# ఆత్మానంద ప్రకాశిక

గ్రంథకర్త
కౌతా మోహన రామశాస్త్రి

ఆత్మ విద్యాశ్రమము
విజయవాడ — సికింద్రాబాదు
1973

ప్రథమ ముద్రణము—1973



మూల్యము : 15 రు.

ప్రాప్తిస్థానము :

1. ఆత్మ విద్యాశ్రమము
   10, పద్మానగర్, సికింద్రాబాదు-500025.
2. కోతా బిల్డింగ్స్, బీసెంటురోడ్,
   విజయవాడ - 520002.

ముద్రణ :
స్వతంత్ర ప్రింటింగ్ ఇన్స్టిట్యూట్,
గీతా స్వాతంత్ర్య విహార్,
10, పద్మానగర్,
సికింద్రాబాదు - 500025.

## శ్రీ రాజరాజేశ్వరీ సంస్కృత కళాశాల ప్రధానాధ్యాపకులు వేదాన్త శిరోమణి, వేదాన్తవిశారద, తర్కాచార్య, సాహిత్యశిరోమణి, విద్వాన్ శ్రీ రాణీ నరసింహశాస్త్రిగారి అభిప్రాయము.

శ్రీరస్తు

బ్ర॥ శ్రీ శ్రీ కౌతా మోహనరామశాస్త్రిగారు వ్రాసిన యాత్మానంద ప్రకాశిక యను గ్రంథము నామూలాగ్రముగ పరిశీలించిచూచినాను. ఈ గ్రంథమున చిరకాలమునుండి వారికి గుర్వీశ్వరానుగ్రహమువలన లబ్ధమైన అద్వైతానుభూతిని శ్రుతియుక్త్యనుభవపూర్వకముగ సరళమగు నాంధ్రభాషలో పొందుపరచినారు. ఇందులో నిరువదియొక్క ప్రకరణములున్నవి. అన్ని ప్రకరణములందును వీరికి గుర్వీశ్వరానుగ్రహలబ్ధమగు నద్వైతానుభూతిని, శ్రుతి ప్రమాణములను విడువక శాస్త్రమందు చూపబడిన దృష్టాంతములేగాక లోక దృష్టాంతములనుగూడ చదువరుల మనస్సున కత్తుకొనునట్లు ఇచ్చినారు. వీరు జగన్మిథ్యాత్వవిషయములో చూపిన లోకదృష్టాంత పురస్సరమగు ననుభూతి నాకెంతయో యానందమును కలుగఁజేసినది. ఇది కాక వీరిచ్చిన ప్రమాణ వచనములుకూడ చాల లోకోత్తరముగనున్నవి. యోగవాసిష్ఠము, అపరోక్షానుభూతి, భగవద్గీత, పంచదశి మొదలగువానిలోని ప్రమాణవచనము లాయా ప్రకరణములకు చాల యతికినట్లున్నవి. వేదాన్తశాస్త్రము నామూలాగ్రముగ నభ్యసించినవారికిగూడ ఈ వచనము లపూర్వముగ కనబడును. వీరే గ్రంథములను చూచి వ్రాయలేదు. ఇది నాకు బాగా తెలియును. కాని వీరికీవచనములన్నియు నర్థానుభూతి పురస్సరముగ నిత్యము మననములోనున్నవే. ప్రమాణ వచనముల యర్థముగూడ సుబోధముగ సంపూర్ణముగ ననువదింపబడినది. జగన్మిథ్యాత్వవిషయములోను, జీవబ్రహ్మైక్యవిషయములోను పునరుక్తులున్నను అవి యీ విద్యకు భూషణములే. మఱియు నీవిద్య కావశ్యకములు. దుర్బోధమగు నాత్మ వస్తువిషయములో పునరుక్తి దోషముకాదని శ్రుతియే చెప్పుచు

న్నదికదా? ఇదికాక వీరిచ్చిన యనుసంధాన శ్లోకములుకూడ చదువరులకు చాల యానందకరములుగనున్నవి. వీరికద్వైతశాస్త్రమందచంచలమగు విశ్వాసము. ఎంతవ్యవహారులైనను ఆ విశ్వాసము వీరికి చలించనిది. వసిష్ఠమహర్షి రామచంద్రమూర్తికి నీవెంత వ్యవహారివైనను ప్రత్యగాత్మానుభూతి నుండి చలింపకుమని బోధించిన యనేక శ్లోకములను వీరుదాహరణముగ చూపినారు. "ఈశ్వరానుగ్రహాదేవపుంసామద్వైతవాసనా" యనునట్లు వీరికీ యద్వైత వాసన ఈశ్వరానుగ్రహలబ్ధమయినది. ఈ యద్వైతవాసన వీరికనూచానముగ "నచాబ్రహ్మవిదస్యకులే భవితుమర్హతి" అను శ్రుతిననుసరించి వచ్చినది. కాన ఈ గ్రంథము అద్వైతసిద్ధాంత జిజ్ఞాసువులందఱకు చాల యుపయోగకరము. ఈ యద్వైత శాస్త్రాభ్యాసమందఱకు అవసరమేకదా! కాన సామాన్యముగ సంస్కృత భాషాజ్ఞానముగలిగిన సిద్ధాంత జిజ్ఞాసువులగు ప్రతివారికిని ఈ గ్రంథము చాల యుపయోగకరము. భాష్యాద్యుద్గ్రంథములలోగల తత్త్వవిద్యను శ్రుతి యుక్త్యనుభూతి పురస్సరముగ నీ గ్రంథములో పొందుపఱచినారు. ఇది కేవలమద్వైతసిద్ధాన్తము నెరుంగగోరు సామాన్యులకందరకునెంతయో యుపయోగించును. ఈ గ్రంథమును శ్రద్ధతో చదివినవారికి తప్పక యద్వైతానుభూతి కలిగితీరును. ఈ యద్వైతవిద్యయందు వీరికున్న యభిమానము నిరుపమము. "అలంకారోహ్యయ మస్మాకం యద్బ్రహ్మాత్మావగతౌసర్వ కర్తవ్యతాహానిః కృతకృత్యతాచ" అను భగవత్పాదోక్తి ననుసరించి వీరీగ్రంథమున బ్రహ్మాత్మానుభూతిని చక్కగ పొందుపఱచినారు. ఈగ్రంథము తత్త్వజిజ్ఞాసువులగువారికి చాల యుపయోగకరము. లోగడ వీరు బ్రహ్మవిద్యానుసంధాన దర్పణము, జ్ఞానామృతసారము అను గ్రంథములను రచించియున్నారు. వాని లోని సారమును ఈ గ్రంథములో చక్కగ పొందుపఱచియున్నారు. ఈ గ్రంథము వారికృతార్థతకును, ఇతరుల కృతార్థతకుకూడ యుపయోగించుచున్నది. ఈ యమూల్యమగు బ్రహ్మవిద్యానుసంధానమును గురించి యిట్టి గ్రంథ మింతవరకు నాంధ్రవాఙ్మయములో వెలువడలేదని చదువరులకు విన్నవించుకొనుచున్నాను.

రాణీ నరసింహశాస్త్రి

## విద్వాన్, పండిత ప్రవర, పూర్వోత్తర మీమాంసా భాస్కర, బ్రహ్మశ్రీ వీరేశ్వరకృష్ణ డోంగరేశాస్త్రిగారు, "విద్యాప్రవీణ" శ్రీహరి లక్ష్మీనరసింహశాస్త్రిగార్ల పరామర్శము, అభిప్రాయము

ఈ ఆత్మానంద ప్రకాశికను వ్రాసిన వేదమూర్తులు, బ్రహ్మశ్రీ విరాజితులగు శ్రీ కౌతా మోహన్‌రామ్ శాస్త్రిగారు ఆంధ్ర దేశములో శ్రీకృష్ణా తీరమందు ప్రసిద్ధముగనున్న విజయవాడ నివాసులు, కీర్తిశేషులైన శ్రీ కౌతా సూర్యనారాయణరావు పంతులుగారి ఏకైక పుత్రులు. వీరి తండ్రిగారు ఆంధ్ర దేశ ప్రముఖ బ్రాహ్మణ వ్యాపారులుగా లోక ప్రసిద్ధిగాంచినను, వాస్తవమున ఆన్తరమున వీరు పారమార్థికులు.

శ్రీ సూర్యనారాయణరావుగారి పరిచయము - వారు స్థాపించిన అనేక వ్యాపార సంస్థలవలననేగాక, వారు లక్షలాది నిధులతో స్థాపించిన స్వధర్మ స్వారాజ్య సంఘము, దాని మూలకముగ ప్రతి సంవత్సరము వసన్త నవ రాత్రములు, కృష్ణాష్టమి, శంకరజయంతి, మహాశివరాత్రి, మొదలగు పర్వ కాలములయందు ఆయా పూజా ఉత్సవాంగములుగ జరుగుచున్న యావద్భార తీయ విద్వత్సదస్సులు, పండిత సన్మానములు, మరియు ఎనుబది సంవత్సర ములనుండి వారి గృహములో జరుగుచున్న శరన్నవరాత్రోత్సవ వేదశాస్త్రసభ లనుబట్టియు యావద్భారతదేశానికే కలదు.

వీరికి వేదశాస్త్రములయందు ప్రామాణ్యబుద్ధి, ఆస్తిక్యము మొదలైన సుగుణములు జన్మసిద్ధమైనవి. ఇటువంటి వారికి కుమారుడుగ జన్మించుట సామాన్య పుణ్యఫలముకాదు. కుమారునకు వీరెల్లప్పుడును అర్థ పరమార్థము లలో శాశ్వత సుఖమనునది ఒక్క పరమార్థమువల్లనే గలుగునుగాని, కేవల అర్థమువలన గలుగు సుఖము శాశ్వతము గాజాలదని చెప్పుచుండెడివారు.

పారమార్థిక సంపత్తివలె ఐహికమైన సిరిసంపదలు గూడ పూర్వ పుణ్యముచేత శ్రీ సూర్యనారాయణరావు పంతులుగారికి వాణిజ్యము నిమిత్త మగుచు దాదాపు కోటిరూప్యద్రవ్య సంపత్తులు దినదినాభివృద్ధిగ అహమహమికతో చేరినవి.

ఈ కారణముచే శ్రీ మోహన్‌రామ శాస్త్రిగారు ఆజన్మ శ్రీమంతులు. వీరు విజయవాడ వాస్తవ్యులైనను వీరి తండ్రిగారి ననుసరించి చిరకాలమునుండి మద్రాసు, హైదరాబాదు పట్టణములలోగూడ, అధిక వ్యాపారవ్యవహారములుగల ఐశ్వర్య సంపన్నులు, యెట్టి ఐహిక సుఖ సంపదలకు లోపము లేనివారు. వీటన్నిటికంటె గూడ ఒక గొప్ప భాగ్యము వీరికి గల్గినది. అది యేమనిన వీరి మాతామహులు శ్రీ వలివేటి భాస్కర లక్ష్మీనృసింహ శాస్త్రిగారు బ్రహ్మజ్ఞులు, జీవన్ముక్తులనే ప్రసిద్ధిగలదు. అటువంటి బ్రహ్మవేత్త యొక్క భుజములమీద వీరి బాల్యము గడచినది. ఇది సామాన్యులకు లభించునదిగాదు. ఇట్టి జన్మాంతరీయ ఉత్తమ సుకృతమును సూచించునట్టి యిన్ని లక్షణములు వీరికి యున్నను శ్రీ మోహన్‌రామ శాస్త్రిగారు దాదాపు వారి అరువది సంవత్సరముల వయస్సు సమీపించునంతవరకు మామూలుగనే యుండెడివారు. బాల్యములో దేహదార్ఢ్యము, బుద్ధిశక్తి, ఇంద్రియ పాటవము అత్యల్పములై సదా దేహ స్వాస్థ్యము లేకుండుటచే వీరికి విద్యాభ్యాసము విశేషముగ జరుగ లేదు. ఆంగ్ల భాషాధ్యయనము కొంతవరకైనదిగాని, శాస్త్రముల అధ్యయనము గాని, చివరకు సంస్కృతాంధ్రభాషాధ్యయనముగూడ కావలసినంత జరుగలేదు. ఇప్పుడుగూడ సంస్కృతాంధ్ర భాషాజ్ఞానము సామాన్యముగనేయున్నది. ఒక విశేషము మాత్రము వీరిలో కనిపించినది. వీరికి ఉపనయనమైనది మొదలు సంధ్యావందనము, బ్రహ్మ యజ్ఞము, శ్రీమద్భగవద్గీతా - విష్ణు సహస్ర నామాదుల పారాయణము, గాయత్రీ జపము మొదలగునవి నియమముగ శ్రద్ధతో జరుగుచుండినవి.

వీరి గృహమందు అనేక వత్సరములనుండి సద్గోష్ఠులనేకములు జరుగుచున్నపుడు మర్యాదాపాలన బుద్ధితో వీరు కూర్చొనుచుండువారుగాని,

వీరికి వాటి బోధగాని, ఆసక్తిగాని యుండెడిదిగాదు. ఈ విషయము నాకు ప్రత్యక్షము. ఇటువంటి స్థితిలోనున్న వీరికి దాదాపు అరువది సంవత్సరములు సమీపించు కాలమున దానంతటిగనే తత్త్వ జిజ్ఞాసలోనికి మనస్సు మరలినది. విద్వాంసుల సాంగత్యము వచ్చినపుడు యీ వేదము శాస్త్రములు యివి యేమిటి? వేదాంతమనగానేమి? మొదలగు ప్రశ్నలు వీరు వేయుటకు ప్రారంభించినారుగాని, యీ ప్రశ్నలకు పండితులు చెప్పిన సమాధానములు మాత్రము అప్పుడు గూడ వీరికి బోధపడెడివికావు. అయినను క్రమ క్రమమున జగన్మిథ్యాత్వము, సర్వాధిష్ఠానము, ఆత్మజ్ఞాన విచారములగావించి "ఆభాసుడు" "సాక్షి" మొదలగు వస్తువులను తెలిసికొనుటకు నిరంతర పరిశ్రమను సంవత్సరముల తరబడి గావించియున్నారు. వీరిజిజ్ఞాస రోజురోజుకు ప్రబలినది. వీరు అనేక వేదాంత గ్రంథములను పఠించి సదా ఆత్మవిచారము గావించుచుండిరి. తరువాత ఆంధ్రానువాదముతో గూడిన విద్యారణ్య పంచదశి, జీవన్ముక్తి వివేకము, వివేకచూడామణి, నైష్కర్మ్యసిద్ధి మొదలగు గ్రంథములనుగూడ అనేకమారులు పఠించి మననము గావించియున్నారు. వీరు యే గురువు యొద్దను వేదాంత శాస్త్రమును ప్రత్యేకముగ నభ్యసించలేదు.

అటువంటి శాస్త్రిగారు స్వతః తమకు గలిగిన యనుభవముచేత ఇపుడు భగవద్గీత, యోగవాసిష్ఠము, పంచదశ్యాది గ్రంథములనేగాక, బ్రహ్మసూత్ర భాష్యము, అద్వైతసిద్ధి మొదలగు గ్రంథములనుగూడ అనాయాసముగ తెలిసికొనుచున్నారు. వీరికి యిటువంటి అనుభవము పరమేశ్వరానుగ్రహము చేతనే వచ్చినదిగాని, మరియొక విధముగగాదు. వీరికి శాస్త్ర పాండిత్యము కన్న అనుభవము ప్రధానము. "శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభిజాయతే" "ఈశ్వరాను గ్రహాదేవ పుంసామద్వైతవాసనా" యను వచనములకు శ్రీ శాస్త్రిగారు సంపూర్ణముగ నిదర్శనభూతులు. వీరికి యెప్పుడే విద్వాంసుల సమావేశము గలిగినను ఆత్మ చింతన గోష్ఠి తప్ప అన్యముండదు.

వీరు తమ వేదాంతానుభవమును సశాస్త్రీయముగ ప్రకాశింపజేయునట్టి రెండు మూడు గ్రంథములను ఇదివరకే ప్రకటించియున్నారు. ప్రస్తుతము

"ఆత్మానంద ప్రకాశిక" యను గ్రంథమును ప్రకటించుచున్నారు. ఈగ్రంథము లన్నియు ఇతర ప్రాచీన గ్రంథములయొక్క అనువాదములుగాని, భాషాన్తరీ కరణములుగాని కాక, స్వతంత్ర గ్రంథములై, శాస్త్రబద్ధములుగను, సాధ కులకు సుబోధముగను ఉన్నవి. వీనిలో "ఆత్మానంద ప్రకాశిక" సుమారు ఇరువది యెనిమిది ప్రకరణముల గ్రంథము. ఈ గ్రంథము ఆంధ్ర భాషా ప్రపంచమున గణనీయమైన తత్త్వ ప్రతిపాదక గ్రంథముగ నిలుచుటకు అర్హత నొందియున్నది.

అనేక ప్రమాణ గ్రంథములనుండి ఉద్ధరించిన వచన రత్నములకు ఇదియొక మంజూషగనున్నది. మానవ జన్మమును సార్థకము జేసికొని కృత కృత్యులగుటకు ఏమి కావలయునో యది యంతయు నిందులోనున్నది.

దీనిలో ఉత్కృష్టముగనున్న ప్రకరణములో - "ఆత్మవిద్య - దీని పరమలాభము" అను ప్రకరణమొకటి. ఇది ఆత్మవిద్య యనగనేమి? అది యెందువల్ల శ్రేష్ఠము? దానివిషయములో పూర్వాచార్యులకుండెడి అభిప్రాయ మెట్టిది? భగవద్గీతయు నీయాత్మస్వరూపము, నేల నిరూపించినది? మొదలగు విషయములను చక్కగ నిరూపించుచున్నది. ఈలాగుననే "ఉపోద్ఘాతము" "జీవాత్మపరమాత్మవివేకము" "జీవ జగత్స్వరూపము" "మానవుని ప్రారబ్ధ పురుషకారములు" అన్నిటికంటెను క్రోడీకరించిన చివర ప్రకరణమగు "తత్త్వ సారము-ఉపసంహారము" మొదలగు ప్రకరణములు లోకసామాన్యమునకు దుర్బోధములైన వేదాన్తశాస్త్రప్రధానవిషయములను అతిసులభముగ బోధించు చున్నవి. తాముచెప్పు ప్రతివిషయమునకు ప్రమాణవాక్యమును చూపించి లోక ప్రసిద్ధదృష్టాన్తములచే విషయనిరూపణము, దానితోపాటు స్వానుభవము నుదా హరించుట-యీ గ్రంథములోనున్న విశేషము, ప్రధానాంశము. సామాన్య జనులకుగూడ అందుబాటులోనున్న గీతావచనముల నుదాహరించి వాటి అర్థ వివరణముచేయుట - యిందులోని మరియొక ముఖ్యాంశము.

ఇందులోని 'అనుసంధానసారము' 'బోధమాల' అనుప్రకరణములు శ్లోకరూపమున వ్రాయబడి స్వరూపచింతనకు మహోపకారకములుగ నుందు

టయేగాక, శ్రీ శాస్త్రిగారి కవితాధోరణినిగూడ తెలుపుచున్నవి. ప్రతిప్రకరణము లోను అతిసారవంతమైన విషయములను బోధించు శ్రుతిస్మృతి వచనరత్నము లిందులో చాల సంగ్రహింపబడినవి.

సాధకులకు కావలసిన సమస్తోపకరణములు గలిగియున్న యీ గ్రంథము మానవులకు విశేషముగ గణనీయము, మననీయమునై యున్నది. సంసారము వలన తీవ్ర రాగద్వేషాక్రాంతచిత్తులై మనఃక్లేశములనొంది బాధపడుచున్న మానవులకు మనశ్శాంతిని, శాశ్వతసుఖమును గలుగజేయు తత్త్వామృత మంతయు ఈ గ్రంథములోనున్నదిగాన, యీ గ్రంథము సర్వసంగ్రాహ్య మనుటలో సందేహములేదు.

"ప్రణవలక్ష్యార్థము" అను ప్రకరణము చూచుటకు చిన్నదైనను మిక్కిలి అర్థగాంభీర్యముతో విలసిల్లుచున్నది. అచట వీరి శ్లోకములు చదువ దగినవి. అధ్యాత్మసంపదను సంప్రదాయానుగుణముగ ప్రజలకందించు వీరి గ్రంథము అందరకు ఆదరణీయమై వెలయుగాక! ఆంధ్రభాషలో వెలసి నందున ఆంధ్రులకీగ్రంథము పరమాదరణీయమనుటకు సందియములేదు. పరమేశ్వరానుగ్రహముతో వీరిట్టి గ్రంథములను వ్రాసి వారి యనుభూతులను లోకమునకందజేయుదురుగాక.

వీరేశ్వరకృష్ణ డోంగరెశాస్త్రి
హరి లక్ష్మీనరసింహాశర్మ

## శ్రీ దర్శన భూషణ, రాష్ట్రపతిసమ్మానిత, మోడేకుర్రు శ్రీ రాజ రాజేశ్వరీ సంస్కృత కళాశాల మాజీ ప్రధానాధ్యాపకులు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన కొల్లూరు సోమశేఖరశాస్త్రిగారి అభిప్రాయము

లోకమున మానవుడు తన స్వరూపమును, తన కర్తవ్యమును మఱచి, దుఃఖమయమగు సంసారమునబడి తుదను కానక నాకీ దుఃఖమెట్లు నశించును, దీనికి యుపాయమెద్దియని విచారించుచు నీ దుఃఖమునకు కారణమేమియని సద్గురువుల నాశ్రయించి యడుగును. అపుడాగురువు దీనికి కారణము జన్మ యనియు, జన్మమునకు కారణము ప్రవృత్తియనియు, దానికి కారణము రాగాదిదోషములనియు, వానికి కారణము మిథ్యాజ్ఞానముకాన, మిథ్యాజ్ఞానము నశింపవలయును. అది తత్త్వజ్ఞానమువలన నశించును. కాన నీవాత్మతత్త్వ జ్ఞానమును సంపాదించి కృతార్థుడవు కమ్మని చెప్పెను. మన యనుభవమున కును, తత్త్వజ్ఞానమునకును చాల వ్యత్యాసము గలదు. మన యనుభవము నందాత్మ పరిచ్ఛిన్నుడుగను, సంసారిగను భాసించుచున్నాడు. ఇది సరిగాదు. వేదమునందాత్మ అద్వితీయుడుగను, నసంగ చిద్రూపుడుగను, ఆనందరూపుడు గను, నిరూపింపబడియున్నాడు. కాన శ్రవణాదులవలన నాత్మయాదార్థ్యమును తెలిసికొనవలయును. మనకుగల మిథ్యాజ్ఞానమ అపరోక్షముకాన దీనిని తొల గించుటకు ఆత్మాపరోక్షజ్ఞానము కావలయును. అందులకై తేలికభాషలో స్వాను భవమునుచేర్చి శ్రీ కౌతా మోహన రామశాస్త్రిగారు "ఆత్మానందప్రకాశిక"యను గ్రంథమును రచించిరి. లోగడ వీరిచే రచింపబడిన "బ్రహ్మవిద్యాను సంధాన దర్పణము" "జ్ఞానామృతసారము" అను రెండు గ్రంథములను నేను జాగ్ర త్తగ జూచితిని. వాని సారమే యీ యాత్మానందప్రకాశిక. ఈ గ్రంథమును శ్రుతి, స్మృతుల ననుసరించి, తమ యనుభవమునుగూడ కలిపి స్పష్టముగ నిరూ పించిరి. కాన ముముక్షువులకిది యవశ్యగ్రాహ్యము. ఇందు పాఠకుల సుబోధము కొఱకు విషయవిభాగము చేయబడినది. ఇది యద్వైతసిద్ధాంతము ననుసరించి

చిరకాలము అభ్యాసముచేసి తమకు గలిగిన యనుభవమునే యీ గ్రంథరూపమున లోకమున కందించుచున్నారు. ఇందలి భాష సాధారణమయినను విషయము మాత్రమసాధారణము. ఇట్టి గ్రంథమిదివరకు వెలువడలేదు. కాన ముముక్షువులు దీనినాధారముగగైకొని తరింతురుగాక.

కొల్లూరు సోమశేఖరశాస్త్రి

"బ్రహ్మవిద్యాలంకార" "తర్క వేదాంత విశారద"
"మహోపాధ్యాయ" "గురుకుల భారతీ నిలయ సంస్థాపక"
బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకట రామశాస్త్రిగారి అభిప్రాయము

ఓం

శ్రీ సద్గురుశ్శరణమ్

బ్రహ్మశ్రీ కౌతా మోహనరామశాస్త్రిగారు — "ఆత్మానందప్రకాశిక" అనెడి సార్థకనామముతో రచించిన ఈ చిన్నగ్రంథమును ముద్రణము కాక ముందే నాకు చూపిరి.

వీరు లోగా రచించి ముద్రింపించినట్టి — "జ్ఞానామృతసారము (283 పేజీలు), బ్రహ్మవిద్యాను సంధానదర్పణము" (635 పేజీలు) అనెడి బృహద్గ్రంథములకిది సారభూతముగానున్నది.

ఈ గ్రంథములోని 20 చిన్న చిన్న ప్రకరణములలో అనేక ఉపనిషద్వాక్యములు, బ్రహ్మసూత్ర శంకరభాష్య, భగవద్గీతావచనములు, యోగవాసిష్ఠ, వివేకచూడామణి, వేదాంత పంచదశ్యాది ప్రమాణవచనములు సమయోచితముగ చక్కగ నుదాహృతములై విద్వన్మనోహరములుగ నున్నవి.

ఈ గ్రంథములో అద్వైత వేదాంతసారము తేటతెల్లములగు తెలుగు మాటలతో శ్రీ శాస్త్రిగారు గుర్వీశ్వరానుగ్రహ బలముతో పొందుపరచిరి. కనుక సంస్కృతభాషాపరిచితిలేని ముముక్షువులకీ గ్రంథము మననమునకు మహోపకారక మగును.

త్రిలింగ మహావిద్యాపీఠం,
విజయవాడ—2.

ముదిగొండ వేంకట రామశాస్త్రి

# ప్రాస్తావికము

పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల ప్రతి జీవియును సర్వదా కోరునది తన సుఖము. నిదురలేచినది మొదలు నిద్రించువరకును యే జీవుడు యేపని చేసినను తన సుఖముకొరకే. అన్నిటికన్నను తన సుఖము ప్రతి జీవునకున్నూ సర్వోత్కృష్టము. కావుననే సర్వులు సర్వదా దీనికొరకే అహర్నిశములు ప్రయత్నించుచుందురు. శాస్త్రము యీ సుఖ సాధనములను ప్రవృత్తి, నివృత్తి మార్గముల రెంటిచే బోధించుచున్నది. ఇందు ప్రవృత్తి మార్గ సాధనములచే గలుగునట్టి సుఖములన్నియు తాత్కాలికములు, అశాశ్వతములు. కాని పొందగలిగిన యడల సర్వ మానవులకును అశాశ్వత సుఖముకన్న శాశ్వత సుఖమునందే యెక్కువ ప్రీతి యనుమాట నిర్వివాదము. మానవుడీ శాశ్వత సుఖము నొందుటకే శాస్త్రము నివృత్తి మార్గ సాధనములను బోధించుచున్నది. ఈ శాశ్వత సుఖమనునది ఒక్క ఆత్మజ్ఞానము వలనగాని గలుగదు. సకల జీవులును కోరునది వారివారి శాశ్వత సుఖమే యైనను, వారాచరించు సాధనములు అన్యములు గావున దీనిని బడయలేకున్నారు. కావున శాస్త్రబోధ యావశ్యకమగుచున్నది.

కలియుగమగు నీ కాలమున ప్రవృత్తి మార్గములగు కర్మ సాధనములు కొంతవరకేదో విధమున నాచరణలోనున్నవి. కాని పామర, పండితవర్యులకు గూడ నివృత్తి మార్గమగు ఆత్మవిద్య, దీని సాధనములందభిరుచి గలుగుట దుర్లభముగ నున్నది. దీనికి కారణము అవిద్యయే. అనగా జీవుని అనాది అజ్ఞానము. దీనిని ఆత్మ విచారమను సాధనముచే నిర్మూలించవలయునేగాని వేరు మార్గములేదు. ఆత్మజ్ఞానమునకు, శ్రవణ, మనన, నిదిధ్యాసనములను సాక్షాత్సాధనములుగ శాస్త్రము బోధించుచున్నది. కావున యీ సాధనముల యొక్క అభ్యాసము జిజ్ఞాసువులెల్లరకును అవశ్య మాచరణీయము. శాస్త్రమనగా

వేదమనియే ముఖ్యార్థము. వేదము మానవులకెల్లప్పుడును అనధిగత, అబాధిత, శ్రేయస్సాధనమునే బోధించునుగాని మరి వేరుగాదు. అనగా మానవుల కిప్పుడు తెలియనట్టిదినీ, యెన్నటికి యేకాలముననుు మార్పు జెందనిది (నశించనిది) యగునట్టి సుఖోపాయమును అనగా శ్రేయస్సాధనమును అధికారి తారతమ్యముల ననుసరించి ప్రక్రియా భేదములచే నుపదేశించునదే శాస్త్రము. కావున శ్రుతి ప్రబోధ సర్వదా సర్వులకును గ్రాహ్యము, ఆవశ్యకము.

అయినను శ్రుతిపరమ తాత్పర్యమగు ఆత్మజ్ఞాన లాభమును, తత్సాధనములను గుర్తించి యభ్యసించునట్టి మహనీయులు యీ కాలమున, గనులలోని వజ్రమణులవలె అతిస్వల్పసంఖ్యాకులై దాదాపు యీ తత్త్వవిద్య అంతరించుచు నామమాత్రముగనున్నది. మానవులకు యీ విద్యాలాభము మహత్తరమగు నిరతిశయ, శాశ్వత సుఖ స్వరూపమగు అమృతత్త్వము నిచ్చునట్టిది. ఈ పరిపూర్ణ శాశ్వత సుఖము, యెంతటి మానవునకైనను ఒక్క ఆత్మజ్ఞానము వలననేగాని, మరియొక దానివలన పొందబడదు. ఈ విషయమునే శ్రీ శంకర భగవత్పాదులు వివేక చూడామణిలో-

> శ్లో॥ పఠన్తుశాస్త్రాణి యజన్తుదేవాన్, కుర్వన్తుకర్మాణి భజన్తుదేవతాః।
> ఆత్మైక్య బోధేనవినావిముక్తిః, నసిధ్యతి బ్రహ్మశతాంతరేఽపి॥

అనగా సర్వ శాస్త్రములను చదువుగాక, యజ్ఞాదిక్రతు భూయిష్ఠమైన గర్మల నాచరించుగాక, దేవతారాధన చేయుగాక, పరమాత్మైక్యజ్ఞానములేనిది ముక్తి యనునది యెన్ని బ్రహ్మకల్పములు గడచినను గలుగదని జెప్పుచు, శాశ్వత సుఖ రూపమగు బ్రహ్మాత్మైక్యజ్ఞానము నుపదేశించుచున్నారు. జీవబ్రహ్మైక్య స్థితియే కైవల్యము. దీని నొందింపజేయునదియే ఆత్మజ్ఞానము. సార్వభౌమాది యెంతటి, యెట్టి జీవునికైనను తన శాశ్వత సుఖమును అనగా నిత్య నిరతిశయ శాశ్వతానందము నొందుటకు స్వాత్మాభిన్న బ్రహ్మజ్ఞానమే సాధనముగాని మరి వేరు సాధనములేదు. ఈ బ్రహ్మాత్మైక్యజ్ఞాన స్థితియే

పరమానంద స్వరూప సుఖము. వాస్తవముగ మరియొక సుఖములేదు. జీవుడు వాస్తవమున సుఖముగానియట్టి తాత్కాలిక విషయ భోగములను సుఖమను భ్రాంతితోడ ననుభవించుచు, పర్యవసానమున దుఃఖ రూపమగు సంసార సాగరమున భ్రమణము జేయుచుండును. జీవునకిట్టి సంసార భ్రమణమునందు మానవజన్మ లభించుట సామాన్యముగాదు. కడు దుర్లభము. మానవునకు తన సంసార దుఃఖాత్యంతిక నివృత్తికి, ఆత్మానాత్మ వివేకాది సాధనములతోడ గలుగునట్టి ఆత్మజ్ఞానమే సాధనముగాని మరియొకటిగాదు. ఈ ఆత్మానాత్మ జ్ఞానమనునది యొక్క మానవునకే తప్ప, తదితర జీవులగు పశుపక్ష్యాదులకు గలుగదు. ఉన్నది యనుభవించుట తప్ప, యీ సామర్థ్యము వాటికిలేదు. కావున మానవుడే యీ ఆత్మజ్ఞానమును సంపాదించవలసిన జీవుడు. జీవునకు జన్మ పరంపరలో అతి దుర్లభమగునట్టి యీ మానవజన్మ గలిగినవుడే అతడు బాగుగ నభ్యసించి ఆత్మజ్ఞాన లాభము పొందవలయును. అట్లు గానిచో తనకు, తీరని గొప్ప నష్టము సంభవించునని శ్రుతి "నచేదిహా వేదీన్మహతీ వినష్టిః" అనిన్నీ, మరియును "జ్ఞానేనహీనః పశుభిస్సమానః" "పశ్వాదిభిశ్చ అవిశేషాత్" అని శాస్త్రి వచనములుగూడ ఆత్మజ్ఞానమును సంపాదించని మానవుడు పశు సమానమను విషయమును బోధించుచున్నవి. కావున వివేకులకు యీ ఆత్మజ్ఞానావశ్యకతను వేరుగ జెప్ప బనిలేదు.

మజ్జనకులైన బ్రహ్మశ్రీ కౌతా సూర్యనారాయణరావుగారికి ప్రారబ్ధమును బట్టి వాణిజ్యము వారి యైశ్వర్యసాధనమైనను, వారు జ్ఞానసంపన్నులు, బ్రహ్మణ్యులు, పరమార్థమే బ్రధానముగగలవారు. వారికి నేనేకైక పుత్రుడను. నా అరువదియైదవ సంవత్సరమువరకును వారు జీవించియుండిరి. వారు అర్థపరమార్థకుశలులై తదనుసారము వర్తించుచు లౌకికప్రజ్ఞావంతులును, ఆంధ్ర బ్రాహ్మణ వ్యాపారప్రముఖులును, బహుఐశ్వర్యసంపన్నులును, బ్రధానముగ వేదవేదాన్త శాస్త్రవిద్యాపోషకులునునై సదా పండిత విద్వద్గోష్ఠులతోడ, కాలము గడపుచుండెడివారు. వారికి సదా, జీవునకు అర్థముకన్న పరమార్థమే లక్ష్యము శాశ్వతసుఖస్వరూపము, స్వస్వరూపము, అను దృఢనిశ్చయముండెడిది. ఇట్టి

నిశ్చయముతోడనే వారు సమస్తవ్యవహారములను నాచరించుచుండెడివారు. అట్టివారి యేకైక పుత్రుడనైన నాకు, వారు శాశ్వతమగు నిత్యనిరతిశయ సుఖమైన పరమ తరుణోపాయమును జూపదలచి కారుణ్యచిత్తులై, అశాశ్వత మగు వారి వివిధ లౌకిక ఐశ్వర్యసంపత్తులతోడ నాకెట్టి వాస్తవ సంబంధమును గలిగింపక, వాటిపరిపాలనాది భారమును నాయందుంచక, ఆత్మవిద్యాభ్యాస వసతులనొనగూర్చి "అథర్వాయ జ్యేష్ఠపుత్రాయప్రాహ" అను వచనానుసరణ మున పరమార్థవిద్యను నాకుపదేశించి, వారి యెనుబదియెనిమిదవ సంవత్సర మున దేహవిముక్తులైరి. "తండ్రిహరిజేరుమనియెడు తండ్రి తండ్రి" అని భాగవతవచనముగదా: మామాతామహులు జీవన్ముక్తులు. వారిబోధమార్గాను సరణమునవలంబించి, జీవన్ముక్తులైన మా తండ్రిగారి ఉపదేశానుసరణమున, ప్రాయశః మూడు దశాబ్దములనుంచి, నా పూర్వజన్మ సంస్కారము వలనను, గుర్వీశ్వరానుగ్రహమువలనను, బ్రహ్మాభ్యాసపరుడనై తత్సాధనముల నాచ రించుచు తరచుగ భాష్యాది శాస్త్ర శ్రవణమును గావించుచు, పంచదశి, వివేక చూడామణి, ఉపదేశసాహస్రి, యోగవాశిష్ఠము, నైష్కర్మ్యసిద్ధి, మొద లగు వేదాన్త ప్రకరణగ్రంథములను బండితవర్యుల సహాయమున పునఃపునః జదువుచు స్వవిచారముచే తత్త్వవిమర్శనమును గావించుచు, నిత్యము ఆత్మాను సన్ధానమనన నిదిధ్యసనములతోడ గాలమును ప్రారబ్ధానుసరణమున గడపు చుంటిని. ఇట్లుండ యేడెనిమిది సంవత్సరములనుండి నా సిద్ధాన్త దార్ఢ్య పరి శీలన కొరకును, నా జ్ఞానాభ్యాస పటిమకొరకును యీ విషయములను శ్రుతి యుక్త్యనుభవానుసరణమున వ్రాయుచు, ప్రతినిత్యము గొంతకాలమును విని యోగించుచుంటిని. కొన్ని సంవత్సరములిట్లు నాచే వ్రాయబడిన నీ విషయ ములే, శాస్త్రప్రకాండులు, శ్రేయోభిలాషులు అగు పండితవర్యుల ఆమోదాభి ప్రాయ ప్రోత్సాహములచే గ్రంథరూపములను గాంచినవి. ఇట్టివానిలో బ్రహ్మ విద్యాసంప్రదాయము ననుసరించి శ్రుతి, యుక్తి, అనుభవనిరూపణలతోడ, శాస్త్రప్రమాణబద్ధముగ బ్రకృతములైన శ్రుతిస్మృత్యాది వచనముల నుదాహ రించుచు ఆంధ్రమున వ్రాయబడిన నా మూడవ గ్రంథము ఈ "ఆత్మానంద ప్రకాశిక." ఇది స్వతంత్రము.

బ్రహ్మవిద్యయగు యీ ఆత్మవిద్యావివేచనములు బోధ, తత్సాధనములు గూడ వివిధములగు పెక్కు శ్రుతి, స్మృతి, పురాణములయందునను, మహనీయులగు ననేక పూర్వాచార్యులవలన రచింపబడి ప్రసిద్ధిగాంచిన బహుగ్రంథ రాజములయందునను విలసిల్లుచున్నవి. కాని అట్టివన్నియు వివిధగ్రంథముల యందతిప్రౌఢముగ, నచట నచట యుండుటచే, విషయమునుబట్టియు, భాషను బట్టియుగూడ అతి గంభీరములై సామాన్యులకివి దురవగాహములుగ నుండుట బట్టియు, నాకుగల యీ విద్యాసంప్రదాయమునుబట్టియు, నాకీ విద్యయందుగల ప్రీతి నిశ్చయములనుబట్టియు, నాకీవిద్యాభ్యాసమునందుగల క్లిష్టాంశముల యొక్క యనుభవములబట్టియు, ముముక్షువుల సాధనాభ్యాసముల నుద్దేశించి సులభముగను, బ్రహ్మవిద్యాభ్యాసమునకు సాక్షాత్సాధనముగ నుండులాగున, "పలికెడిది భాగవతమట, పలికించెడువాడు రామభద్రుండట," యనునటుల దైవ ప్రేరితుడనై నేను నిమిత్తమాత్రుడనగుచు, ఆంధ్రభాషలో వానినొకచోట సిద్ధాన్తానుసారముగగూర్చినాడను. ఇందు చాలాభాగము నా మననాభ్యాస దార్ఢ్యమునకుగాను డైరీలలో, అనగా నాదినచర్యా జ్ఞాపక పుస్తకములలో నచట నచట వ్రాసికొనిన విషయములను సంగ్రహించితిని. ఇట్లు చేయుటయందు వేదాన్త పరిభాష, విమర్శ, విచారములను తగ్గించి, జగన్మిథ్యాత్వమును, జీవబ్రహ్మైక్య బోధను, శ్రుతి, యుక్తి, అనుభవానుసరణమున, మననాను సంధాన నిరూపణ క్రమముగ సంగ్రహించి వ్రాసినాడను. ఇది నిరుపమానమైన ఆత్మవిద్యగనుక యెట్టి ప్రమాణములతోడ, యెంత అనుభవ యుక్తిపూర్వకముగ వ్రాసి తెలిపినను, ఒక్కమారుగ విషయము స్ఫురించుట కష్టము. ఏలయన ఇది యింద్రియ గోచరమగు విషయముగాదు. మనసుచేతనే గ్రహింపదగినది ఆలంబనకుగాను యీ గ్రంథప్రకరణములకు దాదాపు ముప్పది వివిధనామముల నిడినను జదువునప్పుడు చెప్పినదే చెప్పినట్లుండును. ఇందు ప్రతిపాద్యము "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" "ఏకమేవాఽద్వితీయమ్" అనునట్టి యేకతత్త్వము. ఈ విషయము మారుటకు వీలులేనిది. ఇది సంసారమను దీర్ఘవ్యాధికి రసాయన ఔషధమువంటిది. ఒకే రసాయన దివ్యౌషధమును అవసరమునుబట్టి వివిధాను

పానములతోడ సేవింపజేయునట్లు, మహౌషధమగు ఈ ఆత్మతత్త్వమునం దన్ని ప్రకరణములును బ్రహ్మవిద్యనే వివిధప్రకారముల ఉపాయముగ బోధించుచుండును. కాన పాఠకులకు చదువునప్పుడు చెప్పినదే జెప్పినట్లుండును. ఇది దోషముగాదు. "పథ్యంశతవిధంకృత్వా" అను న్యాయముననుసరించి యీ విద్యకిది యావశ్యకము. ఈ విద్యకు ఇది పునరుక్తి దోషముగాక, భూషణమే యగును. అనగా పునఃబోధించు యావశ్యకత యీ విద్యకు గలదు. ఈ విష యమును శ్రీ శంకరభగవత్పాదులు సూత్రభాష్యమున "ఆవృత్తి రసకృదుపదే శాత్" అను సూత్రమునందు సిద్ధాంతపరచియున్నారు. కావున సాధకులు యీవిద్యాభ్యాసమందుప్రీతినిశ్చయములనొంది పునరుక్తియందు విసుగుజెందక, మూడు, నాలుగావృత్తులతోడ యీ గ్రంథమును సద్గురుముఖమున పఠించిన యడల జ్ఞానలాభము తప్పకగలుగును ఏలయన ఈ గ్రంథము ఆత్మానంద స్వరూపసాధనములను తెలుపునదియే గావున. మానవునకు ఆత్మానందముకన్న అధిక సుఖములేదు. శాస్త్రిబోధయు విద్వదనుభవమునుగూడ యిట్లేయున్నవి. కావున ఆత్మజ్ఞానాభ్యాసకులగు జిజ్ఞాసువులు స్వస్వరూప, మననానుసంధానాదు లను పటిమతోడ సదా ఆచరించుచు కాలక్రమమున పరమప్రయోజనము నొందుదురుగాక.

ఈ నా గ్రంథము సాధకులగు జిజ్ఞాసువులకు, ఆత్మజ్ఞాన సాధనోపాయ ములను కరతలామలకముగ బోధించునట్టిది. శ్రద్ధాళువులగు బాలురకుగూడ తెలియునటుల, శాస్త్రానుసరణమున వ్రాయబడినది. ఈ సాధనములను విడు వక, విసుగుజెందక, నిత్యాభ్యాసముజేయువారలకు దీనిలాభము ప్రత్యక్షము ఈ సాధనాభ్యాసమే కాలక్రమమున ఆత్మజ్ఞానలాభము నొందజేయును. శ్రీకృష్ణ పరమాత్మ ఈ విషయమును స్పష్టపరచుచు అభ్యాసకులు అట్టిలాభమును యెట్లు గుర్తించి అభ్యాసము నాచరించుచుండవలయునో దానిని భగవద్గీత ఆరవ యధ్యాయమందు ఆరుశ్లోకముల వలన తెలుపుచున్నారు. అద్దానిని ప్రాస్తావిక ముగ సాధకులగు పాఠకులకు ఈ విద్యానిరూఢి లాభప్రయోజనమునుద్దేశించి సమష్టి తాత్పర్యముతోడ నుదాహరించుచున్నాడను.

శ్లో॥ యదావినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్తఇత్యుచ్యతేతథా॥

శ్లో॥ యథాదీపోనివాతస్థో నేఙ్గతేసోపమాస్మృతా।
యోగినోయత చిత్తస్య యుంజతో యోగమాత్మనః॥

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్రచైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥

శ్లో॥ సుఖమాత్యన్తికంయత్త ద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్।
వేత్తియత్ర నచైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥

శ్లో॥ యంలబ్ధ్వాచాపరం లాభం మన్యతేనాధికం తతః।
యస్మిన్ స్థితో నదుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥

శ్లో॥ తంవిద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్।
సనిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥

అనగా ఈ అభ్యాసకునికి యెప్పుడు యేకాగ్రతను పొందింపబడిన చిత్తమాత్మ యందుండునో, కోరికలన్నియు ఎప్పుడు పోవునో అప్పుడే అతడు యోగియని చెప్పబడును. చిత్త నిరోధము చేసికొని ఆత్మానుసన్ధానము చేయు యోగికి చిత్తము, గాలిలేని చోటనుండిన దీపమెట్లు చలించకయుండునో అద్దానివలె చలనము లేకయుండును. అట్టివాడే యోగి. ఎప్పుడు యోగానుష్ఠానముచే నిరుద్ధమగు చిత్తము ఉపరతిని పొందునో, యెప్పుడు సమాధిపరిశుద్ధమగు అంతఃకరణముచేత జ్యోతి స్స్వరూపమగు నాత్మను జూచుచు తనలో సంతోషించుచుండునో, ఎప్పుడు ఇంద్రియములకు గోచరముగాక బుద్ధిచేతనే తెలియదగు ఆనన్దము ననుభవించుచుండునో, ఎప్పుడు తత్త్వరూపమగు బ్రహ్మానన్దములో నున్నవాడై చలనము పొందడో, యే లాభమును బొంది యితర లాభముల నంతకన్న హెచ్చుగా దలంపడో, యే ఆత్మ తత్త్వమునందున్నవాడై గొప్పదియగు దుఃఖము వచ్చినను చలింపకుండునో దానినే దుఃఖ

రహితమైన విద్యాఫలమగు యోగమునుగా తెలిసికొనవలయును. అనగా సాధకుడు తన అభ్యాసమువలన తనకు కలుగు పై లక్షణములుగల యనుభవ మును బట్టియే తనకు ఆత్మజ్ఞాన లాభము గలుగుచున్నట్లు తెలిసికొనవచ్చును. ఇది ప్రత్యక్షమేగదా? ఇట్టి యోగమును పట్టుదలతో విసుగుజెందని మనస్సుతో నభ్యసించుచుండవలయునని సాక్షాద్భగవంతుడగు శ్రీకృష్ణపరమాత్మ తెలుపు చున్నారు. ఇట్లు చెప్పుచుండుటచే సాధకులకు యీ ఆత్మ సంయమాభ్యాసాదు లచే కాలక్రమమున యిట్టి అనుభవ లాభము గలుగుననియేగదా అర్థము. ఇది సాక్షాత్తు పరమాత్మ చెప్పుచున్నదియేకదా? జ్ఞానుల అనుభవముగూడ నిట్లే తెలియుచున్నది. కావున అభ్యాసకులకు కాలక్రమమున యీ ఆత్మ విద్యా భ్యాస లాభము ప్రత్యక్షముగ గలుగుచుండుననుటకు సందియములేదు. ఇట్లు గలుగులాభమే ఆత్మానన్దప్రకాశము. దీని సాధనములను తెలుపునదియే యీ గ్రంథము. సాధకులు దీనిని యెంతెంత శ్రద్ధతోడ పఠించి యభ్యసించు చుండిన, అంతంత ఆత్మవిజ్ఞానమును, సంసార బంధనివృత్తిని గాంచుచు కాలక్రమమున ఆత్మానన్ద ప్రాప్తి నొందుదురు.

ఈ "ఆత్మానన్దప్రకాశిక" యను గ్రంథ రచనయందు నా భాషా పాండిత్య లోపములను పాటించక, అన్య సహాయమందిచ్ఛలేక, కేవల విషయ ప్రధానమును గావించుకొని దైవ ప్రేరితుడనై, గుర్వీశ్వరానుగ్రహముతోడ, అద్వైత సిద్ధాన్తమును, తత్సాధనములను శ్రుతి ప్రమాణ యుక్త్యనుభవముల ననుసరించి నా బ్రహ్మ విద్యాభ్యాసాను భవానుసరణమున వ్రాసితిని. పండిత వర్యు లిందుగల సిద్ధాన్తాంశములను మాత్రము గ్రహించి లోపములను క్షమింప వేడుచున్నాడ.

ఇట్లు
కౌతా మోహనరామశాస్త్రి

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

మానవులకు ధర్మార్ధ కామ మోక్షములను పురుషార్ధములు నాలుగైనను అందు, మోక్షమే పరమ పురుషార్ధమని శాస్త్రమువలనను, జ్ఞానానుభవమును బట్టియుగూడ నిశ్చయమగుచున్నది. మోక్షమనునది జీవుని శాశ్వత పరిపూర్ణ సుఖస్వరూపము. దీనియొక్క వాస్తవస్వరూపము జీవుని అనాది అజ్ఞానముచే యిప్పుడు తెలియకయున్నను "జీవో బ్రహ్మైవనాపరః" "ఆత్మైవానందః" అను శ్రుతి వచనముల ననుసరించి జీవుడు బ్రహ్మస్వరూపమగు పరిపూర్ణానంద సుఖస్వరూపముకంటె వేరుగాదు. ప్రతి జీవుడును పరమార్ధ వాస్తవమున అఖండ సుఖస్వరూపమగు పరమాత్మస్వరూపుడే కాని యిప్పుడు తన అనాది అజ్ఞానముచే తన సత్యస్వరూపమును మరచియున్నాడు. కావుననే బాలుడు యెప్పుడైనను తన మెడలోనున్న హారమును మరచి, దానికొరకు బైట వెతుకుచుండునట్లు, జన్మించిన సర్వజీవులును తమ తమ ఆనందరూపమగు సుఖముకొరకే సర్వదా వెతుకుచు, ప్రయత్నించుచుందురు. కాని దీనిని సంపాదించుటకు మానవులెంత ద్రవ్య వ్యయ ప్రయాసలు పడుచున్నను, దుఃఖ మిశ్రితము, అనిత్యముకానియట్టి, శాశ్వతసుఖమును సంపాదించలేకున్నారు. అట్టి శాశ్వతసుఖము, పరమానందరూపమగునట్టిది, ఒక్క బ్రహ్మజ్ఞానముతప్ప, వేరుగ అనగా భిన్నముగ యీ బదునాలుగు లోకములయందునను లేదు. మానవులు వారి శాశ్వతసుఖముకొరకు యితరత్ర అనగా స్వాత్మభిన్నముగ ప్రయత్నించుట, బంగారములేని ప్రదేశమున, బంగారముకొరకు తమ ద్రవ్య వ్యయప్రయాసలను వినియోగించుటవంటిది. ఇట్టి శాశ్వత పరిపూర్ణ సుఖమునే శాస్త్రము బ్రహ్మ, ఆత్మజ్ఞానము, కైవల్యము, మోక్షము, పరమముక్తి మొదలగు నామాంతరములచే, తెలుపుచున్నది. శాశ్వత సుఖరూపమగు కైవల్యము ఒక్క జ్ఞానమువలనగాని పొందుటకు సాధ్యముకాదని "జ్ఞాదేనావతు కైవల్యమితి వేదాంత డిండిమః" అను వచనము విశదపరచుచున్నది. ఇచట

జ్ఞానమనగా ఆత్మజ్ఞానమనియే అర్ధముగాని యితర జ్ఞానములుగాజాలవు. పరిపూర్ణ శాశ్వతసుఖము నొందించునట్టి, యీ ఆత్మజ్ఞానసాధనము నివృత్తిమార్గమేకాని ప్రవృత్తిమార్గముగాజాలదు. ఏలనన ప్రవృత్తిసాధనములచే పొందగలుగునట్టి, సార్వభౌమాది సమస్త ఐహికసుఖములును, స్వర్గాది ఆముష్మికసుఖములున్నూ, తాత్కాలిక సుఖములగుచు కాలాంతరమున నశించునట్టివి. కావున అశాశ్వతములు. ఇవియన్నియు దుఃఖపర్యవసితములు. కాని, నివృత్తిసాధనమువలన గలుగునట్టి ఆత్మజ్ఞానము కాలక్రమమున అభ్యాసపాటవమునుబట్టి మానవునకు తన వాస్తవస్వరూపమగు, నిరతిశయ శాశ్వతసుఖమును ప్రారబ్ధాంతమున నొందింపజేయునని శాస్త్రము బోధించుచున్నది. ప్రతి మానవునకున్నూ తాత్కాలిక అశాశ్వతసుఖమునందే యెక్కువ ప్రీతియనుమాట నిర్వివాదము. కావున వివేకులందరకును యీ ఆత్మజ్ఞాన మావశ్యకమని వేరుగజెప్పబనిలేదు.

జన్మించిన ప్రతి జీవియు కోరునది తన సుఖము. ఇట్లు కోరబడుచున్న తన సుఖము అశాశ్వతముకాక, శాశ్వతముగా నుండవలయుననియే ప్రతి మానవునియొక్క వాంఛ యనునది నిర్వివాదాంశము. ప్రతి మానవుడును యేదోయొకవిధమున తానాత్మయనియే తలచుచున్నాడు. నేనాత్మగాదనుకొనువారెవరును యుండరు. అట్లుండుట అసహజము. ప్రతి మానవుడును తానాత్మయని తలచుట సత్యమేయైనను యిట్లు తనను తాను తెలిసికొనుటలో వాస్తవమున ఆత్మకాని దేహేంద్రియాదులను తన ఆత్మయని భ్రమించి తలచుచు తన ఆత్మ సుఖముకొరకు అహర్నిశములు ప్రయత్నించుచు సంకల్ప వికల్పములను జేయుచుందురు. సర్వులకును శాశ్వతసుఖవాంఛ సహజమైనను, యిందు తనకు శాశ్వతసుఖమేదియో, అశాశ్వతసుఖమేదియో, గ్రహించగల సామర్ధ్యము ఒక్కమానవునకేగలదుగాని తదితర జీవులకిది సాధ్యముకాదు. జీవునకీ జనన మరణ ప్రవాహరూపమగు సంసారభ్రమణమునందు మానవజన్మ లభించుట గడు దుర్లభము. జీవునకు ఈ మానవజన్మయనునది యనేక కోటి జన్మలయొక్క సుకృతఫలమువలనగాని కలుగదని శ్రీ శంకర భగవ

త్వాదులు స్పష్టముగా వివేకచూడామణియందు విశదముగావించుచున్నారు. మరియును యిప్పుడు మానవజన్మనుపొందిన అవకాశమును వృధాగావించుకొనగూడదని "నచేదిహావేదీన్మహతీవినష్టిః" అనగా యీ జన్మమందే ఆత్మజ్ఞానము సంపాదించలేనివాడు గొప్పదియగు నష్టముపొందుననియు, "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత" అజ్ఞానమందు నిద్రించుచున్న యో జీవులారా ! మీరు లెండు. అజ్ఞాననిద్రనుండి మేల్కొని జాగరూకులుకండు. శ్రేష్ఠమగు గురువునుబొంది సదాత్మను తెలిసికొనుడు. అను తాత్పర్యమును, ఇంకను "ఏకోవశీసర్వభూతాంతరాత్మా, ఏకంరూపం బహుధా యః కరోతి, తమాత్మస్థం యేఽనుపశ్యంతిధీరా, స్తేషాంసుఖం శాశ్వతం నేతరేషామ్" ఆత్మ అద్వితీయము. సమస్త జగత్తును తన వశమునందుంచుకొన్నది. సర్వభూతముల కంతరాత్మయునగుచున్నది. శుద్ధవిజ్ఞానరూపియై-యుపాధిభేదవశమున ననేకప్రకారములనున్నటుల గనబడుచున్నది. హార్దాకాశాంతర్గతమగు బుద్ధిగుహాయందిట్టి ఆత్మను దర్శించువారికి శాశ్వతసుఖము గలుగును. తదితరులకుగలుగదు యనిన్నీ, మానవుడు తాను కోరునట్టి శాశ్వతమగు స్వరూపసుఖము, అనగా శాశ్వతానందము తన ఆత్మస్వరూపమే, "ఆత్మైవానందః" యనిన్నీ యీ మొదలగుఅనేక శ్రుతివచనములు మానవునకు ఘోషించి బోధించుచున్నవి. శ్రుతి నూరుతల్లుల సమానమని "శతమాతృసమాశ్రుతిః" యను ఆర్షవచనము తెలుపుచున్నది. శాస్త్రమెల్లప్పుడును మానవునకు— "అనవగత అబాధితశ్రేయస్సాధనము" అనగా మానవునకు ఇప్పుడు తెలియనట్టిది, యెన్నటికిని బాధింపబడనట్టిది, శ్రేయస్సాధనమగునట్టిదియే, బోధించునుగాని అన్యమును బోధించదు. శాస్త్రమనగా ముఖ్యార్థము వేదము. ఇట్టి వేదమాతయొక్క బోధను ఉపేక్షించుట మానవ శ్రేయోదాయకముగాదు. కావున వివేకులు యీ మానవ జన్మగలిగిన యవకాశము వృధాగావించుకొనక ప్రారబ్ధానుసరణమున వారివారి కర్మఫల సుఖదుఃఖానుభవములెంతటివైనెట్లు నొందుచున్నను, శక్తివంచనచేయక, ప్రయత్నలోపముజేయక, వారినిత్యవాంఛితమగు శాశ్వతసుఖము నొందుటకు శాస్త్రీయ, విచారాది సాధనములనవలంబించి,

యభ్యసించుచుండుటయే మానవుని పరమ శ్రేయోదాయకము, వివేకమార్గము. ఈ వివేకము వస్తువిచారమువలనగాని గలుగదు. ఈ విచారమేదియనిన ఆత్మానాత్మవిచారము. ఈ విచారమువలన ఆత్మజ్ఞానముగలుగును. ఆత్మజ్ఞానము వలన మానవునకు తానుకోరునట్టి దుఃఖనివృత్తి, ఆనందావాప్తిగలుగును. మానవునకిది నిత్యనిరతిశయసుఖము. ఎన్నటికిని నశించని శాశ్వతసుఖము. మానవ కళ్యాణమునకు యింతకుమించినదిలేదు. కావున యీవిచారాదులావశ్యకములు.

ఎంత విచారించినను, వివేకులకు యీ స్వశరీర సర్వ ప్రపంచమంతయు ప్రధానముగ రెండు భాగములకన్న వేరుగ కనబడదు. అవి ఏవి యనిన, ఆత్మ, అనాత్మపదార్థములు. ఇందు ఆత్మ- పరిపూర్ణము, అఖండము, అపరిచ్ఛిన్నము, నిత్యము, సత్యము, సుఖస్వరూపము. ఇదియే జీవుని పరమార్థవాస్తవ స్వరూపము. ఈయనయే పారమార్థిక జీవుడు. ఈయననే ఆత్మ, ప్రత్యగాత్మ, పరమాత్మయనిన్నీ, బ్రహ్మయనిన్నీ శాస్త్రము మానవునకు బోధించుచున్నది. ఈయనయే స్వప్రకాశుడు, వాస్తవుడు, సర్వాధిష్ఠానము, పరిపూర్ణజ్ఞానరూపము. ఇంక రెండవభాగమేమనిన, ప్రతిజీవియును, నేను, నేను, యని తలచునట్టి, శరీరమనఃప్రాణాదికములును, నాదియనుకొనునట్టి భార్యాపుత్ర, విత్తాదులును, యితర దృశ్యమంతయు, అనాత్మకోటిలోనిది. ఇది అధ్యస్తము, అవాస్తవము, అనిత్యము, జడము, అజ్ఞానరూపము, దుఃఖ పర్యవసితము. ఇట్టి వాస్తవావాస్తవముల అవిద్యాకల్పితసంబంధ గ్రహణము వలననే జీవునకు ప్రపంచానుభవములు కలుగుచున్నవి. ఈ విషయమునే శ్రీ శంకరభగవత్పాదులు "సత్యానృతేమిథునీకృత్య" అని భాష్యము గావించి నారు. శాస్త్రబోధ ననుసరించి జీవుడు, జీవుని అవిద్యాకామకర్మలు, అనాదు లగుటచే, జీవుడు తన అనాది అజ్ఞానముచే, యీ స్వశరీర జగదనుభవముల యందు మిశ్రితముగానున్న, సత్యమగు ఆత్మయేదియో, అనృతమగు అనాత్మ యేదియో, తన అజ్ఞానమువలన తెలిసికొనజాలక, అనృతము, అనిత్యమగు, యీ పరిచ్ఛిన్న శరీరాది దృశ్యమునే ఆత్మయని భ్రమించి ఆత్మకానిదానిని, ఆత్మ. "అహం" నేను అని నమ్మి వ్యవహరించుచు

దృశ్యమందు, స_క్తతాభిమాన, పామరత్వములనొందుచు, సంసారరూపమగు జన్మపరంపరలతో, పర్యవసానమున దుఃఖమునొందుచున్నాడు. మానవుని యిట్టి సంసారదుఃఖమునుండి తరింపజేయుటకే శ్రుతి- "ఆత్మైవానందః" అని, నేను, నేను, అని తలచునట్టి, నీ వా_స్తవస్వరూపము ఆనందమే, నీవే ఆనందస్వరూపుడవని బోధించుచున్నది. దీనిని తెలిసికొనుటకు ఆత్మానాత్మ జ్ఞానమావశ్యకము. అనగా యీ ప్రపంచానుభవమున, అనాత్మ పదార్థము నంతయునూ, జ్ఞానపూర్వకముగ త్యజించి, నేను, నేను, అనుకొనుచున్న తనవా_స్తవస్వరూపము కేవలసుఖస్వరూపమనియూ, ఇదియే ఆత్మ, యిదియే తానని శాస్త్రీయముగ గ్రహించి స్వానుభవము నొందుటవలన, ఆత్మ స్వరూపుడగుతానే పరిపూర్ణానందస్వరూపుడనని గ్రహించగలుగుచు కాలపరి పాకమున, తత్స్వరూపుడే యగునని శాస్త్రము ఘోషించుచున్నది. ఇదియే ఆత్మానందము.

ఆత్మానందమనగా జీవునకు తన పరమార్థస్వరూపమేగాని వేరుగాదు. కాని తాను పరమార్థవా_స్తవమున ఎట్టిస్వరూపుడో తెలిసికొనలేక తాను కోరునట్టి ఆనందమువేరు, తాను వేరు అని తలచుచున్నాడు. ఇదియే జీవా జ్ఞానము. ఈ అజ్ఞానముతోడ సర్వమానవులు సర్వదా తమతమ ఆనందము నకుగాను బాహ్యప్రయత్నములు చేయుచుందురు. ఆనందముకొరకే సర్వ జీవులును సర్వదా వారివారి పనులను చేయుచుందురు. ఈ ఆనందమును ప్రతి వారును వారివారికొరకే కోరుచుందురుగాని యితరులకొరకుగాదు. ఏలనన ప్రతిజీవికియును తన ఆత్మయే పరమప్రేమాస్పదమగుచున్నది. అనగా ప్రతి వారును విషయములను కోరునది తమ ఆత్మానందముకొరకే. అనగా తన ప్రయోజనమును కోరియేగాని, విషయములను వాటియొక్క ప్రయోజనము కొరకు కోరుటలేదు. ప్రతిజీవికియునూ సర్వపదార్థములకన్నను తన ఆత్మయే పరమ ప్రేమాస్పదమగుచున్నది. ఈతాత్పర్యార్థమునే "ఆత్మనస్తుకామాయ సర్వం ప్రియంభవతి" అను బృహదారణ్యకవచనము తెలుపుచున్నది. శ్రీవిద్యా రణ్యస్వామి యీ విషయమునంతయు సవి_స్తరముగ పంచదశి ఆత్మానంద

ప్రకరణమందు నిరూపించియున్నారు. అద్దానినంతయు గ్రంథబాహుళ్యమగు నను భావముతోడ నిచట వివరించుటలేదు. ఆత్మయనగా జీవునకు తన పరమార్థవాస్తవస్వరూపమేగాని వేరుగాదు. జీవునికి ఆత్మప్రకాశరూపమున నున్న తన పరమార్థస్వరూపమే పరమానందస్వరూపము. కాని యిట్టి తన అఖండపరిపూర్ణానంద స్వరూపమును జీవుడు అనాది అజ్ఞాన వివశుడై మరచి యీ ఆనందముకొరకు సదా ప్రాపంచిక విషయములను కోరుచుండును. కాని ప్రపంచవిషయములు ఆభాసములు, అనిత్యములగుటచే మానవునకు తాను కోరునట్టి విషయానందముగూడ తాత్కాలికము మాత్రమేయగుచు సదా మరల జీవుని విషయవాంఛాలంపటునిగ జేయుచుండును. ఈ విషయవాంఛలచే జీవునకు సంసార దుఃఖము గలుగుచుండును. జీవుడిట్టిసంసారదుఃఖమునుండి విముక్తుడగుచు తనపరిపూర్ణానందమునొందుటకు ఒక్క ఆత్మజ్ఞానమే శరణ్యముగాని తదితరములుగావు. విషయానందములనిత్యములు, ఆత్మానందము నిత్యముగావున ఆత్మానందమునుకోరు జీవునకు ఆత్మజ్ఞానమావశ్యకము. "ఆత్మావాఅరేద్రష్టవ్యః శ్రోతవ్యో,మన్తవ్యో, నిధిధ్యాసితవ్యః" అని ఆత్మజ్ఞానసాధనములుగ శ్రవణమననాదులను బృహదారణ్యకవచనము తెలుపుచున్నది. జీవునకు ఆత్మానందము, చిత్తవిశ్రాంతివలనగాని గలుగదు. ఈ చిత్తవిశ్రాంతికి ఆత్మజ్ఞానమే సాధనముగాని మరియొకటిలేదు. ఈ విషయమునే శ్రీ వశిష్ఠభగవానులు

శ్లో॥ కరోతుభువనేరాజ్యం, విశత్వాకాశమంబువా।
స్వాత్మలాభాదృతేవిద్వాన్, విశ్రాంతింనాధిగచ్ఛతి॥

అని శ్రీరామచంద్రమూర్తికి తెలుపుచున్నారు. ఈ ఆత్మజ్ఞానము వలన గలుగునట్టి చిత్తవిశ్రాంతి, నిత్య, నిరతిశయ సుఖస్వరూపము. మానవునకు యిట్టి తన సుఖస్వరూపమును తెలిసికొని స్వానుభవము నొందుటయే పరమానందప్రాప్తి, మోక్షము. మోక్షమన్నను ఆత్మసుఖమన్నను ఒక్కటియే.

ఈ ప్రపంచమున సర్వజీవులును అనగా పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వదా కోరునది సుఖమే. అనగా వారివారిసుఖము. ఈ సుఖము ఆనంద స్వరూపము. ఈ సుఖము కోరునది తనకొరకేగాని అన్యులకొరకుగాదు. అనగా యిది తన సుఖము. తన సుఖమనగా ఆత్మసుఖము. ఆత్మసుఖమనగా ఆత్మవిశ్రాంతియేగాని మరియొకటిగాదు. పరమార్థ వాస్తవమున ప్రతి జీవి యును పరిపూర్ణాత్మస్వరూపుడే. ఈ ఆత్మస్వరూపమే జీవుని, అఖండపరిపూర్ణానందస్వరూపము. కాని జీవుడిప్పుడు తన అనాది అవిద్యచే తన అఖండ పరిపూర్ణానందస్వరూపమును మరచి యున్నాడు. ప్రతి జీవియు అజ్ఞానావృతుడగుట వలన యిప్పుడు తన సుఖస్వరూపమును మరచియున్నవిషయముగూడ తనకు తెలియుటలేదు. అయినను తాను పరమార్థ వాస్తవమున సుఖస్వరూపుడగుటచే తన మెడలోని హారమును తాను మరచి వెతుకునట్లగుటచే తన సుఖముకొరకు, తనను విడచి బాహ్యప్రయత్నములను జేయుచుందురు దీనికొరకే మానవులు ప్రవృత్తి నివృత్తికర్మలను సుఖసాధనములుగ నాచరించుచుందురు. ఇట్లాచరించుటలో శాస్త్రీయసాధనములయందు విశ్వాసముగలిగి యాచరించువారు ఆస్తికులనబడుదురు. మానవులకు యీ ఆస్తికతయన్నది యొకసంపత్తు. ఈ ఆస్తికతయను సంపత్తు శాస్త్రీయ ప్రవృత్తినివృత్తి మార్గముల రెంటియందును గలదు. ఇందు ప్రవృత్తిసాధనములిచ్చునట్టి భోగైశ్వర్య స్వర్గాదులు తాత్కాలికములగుచు నశించునట్టివి. కాని నివృత్తిసాధనములు కాలక్రమమున స్వస్వరూపమగు నిత్యనిరతిశయ సుఖప్రాప్తినిచ్చునని శాస్త్రము తెలుపుచున్నది. ఇందు ప్రతిమానవునకున్నూ అశాశ్వతసుఖముకన్న శాశ్వతసుఖమందెక్కువ ప్రీతియనుమాట నిర్వివాదము.

ప్రవృత్తి మార్గములగు కర్మసాధనములు కొంతవరకేదోవిధమున ఆచరణలోనున్నవి. కాని పామర, పండితవర్యులకుగూడ నివృత్తిమార్గమగు ఆత్మవిద్యయందభిరుచిగలుగుట దుర్లభముగనున్నది. దీనికి కారణము అవిద్యయే. అనగా అనాది అజ్ఞానము. దీనిని ఒక్కఆత్మజ్ఞానమను సాధనముచే నిర్మూలించవలయునేగాని వేరుదారిలేదు. ఈ విద్యనే ఆత్మవిద్య

యనియూ, బ్రహ్మవిద్యయనియుగూడ శాస్త్రము తెలుపుచున్నది. ఆత్మవిద్య యన్నను, బ్రహ్మవిద్యయన్నను, పర్యాయపదములేగాని వేరుగాదు. మానవునకు దీనిలాభము మహత్తరమగు అమృతత్త్వమునిచ్చునట్టి శాశ్వత నిరతిశయ సుఖస్వరూపము. అయినను మానవుడు తన అనాది అజ్ఞానవివశుడై తానే, సుఖస్వరూపుడనని గ్రహించలేక అట్టి సుఖముకొరకు కస్తూరిమృగము దానినాభి యందుండు కస్తూరీసువాసనను తాను గ్రహింపజాలక అది యెచటనోనున్నది యని దానికొరకు యటునిటు బరుగిడునట్లు జీవుడు సంసారభ్రమణముచేయుచు ఏజన్మకాజన్మయందు సుఖాభిలాషుడై, కల్పితములును, అనిత్యములు, నగునట్టి స్వశరీర, కళత్ర, పుత్ర, విత్త, క్షేత్రాదులను వాస్తవములు తనకు నిత్యములని తలచుచు తన సుఖముకొరకే వ్యామోహితుడగుచుండును. ఇదియే జీవునకు సంసారము. కాని వాస్తవమున జీవుడు బ్రహ్మకంటె వేరుగాదు. ఈ విషయమునే శ్రుతిమాత "జీవోబ్రహ్మైవనాపరః" జీవుడు బ్రహ్మకంటె వేరుగాదనిన్నీ "తత్త్వమసి" ఆ బ్రహ్మ నీవేయనిన్నీ బోధించుచున్నది. కాని మానవుడు తన అనాది అజ్ఞానముచే తనస్వశరీర సర్వవిషయములయందున రాగద్వేషాదులతో తన ప్రారబ్ధ సుఖదుఃఖభోగానుభవములయందు అతిసక్తతాభిమానములతోడ వ్యామోహితుడగుచు శుభాశుభకర్మఫలములను బట్టి పుణ్యపాపములనొందుచు యీ పుణ్యపాపముల ఫలముగ సుఖదుఃఖముల ననుభవించుచుండును. ఇట్లు ప్రతి జన్మయందునను జీవుడు అజ్ఞానావృతుడై కర్మలజేయుచు తన ప్రారబ్ధకర్మఫలమనుభవించుటకుగాను తిరిగి తిరిగి నీచ, అతినీచ, ఉచ్చోపాధులను పొందుచు సంసారచక్రమున భ్రమణము చేయుచుండును. ఇదియంతయు జీవునియొక్క అనాది అజ్ఞానమువలనగలుగుచుండును. కాని ఒకానొక జీవుడు తన యనేక కోటిజన్మ పుణ్యకర్మ పరిపాక ఫలమువలన తననుతాను వాస్తవముగ నేనేసుఖస్వరూపుడననియు, విషయ సుఖములు నాకు వాస్తవముగ సంబంధించినవిగావనియు వీటివలన నాకు పరమప్రయోజనము లేదనియు దృఢనిశ్చయమునొంది, తన స్వరూప స్వానుభవమునొందుటకు శాస్త్రీయ సాధనముల నవలంబించును అట్టివి యేవియనిన,

శాస్త్రము మానవునకు, నిత్యములగు మోక్షసాధనములను అనిత్యములగు ఇహపరలోకభోగసాధనములను బోధించుచున్నది. ఇందు మోక్షసాధన ప్రయత్నము నివృత్తిమార్గమనియూ, ఇహపరలోక భోగైశ్వర్యసాధనములు ప్రవృత్తిమార్గమనియూ తెలుపుచూ సర్వప్రవృత్తిమార్గములనూ నివృత్తికి సాధనముగనే బోధించుచు, యీ విద్యలను "ద్వేవిద్యేవేదితవ్యేపరాచైవాపరాచ" అనగా మానవులు తెలుసుకొనవలసిన విద్యలు పరవిద్యయనియు, అపర విద్యయనియు రెండుగలవని శాస్త్రమే తెలుపుచున్నది. ఈ వచనమును బాగుగా పరిశోధించి విద్వాంసులు మొదటిది ఆత్మవిద్యయనియు, తక్కిన విద్యలన్నియు అనాత్మవిద్యలనియు విభాగముగావించిరి. ఆత్మవిద్యయనగా జీవునకు తన ఆత్మస్వరూపము, నిత్యనిరతిశయ పరిపూర్ణానందస్వరూపమునగు మోక్షోపాయమును తెలుపునట్టివిద్య. దీనికి ప్రధాన సాధనముగ శాస్త్రము శ్రవణ, మనన, నిదిధ్యసనములను బోధించుచున్నది. మానవులకు యీవిద్యాఫలము పరమ ప్రాప్తి. అనగా నిశ్శ్రేయసమను నిత్య నిరతిశయసుఖప్రాప్తి. ఇదియే మోక్షము. ఇక అనాత్మవిద్యలన్నియూ ఇహపరలోకభోగసాధనములగుచు అనిత్యములై నశించుచుండును. పర్యవసానమేమనిన పరవిద్యయగునట్టి ఆత్మసుఖలాభము - నిత్యము, ఎన్నటికిని నశించనిది, అపరవిద్యాసుఖము లన్నియు తాత్కాలికములు, నశించునవి యనిగ్రహించి, ఆత్మవిద్యాసాధన ములనవలంబించవలయును. అట్టిమహనీయుడు తనప్రారబ్ధాంతమందు స్వస్వరూపసుఖము నొందినవాడగుచు అమృతుడగును.

ఈ ఆత్మజ్ఞానమే అమృతత్వమునిచ్చి జీవునకు తానుమరచిన తన నిత్యనిరతిశయ సుఖమగు మోక్షమునొందింపజేయును. మానవునకు ఆత్మజ్ఞానమువలన అజ్ఞానము నశించినతోడనే అమృతత్వము లభించును. ఇది కేవలనిర్వికార పరిపూర్ణసుఖస్వరూపము. ఇదియే బ్రహ్మస్వరూపము, ఇదియే ఆత్మానందస్వరూపము.

ఆత్మసుఖామృతమనగా పునర్జన్మరహితమైన శాశ్వతసుఖము. మానవులకు ఆత్మసుఖామృతమునొందుటకు స్వశరీర ప్రపంచములే సాధనములు

గాని మరివేరులేవు. కాని మానవులు తమ అనాదియజ్ఞానముచే యీ సాధనములను వారిఅమృతత్త్వ సిద్ధికి నుపయోగించుకొనుటకుమారుగ వారివారి సంసారబంధమునకుపయోగించుకొనుచున్నారు. ఈ సంసారబంధము జీవునకు తన ప్రారబ్ధభోగానుభవములయందు తనకు గలుగుచున్న రాగద్వేషాది సక్తతాభిమానములను శృంఖలమువలన గలుగుచున్నది. ఈ సక్తతాభిమానరాగద్వేషాదులు సంసారసర్పమునకు విషపుకోరలవంటివి. అభ్యాసకులు శాస్త్రీయ నిత్యానిత్య వివేకములతోడ తమసుఖదుఃఖానుభవములయందు విషయవిషమును (అనగా అతి సక్తతాభిమానపామరత్వములు) తీసివేసి అనుభవింపగలిగిన యెడల కోరలుతీసినపాము గరచినను అపాయము లేనియట్లు యీ సమస్త విషయభోగములు వాటియొక్క యంకురశక్తి నశించినవగుచు తమకు భావిప్రతిబంధములు గాజాలవు. ఎట్లనిన ధాన్యము శనగలు మొదలగునవి అగ్నితాపముచేసి బాగుగవేయించిన, వాటి యంకురశక్తి, అనగా తిరిగి మొలచునట్టిశక్తి నశించి అట్టివి కేవల ఆహారపదార్థములుగనెట్లుపయోగించునో యట్లే యీ స్వశరీర సర్వభోగానుభవములను ఆత్మజ్ఞానమను నగ్నితోడ తపింపజేసి వాటియనుభవమును నొందగలిగిన మహనీయులకు యీ ప్రపంచానుభవములేవియును బంధముగాజాలవు. ఈరహస్యమును గుర్తెరిగి సక్తతాభిమానరహితముగ సమస్త సుఖదుఃఖానుభవములను సమత్వబుద్ధితోడ ననుభవించుటయే నేర్పరితనము. "కృత్వాపిననిబద్ధ్యతే". అని గీతావచనము.

మానవునకు యీ ప్రపంచము చోరునివంటిది. స్వభావముచే చోరుడు అపకారియైనను వానిని దొంగయని బాగుగ తెలిసికొని వానితో స్నేహము గావించిన, చోరుడు అపకారము చేయజాలడు. ఇంకను వానిప్రజ్ఞ, స్నేహితుడైనతనకు ఎప్పుడైనను లాభించుటకవకాశమున్నది. ఈ విషయమునే "విజ్ఞాయ సేవితశ్చోరో, మైత్రీ మేతిన చోరతామ్" యని విద్యారణ్య స్వామి తెలిపి యున్నారు, కావున ముముక్షువులగు జిజ్ఞాసువులు యీ ప్రపంచరహస్యమును తెలిసికొని వారివారి సాధనాభ్యాసములను బాగుగనాచరించుచుండిన

కాలక్రమమున అభ్యాసపాటవమునుబట్టి వారిప్రారబ్ధాంతమందు నిస్సంశయ ముగ, అమృతత్త్వము నొందుదురని శాస్త్రము తెలుపుచున్నది. ఇదియే మోక్షము. ముముక్షువులకు నిట్టిముక్తినిచ్చునదియే యీ బ్రహ్మవిద్య, మానవుడు తన నిత్యనిరతిశయ సుఖస్వరూపమగు మోక్షప్రాప్తిని, నీ విద్యవలననే పొంద వలయును గాని వేరుదారి లేదు. ఈ విషయమునే "నాన్యఃపంథా విద్య తేయనాయ" అని శ్రుతిమాత తెలుపుచున్నది. మానవ జీవితమునకిదియే పరమప్రయోజనము,

కాని కొందరకు నొక సంశయము కలుగవచ్చును, ఏది యనిన-యీ కాలమున ఇట్లాచరించిముక్తిని బడయుట సాధ్యమాయని. కాని వివేకు లకు ఇట్టిశంకకు ఎంతమాత్రమును అవకాశము కనబడదు. ఏలయన శుకవ్యాస వసిష్ఠ వాల్మీక్యాదులు పౌరాణిక కాలమునుండియు, వేల శతాబ్దముల క్రిందనుండి శ్రీ శంకరభగవత్పాద సురేశ్వరాది అనేక పూర్వాచార్యులును, కొద్దిశతాబ్దములక్రింద శ్రీ విద్యారణ్య, మధుసూదన సరస్వతీ, అప్పయ్య దీక్షిత ఇత్యాదులును, ఈ శతాబ్ద ములోగూడా శ్రీరామకృష్ణ పరమహంస, వివేకా నందస్వామి, స్వామి రామతీర్థ, ఇంకనూ లోకమునకు తెలియబడని మహనీయులనేకులు ఆత్మసాక్షాత్కారము నొంది లోకమునకు బోధ పూర్వకముగ చేసిన మహోపకారములు ప్రాజ్ఞులందరకును విశదమే. ఏవిద్య యైనను ఒకకాలమున ఒకరికి సాధ్యమైనచో, అది తక్కిన వారికిని, అన్యకా లములందుగూడ సాధ్యమైనదిగా కావలసియుండును. ఇక కార్యసిద్ధియగు టయు, కాకపోవుటయు, ఆయా వ్యక్తుల యొక్క ప్రజ్ఞాప్రయత్నభావనా దార్ఢ్యములమీద నాధారపడి యుండునుగాని వేరుగాదు. జీవునకు తన పర మార్థలాభమును సంపాదించుటయందు అసాధ్యమేదియును లేదు. ఏలయన పైన తెలిపిన మహనీయుల జీవితములన్నిటికిని శతాబ్దములు దూరమున్నను వీరి యందరి పరమార్థానుభవములు ఒక్కవిధముననే తెలియబడుచున్నవి గాని, వేలసంవత్సరములైనను ఈ స్వరూపజ్ఞానానుభవమున నెట్టి మార్పును యుండలేదు. ఉండుటకు వీలులేదు. ఇది సర్వదా ఏకరూపము, నిత్యము,

నిర్వికారము, అఖండము, పరిపూర్ణము, ఇదియేజీవుని పరమార్ధస్వరూపము, స్వస్వరూపము. కావున జీవునకిట్టి తన నిత్యానుభవ పరమార్ధ స్వరూపప్రాప్తి సాధ్యమాయని యీ కాలముననైనను ఏకాలముననైననుగూడ సంశయించుట వివేకముకాదు. ఇట్టి ఉత్కృష్టఫలమును ఇచ్ఛయించి ప్రయత్నముచేయు మహనీయులు ఈ కాలమున అతిస్వల్పముగ నుండవచ్చును. కాని లేరనగూడదు. ఏలనన యిప్పుడునూ అరుదుగ కనబడుచుందురు. ఈ కాలమున దీనిని సాధించుటకు శక్తిపాటవములు తక్కువగనుండ వచ్చును. కాని యిట్టిస్థితిని పొందియీఫలము ననుభవింపగలమా, ఇది యీ కాలమున సాధ్యమాయని ఎంతమాత్రము సంశయించుటకు అవకాశములేదు.

ఇది బ్రహ్మవిద్య. ఈ విద్యాఫలము ప్రత్యక్షముగాని కాలాంతరముననే, ఫలమిచ్చునదిగాదు. జీవితకాలమందుగూడ ముక్తి, అనగా జీవన్ముక్తి సుఖము నిచ్చు నట్టివిద్య ఇది ఒక్కటియే. దీనినే రాజవిద్య యనిగూడ గీతలలో తెలుపుచున్నారు.

*దీనిని గురించి—*

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం, పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమంధర్మ్యం, సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

అనగా ఈ జ్ఞానము విద్యలలో శ్రేష్ఠమును, రహస్యములలో శ్రేష్ఠమును, పవిత్రమైనదియు, ఉత్తమమైనదియు, ప్రత్యక్షబోధగలదియు, ధర్మబద్ధమైనదియు, నాచరించుటకు సుఖకరమైనదియు, నాశములేని యట్టిదై యున్నదనియు తెలుపుచున్నారు. ఇంకనూ బ్రహ్మజ్ఞానమునకు ముఖ్యసాధనమగు అహంకారత్యాగము (అనగా ఈ శరీరాదులేనేనను బుద్ధినివిడచుట) ను గురించి: —

శ్లో॥ అపి పుష్పాపదళనాదపి లోచన మీలనాత్ ।
సుకరోఽహంకృతేస్త్యాగో నక్లేశోఽద్యమనాగపి ॥

అనగా అహంకారమును విడచుట పుష్పముగోయుట కంటెను, కను మూయుట కంటెను, సులభమైనది ఇందు కొంచమైనను కష్టములేదు. అని వాశిష్ఠము నందు బృహస్పతి వచనము తెలుపుచున్నది.

కాని ఇది ప్రజ్ఞావంతులకు ఎంతసులభసాధ్యమో ప్రజ్ఞాహీనులకు అంతకష్టసాధ్యము. అయినను మానవుడు తన శాశ్వతసుఖమునొందుటకు బ్రహ్మవిద్యయే శరణ్యము. ఇది అమూర్తము, నిష్ప్రపంచపదార్థము, కావున సులభముగ బోధపడదు. ఇందువలననే లోకములోగూడ "ఇది బ్రహ్మవిద్యా?" అను లోకోక్తికలదు. అయినను మానవుల కిది విద్యలలోనికెల్ల శ్రేష్ఠమైన దగుచు వారి నిత్య నిరతిశయ సుఖస్వరూపమగు మోక్షమునొందింపజేయునది. మానవుడింతకన్న పొందగలలాభములేదు. ఈ విద్యను బాగుగ గ్రహించుటకు గుర్వీశ్వరానుగ్రహము లతోకూడిన నిశితమగు బుద్ధి అపేక్షితము. ఈ విద్యాభ్యాసమార్గము అతిక్లిష్టము గనుక ప్రజ్ఞాబుద్ధు లావశ్యకములు. మానవుని భ్రమప్రమాదములచే ఈవిద్యాభ్యాసమార్గము దుస్సాధ్యముగనుండును. బహుజాగరూకుడై ఆవలియొడ్డుకు చేరవలసి యున్నది. ఈ విషయమునే "క్షురస్యధారా నిశితాదురత్యయా, దుర్గంపథ స్తత్కవయోవద న్తి" వాడియైన కత్తిని దాటుట అనగా కత్తిమీదనడచుట ఎంతకష్టసాధ్యమో అటులనే ఈ ఆత్మజ్ఞాన రూపమగు బ్రహ్మవిద్యా మార్గము అంతకష్టమని శ్రుతి తెలుపుచున్నది. బ్రహ్మవిద్య అనగా ఆత్మజ్ఞానము, అతిసూక్ష్మ విషయము. దీనిని పొందుటకు అనాత్మభూతమగు సర్వ ప్రపంచమున నసంస్పృష్టుడై అనగా ప్రపంచము తనకు నిత్యము సత్యమని తలంచుచు రాగద్వేషాదులతోడ వ్యామోహితుడుగాక తన ప్రారబ్ధము ననుభవించుటయందు వాడియైన కత్తిని దాటునట్లు దాటవలెనని తాత్పర్యార్థము.

శాస్త్రశ్రవణ మెంతచేసినను జిజ్ఞాసువుల విద్యాభ్యాసమునకు ప్రపంచ సత్యత్వబుద్ధి, విషయానుభవములు అడ్డువచ్చుచు సంశయములను కలిగించుచునేయుండును. అందుచే ఈ బ్రహ్మవిద్యను సంశయ విపర్యాస రహితముగ గ్రహించుట కత్తిమీదనడచుటలాగున దుర్లభముగ నుండును. నిష్ప్రపంచ

మగునట్టి ఆత్మతత్త్వమును బహువిధముల బోధించినగాని స్ఫురింపదు. అనగా విశదముకాదు. మననాదులవలనగాని సంశయ విపర్యాస రహితముగ బ్రహ్మపదార్థము తెలియబడదు. కావున జిజ్ఞాసువులకు ఈవిద్య సులభము గను, నిశ్చయముగను, తెలియుటకుగాను శ్రుతియుక్త్యనుభవములగ్రహించి ఈ అద్వైత సిద్ధాంతమును భిన్న భిన్న విషయనామముల తోడను, వివిధ లోకానుభ వోదాహరణల తోడను, సర్వ జిజ్ఞాసుసాధారణభాషలో మరల మరల "పథ్యంశతవిధంకృత్వా" అనున్యాయాను సరణమున ఈ గ్రంధమున తెలుపబడినది. కాని తెలుపబడినట్టి విషయ మంతయు నొక్కటియే. అనగా ఏకతత్త్వమగు బ్రహ్మవిద్యయేగాని మరియొకటిగాదు. బ్రహ్మ విద్యయన్నను ఆత్మవిద్యయన్నను ఒక్కటియే. కావున జిజ్ఞాసువులు పునరుక్తిని సుసాధనముగ గ్రహించవలయునేగాని దోషమను భ్రాంతి నొందగూడదు.

ఆత్మ విద్యయనగా జీవుడు తన సత్యస్వరూపమును తెలిసికొని స్వాను భవము నొందుట. ఈవిద్య వలనగాని స్వస్వరూప ఆత్మానందప్రాప్తి కలుగదు. ఆత్మానందము నిష్ప్రపంచ, నిర్విషయ, నిత్యసుఖస్వరూపము. ఎన్నటికిని మారునదిగాని నశించునదిగాని కాదు. కాని స్వశరీర సర్వప్రపంచసుఖములు సర్వదా మారుచు నశించునవి. ఇందు నిత్యమగునది ఒక్కటియునులేదు. ఏలనన యీ స్వశరీర సర్వప్రపంచ విషయములును, జీవుని ప్రారబ్ధాను భవనిమిత్తము జనించిన కల్పిత పదార్థములు. ప్రారబ్ధముగూడ జీవకల్పితమే. ఇది అజ్ఞానకల్పితము గావున జీవునియొక్క శాస్త్రీయ ప్రయత్నాదులచే, జ్ఞానమువలన నశించును. ప్రారబ్ధము నశించినయపుడు జీవుడు తన వాస్తవస్వ రూపముతో నిర్విశేషుడగును. ఇదియేముక్తి, మోక్షము. జీవునకిది తెలుపుటకే శ్రుతి "జీవోబ్రహ్మైవనాపరః" జీవుడు బ్రహ్మకంటే వేరుగా దని స్పష్టముగా బోధించుచున్నది.

ఈ స్వశరీర సర్వప్రపంచము భ్రాంతికల్పితమని "మాయా మాత్ర మిదంద్వైతం అద్వైతంపరమార్థతః" "అతోన్యదార్తం" అను మొదలుగా గల శ్రుతి వచనములున్నా.

శ్లో॥ దీర్ఘస్వప్న మిదం విశ్వం, విశ్వంబ్రహ్మణికల్పితం ।
పురుషః స్థాణు వద్భ్రాంత్యా, కల్పితశ్చిత్త విభ్రమాత్ ॥

అనగా కనుచీకటి యందు పురుషుని చూచి స్థాణువను భ్రాంతిజెందు నటుల, బ్రహ్మజ్ఞానమువలన చిత్తవిభ్రమముచే కల్పిత మైన యీస్వశరీర సర్వప్రపంచము దీర్ఘస్వప్నములాగున నగుబడుచు ననుభవింపబడు చున్నది అనగా వాస్తవము గాదను తాత్పర్యార్థమును శాస్త్రవచనములు తెలియజేయు చున్నవి. సర్వప్రపంచ అవాస్తవికతను గురించి శాస్త్రము, జీవునకింత విశద ముగా తెలుపుచున్నది. ఏలనన, నిచట యొకరహస్యము కలదు. ఈ స్వశరీర సర్వప్రపంచము కల్పితమైనను ప్రతి జీవియునూ సాధారణముగ తన ప్రారబ్ధ మనుభవింపక తప్పదు. ఏలనన "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" "ప్రారబ్ధంభోగతోనశ్యేత్" అను మొదలుగా గల వచనములు కోటిజన్మలకై నను అనుభవము వలనగాని కర్మక్షీణించదనిన్నీ, ప్రారబ్ధము భోగమువలన గాని నశించదనిన్నీ తెలుపు చున్నవి. కావుననే ఉన్నది అనుభవించుటయందు దోషములేదు. ఇంకఏమనిన యొకల తనకు కలుగుచున్న యీ స్వశరీర జగదనుభవములను-వాస్తవములు, యివితనకు నిత్యములు అను బుద్ధితోడ ననుభవించుట సంసారదుఃఖహేతువు. కావున గురు శాస్త్రబోధవలన యీ స్వశరీరసర్వదృశ్య - దృశ్యానుభవముల యొక్క అవాస్తవికతను బాగుగ గుర్తించి యిట్టి నిశ్చయమునొంది చేయునట్టి ప్రాపంచికానుభవములు జీవునకు భావిప్రతిబంధములు కాజాలవని శాస్త్రము తెలుపు చున్నది.

శాస్త్రబోధవలన యీ స్వశరీరజగత్తుల యాథార్థ్యమును తెలిసికొనుట వలన యీ రెండును మిథ్యా మాత్రములని తెలియ గలదు. జిజ్ఞాసువులకు జగన్మిథ్యాత్వనిశ్చయ జ్ఞానమావశ్యకము. ఇట్టినిశ్చయజ్ఞానమువలన జీవునకు తాననుభవింపవలసిన ప్రారబ్ధానుభవములో సౌలభ్యముగలిగిమోక్షసాధన మగును. జీవునకీజ్ఞానము ఇహపరసుఖ సాధనము.

ఇట్లు తెలిసి కొనలేక యీస్వశరీర ప్రపంచానుభవములనే తనకు నిత్యములు, వాస్తవములని నమ్మి పామరత్వముతోడ విషయ భోగలంపటు డగుచు వ్యామోహితుడై పరమును మరచు మూఢుడు చర్వితచర్వణముగ నీచ, అతినీచోపాధులనొందుచు జన్మపరంపరలతో సంసారభ్రమణము చేయు చుండునని, "నసాంపరాయః ప్రతి భాతి బాలం ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్, అయంలోకోనాస్తి పరఇతి మానీ పునఃపునర్వశమాపద్యతేమే," అనగా. పుత్ర, మిత్ర, కళత్ర, విత్త, గృహ, క్షేత్రాదుల యందు అతిసక్త తాభిమానములతో వ్యామోహితులై అజ్ఞానముచే నావరింపబడి ప్రమాదమును జెందు యవివేకులు వారి పరప్రాప్తికి శాస్త్రీయ సాధనమును పొందలేరు. కాంతా కనకాన్నపానాది సంపదగగాన్పించుచున్న యిదియేలోకము, పరము లేదనితలంచువారు జననమరణ ప్రవాహముతో పునః పునః నాయధీనమగు చుందురని, మృత్యుదేవతయగు యమధర్మరాజు వచించుచున్నట్లు శ్రుతి వచనము తెలుపు చున్నది. కావున వివేకులగు వారలు, స్వశరీర ప్రపంచ స్వభావములను శాస్త్రజ్ఞానముచే బాగుగగ్రహించి, తెలిసికొని అట్టినిశ్చయము తోడ వారి వారి ప్రారబ్ధ సుఖ, దుఃఖ, భోగానుభవముల ననుభవించ వలసిన యావశ్యకత గనబడుచున్నది. వివేకి తన శాశ్వత సుఖమునకు నమ్ముకొన దగిన పదార్థమేదియునూ నీ ప్రపంచమున కనుబడదు.

ఈ ప్రపంచమున ప్రతి జీవునకున్ను జీవిత సంపదలనగా నెట్టివో వాటి నిష్ప్రయోజన, అనిత్యత్వములను గురించి తెలుపుచున్నట్టి కొన్ని వచనములను, తాత్పర్యార్థము తోడ నిచట యుదాహరించుచున్నాడ.

"ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతిక్షయం యౌవనం, ప్రత్యాయాంతి గతాః పునర్న దివసాః కాలో జగద్భక్షకః, లక్ష్మీస్తోయ తరంగభంగ చపలా విద్యుచ్చలం జీవితం ॥"

"కింయానేన ధనేన వాజికరిభిః ప్రాప్తేన రాజ్యేనకిం,
కింవాపుత్ర కళత్ర మిత్ర పశుభిర్దేహేన గేహేనకిం।
జ్ఞాత్వైతత్క్షణ భంగురం సపదిహిత్యాజ్యం మనో దూరతః॥

అనగా మనము చూచుచుండగనే జీవుని ఆయుర్దాయము ప్రతిక్షణము నను క్షీణించు చున్నది. యౌవ్వనము గూడ రోజురోజుకున్నూ క్షీణించి తగ్గి పోవుచున్నది. గడచినరోజులు మరల వచ్చుటలేదు. కాలము స్వశరీర సర్వప్రపంచమును భక్షించుచున్నది. పుత్ర, మిత్ర, కళత్ర, విత్త, గృహ క్షేత్రాది సంపదలన్నియు సముద్ర తరంగములవలె సర్వదా చంచలములై మారుచున్నవి. జీవితము మెరుపువలె క్షణికమైనది. అనగా జీవుడు తాను పొందిన శరీరముగాని, గృహక్షేత్రాదులనుగాని, భార్యాపుత్ర మిత్ర కళ త్రాదులనుగాని, గజాశ్వవాహనాదులు గలిగినట్టి రాజ్యాది ఐశ్వర్యాధి కారములనుగాని కేవల సుఖసాధనములని తలంచక వీటియొక్క అల్పకాల స్థితిని, నశ్వరత్వమును, బాగుగ గ్రహించి మనస్సును వాటినుండి దూరముగా నుంచవలయును. అనగా వాటియందు వ్యామోహితుడై సక్తతాభిమానముల నొందక, ననుభవింపవలయునని పై వచనములు తెలుపు చున్నవి.

ఇంకనూ, శ్లో ॥ నదైవం నచకర్మాణినధనానిన బాంధవాః।
శరణం భవభీతానాం స్వప్రయత్నా దృతే నృణామ్ ॥

అనగా, సంసారము నుండి భయపడి సుఖమును కోరు మను జులకు దైవముగాని, కర్మములుగాని, బంధు సంపదలుగాని, రక్షకులు కానే రరు. కాని ఏమనిన శాస్త్రీయ స్వప్రయత్నమే సంరక్షణమగునని శ్లోకార్థము.

వివేకులగువారలకు నీప్రపంచమెంత వెదకిచూచినను తమశాశ్వత సుఖ మునకు నమ్మికొనదగిన పదార్థమేదియును వాస్తవముగ గనుబడదు. ఏలనన, నేను అనుకొను తన శరీరము మొదలు నాది యనుకొనబడుచున్నట్టి సకల ప్రపంచము భ్రాంతికల్పితమని శాస్త్రము బోధించుచున్నది. మన యనుభవ మును బట్టి చూచినను, యివియన్నియు సర్వదా మారుచు ఏదోయొక కాల మున నశించుచునే యున్నవి. కాని ఒక్క ఆత్మ పదార్థము తప్ప, నాశము నొందని పదార్థము ప్రపంచమున నేదియును లేదు. దీనినిఎట్లు తెలిసి

కొనవలయుననిన, శాస్త్రి బోధ యటులుండ, అతిసూక్ష్మ బుద్ధితోడ గ్రహించ గలిగిన యడల మనయనుభవమును బట్టియే అహమ్ నేను యనుకొనబడు చున్న వాస్తవపదార్థమెన్నటికిని నశించుటలేదు. ఈ నేను అను అహమ్ ప్రతీతి మాత్రము ప్రతి మానవునకును జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవ స్థల యందునను, తన భూత భవిష్య ద్వర్తమానములగునట్టి, వెనుకటి జన్మ, యీ జన్మ, వచ్చే జన్మలయందునను, నశించుటలేదు. యే మానవుడును తననుతాను మరువక అహమ్ నేను అను ప్రతీతి తోడ అవస్థాత్రయత్రికాలాబాధితముగ నిత్యానుభవమును పొందుచునే యున్నాడు. ఇదియే ఆత్మ. ఈ ఆత్మ కేవల ఆనంద స్వరూపమని "ఆత్మైవానందః" అని శ్రుతిమాత తెలుపుచున్నది. ఇట్లుండ, నిత్యమైయుండు తన పరమార్థ స్వరూపమును వాస్తవముగ గ్రహింప జాలక జీవుడు, తన అవిద్యాకామకర్మల భోగార్థమై కల్పితముగ నేజన్మకా జన్మయందు నేర్పడుచున్న తన శరీర మునే వాస్తవముగ తాననిన్ని తన ప్రారబ్ధానుసరణమున యీ జన్మలో సంప్రాప్తమగుచున్న స్వశరీర, పుత్ర, మిత్ర, కళత్ర, విత్త, క్షేత్రాదులను తనకు శాశ్వతములు, నిత్యము లనిన్ని భ్రాంతితోడ వాటి యందు పామర, సక్తతాభిమానముల నొందుచు యిట్టి భ్రాంతిచే వాటి వియోగ దుఃఖము తోడ మరణించుచున్నాడు. శ్రీరామచంద్రమూర్తికి వశిష్ఠ భగవానులు మరణమును గురించి తెలిపినట్టి విషయమును నిచట తాత్పర్యార్థముతోడ నుదాహరించు చున్నాడను. ఈ మరణ విషయ విచారము అమంగళమని యొక సాధారణాభి ప్రాయమున్నను, జ్ఞాన సంప్రదాయమును బట్టి, యీ విచారణావశ్యకత కన బడుచుండుటచే నిచట నుదాహరించుచున్నాడను.

శ్లో॥ హస్తపాదాది మాన్దేహో, మమాऽయమితి పశ్యతి।
ఏతస్యాహంపితుః పుత్రో, వర్షాణ్యేతాని సంతిమే॥

శ్లో॥ ఇమేమే బాంధవారమ్యా, మమేదంరమ్య మాస్పదం।
ఇతి భ్రాంత్రిర్జగత్యత్ర, మృతిమోహా దనంతమ్॥

శ్లో ॥ అనుభూయక్షణంజీవో, మిథ్యామరణమూర్ఛనామ్ ।
విస్మృత్యప్రాక్తనంభావ, మన్యంపశ్యతి సువ్రత ॥

అనగా, యీ జగమునందు జీవుడు మృతిమోహము నొందిన వెంటనే యీ యుపాధి (అనగా దేహము) యందున్నాడనని యు, చేతులు, కాళ్ళు మొదలగు యవయవములు నావియనియు, యితడు నా తండ్రీ, యీయనకు నేను పుత్రుడను, నాకు యిన్ని సంవత్సరములు గలవు నాకు వీరు బంధువులు, యిది నా గృహము, నా సంపద, యను మొదలు గాగల వానిని చూచుచు (అనగా యిది యంతయు భ్రాంతి మాత్రమే) యిట్టి భ్రాంతితోడ జీవుడు క్షణము సేపు మిథ్యామాత్రమగు మరణమోహము (ప్రద్యోతము) ను యనుభవించి పూర్వ విధమునంతయు పూర్తిగ మరచి వేరొకవిధమును జూచుచు యీ దేహమును విడచును అని తెలుపు చున్నారు.

"జాతస్యమరణంధృవం" అని జన్మించిన ప్రతి జీవికియును మరణము నిశ్చయము, ఇది తప్పుటలేదుగదా? జన్మించిన జీవునకు మరణమేలేనిచో యీ ప్రపంచ వియోగ దుఃఖముండదుగదా? కాని జన్మించిన జీవునకు మరణము సహజము. స్వభావముచే విధిగా జరుగవలసిన మరణమునుబట్టి తాను శాశ్వత మనుకొనినదంతయు తనకు పోవుచున్నదేయని సక్తతాభిమానములతోడ మరణశోకమునొందును. అందుమూలమున తిరిగి సంసారబంధమునొందు చుండుట అజ్ఞానమేగదా? ఈ అజ్ఞానమువలననే దుఃఖము గలుగుచున్నది. జీవునకు యీజననమరణములు ప్రవాహరూపములుగనుక యీసంసార దుఃఖము గూడ ప్రవాహరూపముననుండును. జీవునకు యీ సంసార ప్రవాహమునుండి ఆత్యంతిక దుఃఖ నివృత్తి కొరకే, నేనెవరు? యీ ప్రపంచ మెట్టిది? నాకు దీనికిగల సంబంధ మెట్టిది? యను జ్ఞానమావశ్యక మగుచున్నది. ఈ జ్ఞానమునే శాస్త్రము బోధించునది. శాస్త్రమెల్లప్పుడును మానవునకు "అనధిగత, అబాధిత, శ్రేయస్సాధనమునే భోధించును గాని మరియొకటిచెప్పదు. కావున సర్వులకును శాస్త్రమాదరణీయము.

మానవునకు స్వశరీర ప్రపంచ సర్వసంపదలును సర్వదా మార్పు నొందుచు,నశించు స్వభావము గలవి. మానవునకు జీవితకాలమునందునగూడయీ స్వశరీర సంబంధములు, సంపదలు, మారుచుండుటచేగలుగు దుఃఖములే గాక మరణదశలో యింతకాలము నేను అనుకొనుచున్న తనదేహమును, నాదియనుకొనుచున్న భార్యా, పుత్ర, క్షేత్ర, విత్తాద్యైశ్వర్యములను, విడచి తాను మరణించుదునను దుఃఖముగూడ గలుగుచుండును. కాని జీవుడు యీ దేహ, ప్రపంచములను మరణ రూపమున త్యజించుట ప్రపంచ స్వభావము, వాస్తవ స్థితి. అయినను జీవుడు తన అనాది అజ్ఞానముచే వీటినిగురించి అతిసక్తతాభి మానములనొందుచు వీటిసంయోగ వియోగములవలన హర్ష దుఃఖముల నొందుచు పర్యవసానమున దుఃఖమునే పొందుచుండును. ఎందులకిట్లు జీవునకు గలుగుచున్నదనిన-తన అనాది యజ్ఞానమే సంసార కారణము. ఈ అజ్ఞాన ముచే ప్రపంచము తనకు సత్యము, నిత్యమని భ్రమించి సంసార దుఃఖము నొందుచున్నాడు. కాని తనశరీర ప్రపంచముల స్వభావమును, యివి కల్పిత మాత్రములు, తన కర్మానుభవమునకు నిమిత్తములు, కాని యివి తనకు నిత్యములుగావు, పరమార్ధవాస్తవమున వీటితో వాస్తవసంబంధములేదని బాగుగ గ్రహించిన యడల యీ వాస్తవ జ్ఞానముచే దుఃఖమున కవకాశ ముండదు. దృశ్యయధార్ధ జ్ఞాన నిశ్చయము తోడ చేయునట్టి సుఖదుఃఖ భోగానుభవముల యందు సక్తతాభిమానములు తగ్గి తగ్గి గలుగుచుండును. కలిగినను క్షీణించును. దీనివలన దృశ్య దుఃఖము క్షీణించుచుండును.

లోకానుభవమును బట్టిగూడ యిచట మనము తెలిసికొనవలసిన విష యమేమనిన, యెట్టి వాడైనను తన ఆభరణమును *గిల్టు బంగారమని* తెలిసి కొని యనుభవించిన యడల, తదుపరి, కొంతకాలమునకు బంగారు నల్లబడి నను విచారపడడు. ఏలనన వాస్తవమును తెలిసికొని యనుభవించువాడు గావున. పొరబడి గిల్టు బంగారమునే అసలు బంగారమనుకొని అనుభవించు వాడు, అది కాలక్రమమున నల్లబడుటచే దుఃఖితుడగును. దీనికి కారణము

తాను కొనిన ఆభరణ సువర్ణము యొక్క సత్యాసత్యతలను తెలియకపోవుటయే గదా? ఇది అజ్ఞానమేగదా? అట్లే జీవుడు తన అనాది అజ్ఞానముచే యీ ప్రపంచమందు గలుగుచున్న సంసార దుఃఖము ననుభవించుచున్నాడు. కాని ఏజీవునకు యీ ప్రపంచానుభవములన్నియు అవాస్తవములు, అనిత్యములు యివి యన్నియు మాయబంగారువంటివని నిశ్చయము నొందునో, వానికి దృశ్య దుఃఖము క్షీణించును. జీవుని నిట్టి సంసారమునుండి విముక్తుని గావించుటకు గానే శాస్త్రము "బ్రహ్మాత్మైకత్త్వ బోధేన మోక్షస్సిధ్యతి నాన్యథా" అని స్పష్టముగా తెలుపుచు యీ మానవజన్మ గలిగినప్పుడే మేలుకొని, అనగా జాగ్రతపడి తానెవరోయను స్వాత్మజ్ఞానము నొందవలయునని "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత" అనగా అజ్ఞానమను నిద్రనుండి లెమ్ము, జాగ్రతపడుము, శ్రేష్ఠమగు గురువునొంది ఆత్మజ్ఞానమును పొందుము అని మానవునకు బోధించుచున్నది. కావున జ్ఞానాభ్యాసకులు - యీ జనన మరణములు, ప్రపంచానుభవములు, గల్పితములు, అశాశ్వతములు, దుఃఖ పర్యవసితములని శాస్త్రబోధవలన బాగుగ తెలిసికొని విషయములందు సక్తతా భిమానవ్యామోహితులుగాక వానిని తమ ప్రారబ్ధక్షయమునకు మాత్రము అనుభవించుటయే వివేకము, నిరతిశయ శాశ్వతసుఖమగు మోక్షసాధనమని గ్రహింతురుగాక. ఈ విషయములను గురించి ముందు గ్రంథమందు శ్రుతి, యుక్తి, అనుభవ పూర్వకముగ విపులముగా నిరూపింపబడినది.

ఈ చిన్న గ్రంథములో ప్రతిపాద్యమగు విషయము నిరుపమాన సర్వోత్కృష్టమగునట్టి బ్రహ్మ విద్యగావునను,నిది అద్వైతము గావునను,మానవునకు లోకవ్యవహార అనుభవములన్నియు సద్వితీయమగు నానాత్వముతోడకూడి నవిగావునను, యెంతవ్రాసి, యెట్లు తెలిపినను, సిద్ధాంతము సాధారణానుభవ వ్యతిరేకముగ గనబడుచుండుటచే యీ గ్రంథ విషయజ్ఞానలాభమందరకునూ నేకరీతిన యుండదు. ఏలనన, యిసుమంతయైనను, విద్యాగంధములేక కేవల కాంతాకనకాన్నపానాది విషయ భోగలాలసతాప్రధానులగుచు, యివియే స్వర్గ

మోక్షములని తలచెడు వారలకే గ్రంథప్రయోజనమల్పము. ఇంక వారి పురాకృతపుణ్య ఫలంబున, యీ జన్మ యందీ శాస్త్రపాండిత్యము నొంది, ఆత్మసంయమలాభంబు నొందుచున్నట్టి, అత్యుత్తమాధికారులకును యీ గ్రంథమావశ్యకము గాదు. ఏలనన, అట్టి మహనీయులు సకృత్ శ్రవణాదులవలననే కృతకృత్యులగుదురని శాస్త్రము తెలుపుచున్నది. అట్టివారలకు ఒక్క మహావాక్య శ్రవణమే చాలునని గూడ శాస్త్రము తెలుపుచున్నది. ఇంక మిగిలినవారు, మంద, మధ్యమ, ఉత్తమాధికారులు. వీరలలో మొదటివారు సత్కర్మానుష్ఠానపరులగుచు యీ గ్రంథమును సద్గురుముఖమున పలుమారులు వినుటచే వారికి చిత్తశుద్ధి సంస్కార లాభము తప్పక కలుగును. ఇంక మధ్యమ, ఉత్తమాధికారులు, సదాచార సత్కర్మానుష్ఠాన పరులగుచు, యీ గ్రంథమును పలుమారులు పఠించి, బాగుగ గ్రహించి, వారువారుచేయునట్టి మననానుసంధానాద్యభ్యాసపాటవములచే, కాలక్రమమున యీ విద్యాలాభమును పొందగలుగుచుందురు. ఇందుకు సందియము లేదు.

నా గ్రంథములన్నియు, తత్త్వబోధ ప్రధానములుగావున, వాని యందు శ్రుతి స్మృతి వచనములును, తత్తుల్యమగునట్టి, పూర్వాచార్యుల గ్రంథ వచనములును ప్రమాణముగ గైకొనబడినవి అట్టివానిలో అద్వైత తత్త్వ బోధకుగాను శ్రీయోగవాశిష్ఠ గ్రంథ బోధను గూడ, వివిధ ప్రకరణములలో, సందర్భానుసారమున నుదాహరించి యున్నాడను. కొందరు పండితుల మనుకొనువారు, వాశిష్ఠము పౌరాణిక గ్రంథమేగాని, అధ్యాత్మ విద్యాసమన్వయమునకు ప్రమాణ గ్రంథము గాదనియూ, అందు వలననే శ్రీ శంకరభగవత్పాదులు దీని నెచటను గ్రహించియుండలేదనియు, శంకనొందుచున్నారు. కాని యిట్టి శంకనొందుట ప్రమాణ బుద్ధికి లక్షణముగాదు. ఏలనన శ్రీ శంకర భగవత్పాదులే గీతాపదమూడవ అధ్యాయములో అయిదవది యగునట్టి,—

శ్లో॥ ఋషిభిర్బహుధాగీతం, ఛన్దోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మ సూత్రపదైశ్చైవ, హేతుమద్భిర్వి నిశ్చితైః॥

అనుశ్లోకమునకు భాష్యము గావించునపుడు, ప్రథమ పాదములోని "ఋషిభిః" అను పదమునకు వశిష్ఠాదిభిః అనియ్నీ, "బహుధా" బహుప్రకారములచేననియ్నీ, 'గీతం' కథితం' అనియ్నీ తెలుపుచున్నారు. కావున శ్రీ వశిష్ఠ భగవానులను, జ్ఞానసంప్రదాయఋషిగణములో నగ్రగణ్యులుగ శ్రీ శంకరభగవత్పాదులే గ్రహించిరనుటకు సంశయము లేదుగదా.

ఇదిగాకను బ్రహ్మవిద్యా సంప్రదాయ గురుపరంపరలో "నారాయణం పద్మభువం, వశిష్ఠం" అని మూడవవాడగు బ్రహ్మమానసిక పుత్రుడు, బ్రహ్మవిద్యా సంప్రదాయనిమిత్త మాత్రముగ, సాక్షాద్భగవదవతారమగు శ్రీ రామచంద్రమూర్తికి చేసిన తత్త్వబోధను, ప్రమాణముగాదని తలచుట అసంభావనా మాత్రమే.

శాస్త్రమెల్లప్పుడును "అధికారిణమాశాస్తే" అని, అధికారియైనవానిని గురించియే, బోధించుచుండును. శాస్త్రి పరమతాత్పర్య మొక్కటియైనను, జీవుల అధికార తారతమ్యములనుబట్టి, సోపానమార్గమున, వివిధములుగ బోధించును. కావున, వారివారి అనుభవ, అధికార తారతమ్యములనుబట్టియే శాస్త్రిమును సమన్వయము చేసికొనవలయునుగాని, శాస్త్రి దూషణము నింద్యము.

యోగ వాశిష్ఠము అద్వైతబోధక పరమప్రమాణ గ్రంధములలో నొక్కటి. భక్తిశ్రద్ధల తోడగూడిన యీ గ్రంధపఠనము-జీవన్ముక్తి ప్రత్యక్ష లాభమును, విదేహముక్తి పరిమలాభమును, నిచ్చునదని, గ్రంధమునందే వశిష్ఠభగవానులు ప్రతిజ్ఞాపూర్వకముగ తెలుపుచున్నారు.

ఈ గ్రంథమంతయు నాయూహాగానముతోడచేసిన కల్పనారచనగాదు. ఇవినామాటలుగావు. గుర్వీశ్వరానుగ్రహముతోడ, నేనుచేసిన బహుగ్రంథ శాస్త్రీయ పరిశీలనానుభవమునే "పలికించెడివాడు రామభద్రుండట" యనునట్లు, నేను నిమిత్తమాత్రుడనై, దైవప్రేరితుడనగుచు, సిద్ధాంతానుసారమున

సుబోధకరముగ, సులభశైలిలో వ్రాసినానేగాని వేరొండుగాదు. కావున జిజ్ఞాసువులు నిరుపమానమగునట్టి, యీ బ్రహ్మవిద్యాబోధయందు పునరుక్తి యావశ్యకతను గ్రహించి, యీ ఆత్మవిద్యకిది భూషణముగ గుర్తించి, పలుమారులు పఠించి, దీనిని ప్రీతినిశ్చయములతోడ గ్రహించి యాచరించుచు, అభ్యాసపాటవమును బట్టి, వారి పరమానంద స్వరూపమగు నిత్య, నిరతిశయ సుఖమునొందుదురుగాక. ఇదియే ఆత్మానంద స్వరూపము. ఇంతకన్న మానవుడు పొందదగిన అధికలాభములేదు. ఇదియే పరమ లాభము. ఇదియే మోక్షము. మానవునకిట్టి ఆత్మానంద స్వరూప సాధనములను సప్రమాణముగ బోధించునదియే "ఆత్మానందప్రకాశిక".

—o—

# మానవజన్మ ఉత్కృష్టత

సృష్టికి పూర్వము అంతయు ఒక్కటి మాత్రము గానున్నట్టి, ఆ అద్వితీయ అఖండ పరిపూర్ణానందస్వరూపుడగునట్టి పరమాత్మయే, కల్పితముగ మాయా వివశుడై, అనేక జీవజనోపాధుల నొందిన వానివలె, అనుభవమును బట్టికనబడుచున్నాడు. ఇదియే సృష్టి. ఈ సృష్టియందు ప్రతిజీవుడునూ, తన అనాది అవిద్యాకామకర్మలవలన వాని ఫలమనుభవించుటకు గాను ఉచ్ఛ, నీచ, అతినీచోపాధులతోడ, ఆయా దేశకాలములలో వారి, వారి ఫలానుభవములకు తగిన గర్భములందు జనించుచు, జరామరణప్రవాహ మున చర్విత చర్వణముగ భ్రమణము జేయుచుండును. ఇట్టి జన్మ పరంపరా భ్రమణములో, ఏ జన్మకాజన్మలో సంభవించునట్టి స్వశరీరభార్యాపుత్రవిత్త గృహక్షేత్రాదులతో వ్యామోహితుడగుచు, కోరికలు జేయుచు, అట్టి సంకల్పఫలముల ననుభవించుటకుగాను, తిరిగి తిరిగి ఉచ్ఛ నీచజన్మలనొందు చుండును. జీవునకిదియే సంసారము. ఈ సంసారము దుఃఖమను మాట శాస్త్రము బోధించుటయేగాక, సర్వ జీవులకునూ అనుభవమున తెలియుచున్నదియే. సంసారము కేవలసుఖమని, వివేకులగువారెవ్వరునూ జెప్పజాలరు. పరమార్థ వాస్తవమున స్వభావముచే ప్రతిజీవియునూ సుఖస్వరూపుడే. కావుననే యీ జీవరాశియంతయూ అనగా పిపీలికాది బ్రహ్మ పర్యంతము, సర్వదా సుఖమునే కోరుచుండును కాని ప్రతి జీవికియునూ అనాది అజ్ఞానమనునట్టి ఒక అజ్ఞానావరణమున్నది. దీనిచే భ్రాంతుడై, వాస్తవ సుఖమును గుర్తించజాలక, సుగంధమునిచ్చు చెట్టుక్రింద పచ్చికబైలునూ, దుర్గంధ పూరితమైన బురద ప్రదేశమును యున్న యొకచోటున, వరాహము తన సౌఖ్యమునకు, పంకతటాకమునే యెట్లువరించునో అట్లే జీవుడు, వాస్తవమున సుఖము కానియట్టి, విషయములనే ప్రేమించుచు వాటిని కోరుచుండును. ఇట్టి

తన కామకర్మఫలములనొందుటకుగాను జీవుడు తిరిగి తిరిగి జన్మలనొందుచు సంసార దుఃఖము ననుభవించుచుండును. ప్రతిజీవికియునూ సుఖమైనను దుఃఖమైనను తాను కోరుకున్నదియే వచ్చును. లేనిది రాదు. అయితే - దుఃఖమునే జీవుడునూ కోరడు గదా? దుఃఖమెందుల కొచ్చుచున్నదను, సంశయము నొందవచ్చును. ఇదిన్యాయమే. కాని జీవుడు తన అవిద్యా భ్రాంతిచే స్వభావముచే సుఖముకానిదానిని అనగా అట్టి విషయములను తన సుఖమునకు కోరుచుండును. కాని యీ విషయములన్నియూ సుఖ స్వరూపములు కావుగనుక పర్యవసానమున జీవునకు దుఃఖమునే యిచ్చుచుండును. మృత్తు సువర్ణమెప్పటికైనను కాగలదా? కాని బంగారుఛాయ అనగా (gold geilt) వేసి బంగారులాగు కనుబడునట్లు చేయవచ్చునుగదా! ఇట్టిది తాత్కాలికముగాక శాశ్వతముగ నెట్లుండగలదు! ఇట్టివియే యీ విషయానందములన్నియును. ఈ సృష్టి అంతయూ జీవ సుఖదుఃఖ కర్మఫల భోగానుభవ నిమిత్తము కల్పిత మాత్రము. జీవుడిప్పుడు అవిద్యచే భ్రాంతుడై యుండుటవలన, యీ తన అవిద్యా వరణమును తొలగించుకొని, తనవాస్తవ స్వరూపమగునట్టి అద్వితీయ అఖండ పరిపూర్ణానంద రూపమును పొందజాలక యున్నాడు. జీవుడిట్టి తన వాస్తవ స్వరూపమును తాను బాగుగ తెలిసికొని, స్వస్వరూపమున నుండుటయే మోక్షము. ఈ మోక్షము నిత్య నిరతిశయ సుఖ స్వరూపము. ఎన్నటికినీ మార్పులేనిది, నశించనిది, కేవల సుఖము, ఆత్మ స్వరూపము. జీవుడు మోక్షమునొందుటకు ఒక్క జ్ఞానమే శరణ్యముగాని అన్యములుగావు. ఈ జ్ఞాన మనునది సర్వజీవులకునూ, నేదో యొకవిధమున యుండనే యున్నది. ఇది సామాన్య జ్ఞానము. మోక్షమునకు దూరము. కావున ప్రతిజీవియూ మోక్ష స్వరూపమగునట్టి తన ఆత్మ జ్ఞానమును యధార్థముగ తెలిసికొన సమర్థుడగుటలేదు. అయినను సామాన్యుడు, మొదలు సార్వభౌమునివరకునూ సమస్త జీవులును తమ సహజ స్వరూపమగునట్టి సుఖమునకే సర్వదా ప్రయత్నించుచుందురు. కాని, జీవునకు తన అనాది అజ్ఞానా వరణముండుటచే, ఆ సుఖమును తాను నిత్యముగ బొందలేకున్నాడు. జీవుడు తన యీ అనాది,

అజ్ఞానా వరణమును తొలిగించుకొనిన గాని తన సుఖమును శాశ్వతముగ బడయజాలడు. ఈ అనాది అజ్ఞానము జీవునియందు, కొండగుహలయందు అనాది కాలమునుంచియుండు నట్టి గాఢాంధకారమువంటిది. ఈ అజ్ఞానమను చీకటి జీవుని హృదయ గుహయందు యెంతకాలమునుంచియున్నను, ఒక్క సారి స్వస్వరూప జ్ఞాన ప్రకాశమును సంపాదించిన, ఆ ప్రకాశమువలన, తిరిగి ఆ హృదయ గుహయందు, అజ్ఞానమను చీకటి యెన్నటికినీ ప్రవేశింప జాలదు.

జీవులందరును సామాన్య జ్ఞానముగలవారైనను, యీ జీవులలో మానవజన్మనొందిన జీవుడే తననిత్యానిత్య జ్ఞాన విచారముతోడ యీ అనాది అవిద్యావరణమును తొలగించుకొన సమర్థుడగును గాని, యితర జన్మము లందు జీవునకిట్టి సమర్థత కలుగదు. జీవునకు మానవజన్మ వచ్చుట కడు దుర్లభము. ఈ మానవజన్మ అనేకకోటి జన్మ సుకృతఫలము వలనగాని కలు గదు. ఈ విషయమునే శ్రీ ఆదిశంకరులు వివేకచూడామణియందు "జన్తూనాంనర జన్మ దుర్లభ" మనుశ్లోకముతోడ తెలుపుచున్నారు. సాధారణ ముగ పశు పక్ష్యాదులకు, యెదుటనున్నదానిని, అనుభవించుటయే తప్ప దాని యొక్క యుచితానుచితము, వస్తు వివేకము, నిత్యా నిత్య జ్ఞానము నుండదు. ఇట్లు గ్రహించు ప్రజ్ఞా సామర్థ్యములు ఒక్క మానవునకే కలవు. కావున యితర జీవులకన్న మానవుడు, అనాది భ్రాంతిచే తాను మరచినట్టి తన స్వరూప సుఖమును సాధించి, తన శాశ్వతానందము నొందుటకు సన్నిహితు డుగా నున్నాడు. ఇట్టి అవకాశమును గుర్తించి, తన నిత్య నిరతిశయ సుఖ మగు, ఆత్మ జ్ఞానమునకు ప్రయత్నించువాడే విద్వాంసుడు.

ఈ ప్రపంచమున మానవ జీవితము, యుద్ధభూమిని ప్రవేశించుట వంటిది. ఏలనన, ప్రతిమానవుడును; తనకు శత్రువగునట్టి దుఃఖమును జయించి, తన సుఖమును స్థాపించుటకు, సర్వదాయత్నించుచుండును. ఇది సహజము. ప్రతివారును దుఃఖమనునట్టి శత్రువునోడించి, సుఖమనునట్టి రాజ్య

మును సంపాదించుటకు చేయునట్టి ప్రయత్నమే, మానవునకు జీవితరణ రంగము. ప్రతిజీవియునూ సుఖసామ్రాజ్యమునే కోరుచుండును. దుఃఖ మును కోరక, దానిని శత్రుతుల్యముగనే పాటించును. దుఃఖమను నట్టి శత్రు నిర్మూలనమునకే సర్వదా, సర్వజీవులును సర్వవిధములను ప్రయత్నించు చుందురు. కాని యెంతప్రయత్నించినను యీదుఃఖమను శత్రువు తాత్కాలిక ముగ మరుగుబడి తిరిగి వచ్చుచునేయుండును. మరల సుఖమునకు ప్రయ త్నించుచుందురు. పిదప తాత్కాలికముగ యీదుఃఖముపశమించి మరల వచ్చుచుండునేగాని, మానవుని సామాన్య ప్రయత్నముచే యీదుఃఖము ఆత్యంతికముగనశించదు. ఇదిగాక అందరును సుఖరాజ్య సమ్రాట్టులగుటకే ప్రయత్నించుచుందురు. కాని యీభౌతిక సుఖసామ్రాజ్యము, పరిమితమగుట చేతనూ, తాత్కాలిక స్వభావమగునట్టిదగుటవలననూ శాశ్వతముగ నెవరి వలనను పొందబడుటకువీలుకాదు. ఈ ప్రపంచస్వరూపమే దేశకాల పరి చ్ఛిన్నము కావున యిందు నెవరునూ దుఃఖరహితశాశ్వత సుఖసామ్రాజ్యమును బడయజాలరు. ఈప్రపంచస్వరూపము ద్వంద్వము. ఒకరిలాభము ఒకరినష్ట మునకునూ, ఒకరి సుఖము, మరి యొకరి క్లేశమునకునూ, ఒకరి యిష్టము మరి యొకరి అనిష్టమునకునూ హేతువగుచుండును. కాని జీవులందరును సుఖమును ఏకకాలమున ఒకేవిధముగ పొందజాలరు, యీపొందబడు సుఖము గూడ తాత్కాలికమైనశించుచున్నది. కావుననే శాస్త్రము, అనుభవజ్ఞులగు మహనీయులు గూడ, బాగుగప్రయత్నించు వారందరునూ శాశ్వతసుఖ సమ్రాట్టులగుటకు సంభవమున్నదనియూ, అట్టి స్థితి ఒక్క ఆత్మజ్ఞానము వలననే సంభవమనియూ, కాన వివేకులగువారు సదాత్మజ్ఞానము సంపాదించ వలయుననియూ, బోధించుచున్నారు. కావున మానవునకు యీ సదాత్మ జ్ఞానము, తనజీవితానుభవములను లాఘవముగను, సౌకర్యముతోడను, నను భవించుటకునూ, తన శాశ్వత సుఖసామ్రాజ్యమును బడయుటకునూ యావ శ్యకమగు చున్నది. ఏలనన ప్రతిజీవికియునూ యీ మానవజన్మ, సుఖదుఃఖ మిశ్రితకర్మ ఫలానుభవముకుగాను కల్పితమై ఏర్పడినట్టి యొక ఉపాధి,

ఈఉపాధితో ననుభవించవలసినట్టి, ఫలోన్ముఖమైన కర్మమునకే ప్రారబ్ధమని పేరు. ఇది బలవత్తరము. ప్రారబ్ధమెట్టివారికైనను, విధించబడినట్టి శిక్ష వంటిది. ఈ ప్రారబ్ధ సుఖదుఃఖ ఫలానుభవములను, మానవుడు సాధారణముగ ననుభవింపక తప్పదు. కనుక మానవుడు సుఖదుఃఖములు రెండింటిని యను భవింపవలసియున్నది. ఇందులో సుఖానుభవము ప్రతివారికినీ యిష్టమను మాటనిర్వివాదము. కానిక్లేశ, విషాద, దుఃఖానుభవముల నెవ్వరునూ కోరరు. ఇష్టపడరు. అయినను, అనుభవింపకతప్పదు. మానవుడిట్లు తాను విధిగా నను భవించవలసిన సంసార దుఃఖ అత్యంతనివృత్తికే సదాత్మజ్ఞానమావశ్యకము. ఈ సదాత్మజ్ఞానమువలన మానవుడు తన ప్రారబ్ధసమస్తానుభవములను, సుఖ దుఃఖనిర్లిప్తత తోడ తాను నిమిత్తమాత్రుడగుచు అనుభవింపసమర్థుడగును. స్వాత్మజ్ఞానము లేచిచో, మానవుడు తన ధర్మాధర్మములను గ్రహింపజాలక, అవివేకముతోడను దుఃఖముతోడను తన ధర్మాధర్మములను బాగుగా నిర్వ ర్తింపజాలక, ఒక సమయమున నిర్వర్తించినను, దుఃఖమును పొందుచునే యుండును. మానవునకు దుఃఖము, ఆధివ్యాధులు రెండింటివలననూ గలుగు చుండును. మానవునకు యీ రెంటినీ, శాశ్వతముగ నిర్మూలించునట్టి పరమ ఔషధమే ఆత్మజ్ఞానము. ఈ ఒక్క సదాత్మజ్ఞా నౌషధముతప్ప తక్కిన ఔషధరాజము లేవియునూ మానవునకు యీ ఆధివ్యాధులను శాశ్వతముగ పోగొట్టజాలవు. స్వాత్మజ్ఞానము. ఆధివ్యాధి సర్వరోగనివారకము. ఈ ఆత్మ జ్ఞానము దివ్యౌషధము తక్కిన ఔషధములు శాశ్వతదుఃఖ నివృత్తిని కలుగ జేయజాలవు. కావుననే అర్జునునకు తనధర్మానుష్ఠానరూపమగునట్టి యుద్ధనిర్వ హణమందు ప్రారంభముననే విషాదముకలిగి దుఃఖితుడుకాగా, శ్రీకృష్ణపర మాత్మ అర్జునునితో, తమకు కౌరవులు చేసిన అధర్మ, దౌరాత్మ్య, అన్యాయములకు పగదీర్చుకొనుటే ధర్మమనిగాని, న్యాయమనిగాని చెప్పియుండలేదు. మరే మనిన అర్జునుని విషాద దుఃఖములకు మూలకారణమగునట్టి, ఆత్మాజ్ఞానమును నిర్మూలించుటే పరమౌషధమని నిశ్చయించి సర్వప్రయోజన కారియగునట్టియు

శాశ్వత దుఃఖనివృత్తినిచ్చునట్టియు ఆత్మజ్ఞానమునే ప్రప్రథమమున నే ద్వితీయాధ్యాయ మందు అర్జునునకు,

"నాసతో విద్యతేభావో, నాభావో విద్యతేసతః"

శ్లో॥ అవినాశితు తద్విద్ధియేన సర్వమిదంతతమ్ ।
వినాశమవ్యయస్యాస్యన కశ్చిత్కర్తుమర్హతి ॥

"నాయంహన్తినహన్యతే"

శ్లో॥ నజాయతే మ్రియతేవా కదాచి, న్నాయంభూత్వా, భవితావాన భూయః।
అజోనిత్యశ్శాశ్వతోఽయం పురాణో, నహన్యతేహన్యమానేశరీరే॥

శ్లో॥ వేదావినాశినం నిత్యం, యఏనమజమవ్యయమ్।
కథం సపురుషః పార్థ, కంఘాతయతిహన్తికమ్॥

శ్లో॥ వాసాంసిజీర్ణాని యథా విహాయ, నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథాశరీరాణి విహాయజీర్ణా, న్యన్యాని సంయాతి నవానిదేహీ॥

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి, నైనందహతి పావకః।
నచైనంక్లేదయంత్యాపో, నశోషయతి మారుతః॥

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ, మక్లేద్యోఽశోష్య ఏవచ।
నిత్యస్సర్వగతః స్థాణు, రచలోఽయం సనాతనః॥

శ్లో॥ అవ్యక్తోఽయమచింత్యోఽయ, మవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం, నానుశోచితుమర్హసి॥

అనగా "అసత్తగు దేహాదులు ఉండవు. సత్పదార్థమగునాత్మ, లేక పోవుటయనునది ఎన్నడునూ ఉండదు ఏ ఆత్మ ఈ ప్రపంచమంతయును నిండియున్నదో అట్టి ఆత్మకు నాశము లేదని తెలిసికొనుము. అవ్యయమగు నీ యాత్మకు నాశమును కలుగజేయునది యేదియునూలేదు. ఈ ఆత్మ

చంపునది కాని, జంపబడునదికాని, ఏదియునూగాదు. ఈ ఆత్మ ఒకప్పుడునూ, అనగా యెప్పుడునూ పుట్టుకగలదిగాని, మరణించునదిగాని గాదు. కొంత కాల ముండిపోవునదిగాని, కొంతకాలమునకు కలుగునదిగాని కాదు. ఆత్మ ఎప్పుడునూ పుట్టుకలేనిది. ఒక్క రీతిని యుండునది. స్థిరమైనది అనాదియైనది. శరీరము పోయినను ఆత్మపోవునది కాదు. ఎవడు ఈ ఆత్మను నిత్యమైన దానిగను, నాశములేనిదానిగను, పుట్టుకలేనిదానిగను. అవ్యయమైనదానిగను తెలిసికొను చున్నాడో ఆ పురుషుడు ఎవనిని ఎట్లు చంపును ? ఎట్లుచంపించ గలడు? మనుష్యుడు, చినిగిపోయిన పాత వస్త్రములను విడచి క్రొత్తవస్త్రములను ధరించునట్లు, ఆత్మ జీర్ణములైన శరీరములను విడచి క్రొత్త శరీరములను పొందుచుండును. ఈ ఆత్మను, శస్త్రములు ఛేదింపజాలవు. అగ్ని కాల్పజాలదు. జలముతడుపజాలదు. గాలిశోషింప జేయలేదు. ఆత్మ ఛేదింపదగినదికాని, దహింపదగినదికాని, తడుపదగినదికాని, యెండింపదగినదికాని కాదు ఎప్పుడునూ ఏకరూపముగా నుండునది. అంతటను (బాహ్యాంతరముల) నిండియున్నది. స్థిరమైనది. అచలమైనది సనాతనమైనది. ఆత్మచక్షురాదీంద్రియముల కగుపడదు. మనసుచే నాలోచించుటకు వీలులేనిది. ఆత్మ ఎట్టి వికారములులేనిది, అని తత్త్వజ్ఞులు చెప్పుచున్నారు కావున ఆత్మ యిట్టిదియని తెలిసికొని, యుద్ధముచేయుటకై దుఃఖింపకుము" అని బోధించి, దానిని సంపాదించునట్టి వివిధోపాయములను, వివిధ మార్గములను తక్కిన అధ్యాయములందు సంశయ రహితముగ బోధించి, అర్జునుని ప్రజ్ఞావంతునిగా జేసి, తనకు ధర్మమగునట్టి యుద్ధమును జేయించి, జయము నొనగూర్చెను. కాని ఆత్మజ్ఞానమును కలుగజేయక గాని, యుద్ధముజేయించకుండగనే గాని, శ్రీ కృష్ణ పరమాత్మ యైనను, అర్జునునకు జయము కలుగజేసి యుండలేదు గదా. కనుక మానవునకు, తన ధర్మమునాచరించుట యావశ్యకము. తప్పనిది. ఈ జీవితరణరంగమందు, ఆత్మ జ్ఞానమను వజ్రాయుధముతోడ యుద్ధము గావించినగాని మానవునకు తన నిత్య నిరతిశయ సుఖప్రాప్తి కాజాలదు. ఇదియేశాశ్వత సుఖము, మోక్షము. కావున మానవునకు, తన ప్రారబ్ధమును

జయించుటకు యీ సదాత్మ జ్ఞానమావశ్యకమని జిజ్ఞాసువులు గ్రహింతురు గాక. ఇది గుర్వనుగ్రహ శాస్త్రి బోధవలనగాని కలుగదు. మానవుడు వాస్తవమున ఆత్మ స్వరూపుడు కావున ఈ స్వాత్మజ్ఞానలాభము మానవు లందరకునూ ఒక్కటియే. ఈ జ్ఞానము జాతి. మత భేదములతోగాని స్త్రీ పురుషాది విచక్షణతోడ గాని నేమియు సంబంధించినదికాదు. సర్వులకునూ యీ స్వాత్మజ్ఞానమనునది ఒక్కటియే. ఇది ఏకరూపము సామర్థ్యమును సంపాదించి, దీనియందు ప్రీతి నిశ్చయములతోడ ప్రయత్నించు వారందరునూ, స్వాత్మజ్ఞానమును కాల క్రమమున బడయుదురనుటకు నెట్టి సందేహమును లేదు. దీనికి దేశకాలములతోడ నిమిత్తములేదు. అనేక శతాబ్దములకు ముందు యీ విషయమునే వివిధ పాశ్చాత్య దేశీయ తత్త్వ వేత్తలుగూడ, బోధించినట్టి అనేక వాక్యములు గలవు. అందు కొన్ని వాక్యముల అర్థము :—

"నేనునూ నాతండ్రి (అనగా సృష్టికర్త)యు నొక్కటియేనని" నిన్ను నీవుయథార్థముగ తెలిసికొనిన, మోక్షము నొందుదువు" అని యొక మహానుభావుడునూ, "విద్యలలోనికెల్ల మానవుడు తనను తాను యథార్థముగ తెలిసికొనుటయే పరమ విద్య" యని యొక తత్త్వజ్ఞానియునూ తెలుపుచున్నారు. ఇంకనూ యిట్లు తెలిపిన వచనములనేకములు గలవు. బాగుగ విచారించిన యెడల యివియన్నియునూ మానవునకు స్వాత్మజ్ఞానమే పరమ శ్రేయోదాయకమగునట్టి మోక్షసాధనమని బోధించుచున్నవి. ఈ విషయము సంశయింపదగినది కాదు గావున, జిజ్ఞాసువుల సిద్ధాంత దార్ఢ్యమునకు గాను యీ విషయము గూడ నిరూపింపబడినదని ముముక్షువులు గ్రహింతురుగాక.

జీవునకు ఇతరజన్మలకన్నను, స్వాత్మజ్ఞానమును సంపాదించునట్టి సామర్థ్యముండుటయే, మానవ జన్మ యొక్క విశేషము. కావున వివేకులు మానవజన్మను వృథాగావించుకొనుట అనుచితము, ఆత్మహాని యని గ్రహించవలయును.

# ఆత్మవిద్య—దీనిపరమ లాభము

ఆత్మవిద్య వలన గాని ఆత్మానందము కలుగదు. ఆత్మ విద్యయన్నను ఆత్మజ్ఞానమన్నను ఒక్కటియే ఈ ఆత్మవిద్యను గురించి పలువురకు యీ విద్యవలన వారివారి వ్యవహార లోపములు కలుగుననియు, వ్యవహారములేనిది సుఖముబడయ జాలమనియు దానిచే మన ఆనందము లోపించు ననియు భయము ఉన్నట్లు కనబడుచున్నది. ఈ భయముచే యీ విద్య యెవరిని గురించియో చెప్పుచున్నది, అది మనల కెందు కని తోచుచున్నది. కాని వాస్తవమాలోచించిన యీ విద్య ప్రతివారికినీ వారి. వారిని గురించి తెలుపునట్టి స్వవిద్యయేగాని, పరులను గురించి తెలుపు విద్యగాదు. ఈ విద్యయే మానవునకాత్మానందమును అనగా తన పరమ సుఖమును నొందింప చేయునది. ఆత్మవిద్య యనునది మానవుని పరమసుఖము కొరకు తనపరమార్థ స్వరూపమును బాగుగ తెలుపునట్టిది. ఇట్టిపరమోత్కృష్ట విద్యను మానవుడు తన అజ్ఞానమువలన గుర్తించలేకున్నాడు జీవునకు ఉపాధి ఒకనిమిత్తముగా గలిగినదిగాని, జీవునిపరమార్థవాస్తవ స్వరూపము గాదు. తనపరమార్థవాస్తవ స్వరూపమును గుర్తించు సామర్థ్యము, సర్వజీవులలోను ఒక్క మానవోపాధికే గలదు. గాని తక్కిన యుపాధు లన్నిటియందు సుఖదుఃఖప్రారబ్ధానుభవము చేయుటయేగాని జీవుడు తనపరమార్థవాస్తవ స్వరూపమును గ్రహించి, తన ఆత్యంతిక దుఃఖ నివృత్త్యుపాయమును పొందజాలడు. అట్టి వివేకము మానవోపాధికే గలదు. కావున మానవునకు శ్రుతిమాత 'జీవో బ్రహ్మైవనాపరః' అనిన్నీ 'తత్త్వమసి' యనిన్నీ బోధించుచున్నది. అనగా జీవుడు బ్రహ్మకంటే వేరుగాదనియు, ఆ బ్రహ్మనీవే ననియు మానవునకు వేదమాత తెలుపు చున్నది. ఇట్లుతెలుపు చున్న శ్రుతిబోధను మానవుడు గ్రహించి తనపరమార్థవాస్తవస్వరూపమును తెలిసికొని స్వానుభవమునొందుటయే ఆత్మవిద్య యనబడును. కావున ఆత్మ

విద్యయనగా ప్రతిమానవునకును తన వాస్తవికతను తెలుపునట్టి విద్యయేగాని మరి వేరొకటేదియునుగాదు. మానవునకు దీని యావశ్యకత ఎద్దియనిన- ప్రతి మానవుడును అనగా సామాన్యుడు మొదలు సార్వభౌముని వరకును అందరు కోరునదిసుఖము. అనగా యీ సుఖముకొరకే సర్వజీవులును, పిపీలికాదిబ్రహ్మపర్యంతము సర్వదాప్రయత్నము చేయుచుందురు. తానుకోరునట్టి యీ సుఖము, పరమార్థవాస్తవమున సుఖస్వరూపుడైన తన యందే యున్నదిగాని, తనకు బయటగాని, తనను విడచిగాని యీ స్వరూపసుఖము లేదు. అయినను జీవుడు అనాది అవిద్యచే, తనపరిపూర్ణసుఖ స్వరూపమును మరచి, తననాభియందుండు కస్తూరిసుగంధము తనయందేయున్నదనితెలిసికొనలేక కస్తూరిమృగముతన అజ్ఞానముతో యీసుగంధము యెచటనో యున్నదని అటునిటు పరుగిడునట్లు, మానవుడుతన యందున్న పరిపూర్ణస్వరూప సుఖమును గుర్తించలేక, దీనికిగాను అనగా తానుకోరు యీ సుఖమునకు, తాను వాస్తవముగా గానట్టి తనదేహోపాధితో తాదాత్మ్యము నొందుచు, తనకు యీ పుత్ర, మిత్ర, కళత్ర, విత్త, క్షేత్రాదులన్నియూ నిత్యములు, సత్యములు, అనితలచి, తనసుఖము కొరకు వీటియందు రాగ ద్వేషసక్తతాభిమానుడగుచు, వివిధ కోరికలతో సంకల్పములు చేయుచుండును. కాని యివియన్నియు తనకు తాత్కాలిక నిమిత్త భోగములగుటచే తానుకోరు నట్టి నిత్యసుఖము వీటి వలన గలుగదు. ఏలనన- యీవిషయ భోగములన్నియును, అనిత్య, అవాస్తవములు. వీటి వలన కలుగు సుఖము సుఖ చ్ఛాయా మాత్రమై అనిత్యమగును. కావున మరల మరల తనసుఖము కొరకే విషయవాంఛలను చేయుచు, సుఖమునకు బదులు, పర్యవసానమున దుఃఖమునేపొందుచు మానవుడు సంసారచక్రమున భ్రమణము చేయుచుండును. ఇట్లు అజ్ఞానావృతులై సంసారదుఃఖమున నిమగ్నులగు జీవుల, అనగా మానవులనుద్ధరించుటకే వేదమాత తనపరమార్థ స్వరూపమగునట్టి నిత్య, నిరతిశయ, సుఖ స్వరూపమును బోధించుచున్నది. ఇదియే పరమాత్మ, బ్రహ్మ, యనబడుచున్నది. జీవుడు, బ్రహ్మ లేక పరమాత్మ

కంటెవేరుగాదని మానవునకు శ్రుతిమాత తెలుపుచున్నది. కావున మానవునకు తనపరమార్థ స్వరూపమును వాస్తవముగ తెలుపు నట్టి విద్యయే ఆత్మవిద్య. ఈ ఆత్మయనునది ప్రతిజీవియొక్క వాస్తవస్వరూపమే గాని వేరుగాదు. ప్రతి జీవియు ఆత్మస్వరూపుడే. అయినను యీ ఆత్మస్వరూపమును యథార్థముగ గుర్తించలేక తన స్థూల, సూక్ష్మోపాధియైన శరీరమునే, "నేను, నేను" యని తలంచుచున్నాడు, కానినేను ఆత్మనుగాదని చెప్పసాహసించు మానవుడుండడు. కావున యీ ఆత్మవిద్య సర్వ మానవులకును, అందు ప్రతి ఒక్కొక్కరికిని యావశ్యకమగు నట్టి పరమసుఖ విద్యయనియు, యిదియే మోక్షవిద్య యనియు, వివేకులు గ్రహింతురుగాక. ఇట్టి యీ పరమోత్కృష్ట విద్యను గ్రహించి మానవుడు తన వాస్తవ స్వరూపమగు బ్రహ్మజ్ఞానము నొందినను మానవునకు తనసుఖ, దుఃఖ, ప్రారబ్ధభోగములు వెంటనే నశించవు. కొంత వరకు అనగా ప్రారబ్ధక్షయమగువరకు కోరలు తీసిన సర్పమువలె యీ ప్రార బ్ధమునిలచి యుండును. అయినను మానవుడు యీ జ్ఞానము వలన తన వ్యవ హారములోపించునని భయపడగూడదు. ఇంక ఏమనిన మానవునకు సాధారణ ముగా తప్పనట్టి తన ప్రారబ్ధ సుఖ, దుఃఖ, భోగానుభవములను, తన ఆత్మ జ్ఞానముతోడ అతిసౌలభ్యముగను, అధిక కౌశలముతోడను, అనుభవింప గలుగు చుండును. ఇట్టి అనుభవమునందు తనకు పుణ్యపాపములు అంటవు. కావున భావిప్రతి బంధముగలుగదు. ఇదియే మానవునకు మోక్షద్వారము. కావున యీ ఆత్మజ్ఞానమనునది వివేకులందరకును యావశ్యకము, ఆదరణీ యము అగునట్టి విద్య. ఇందులకు గానే అర్జునునకు ప్రారబ్ధాను సారమున తప్పని సరియగు యుద్ధమును, కౌశలముతోడను, లాఘవముతోడను నిర్వ ర్తింపగలుగుటకుగాను శ్రీకృష్ణభగవానులు యీ ఆత్మవిద్యను యుద్ధరంగమం దుపదేశించి యుండెను. ప్రతిమానవునకును యీ ప్రపంచానుభవములు యుద్ధ రంగమువంటివి. కావున యీ ఆత్మ విద్యావశ్యకతను, దాని పరమలాభమును, ముముక్షువులు గ్రహించుదురుగాక.

ఆత్మవిద్యయన్నను, బ్రహ్మవిద్యయన్నను, తత్త్వ విద్య యన్నను ఒక్కటియే. ఈ విద్యయే జీవుని అనాది అజ్ఞానమును బోగొట్టి మానవునకు శాశ్వత సుఖమునొనగూర్చునది. ఈ విద్యయే వేదాంత మనియు, బ్రహ్మ విద్య యనియు పరమార్థ శాస్త్రమనియు గూడ చెప్పబడుచున్నది. మానవునకు యీ శాస్త్రము యొక్క ఉపయోగము, పరమోత్కృష్టమని శ్రీవసిష్ఠ భగవానులు :

శ్లో॥ కించిత్సంస్కృత బుద్ధీనాంశ్రుతంశాస్త్రిమిదంయథా ।
మౌర్ఖ్యాపహంతథా, శాస్త్రమన్యన్న కించన ॥

అనగా కొంచము సంస్కారయుక్తమగు చిత్తముగల వారలకు నీ ఆత్మజ్ఞాన శాస్త్రమువలె వినినంతమాత్రమున, నజ్ఞానమును బోగొట్టునట్టి మరియొక శాస్త్రమెద్దియును లేదని తెలుపు చున్నారు. మానవులకు ఆధి, అనగా మానసికదుఃఖము. ఇది భ్రాంతి. సంసార దుఃఖము. ఇట్టి సంసార దుఃఖము నశించుటకు ఒక ఆత్మజ్ఞానమేగాని వేరుదారిలేదని—

శ్లో ॥ ఆత్మజ్ఞానంవినాసాధో, నాధిర్నశ్యతి రాఘవ ।
యథా రజ్జ్వవ బోధేన, వినాసర్పోననశ్యతి ॥

అనగా తాడునందు తోచిన సర్పము, తాడు నెరుంగకున్న యెడల, నశించని యట్లు (జన్మాదులకు మూలభూతంబైన) ఆధి, ఆత్మజ్ఞానములేక నశింపదని వశిష్ఠ భగవానులు శ్రీరామచంద్రమూర్తికి యుపదేశించుచున్నారు. కావున ఆత్మజ్ఞానమును, మానవుడు తనతరణోపాయముగ యెన్నటికైనను సాధింపవలసినదేగాని వేరుదారిలేదు.

ఏ మానవునికైనను సుఖదుఃఖాను భవరూపమగు జీవయాత్ర తప్పదు. కేవల సుఖమునొందజాలడు. ఏల యనిన జీవునకు యీ మానవజన్మ తన పుణ్యపాపఫల మిశ్రితమగు ప్రారబ్ధానుభవమునకుగాను గలిగినదేగాని వేరు గాదు. ఇందు ఆయా మానవుల పుణ్యపాపఫలముల యొక్క న్యూనతాతిశ

యములనుబట్టి సుఖ విశేషములు, దుఃఖ విశేషములు గలుగుచుండును. ఇట్టివి యన్నియు మానవునకు తన సుఖ దుఃఖానుభవములకు గాను కల్పితమైన యీ శరీరోపాధివేగాని వాస్తవమున తనకు సంబంధించినవిగావు. ఏలనన తాను అనగా యీ నేను నేను యనుకొను మానవుడు పరమార్థవాస్తవమున ఆత్మ స్వరూపుడు. ఈ శరీరము తన భోగమునకు యేర్పడిన యొక కల్పితోపాధియేగాని యీ శరీరమేతానుగాడు. కాని ప్రతిమానవుడును యిప్పుడు తన వాస్తవ స్వరూపమును మరచి వ్యవహరించుచుండును. ఇదియే అజ్ఞానము. ఇట్టి అజ్ఞానమును తొలగించుటకే శ్రుతి మాత "జీవోబ్రహ్మైవ నాపరః" జీవుడు బ్రహ్మ, అనగా ఆత్మ స్వరూపుడు. వేరుగాదని తెలుపుచున్నది. అయినను మానవుడు యీదేహమే నేను అను అనాదిఅజ్ఞానముతోడ యీ దేహధర్మ క్రియాదికములన్నిటిని తన యందారోపించుకొని అతిసక్తతాభిమానములతో సంసార దుఃఖము నొందుచున్నాడు. ప్రతిమానవుడును కోరునది తన దుఃఖనివృత్తి, — సుఖప్రాప్తియేగదా; ఎంతటిమానవుడైనను తాను కోరునట్టి దుఃఖ రహితమైన శాశ్వత సుఖము ఆత్మ జ్ఞానములేనిదే నొందజాలడు. ఈ విషయమునే శ్రీ వశిష్ఠ భగవానులు,

> శ్లో॥ కరోతుభువనేరాజ్యం, విశత్వాకాశమంబువా।
> స్వాత్మజ్ఞానా దృతే విద్వాన్, విశ్రాంతింనాధిగచ్ఛతి॥

అనగా భూమండలమునంతయు పరిపాలించినను, ఆకాశ గమనాదులు, మహాసముద్రగమనాదులు చేసినను స్వాత్మజ్ఞానము గలుగనిది, విద్వాంసుడైన మానవుడు గూడ విశ్రాంతి సుఖమును పొందజాలడని తెలుపుచున్నారు. కావున యీ ఆత్మ విద్య మానవునకు తన ప్రారబ్ధ వశమగు జీవయాత్రలో (అనగా The passage of life) తొట్రుపాటు లేక సుఖమునొందగలుగుటకును, జీవిత జీవితానంతర శాశ్వత సుఖమునకు గూడ యావశ్యకమగుచున్నది. తన శుభా శుభకర్మఫలమును ప్రతి మానవుడు విధిగా తానే యనుభవింప వలసియున్నది. ఇట్టి సుఖ దుఃఖ భోగానుభవము

లన్నియు జీవుడు ప్రారబ్ధ ప్రేరితుడై యాచరించుచుండును. ప్రాజ్ఞుడగు మానవుడు వీటి కొరకు దుఃఖింప గూడదు. ఏలనన యివి యన్నియు ఆత్మ స్వరూపుడగు తనకు వాస్తవమున, సంబంధించినవిగావు. ఈ రహస్యమును అర్జునునికి బోధించుటకు గానే శ్రీ కృష్ణ భగవానులు ప్రప్రథమమున గీతా ద్వితీయాధ్యాయమందే ఆత్మ స్వరూపమును—.

శ్లో॥ నజాయతే మ్రియతే వాకదాచి, న్నాయంభూత్వా భవితావానభూయః।
అజోనిత్య శ్శాశ్వతోఽయంపురాణో, నహన్యతే హన్యమానే శరీరే॥

అనగా ఈ ఆత్మ ఒకప్పుడును పుట్టుక కలదిగాదు. మరణముగలదియుఁ గాదు. కొన్నాళ్ళు ఉండిపోవునదిగాని కొన్నాళ్ళకు గలుగునది గానికాదు. ఏమన; ఆత్మ-పుట్టుకలేనిది. ఎప్పుడును ఒక్కరీతిని ఉండునది. స్థిరమైనది. శరీరముపోయినను పోవునదిగాదు.

శ్లో॥ వేదావినాశినం నిత్యం, యఏనమజమవ్యయమ్।
కథంసపురుషః పార్థ, కంఘాతయతి హన్తికమ్॥

అనగా అర్జునా! ఎవడు యీ ఆత్మను నిత్యమైనదానిగను, వినాశము లేనిదానిగను, పుట్టుకలేనిదానిగను, అవ్యయమైనదానిగను, తెలుసుకొనుచున్నాఁడో ఆపురుషుడు ఎవనిని ఎట్లు చంపును? ఎట్లుచంపించును?

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథావిహాయ, నవాని గృహ్ణాతినరోఽపరాణి।
తథాశరీరాణి విహాయ జీర్ణా, న్యన్యాని సంయాతి నవానిదేహీ॥

అనగా మనుష్యుడు చినిగిపోయిన వస్త్రములను విడిచి క్రొత్తవస్త్రములను గట్టుకొనునట్లు, ఆత్మ జీర్ణములైన శరీరములను విడిచి క్రొత్తవియగు శరీరములను పొందుచుండును.

శ్లో॥ నైనంఛిన్దన్తి శస్త్రాణి, నైనందహతిపావకః।
నచైనంక్లేదయంత్యాపో, నశోషయతి మారుతః॥

అనగా ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు; అగ్ని కాల్పఁజాలదు; ఉదకము తడుపజాలదు; గాలి శోషింపఁజేయలేదు.

శ్లో ॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ, మక్లేద్యోఽశోష్య ఏవచ ।
నిత్యస్సర్వ గతః స్థాణు రచలోఽయం సనాతనః ॥

అనగా ఆత్మఛేదింపఁదగినదిగాని దహింపఁదగినదిగాని, తడుపఁదగినదిగాని యెండింపఁదగినదిగాని కాదు. ఎప్పుడును ఏకరూపముగా నుండునది. అంతటను నిండియుండునది; స్థిరమైనది; అచలమైనది; సనాతనమైనది.

శ్లో ॥ అవ్యక్తోఽయమచింత్యోఽయ, మవికార్యోఽయముచ్యతే ।
తస్మాదేవం విదిత్వైనం, నానుశోచితుమర్హసి ॥

అనగా ఆత్మ చక్షురా దీంద్రియములకగుపడదు. మనసుచే నాలోచించుటకు వీలులేనిది. ఏ వికారములును ఆత్మకు లేవు. అనితత్త్వజ్ఞులు చెప్పుదురు. కావున ఆత్మ యిట్టిదియని తెలిసికొని, దుఃఖింపక యుద్ధముచేయుము అని అర్జునునకు తెలిపిరి. అనగా వివేకులగువారు తమ ఆత్మజ్ఞానసిద్ధికై ఆత్మానాత్మల యుద్ధముగావించి అనాత్మ పదార్థము నోడించి ఆత్మజ్ఞానము నొందవలయును, అని తాత్పర్యార్థము.

ఈ ఆత్మజ్ఞానమే బ్రహ్మవిద్య. అర్జునునకు (అధికారియైన మానవునకు) శ్రీ కృష్ణ పరమాత్మ యీ ఆత్మ స్వరూపమును ముందుగ తెలియజేసి దాని సాధనోపాయములను వివిధముగ పదునెనిమిది యధ్యాయముల యందునను బోధించి అర్జునుని యజ్ఞానమును తొలగించి, ప్రారబ్ధానుభవ రూపమగు జీవ యాత్రను సౌలభ్యముతోడను, ధైర్యముతోడను, నొందునటులజేసి, యుద్ధముచేయించి విజయము నొనగూర్చెను. వివేకులగువారు దీనిని ఆత్మా నాత్మల యుద్ధముగ అనగా Battle of Life అని తెలిసకొని

గీతాజ్ఞానసారమును వారివారి జీవితజీవితానన్తర శాశ్వత సుఖమునకు యథా శాస్త్రముగ నభ్యసించుచుందురు గాక.

ఆత్మజ్ఞానమనగా జీవుడు తన పరమార్థ వాస్తవస్వరూపమును తెలిసి కొనుట. ఈ జ్ఞానముతోడ తాను అనగా నేను యీ స్థూల సూక్ష్మోపాధులుగా వనియు, తనపరమార్థ వాస్తవస్వరూపము ప్రత్యగాత్మ స్వరూపమనియు, ఇదియేపరమాత్మ స్వరూపమనియు, ఇదియే తాననియు, స్వాత్మాభిన్నముగ గ్రహించి స్వానుభవము నొందుటయే అపరోక్ష జ్ఞానము. అపరోక్ష జ్ఞానమనగా స్వాత్మాభిన్న, అఖండ పరిపూర్ణ, సచ్చిదానంద స్వరూపుడను నేనే యనితెలిసికొని స్వానుభవము నొందుట. ఇట్లు ఆత్మను తానేయని యథార్థముగ తెలసికొనిన మహనీయుడు, నిత్యతృప్తుడగుచు దేనికొరకును పరితపింపడు. ఎల్లప్పుడును బ్రహ్మాత్మనాసంస్థితుడై, పరిపూర్ణ సంతుష్టుడుగ నుండును. ఈవిషయమునే "ఆత్మానంచేద్విజానీయా దయమస్మీతిపూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయశరీరమను సంజ్వరేత్" "అనగా యీ ప్రత్యగాత్మను తాను అనగా నేనేయని తెలిసికొనిన పురుషుడు దేనికొరకు తనదేహమును పరితపింప జేయును." అని బృహదారణ్యకవచనము తెలుపుచున్నది. అనగా అట్టి మహనీయులు నిత్యతృప్తులై ఆప్తకాములగుదురు. ఆత్మవిద్య వలన మానవునకు గలుగు పరమలాభమిదియే. పంచదశియందు శ్రీ విద్యారణ్యస్వామి తృప్తి దీపప్రకరణమంతయు యీ "ఆత్మానంచేత్" అను వాక్యము మీదనే వివరించి యున్నారు. కావున మానవులకు యీ ఆత్మజ్ఞానము వలనగలుగు ఫలము మహత్తరము. ఇంతకుమించి పొందదగిన లాభము మానవునకు లేదు.

అయినను కొంచము పరమార్థాసక్తి కలవారుగూడ, ఆత్మ విద్యయగు నీ బ్రహ్మవిద్య మనకు సాధ్యమా? ఈవిద్య నభ్యసించి మన మీజన్మ యందిట్టిలాభమును పొందగలమా? లేనిచో, అనగా అభ్యాసకాలమందే అశక్తతగాని, మరణించుటగాని సంభవించిన యడల యిహపరముల రెంటికిని

జెడినవారమగుదుము. అను సంశయముతో గూడ నీవిద్యాభ్యాసమందు భయము నొందుదురు. అర్జునునకుగూడ నిట్టిసంశయమే కలుగగ, భగవద్గీత ఆత్మ సంయమాధ్యాయమందు భగవంతుడగు శ్రీకృష్ణ పరమాత్మ యీక్రింది శ్లోక ముల వలన నాసందేహము నీవిధమున నివృత్తిగావించెను. సంగ్రహము :-

"నహికల్యాణకృత్కశ్చి, ద్దుర్గతింతాత ! గచ్ఛతి" ।

శ్లో॥ ప్రాప్యపుణ్యకృతాంలోకా నుషిత్వా శాశ్వతీస్సమాః ।
శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభి జాయతే ॥
తత్రతంబుద్ధి సంయోగం లభతేపౌర్వదైహికమ్ ।
యతతేచతతోభూయ స్సంసిద్ధౌ కురునన్దన ॥

"పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపిసః ।"

అనగా, అర్జునా! మంచిపని చేసినవాడెవడును దుర్గతిని పొందడు సుమా ! అటువంటి యోగభ్రష్టుడు పుణ్యము చేసిన వారు పోవు లోకములకు పోయి అచట చాలా సంవత్సరములు నివసించి సదాచారవంతులు, జ్ఞానవంతు లగు శ్రీమంతులయిండ్లలో పుట్టును. పైనతెలిపినయట్లు యోగుల కులమందు పుట్టి పూర్వదేహమునందుండి సంపాదించుకొన్న ఆబుద్ధితో యోగమును పొందును. మరల పూర్వజన్మసంస్కారమునుబట్టి జ్ఞానము సిద్ధించుటకై ప్రయత్నించుచుండును. అవశుడైనను అటువంటి యోగభ్రష్టుని బలవంతమగు పూర్వజన్మా భ్యాసము లాగుచుండును. అని తాత్పర్యార్థము.

కావున వివేకులు ఎట్టి సంశయము నొందక శాస్త్రవిధానమున ఆత్మ విద్యాభ్యాసమును చేయుచుండుట యీ జన్మయందునను, ఉత్తరజన్మయందు నను గూడ పరమ శ్రేయోదాయకము, వారిపరమముక్తికిసాధనమని గ్రహించ వలయును. మానవునకు తన పరమార్థవాస్తవ స్వరూపమును బాగుగగ్రహించి స్వానుభవము నొందుటయే పరమధర్మము, పురుషార్థము. ఇట్టియోగము నెంతస్వల్పముగ నాచరించినను సంసారబంధమునుంచి విముక్తుడగుటకు

సాధనమగును. అనగా కాపాడబడునను విషయమును "స్వల్పమప్యస్యధర్మస్య త్రాయతే మహతో భయాత్" అను గీతావచనము తెలుపుచున్నది. పై వచనములు సాక్షాత్ భగవద్వాక్యములేగదా? కావున అభ్యాసకులకు ఆత్మవిద్యాభ్యాసమును గురించి యెన్నడునూ వారియొక్క శాస్త్రీయసాధనాభ్యాసములు వ్యర్థములగునని సంశయ భయములనొందక యీ జన్మయందే ఆత్మవిచారాభ్యాసముల నారంభించుట శ్రేయోదాయకము, వారి పరమ ముక్తిసాధనము.

పై విచారమునుబట్టి మానవునకు వాస్తవమున తన స్వరూపానందమగునట్టి యీ ఆత్మ విద్య నెంతవరకభ్యసించిన నంతలాభముండుననియు, అట్టిది వృథాగాక ఉత్తరజన్మమందు తన మోక్షసిద్ధికి సాధనమే యగుననియు ప్రమాణవచనములను బట్టి తెలిసికొనియుంటిమి. ఆత్మ యనగా ప్రతి జీవుడును నేను, నేను యనుకొనుచున్నట్టి పరమార్థ వాస్తవ స్వరూపమేగాని వేరుగాదు. జీవుని విడచి ఆత్మ యెక్కడనో లేదు. ప్రతి మానవుడును యేదో యొక విధమున తాను ఆత్మ స్వరూపుడననియే గుర్తించుచున్నాడు. ఎంత మూఢుడైనను నేను ఆత్మను కాదని చెప్పగలిగిన వాడెవడును ఉండడు. ప్రతివాడును తానాత్మ స్వరూపుడననియే తలచుచున్నాడు. కాని యీ ఆత్మను గుర్తించుటలో తాను భ్రాంతిని జెందుచు తన శరీరాదులే నేను, ఆత్మ, యనినమ్ముచు యీ ప్రపంచమున కొంతవరకు మాత్రమే నాది, అనగా తనది యనియు, శేషించినదంతయు తాను కాననియు, తనది కాదనియు, తలంచుచుండును. మానవునకెంతయున్నను శేషించినదంతయు తానే కోరుచుండుట సహజము. కాని యిట్లు తలంచుట అజ్ఞానమే గాని జ్ఞానము గాజాలదు. ఏలనన శ్రుతిమాత మానవుని యీ పరిచ్ఛిన్న భ్రాంతి నుండి విముక్తునిజేయుటకే "జీవో బ్రహ్మైవనాపరః" "అయమాత్మాబ్రహ్మ" "ఆత్మైవానన్దః" యని తెలుపుచు "సర్వంఖల్విదంబ్రహ్మ" యీ స్వశరీర సర్వదృశ్యమంతయును నీ ఆత్మ స్వరూపమగునట్టి బ్రహ్మ స్వరూపముగానే తెలిసికొనమని తెలుపుచు, యీ ఆత్మయే ఆనన్ద స్వరూపమని స్పష్టపరచుచున్నది. జీవునకు యీ బోధయొక్క పర్యవసానమేమనిన, నీవు కొంతయే నేను, నాది, యనుకొనుచున్నావు. కాని

అదివాస్తవముగాదు. నీవు పరిపూర్ణుడవు. నీవు కానట్టిదిగాని, నీకు మించినదిగాని యేమియును యీ సర్వదృశ్యమందునను లేదు. నీవు పరమాత్మ స్వరూపమగు అఖండానంద స్వరూపుడవని శాస్త్రము మానవునకు బోధించుచున్నది. ఇదియే ఆత్మ విద్య. శాస్త్రమెప్పుడును మానవునకు తెలియని విషయమును, శ్రేయోదాయకమగు విషయమును జెప్పునే కాని, బాగుగ తెలిసిన విషయముగాని, అశ్రేయస్సగు విషయమునుగాని, అనిష్టమగు దానిని గాని, చెప్పదు. కావుననే వేదము నూరు తల్లుల సమానమని శాస్త్రమే తెలుపుచున్నది. అయినను యీ ఆత్మజ్ఞానము మానవునెట్లు పరమానంద రూపునిగ చేయగలదను విషయమును అనుభవమును బట్టి కూడ విచారించుదము.

పైన నిరూపించిన శ్రుతి వాక్యములన్నియును మానవునకు స్పష్టముగ, సర్వమును నీవే, నీవుపరిపూర్ణానంద స్వరూపుడవు, వాస్తవమున నీకు భిన్నమగునట్టి పదార్ధమేమియు లేదని తెలుపుచున్నవి. కాని మానవుడు తన అనాది అజ్ఞానముచే నేను, నాది, యను పరిచ్ఛిన్న భ్రాంతినొందుచు యిట్టి భ్రమతోడ శేషించిన అనగా నేను కాదు. నాదికాదు యనుకొనబడు యీ దృశ్య రూపమున నున్న సమస్తమును తన సుఖము కొరకు కోరుచుండును. మానవ స్వభావమును బట్టి తనకెంత యున్నను, యున్నదానికన్న నెక్కువను, తన సుఖము కొరకు కోరుచుండును. ఈ కోరిక యెంతవరకు పోవుచుండుననగా సర్వకాలములందునను, సర్వధా పరమసుఖము తనకుండవలయునన్నంతవరకు పోవుచుండును. కాని సర్వదా యీ పరమ సుఖమనునది మానవునకు ఒక్క ఆత్మజ్ఞానము వలనగాని సంభవముగాదు. ఒకనికొకడు, ప్రపంచమునంతయు దానముచేసినను జగత్తనునది అజ్ఞాన స్వరూపమే గావున వాస్తవ స్వరూప సుఖము నివ్వజాలదు. అజ్ఞాన కార్యమెల్లప్పుడును దుఃఖకరమే గాన అది సత్యమగు నిత్య సుఖమునెట్లివ్వగలదు? లోక వ్యవహారమందుగూడ, యథార్థమగునట్టి సత్యజ్ఞానము (Correct Knowledge) వలన సుఖమును, అయథార్థ మగు అజ్ఞానము (Incorrect Knowledge) వలన దుఃఖమే గలుగుచున్నదిగదా? లోకాను

భవములందే యిట్లుండ పరమార్థ విషయమున మానవునకు తన అజ్ఞానము వలన పరమానందమగు శాశ్వత సుఖము గలుగుటెట్లు సంభవము? సంభవము గాదు. కావుననే మానవునకు సంసార దుఃఖము తప్పుటలేదు. ఇది మానవునకు తన అజ్ఞానము వలననే గలుగుచున్నది. జీవుని యీ అజ్ఞానమునుంచి విముక్తుని గావించి తన వాస్తవ స్వరూపమగు అఖండ జ్ఞానమును బోధించి మానవునకు తన పరమార్థ స్వరూపమగు అఖండ పరిపూర్ణానంద స్వరూపము నొందించుటకే శ్రుతిమాత మానవునకు తన సర్వాధిష్ఠాన పరిపూర్ణత్వమును బోధించుచున్నది. కావున వివేకులు వారి పరమానంద ప్రాప్తి నొందుటకు శ్రుతిబోధ ననుసరించి తన వాస్తవ స్వరూపమును గ్రహించ గలిగిన యడల సర్వమును తనఅధిష్ఠాన రూపమేగదా యగుచున్నది. అప్పుడు సర్వము తానేననియు, తనకు భిన్నమైనది వాస్తవముగ కొంచెమైనను లేదనియు తెలిసికొనగలుగును. అట్టితరి తానే పరిపూర్ణుడై తాను కోరవలసినది యేమి యును తనకు భిన్నముగ, వాస్తవమున నుండదు. సర్వము తానే యగును. జీవునకిట్టి స్థితియే తన పరమార్థ వాస్తవ స్వరూపము, అఖండ పరమానంద స్వరూపము. ఇట్టి స్వరూపమును తెలిసికొనిన మానవుని గురించియే "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ" అట్టివాడు సర్వ కామములను పొందిన వాడై నిష్కాముడగునను తాత్పర్యార్థమును శ్రుతిమాతయే తెలుపుచున్నది. కాని యిట్లు తెలిసికొనిన వాడైనను సర్వమును తానెట్లనుభవింపగలిగి ఆత్మకాము డగునను సంశయము కలుగవచ్చును. ఇది సరిగాదు. ఏలననిన నిచట సూక్ష్మ బుద్ధితోడ తెలిసికొనవలసిన అనుభవ భేదమున్నది. ఏది యనిన జీవుని సర్వానుభవములకు జ్ఞానమే ఆధారమగుచున్నను ఇందు కేవల జ్ఞానపూర్వకముగ నొందు ననుభవములు కొన్నియును, మరికొన్ని జ్ఞానముతోడ, నింద్రియముల ద్వారా ననుభవింపబడునట్టివిగొన్ని యును, అను రెండు విధముల నున్నవి. ఇందు కేవల యింద్రియముల ద్వారా నొందునట్టి భోగానుభవములు పశువునకును, మానవునకును సమానము. కేవలమిట్టి యనుభవములు పశు ధర్మములు. కాని కేవల జ్ఞానముద్వారా నొందు యనుభవములు మానవునకు విశేషము. దీనినంతయును యుద్దేశించియే "గొడ్డుకు తిన్నది పుష్టి, మనుజు

నకు ఉన్నది పుష్టి," యను లోకోక్తి యున్నది. పుష్టి యనగా తృప్తి. పశువులు వాటి యింద్రియముల ద్వారా పొందునట్టి యనుభవములనే గ్రహించ గలుగును. కాని, మానవుడట్లుగాక, తన యింద్రియములచే భోగానుభవముల నొందకపోయినను కేవల జ్ఞానము ద్వారా తనకింత యున్నదనియు, తను యిట్టి యధికారి యనియు, తాను సార్వభౌముడననియు, తాను దరిద్రుడననియు, మొదలగు యనుభవముల నొందుచున్నాడు. ఇవి కేవల జ్ఞానమాత్రానుభవములు. మానవునకు నేనిట్టివాడను అను నిశ్చయ జ్ఞానమే యనుభవము నిచ్చును. ఎంతటి ధనికుడైనను, సార్వభౌముడైనను, తన యింద్రియముల తోడ తనకున్నదానిలో నెంత అనుభవింప గలుగుచున్నాడో ప్రాజ్ఞులందరకు విశదమే. మానవుడు తనకున్నది, యను జ్ఞానానుభవము తోడనే తన సుఖానందముల నొందుచున్నాడు గాని తనకున్న దానియందు సహస్రాంశము, శత సహస్రాంశమును గూడ, తన యింద్రియములతోడ ననుభవింప సమర్థుడగుటలేదు. కాని తనకున్నది యను జ్ఞానముతోడనే యధికానందము నొందుచున్నాడుగదా? ఇది కేవల జ్ఞానమాత్రము. పశువునకు తృప్తి యనునది, తానింద్రియములచే ననుభవించునట్టి దానివలననే గలుగుచున్నది గాని తనకింత యున్నదను జ్ఞానముచే తృప్తి కలుగుట లేదు. కాని మానవుడు తన జ్ఞానము వలననే సమస్తానుభవముల నొంది తృప్తినొంద సమర్థుడగుచున్నాడు. మానవునకు యీ మూర్తా మూర్త ప్రపంచమంతయు నా స్వరూపమే, ఈసర్వమునకు నేనే యధిష్ఠానము అని తెలిసికొనుట జ్ఞానమేగదా యగుచున్నది. కావున మానవున కదెట్లు సాధ్యమో యట్లే, తన సర్వాధిష్ఠాన పరిపూర్ణతను గ్రహించి యిదియే నేనను జ్ఞానముచేతనే యనుభవము నొందుట సాధ్యము. ఇందు అసాధ్యముగాని, సంశయింప దగినది గాని, యేమియును లేదు. ఈ విషయమును గురించి యెంత వ్రాసినను వ్రాయవచ్చును గాని గ్రంథ విస్తర భీతిచే విరమించుచున్నాడను.

అనుభవమునుబట్టి చూచినను సామాన్యుడు మొదలు సార్వభౌముని వరకును కొంతభాగ నాది, కొంత ఇతరులది, యనుకొనువారికంటె, అంతా

నాదియే, యని భావించినపుడు, లేక ఎంతెంత అధికముగ నాదేయని భావించునో యంతంత యధిక సుఖమును, ఆనందమును పొందుచున్నారు. లోకానుభవమునందే యిట్లుండ మోక్షార్థియైనవాడు తన వాస్తవస్వరూపమును గుర్తించి యీ మూర్తామూర్త సర్వదృశ్యమును, సర్వమును, నేనే, నాదే, యను జ్ఞానము నొందినప్పుడెట్టి యానందము నొందగలడో ప్రాజ్ఞులే ఊహించగలరు. ఇదియే పరమానందము. ఇట్టిస్థితినొందుటయే పరమానందప్రాప్తి. ఇదియే జీవుని పరమార్థవాస్తవమగునట్టి అఖండపరిపూర్ణానందస్వరూపము. జీవుడిట్టి తన వాస్తవస్వరూపమును మరచి దరిద్రునివలె దుఃఖించుచున్నాడుగావుననే వేదమాత తన సంతానమగు ఈ జీవులయందు కారుణ్యముతోడ వారినుద్ధరించుటకే, అనగా వారి ఆత్యంతిక దుఃఖనివృత్తినిగావించుటకే, పరమార్ధమగునట్టి అఖండ పరిపూర్ణానందస్వరూపము నీవేయనిన్నీ, యీ ప్రపంచ సర్వాధిష్ఠానము నీవే యనిన్నీ, నీ స్వరూపమునకు భిన్నముగ కొంచెమైనను నేదియును లేదనిన్నీ యనేకవిధముల బోధించుచున్నది. ఈ బోధను గ్రహించుటయే ఆత్మజ్ఞానము. ఇదియే పరమాత్మ స్వరూపము. ఇంతకధికముగ మానవుడు తెలిసికొనవలసినదిగాని, తెలిసికొనదగినదిగాని యేదియును లేదు. ఇదియే పరమావధి. మానవునకు పరమాత్మ జ్ఞానలాభముకన్న అధికలాభమేదియునులేదు.

ముండకోపనిషత్తునందు, పరమాత్మజ్ఞానఫలము, ఈ విధముగ తెలుపబడుచున్నది.

> "భిద్యతే, హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః।
> క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావరే"

అనగా, పరావరుడగు నా పరమాత్మ దర్శనమగుచుండగా బుద్ధినాశ్రయించి పీటముడివలె గట్టిపడి వాసనా బీజరూపముననున్న అవిద్య విడిపోవును. అప్పుడు అవిచ్ఛిన్న ప్రవాహరూపముననున్న సర్వసంశయములునూ విచ్ఛిన్నములగును. సంశయములుపోయినవెంటనే అవిద్యనశించును. ఇట్టివారు

సంచితకర్మమంతయు నశించుటవలనను, యీ జన్మ కర్మఫలము, భావి ప్రతిబంధముగాకుండుటచే సంసార కారణములేక ముక్తిని గాంతురు. అనగా సగుణ, నిర్గుణరూపమున తెలియబడునట్టి పరమాత్మనునేనే. "అహం" యని సాక్షాత్కారమునొందిన మహనీయునకు, హృదయగ్రంధిరూపముననున్న సర్వసంశయములు నశించి సంసారము నశించునను తాత్పర్యార్థమును, పై వాక్యము స్పష్టముగా తెలుపుచున్నది. కావున యీ ఆత్మవిద్యయగు పరమాత్మ లాభజ్ఞానమిట్టిదియని, గ్రహింతురుగాక.

ఇట్లు గ్రహించి, జిజ్ఞాసువులీఆత్మవిద్యా లాభమునొందుటకు సతతాభ్యాసమావశ్యకమని మరువగూడదు. ఏలనన పరమాత్మస్వరూపుడగు శ్రీకృష్ణ భగవానులే,

శ్లో॥ అనన్యచేతాస్సతతం యోమాంస్మరతి నిత్యశః।
తస్యాహంసులభఃపార్థ నిత్యయుక్తస్యయోగినః॥

అనగా యెవడు నన్ను, అనగా ఆత్మస్వరూపమును, ప్రతిదినమును నిరంతరముగ స్మరించునో అట్టి నిత్యాభ్యాసియగు యోగికి నేను సులభముగా దొరకుదును. అనగా వాడు స్వస్వరూపము నొందును. అర్జునా, యని స్పష్టముగా తెలుపుచు, యింకను

శ్లో॥ అన్త్యకాలేచ మామేవ స్మరన్ముక్త్వాకళేబరమ్।
యఃప్రయాతి సమద్భావం యాతినాస్త్యత్ర సంశయః॥

శ్లో॥ యంయంవాపిస్మరన్ భావంత్యజత్యన్తే కళేబరమ్।
తంతమేవైతికౌంతేయ సదాతద్భావభావితః॥

"తస్మాత్సర్వేషుకాలేషు మామనుస్మరయుధ్యచ"

అనగా అర్జునా మరణకాలమందు యెవడు నన్నే స్మరించుచు అనగా పరమాత్మజ్ఞానముతోడ దేహమును విడచిపోవునో వాడు నా భావమును అనగా

పరమాత్మభావము నొందును. ఇందు సందియము లేదు. అనిన్ని, పురుషుడు మరణకాలమున, ఏయేభావమును స్మరించుచు దేహము విడచునో, అట్టివాడు ఆభావానుచింతనచే వాసితమైన చిత్తము గలవాడై ఆయాభావమునే బొందును, కావున సర్వకాలములందునను నన్నేస్మరింపుము. అనగా పరమాత్మానుసంధానము జేయుచుండుమని స్పష్టముగా బోధించుచున్నారు. కావున యీవిద్యాలాభమునకు ప్రారబ్ధాంతమువరకును సతతాభ్యాసము ఆవశ్యకమని అభ్యాసకులు నిశ్చయమునొందుదురుగాక.

మరియును యిందొక రహస్యమేమియనిన సాధారణముగ నెట్టివారికైనను మరణకాలమును, నిర్దిష్టముగ నిశ్చయించి దానిని ముందుగ తెలిసికొనుట కష్టసాధ్యము. కొందరిట్లు తెలిసికొనగలుగుచున్నారేయనునదిగూడ యూహాగానమే. మరణము జీవునియందుదాగి యుండును. అదివచ్చు క్షణమువరకును ప్రతివారును, తమమరణమెప్పుడో వచ్చునని తలంచుదురు. ఇట్లనుకొనుచుండ యేదో యొకక్షణమున మరణము సంభవించును. మరణము దాగి యుండును గనుక, యేదోయొకరోజువచ్చు దొంగనుద్దేశించి ప్రతిరోజునను, వివేకులు జాగరూకులై, కవాటబంధములుజేయుచుండునట్లు ఆత్మజ్ఞానాభ్యాసి సర్వదా తనస్వరూపమును మరువక జాగరూకుడై యుండుట యావశ్యకము. ఇచట జాగ్రతయేమియనిన తన పరమార్థ వాస్తవస్వరూపమును మరువకుండుటయే. ఇది యెట్లుసాధ్యమనిన, మానవుడు తాను దేనియందు అధిక ప్రీతికలిగియుండునో అదియే అన్నికాలములందునను, మరణకాలమందున గూడ స్మరణకు వచ్చుచుండును. ఇది సహజము. కావున ముముక్షువు తన అధికప్రయత్నముతోడ, స్వస్వరూపమందిట్టి ప్రీతి నొంది సతతమునాచరించు నభ్యాసాదుల వలన శ్రీకృష్ణపరమాత్మ పైనతెలిపినటుల, పరమాత్మభావమును తప్పక నొందగలడు. నిశ్చయము. ఇది పరమ లాభము.

ఆత్మవిద్యయన్నను ఆత్మజ్ఞానమన్నను, ఒక్కటియే. ఇవి పర్యాయపదములు. అనగా సమార్థము గలవి. ఈ విద్యయొక్క పరమలాభసారాంశ

మేమనిన, జీవునకు యీ జననమరణప్రవాహ సంసారదుఃఖము, తన అనాది అవిద్యవలనగలుగుచున్నది. అవిద్యయనగా జీవునకు తనవాస్తవస్వరూపమును తెలిసికొనజాలకయుండు స్థితి. జీవునకు ఇట్టి స్థితి ఆత్మజ్ఞానమువలనగాని నశించదు. జీవునకు యీ జననమరణ సంసారప్రవాహము తనను బంధించి త్రిప్పుచున్న శృంఖలమువంటిది. శృంఖలమనగా సంకెళ్లు. ఈ సంకెళ్లను గొలుసు మొదలు చివరల గొళ్లెములు కలిసి బంధించుచుండును. ఎట్లన యీ సంకెళ్లగొలుసు మొదలు చివరలనునవి జననమరణములు. జీవుని అనాది అజ్ఞానమువలన, జన్మ పరంపరలను అనేకగొళ్లెములేర్పడి, యివి యన్నియు జననమరణములను, యిరువైపులనున్నట్టి చివరగొళ్లెములు కలసి శృంఖలముగానేర్పడి జీవుని జననమరణ ప్రవాహమున, మొదలు చివరలు సంసారమునందు బంధించుచుండును. వివేకులగు జీవులకు సంసారము దుఃఖమనుమాట విశదమే. ఇదిఅంతయు జీవాజ్ఞానము మాయాకార్యము, అనగా భ్రాంతికల్పితము వాస్తవముగానట్టిది. అయినను జీవుడు తన అనాది అజ్ఞానముచే నాచరించునట్టి కార్యఫలానుసరణమున సంసారదుఃఖము ననుభవించుచున్నాడు. ఇట్టిజీవులలోఎవనికో తన అనేకకోటిజన్మపుణ్యఫలముగ, ఈ స్వశరీర సర్వదృశ్యమువలనను తనకు కలుగుచున్నట్టి సుఖదుఃఖములు అనిత్యములనిన్నీ, వాస్తవముకావనిన్నీ,యివియన్నియు పర్యవసానమునకు దుఃఖస్వరూపమేయనిన్నీ తోచి, అనగా తెలిసికొని, యిట్టి సంసారదుఃఖమునుంచి విముక్తినొంది శాశ్వతసుఖము బడయవలయునను వేదనము గలుగును. అట్టి సుకృతజీవుడగు యొకానొక మానవుడు తన అత్యంతిక దుఃఖనివృత్తికి అనగా మోక్షప్రాప్తికి శాస్త్రీయసాధనముల నవలంబించును. ఇట్టి శాస్త్రీయ సాధనములలో ఆత్మజ్ఞానము ముఖ్యము. దీనికి సాటియైనది మరియొకటిలేదు. ఇంతకన్నపవిత్రమైనది, ఎక్కువగునట్టిది, మరియొకసాధనములేదు. ఈ విషయమును గీతలలో శ్రీకృష్ణపరమాత్మ స్పష్టముగ "నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే" అని తెలుపుచున్నారు. తీవ్రముముక్షువు బాగుగ నభ్యసించినయిట్టి ఆత్మజ్ఞానమువలన, సంసారబంధమునుండి విముక్తుడగునని

శాస్త్రము బోధించుచున్నది. ఎట్లన బాగుగ నభ్యసించబడునట్టి యీ ఆత్మ జ్ఞానము అగ్నివంటిది. అజ్ఞాన కర్మఫలమగు జన్మపరంపరయను శృంఖలము (గొలుసు) సదా ఆ వృత్తినొందుచునేయుండును. జనన మరణరూపమున పైకి క్రిందకు నిట్లు తిరుగు, జన్మపరంపర గొలుసు (శృంఖలము) నందు ఒక గొల్లెమును జీవుడు తనయీ మానవజన్మయందు ఆత్మజ్ఞానమను అగ్నిచే కాల్చి తీసివేయగలిగిన యడల అనగా యీస్వశరీర సర్వదృశ్యము, సంబంధ ములు, తన కర్మఫలానుభవమునకుగాను నేర్పడిన కల్పితము, వాస్తవము కాదనిన్నీ, ప్రారబ్ధవశమున వ్యవహారమున్నను వీనితో తనకు వాస్తవ సంబం ధము లేదనిన్నీ దృఢజ్ఞానానుభవమునొందగలిగినయడల, క్రిందిమీదికి సదా తిరుగుచుండునట్టి యీ జననమరణప్రవాహమను సంకెలిగొల్లెము తెగును. అప్పుడు తనను బంధింపజాలక తెగి క్రిందబడును. అట్టి గొలుసు ఆవృతము చేయజాలదు. ఏలనన సంబంధము తెగిపోయినది కావున తిరుగజాలదు. కావున తిరిగి జన్మయుండదు. ఎప్పుడు జీవుని జననమరణ ప్రవాహము నశించునో అప్పుడు జీవుడు తనవాస్తవస్వరూపమగు అఖండపరిపూర్ణ జ్ఞానస్వరూపము నొందును. ఇదియే ఆత్మానంద స్వరూపము. జీవునకు తన స్వస్వరూప జ్ఞానానుభవమే అనగా యీ జ్ఞానము జన్మకారణమగు కర్మఫలములనన్ని టినీ, మండుచుండెడి అగ్నిసమిధలను భస్మము జేయునట్లు జేయునని, అర్జునునకు:

శ్లో॥ యథైధాంసిసమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణిభస్మసాత్కురుతేతథా॥

అని శ్రీ కృష్ణపరమాత్మ గీతలలో తెలుపుచున్నారు. సంసార సాగరము దాటుటకు, వివిధమార్గములున్నను, ఇదియే సాక్షాన్మార్గము. సర్వమార్గముల పర్యవసితము ఆత్మజ్ఞానమునందేయని జిజ్ఞాసువులు గ్రహిం తురుగాక.

—o—

# నేను, నాది, ఇది, యను ప్రతీత్యర్థ వివేచన

ప్రతి జీవికిని, తన దేహమును తాను-అనగా నేను అనియు, తనకు నుపయోగించు దానినంతయు ప్రపంచ రూపమున గుర్తించుచు, నాది యనియు, వ్యవహారము లోకప్రసిద్ధముగ నడుచుచున్నది. తన కుపకరించని దాని నంతయు నుపేక్షాభావముతో ఇది, అవి అని మాత్రమే వ్యవహరించుచున్నాడు. ఎట్లు వ్యవహరించినను యిదంతయు ప్రపంచాంతర్గతమే. ఇట్టి ప్రపంచము నంతటినీ, వాస్తవమున బ్రహ్మగా తెలిసికొనుము. యిదంతయు బ్రహ్మయే నని "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్" అని శ్రుతి తెలుపుచున్నది. ఎట్లని విచారించుదము.

ఈ ప్రపంచమున ప్రతి జీవియును నేను, నేను, అని తలచునది ప్రతీతి మాత్రము. ఈ "అహమ్," నేను, అను ప్రతీతి ఏమియని వాస్తవ మాలోచించిన యడల యీ కరచరణాది విశిష్టమగునట్టి స్థూల దేహముగాని, లేక-మనః ప్రాణములతో కూడినట్టి సూక్ష్మ దేహముగాని అర్థముగాదు. ఈ నేను అనునది కేవల ప్రతీతి మాత్రము. ప్రతి మానవుడును నా దేహము, నా ప్రాణము, నా మనస్సు అని తలచనివాడుండడు. నా మనసు బాగా యున్నదనిగాని, అనగా సుఖముగా యున్నదనిగాని, లేక యేమియునూ బాగాలేదు, అనగా దుఃఖక్లేశములతో యున్నదనిగాని అప్పుడప్పుడనుచుండుట అందరి అనుభవములో నున్నదే. ఇట్టి అనుభవమును బట్టి చూడ నాదియని యనుకొనబడుచున్నట్టి, దేహముగాని, ప్రాణముగాని, మనసుగాని, తాను అనగా "అహమ్" నేను యనునది ఎట్లగును? అగుటకు వీలులేదు. ఏలనన మానవుడు నా మనసు, నా ప్రాణము, నా దేహము, అని తలచునపుడు యివి యన్నియు, నా యిల్లు, నా భార్య, నా పిల్లలు, నా ధనము, నా పశువు, నా పెట్టె, నా కర్ర, నా చెంబు, అని తలచునట్టివియేగదా? నా అవి

తలచునపుడు అర్థము - నాయొక్క అనియేగదా? కావున నాయొక్క పెట్టె, కఱ్ఱ, చెంబు, నేను కాదు అని యెట్లు మానవుడు తెలిసికొనుచున్నాడో, అట్లే నా దేహము, ప్రాణము, మనసు యనునపుడు గూడ గ్రహించవలయును. తన పెట్టెగాని, కఱ్ఱ, చెంబుగాని పోయినయడల మరొకటి కొనవలెననిగాని లేక వానితో ప్రస్తుతము నాకవసరము లేదనిగాని యెట్లు తలంచుచుండునో యట్లే గదా? ఈ దేహ, ప్రాణ, మనస్సులు గూడ గావలయును. ఇల్లు, పశువు, పెట్టె, చెంబు మొదలగు వాని యందునను, దేహము, ప్రాణము, మనసు, అను మొదలగువాని యందునను నాదియను స్వామిత్వ అభిమానమువల్ల నేగదా, వాటి వియోగము దుఃఖమునకు హేతువగుచున్నది. తన యభిమానము నుంచనట్టి గృహక్షేత్ర పశ్వాదులు, పోయినను, ఉన్నను, తనకు సమానములే యగుచున్నవిగదా. ఈ స్వామిత్వ అభిమానములు లేకుండగను మనకు లభించునట్టి ధర్మశాలలు మొదలగువానిని వాటియందున్నంత కాలము వాటి యనుభవములు పొందుచున్నాము. ఇట్లుండ వాటియందు నేను, నాది, యను కొనుట అజ్ఞానమగునట్టి భ్రాంతియేగదా కావలయును. కావున యీ దేహాదు లు నేను, నాకివి నిత్యములు, అని తలచుట అజ్ఞానమేగదా! అయినను జీవుడు యివి నేను అను భ్రాంతి నొందుచున్నాడు. ఇట్లు భ్రాంతినొందుచు వాక్కుతోడ నా దేహము, నా ప్రాణము, నా మనసు యని చెప్పుచున్నను మనసుతోడ యివియే తానని భ్రాంతి నొందుచున్నాడు. ఈ భ్రాంతి జీవునకు అనాది. కావుననే యీ దేహ ప్రాణ, మనస్సులు గూడ నీవు కావనియు, స్వస్వామిత్వ అభిమాన రహితముగ వీనియొక్క యను భవములను పొందవచ్చుననియు, యీ దేహ, ప్రాణ మనస్సులు జీవునకు ఉపయోగించునట్టి సాధనములేగాని, యివి జీవుని వాస్తవ స్వరూపము గాద నియు, ఇవియే, నేను, "అహమ్" అని తలచుటయే అనాది అజ్ఞానమనియు, జీవుడు పరమార్థ వాస్తవమున అఖండజ్ఞానస్వరూపుడనియు, అదియే అతని ఆనంద స్వరూపమనియు శాస్త్రము మానవునకు బోధించుచున్నది. ఈ విషయ మును తన, అనుభవ, వివేక, వివేచనములను పట్టి చూచిన స్పష్టమగును.

ఎట్లనిన నేను అనునది మానవునకు ప్రతీతి మాత్రమేగాని యీ నేను అను పదార్థము ప్రపంచమున నేదియు వాస్తవముగను, నిత్యముగను నగుబడుట లేదు. కాని సర్వులును వారి వారి వ్యవహారానుభవములను యీ నేను అను ప్రతీతి తోడనే చేయగలుగుచున్నారు. అయినను "అహమ్" నేను యనునది కేవల ప్రతీతి మాత్రముగనే యున్నది. ప్రతీతి యనగా "ప్రతీతిర్మాత్రప్రత్యయః" అనెడి వ్యుత్పత్తి వలన యీ నేను యనునది జ్ఞాన స్వరూపముగాని మరియొకటి కాజాలదు. వాస్తవమున జ్ఞాన స్వరూపము. నిత్య, నిర్వికార, అఖండ పరిపూర్ణానందము. కాని, యిట్టి తన అఖండ పరిపూర్ణ జ్ఞాన స్వరూపమును, జీవుడు భ్రాంతుడగుచు మరచి కర్మఫలానుభవ నిమిత్తముగ తనకు గలిగిన యీ శరీరాదులనే నేను అని యనుకొనుచున్నాడు. కాని యిది యెంతమాత్రము వాస్తవముగాదు. నేను, అనునది ప్రజ్ఞానము. ఇది బోధ గాని దేహముగాదు. దృశ్యమందు అనగా యీ ప్రపంచమున నామరూపములను ఉపేక్షింపగ శేషించునది జ్ఞానముమాత్రమే. జ్ఞానమందు జ్ఞాతృజ్ఞేయములుగ నామ రూపములు అధ్యాస (కల్పిత) మాత్రముగనున్నవి. కావున యీ అధ్యాసను తొలిగించగలిగినట్టి మానవుడు, సజాతీయ, విజాతీయ, స్వగతభేద రహితమును, అద్వితీయమును అఖండ పరిపూర్ణమునగు జ్ఞాన స్వరూపమే నేను, అని తలచుచు ఆత్మానందమనుభవింపవచ్చును. ఇదియే బ్రహ్మానందము. ఇదియే తన పరమార్థ వాస్తవ స్వరూపమని గ్రహించి జీవుడు స్వానుభవము నొందవచ్చును. ఎట్లన యీ స్వశరీర సర్వదృశ్యము ఆకాశమునందు నగర కల్పన వంటిది. జీవుడును, సకల జగత్తును, బ్రహ్మ మాత్రమేనని వేదాంత సిద్ధాంతము. ఈస్వశరీర సర్వప్రపంచమును బ్రహ్మయందారోపితము. ఆరోపితము యెన్నటికిని అధిష్ఠానమునకన్న వాస్తవమున వేరగుటకు వీలుగాదు. ఎట్లనిన శ్వేతాంబర చిత్రపటమునందు జూడబడునట్టి నగ, నదీ, నగర, వృక్షలతాదికములన్నియు, భిన్న భిన్నముగ నగుబడుచున్నను సర్వమును ఒక్కటియగు ఆశ్వేతవస్త్ర పటమునందే గనబడును గాని దానిని విడచిన, నగుపడజాలవు. ఇట్లే, విమర్శింపగ మాయావిరచితమగు యీ స్వశరీర సర్వ

ప్రపంచము అధిష్ఠానమగు బ్రహ్మ (అఖండ, నిత్య నిర్వికార పరిపూర్ణజ్ఞాన స్వరూపము) యందే అజ్ఞానము వలన భాసించుచున్నది. కావున స్వశరీర సర్వ ప్రపంచము బ్రహ్మ మాత్రమే యగును. స్వశరీర సర్వనామ రూపోపాధులను ఉపేక్షింపగా శేషించునది - సచ్చిదానంద స్వరూపము బ్రహ్మము. కేవల జ్ఞాన స్వరూపమగు బ్రహ్మ అఖండ పరిపూర్ణమై యున్నను వ్యష్టియందు ఉపాధి గ్రహణము వలన సాక్షి, ప్రత్యగాత్మ యనబడును. కాని మహాకాశము, ఘటాకాశము, అని నామమాత్రముగ వ్యవహరింపబడుచున్నను వాస్తవమున ఆకాశమంతయు నొకటియే యగునట్లు, యీ సాక్షీ, ప్రత్యగాత్మ, పరమాత్మలు సర్వదా ఒక్కటియే. ఈయన కూటస్థుడు. ఈ కూటస్థాత్మ నిరవయవుడు, నిష్క్రియుడు, పరిపూర్ణుడు."అహమ్" నేను అను మాటకు వాస్తవార్థమిదియే. ఈ దేహాదులు నేననితలచుచు తనయందు కర్తృత్వ భోక్తృత్వాదులను ఆరోపించుకొనుటయే జీవునకు అనాది అజ్ఞానము. పరమార్థ వాస్తవమున నేను అనువాడే స్వప్రకాశుడు, సర్వమును ప్రకాశింపజేయువాడు. తనకు భిన్నముగ వాస్తవమున నేమియును లేదు. కాని యిట్టి జీవుడే తన అనాది అజ్ఞానముచే, అనిత్యములగు పరిచ్ఛిన్నోపాధులను గ్రహించి నేను, నాది, అని పరిచ్ఛిన్నత్వ, జడత్వ, దుఃఖిత్వ, భ్రాంతుల నొందుచున్నాడు. ఇదియే మానవునకు సంసార దుఃఖకారణము. మానవులకిట్టి దుఃఖ కారణమును తొలగించుటకే జిజ్ఞాసువులగు వారికి యీ మూర్తామూర్త స్వశరీర, సర్వ దృశ్యమును తమ పరమానంద ప్రాప్తి సాధనముగ నుపయోగించుకొనుచు, యీ "అహమ్" నేను అను ప్రతీతికి వాస్తవార్థము, తమ నిత్య నిర్వికార అఖండ పరిపూర్ణానందజ్ఞాన స్వరూప మనియే గ్రహించవలయునని శాస్త్రము బోధించుచున్నది.

"అహం" నేను అనునప్పుడు ప్రతి జీవియూ, సర్వదృశ్యనిరాకరణము చేసి తనను మిగుల్చుకొనుచున్నాడు. ఇది సర్వులకునూ సహజము. ఇట్లు చేయుటలో ప్రతివారును "నేను" అని తమ హృదయముమీద హస్తము నుంచి అనుకొనుచున్నారుగాని, వెలుపలికి చేయి చూపుచు నేను, అని ఎవరును తలచుటగాని చెప్పుటగాని జరుగుటలేదు. ఇది అందరకును సర్వసామాన్యమై

సహజముగనున్నది. నీవెవరని ప్రశ్నించినయెడల, పసిపాప మొదలుకొని నేను అని వారి గుండెమీద చెయ్యివైచియే చెప్పునుగాని వేరువిధమున చేయుట లేదు. కావున "అహం" నేను అనునప్పుడు ప్రతిజీవియునూ, నెందులకిట్లు చేయుచున్నాడు? దీని విశేషమేమి? దీని పరమార్థమేమి? యని విచారింపవలసి యున్నది. ఈ విచారమెందులకనిన, జీవునకు యీ విచారము, పరమ వివేక సాధనము. దీనివలన జీవునకు మోక్షసాధనమైనట్టి వైరాగ్యాది సంపత్తి కలుగును. కావున నీవిచారముచేయుట యావశ్యకము. ఐతే సుఖము ప్రతి వారికి నీవిషయభోగములవలననే కలుగుచుండగ, యీ విచారమెందులకనిన యెడల, జీవునకు విషయసుఖములన్నియు అనిత్యములు, తాత్కాలికములే యగుచు పర్యవసానమున దుఃఖకరములేయగుచున్నవి. ఈ "అహం"యొక్క పరమార్థ విచారమువలన ఆత్మజ్ఞానము కలుగును. ఆత్మ సుఖస్వరూపము. జీవునకు ఈ సుఖము నిత్యనిరతిశయమైనది. అనగా యెన్నటికినీ నశించనట్టి, సాటిలేని సర్వోత్కృష్టసుఖము. ఈ పరిపూర్ణ సుఖస్వరూపమే బ్రహ్మ, ఆత్మ, యని శాస్త్రము తెలుపుచున్నది. పరమార్థమున జీవుడు బ్రహ్మస్వరూపుడని శ్రుతిమాత తెలుపుచున్నది. అయినను మానవుడు తన అనాదిఅజ్ఞానముచే, వాస్తవమగునట్టి తన అఖండపరిపూర్ణ సుఖస్వరూపమును మరచి, తాను పరమార్థ వాస్తవమున కానట్టి యీ దేహాదులను తాను అనగా "అహం" నేను యని యనుకొనుచున్నాడు. ఇదియే అధ్యాస. అనగా తాను కానిదానిని తాననితలచుట. మానవునకు యిదియే అనాది అజ్ఞానము. జీవునకిదియే సంసార దుఃఖకారణముగ నున్నదిగాని, వేరేమియునూలేదు. కావున వివేకి యగు ప్రతి జీవునకున్నూ, తన వాస్తవస్వరూపమును తెలిసికొనుట తన పరమ సుఖమునకావశ్యకము.

జీవునకు సంసారకారణమేమియనిన, నిత్యనిర్వికార, అద్వితీయ అఖండపరిపూర్ణ చైతన్యస్వరూపుడగునట్టియు, అఖండపరిపూర్ణ సుఖస్వరూపుడగునట్టియు, ఆ పరమాత్మయే మాయాప్రభావమువలన భ్రాంతినొందిన వానివలె నగుబడుచు, జీవనానాత్వముతోడ, బహుసంఖ్యాకములగు వివిధో

పాధుల నభిమానించినవాడాయెను. ఈ అభిమానము (అనుభవమునుబట్టి) కల్పితముగాని వాస్తవముకాదు. ఇట్టి వివిధ, భిన్నభిన్న, ఉపాధ్యభిమానముల తోడ, ఆ పరమాత్మయే సంసారివలె నగుపడుచున్నాడు. కాని వాస్తవమున ఆ పరమాత్మ అద్వితీయ నిత్యనిర్వికార పరిపూర్ణసుఖస్వరూపుడు. పరమార్థ వాస్తవమున జీవునకు, జనన మరణ ప్రవాహరూపముననున్న యీ సంసారము లేదు. అనగా వాస్తవముగాదు. ఈ సంసారమనునది మాయాకల్పితము. మాయయనగా లేనిదియున్నట్లుగా గనుబడునదియే. ఇదియే అజ్ఞానము, కల్పితము, అవాస్తవముననబడును. యా-మా-సా-మాయా-అనగా ఏదిలేదో అది మాయ. ఉన్నది యున్నట్లుగ వాస్తవమున తెలిసికొనుట, జ్ఞానము, సత్యము అనబడును. కావున వివేకియగు మానవుడు యీ రహస్యమును బాగుగ గ్రహించవలసియున్నది. ఇచట అనగా యీ ప్రపంచమున ఒక్కొక్క జీవ రూపమున నగుబడుచున్న యీ పరమాత్మయే జీవభ్రాంతి నొందుచున్నవాని వలె తాను వాస్తవమునగానట్టి అనంత, సూక్ష్మ, స్థూలశరీరోపాధులన్నియూ తానేననియూ, తనకు బాహ్యమునయున్న దృశ్యమంతయు తనదియనియు, తనదిగాదనియు తలచుచు, యిందు తనదని తలచినపుడు రాగముతోడను, తనదిగాదని తలచినపుడు ఉపేక్ష, ద్వేషభావముతోడను, రాగద్వేషాభిమానుడై సంసారభ్రాంతుడగుచున్నాడు. కాని యీ సంసార దుఃఖము కల్పితము, తనకు వాస్తవమున సంబంధించినదిగాదని, తన అనాది, అజ్ఞానముచే తెలిసికొనజాలక తన పరమార్థ వాస్తవ సుఖస్వరూపమగు బ్రహ్మస్వరూపమును మరచియున్నాడు. ఇట్టి జీవుని సంసారభ్రాంతినుండి తరింపజేయుటకే వేదమాత "జీవోబ్రహ్మైవనాపరః" అని తెలుపుచు "తత్త్వమసి" అనగా జీవుడు బ్రహ్మకంటెవేరుగాదు. "అబ్రహ్మనీవేను" అని బోధించుచున్నది. కావున వివేకియగు మానవునకు తన పరమార్థ వాస్తవస్వరూపమును గ్రహించుట తన నిత్య, నిరతిశయ, సుఖమునకావశ్యకము. దీనికిగాను శాస్త్రమునాశ్రయించి తాను పరోక్షముగ తెలిసికొనిన "సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం," "నేహనానాస్తికించన" "తత్త్వమసి" అను

అన్నివాక్యములయొక్క తాత్పర్య సారాంశమును బాగుగవిని, వినిన దానిని విచారించి,విచారించినదానిని బాగుగమననముచేసికొని,మనన పరిపాకమువలన నిదిధ్యసనాదులాచరించుచుండినయడల కాలక్రమమున తనకు యీ స్వశరీరాది సర్వదృశ్యమందు సత్యత్వబుద్ధిక్రమముగ క్షీణించి, స్వప్నదృశ్యముల లాగున ననుభవింపగలుగును. కాలక్రమమున "మాయామాత్రమిదంద్వైతం, అద్వైతం పరమార్థతః" అనువిషయము స్పష్టపడును. అప్పుడు యీ నేను అను ప్రతీతితో సర్వవ్యవహారములు ప్రారబ్ధవశుడై చేయుచు, ననుభవించుచున్నను, అట్టివి యన్నియు ఛాయామాత్రములగుచు తనను బాధింప నందున, తాను నేను అను ప్రతీతితో నేపని చేయుచున్నను, ఎల్లప్పుడును తన పరమార్ధ వాస్తవ స్వరూపమగు అఖండ పరిపూర్ణ చైతన్యమునందే లక్ష్యము గలవాడగుచు, తాను నేను అనుకొన్న ప్రతీతిని, వ్యవహారము లన్నిటినీ కల్పితములని గ్రహించి వాటినన్నిటిని నిమిత్త మాత్రముగ తన ప్రారబ్ధ క్షయమునకుగాను అనుభవము నొందగలుగుచున్న యడల తన ప్రారబ్ధాంతమున యీ నేను అను పరిచ్ఛిన్న ప్రతీతి అఖండ సత్పదార్ధమునందు లయించి తాను అఖండ సచ్చిదానంద స్వరూపుడే యగును. ఇదియే యీ నేను "అహం" అను ప్రతీతియొక్క పర్యవసిత ప్రయోజనమని ముముక్షువులు గ్రహించి జీవునకు పరమ లాభమగునట్టి ముక్తిని బడయుదురుగాక. ఇట్టి మోక్షప్రాప్తికి ముముక్షువులు వారి వారి పరిచ్ఛిన్న అహం ప్రతీతిని కేవల వ్యవహార ప్రయోజనముగ తెలిసికొని ఆత్మాను సంధానాదుల నభ్యసించుట యావశ్యకమని గ్రహించవలెను.

అనుభవమును బట్టి చూచిన నేను, అనునది యున్నప్పుడే నాది, యనునది యుండుట సంభవముగాని లేనిచో కాదు. సూక్ష్మ బుద్ధితో నాలోచించిన ఈ నేను అను ప్రతీతికి వాస్తవకర్త ఎవడును కనబడుటలేదు. ఈ నేను, నేను యనుకొనువాడు అంతఃకరణ ప్రతిబింబుడగు చిదాభాసుడు. ఆ భాసుడనగా నిజముగా తాను కానివాడనియు, మోసగాడు అనియేకదా

అర్థము.చిదాభాసుడు ఇట్టివాడే. ఈచిదాభాసుడే తన అనాది అవిద్యా కామ కర్మల తోడఅజ్ఞానమునొంది భ్రాంతియుతుడై ఏజన్మకాజన్మయందునాభార్య,నాపిల్లలు, నాయిల్లు, నా ధనము అని తలంచుచు, వానియందు వ్యామోహితుడై కోరికల జేయుచు నాది, నాది యని తలచుచున్న పుత్ర, కళత్ర, బంధు, గృహ, విత్త క్షేత్రాదుల నన్నిటిని ఏజన్మయందలి వానిని ఆజన్మాంతమందే నిర్దాక్షిణ్యముగ శ్మశానములో ఘటమును పారవైచునట్లు అన్నిటిని వదలి మరియొక ఉపాధి కొరకు పోవుచుండును. ఇట్టి చిత్ప్రతిబింబుడగు చిదాభాసుని నమ్ముకొనుట అజ్ఞానము, అవివేకమేకదా? ఈ చిదాభాసుడు ప్రతిబింబుడు. ఈ ప్రతిబింబు నకు బింబుడెవరో ఆయనయేగదా వాస్తవుడగును. ఆయనయే చిద్రూపుడు. ఆయనయే అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపుడు. ఆయనకు కర్తృత్వాదులు లేవు. ఆయన స్వప్రకాశుడు. ఒక్క సూర్య ప్రకాశము వలన సమస్త లోక వ్యవహారములును నడచుచున్నట్లు, నిత్య నిర్వికారుడగు ఆ చిద్భాస్కరుని ప్రకాశము వలననే ఈ చిదాభాసుడు వ్యవహరించుచు సంసార భ్రమణము చేయుచుండును. ఈయనయే వ్యవహార జీవుడు. కల్పితుడు. అయినను ఈయన పరమార్థ వాస్తవ స్వరూపము (పారమార్థిక జీవుడు.) నిత్య నిర్వి కార అఖండ సచ్చిదానంద స్వరూపముగాని మరియొకటిగాదు. జీవునకీ జన్మ పరంపర, ఈ యుపాధి సంబంధములు అజ్ఞాన నిమిత్తముననే వచ్చినవిగాని వాస్తవములు గావు. జీవుడు తన సంసార దుఃఖమునకు నిమిత్తమగు అజ్ఞాన మును స్వాత్మజ్ఞాన ప్రకాశముతోడ నిర్మూలించగలిగిన యడల తన వాస్తవ స్వరూపమగు పరిపూర్ణానంద స్వరూపుడేయగును. ఇది రహస్యము జీవునకీ రహస్యమునుగ్రహించగలిగినసామర్థ్యము ఒక్కమానవజన్మయందే కలుగును గాని యితర జన్మలందుకలుగదు. కావున వివేకియగు జీవుడు తనకిప్పుడువచ్చిన మానవజన్మను వృధా చేసికొనక పరమార్థవాస్తవమున తానెవరోతెలిసికొనిన యడల తాను వాస్తవమున అఖండ పరిపూర్ణానందస్వరూపుడనియు తాను నేను, నేను, అని భ్రమించుచున్న ఈ పరిచ్ఛిన్న, స్థూల, సూక్ష్మోపాధిని గాననియు, తనకు యీ పుత్ర, మిత్ర, విత్త, కళత్ర క్షేత్రాదులయందు కర్తృత్వాద్యభి మానములు వాస్తవమున సంబంధించినవి గావనియు స్పష్టపడును.

ఈ స్వశరీర ప్రపంచసృష్టి యంతయును కల్పితము, భ్రాంతి మాత్రమే యయినను, నిందు బ్రహ్మసృష్టియనియు, జీవసృష్టియనియు రెండు విధములుగలవు. పంచభూతాత్మకమగు జీవజడదృశ్యమంతయు బ్రహ్మసృష్టియే. జీవసృష్టియనగా జీవుడు తాను అనగా నేను అనుకొను పరిచ్ఛిన్నభ్రాంతియు, నాది యనుకొను స్వశరీర, పుత్ర, కళత్ర, బంధు, విత్త, గృహక్షేత్రాదులను, నావి నావి యని వ్యామోహితుడగుచు తాను కామక్రోధాదుల తోడ, భయ, రాగద్వేషాదుల నొందుచు కర్తృత్వ, భోక్తృత్వ ధర్మములతో తన వ్యవహారముల నాచరించుచుండుట. కాని కేవల బ్రహ్మసృష్టి జీవునకు నిర్బాధకముగనుండి జీవుని బంధింపదు. మరియేమనిన జీవుడు దృశ్యము వాస్తవమను భ్రాంతి గలవాడై కర్తృత్వాదులతోడ నేను, నాది, యనుకొనునట్టి స్వకల్పిత సృష్టివ్యవహారములే తనకు బాధాకరములగుచు తన సంసారబంధకారణమగుచున్నవి. బాగుగ విచారించి తెలిసికొనిన జీవునకు తన పరమార్ధవాస్తవస్వరూపము అఖండానంద స్వరూపమగు ఆత్మపదార్ధమే గాని వేరుగాదు. ఈ ఆత్మ నిత్య, నిర్వికార, నిరవయవ, స్వప్రకాశ, అఖండ జ్ఞాన స్వరూపుడు గావున ఈయనకు కర్తృత్వాదులు లేవు. మానవుని పరమార్ధస్వరూపమిట్టిదియే కాని వేరుగాదు. కావున జిజ్ఞాసువులిట్లు తెలిసికొనవలెను. ఈ నేను యనుకొను తమ స్వశరీర పరిచ్ఛిన్నభ్రాంతి, నాదియను కర్తృత్వాది వ్యామోహము, కేవల కల్పితము, భ్రాంతిమాత్రమను నిశ్చయము నొంది నేను చిదాభాసుడనుగాను. నేను చిద్రూపుడను, నేను చిత్ప్రతిబింబుడను గాను, నేను చిత్స్వరూపుడను. సర్వము చిన్మాత్రమే. చిత్ అన్ననూ, బ్రహ్మ యన్ననూ, జ్ఞానమన్ననూ, ఆత్మయన్ననూ యివియన్నియూ సమానార్ధములగు పర్యాయపదములు. ఈ నాది, నేను అను విచార, విమర్శలనుబట్టి సర్వము బ్రహ్మయేనని, నిశ్చయమగుచున్నది. కావున

శ్లో॥ బ్రహ్మైవపంచభూతాని
బ్రహ్మైవ సకలంజగత్

బ్రహ్మైవాహం, బ్రహ్మచాన్యత్
బ్రహ్మభిన్నంనకించన

అను నిశ్చయముతోడ జిజ్ఞాసువులు వారి అనుసంధానాదుల నాచరించు చుండవలయును. ఈ జ్ఞానానుసంధానాదులే సాక్షాన్ముక్తిమార్గము.

కాని మానవునియొక్క పరమ ప్రయోజనమును శాస్త్రము తెలుపు చున్నట్టిదియును నగు యీ నేను, నేను యను, అహమ్ ప్రతీతి వాస్తవ స్వరూపము సర్వజీవుల హృదయాంతరమగు పరిపూర్ణ జ్ఞానస్వరూపమనియు, యిదియే సర్వాధిష్ఠాన, సర్వవ్యాపక, పరిపూర్ణ, స్వాత్మ స్వరూపమనియు, గ్రహించుటెట్లు? యను సంశయమున్నవారలగుచు అట్టి ఆత్మయున్న యడల, అది మనకెందుకు గోచరించదు? యని శంకించుచుందురు. కాని వస్తువు యున్నంతమాత్రమున అది సర్వులకును యెల్లప్పుడును కన బడవలెనను నియమములేదు. అందరకును ప్రకాశజ్ఞానమాత్రముగ, అధిష్ఠానముగనున్నట్టి పరిపూర్ణ జ్ఞానస్వరూపుడగునట్టిన్నీ, సర్వజీవోపాధుల హృదయగుహల యందునను ప్రకాశరూపమున తెలియబడుచు సర్వమును ప్రకాశింపజేయునట్టిదియును, నగుస్వాత్మ ప్రకాశము వలననే సర్వ వ్యవహా రము జరుగుచున్నదని గ్రహించుచు ఆ ప్రకాశము తన శరీర ధర్మము గాదని గ్రహించవలెను. ఎట్లనిన యీకాలమున దూరసంభాషణా యంత్ర ములు, అనగా టెలిఫోనులలో ఒకదూరపు ప్రదేశమునుంచి, మరియొక ప్రదేశమునకుగాని, ఒకదేశమునుంచి, మరియొకదేశమునకుగాని మాట లాడునపుడు ఆ కంఠధ్వని, మాటలు, అవతలనున్న మానవమాత్రుడివేగాని టెలిఫోనుకు సంబంధించినవి గావనిన్నీ, అయినను యిట్లు దూరముననున్న కంఠధ్వని శబ్దములను వినుటకు టెలిఫోనుయంత్రమే యెట్లు ద్వారమాత్రము, ఆధారమని తెలుసుకొనుచున్నామో అట్లే మన యనుభవములకు ఉపకరణ ముగానున్న యీ శరీరముగూడ టెలిఫోను యంత్రమువంటిదేననియూ, యిది తన జ్ఞానమునకు ద్వారమువలె సాధనమాత్రమనియు, వాస్తవమున

మనకు కలుగుచున్న సమస్తానుభవప్రకాశమును వారి, వారి హృదయ పుండరీకమందు తెలియబడు చిదాకాశరూపుడగు ఆత్మదేగాని జడాత్మకమగు శరీరాదులది గాదనియు తెలిసికొనవచ్చును. మానవుడు తన సుఖదుఃఖ సమస్తానుభవములను జ్ఞానము లేక అనుభవమునొందుటలేదు. ఒక్క జ్ఞానమువలననే జీవుడు తన అనుభవములన్నియు నొందగలుగుచున్నాడు. ఇట్టిజ్ఞానము ఉన్నను, యెల్లప్పుడును సర్వత్ర యున్నవస్తువులన్నియు యేకకాలమందుగోచరించుటలేదు. ఇదివారివారి శక్తిసామర్థ్యప్రయత్నములనుబట్టియు, అర్హతాధికారములనుబట్టియు, తెలియుచు గనబడుచుండునేగాని వేరుగాదు. అంధునకు కనబడనంతమాత్రమున సూర్యుడు లేడని చెప్పవచ్చునా? ఈ అంధత్వము పోయినవెంటనే ప్రయత్నములేకయేసూర్యుడు గనపడు చుండును. అట్లే మానవునకిప్పుడున్న అంధత్వమను అజ్ఞానమును, ప్రయత్నించి పోగొట్టుకొనగలిగినయడల ప్రతివారిలోను సర్వపరిపూర్ణ ముగనున్న యీ జ్ఞానభాస్కరుడు గనబడుచునేయుండును. సామాన్యమానవుడొకడు సార్వభౌముని చూచుటకు ప్రయత్నమావశ్యకమగులాగుననే యీసర్వాధిష్ఠాన రూపుడగు చిద్భాస్కరుని చూచుటకు శాస్త్రశ్రవణము, అనుభవవివేచన, మనన, నిదిధ్యసనసాధనములావశ్యకములగుచున్నవి. కావున శాస్త్రము తెలుపునట్టి యీ ఆత్మయే మనయందరి హృదయ కమలములయందునను సాక్షిమాత్రుడుగనుండి సర్వప్రకాశమును (జ్ఞానమును) యిచ్చుచున్నాడనియు. యీ పరమాత్మయే పరిపూర్ణముగ నిండియున్నాడనియు యీ క్రింది అనుభవవివేచనల వలన స్పష్టపడగలదు.

జీవునకు సర్వమును తనలో లేనియడల అనుభవ మనునదియే సంభవము కాదుగదా! మరియొక చోటనున్న జ్ఞానము తనకు ప్రత్యక్షానుభవము నివ్వజాలదు. కావున యీ జ్ఞానమనునది తనలోననే యుండవలయును. కనుక తన వాస్తవ స్వరూపము తనలో పరిపూర్ణజ్ఞాన స్వరూపుడుగనున్న ఆత్మ స్వరూపమేనని గ్రహించుటకేమికష్టము? సులభముగ గ్రహించవచ్చునుగదా!

ఆత్మ స్వప్రకాశ రూపజ్యోతి. ఈ శరీరము జడమగు ఘటాదుల వంటిది. తమోరూపము ప్రకాశమనునది జ్యోతి వలన రావలయునుగాని ఘటము వలన రాదుగదా? మానవునకు తన భోగానుభవములకు ప్రకాశము, అనగా తెలివి యావశ్యకమగుచు తనలోనుంచియేగదా! యీ జ్ఞానము గలుగుచున్నది. కావున ఘటమువంటి తన శరీరములోని హృదయ పుండరీకమందున నున్న ప్రకాశమే అనగా జ్ఞానమేతన పరమార్థ వాస్తవ స్వరూపమని తెలిసికొన వలయును.

మరియును యీ కాలమున రేడియోలు, అందరి అనుభవములో నున్నవియేగదా? "ఆకాశవాణి" అనగా ఆకాశమంతలో సర్వత్ర నిమిడి యున్న శబ్దము, దానంతట యది వినబడుటగాని, గోచరించుటగాని లేదు గదా? అన్ని శబ్దములు, అన్ని కంఠధ్వనులు, ఆకాశమున సర్వత్ర నిండి యున్నను, నిది యెవరికిని అప్రయత్నముగ వినబడుటగాని, తెలియబడుట గాని, లేదుగదా? కాని శాస్త్రజ్ఞులు ఆకసమున మరుగుపడియున్న యీ శబ్ద తరంగములను పరిశోధన చేసి వాటి నాకర్షించునట్టి యంత్రములను సాధించి నప్పుడుగదా, అట్టి రేడియో యంత్రముల ద్వారా మనమాయాకాశములో సర్వత్రను తెలియకుండగ నుండునట్టి శబ్ద, కంఠధ్వనుల నాకర్షించి వినగలుగు చుంటిమి. ఇట్లే సర్వ వ్యాపకమగునట్టి పరిపూర్ణాత్మ స్వరూపమును గ్రహించు టకు అనుభవ వివేచనలను సూక్ష్మబుద్ధితోడ గావించి బాగుగ తెలిసికొన వచ్చును. అట్టి దానిని సతత మననాభ్యాస సాధనములద్వారా రేడియో మూల ముగ దూరశబ్ద శ్రవణానుభవముల నెట్లు పొందగలుగుచుంటిమో, యట్లే కేవల జ్ఞాన స్వరూపమగు యీ పరిపూర్ణాత్మానుభవము పొందగలమనుటకు నెట్టి సందియమును లేదు. ఇట్లు స్వాత్మజ్ఞానము నొందిన మహనీయులు అన్ని కాలముల యందునను గలరనుటకును సందియము లేదు. కావున పరమాత్మ స్వరూపమునిట్లు తెలిసికొనుట యనునది సాధ్యమే కాని అసాధ్యము గాదని వివేకులు గ్రహింతురుగాక.

ఈ పరమాత్మయే సమస్త ప్రాణులయందున్న అఖండ చైతన్యమనియు, ఈ ప్రపంచమంతయు నామ, రూపోపాధుల భేదముచే నానారూపముల భిన్నముగ నున్నట్లు భాసించుచున్నది గాని యీ ప్రపంచ సర్వాధిష్ఠానము తన అఖండ పరిపూర్ణాత్మ స్వరూపము తప్ప వేరేదియును లేదను నిశ్చయ జ్ఞానానుభవమును శాస్త్రీయ శ్రవణ మననాద్యభ్యాస పాటవముచే జీవుడు తన ప్రారబ్ధాంతమందు నిశ్చయముగ పొందునని శాస్త్రము తెలుపుచున్నది. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే, కార్యా కార్యవ్యవస్థితౌ" మానవుడు తన పరమ శ్రేయస్సాధనమునకు యేపని చేయవలయును, యే పనిని చేయరాదు, అను వ్యవస్థకు శాస్త్రమే ప్రమాణము అని భగవద్వచనము తెలుపుచున్నది. కావున శాస్త్ర ప్రమాణము నుల్లంఘించుట శ్రేయోదాయకముకాదు గదా!

ఈ నేను, నేను, అని సర్వ జీవులచేతను అనుభవింపబడుచున్న "అహం" ప్రతీతి యొక్క వాస్తవమునే, సర్వ వేద శాస్త్రముల వలనను, తెలిసికొనవలసినది గాని మరియొకటి దీనికన్న ఎక్కువది లేదని, పరమాత్మ యగు శ్రీకృష్ణ భగవానుడే, గీతలయందు "వేదైశ్చసర్వై రహమేవ వేద్యః" యని స్పష్టముగా తెలుపుచున్నారు. కాన జిజ్ఞాసువులకు యీ అహం పదార్థవివేచన, అమృత పానము చేయుటవంటిది.

—O—

# జీవాత్మ పరమాత్మ వివేకము

ఈ జీవాత్మ పరమాత్మలు అధిష్ఠానాధ్యస్త రూపమున కలిసియేయున్నం దున దీని వివేకము కష్టము. ఏలనన వాస్తవమున అధిష్ఠానరూపమగు పర మాత్మస్వరూపము యింద్రియగోచరముకాదు. అవాస్తవము, అధ్యస్తమునగు జీవప్రపంచమంతయు యింద్రియగోచరము. ఇంద్రియములు, బాహ్యవిషయ ములనే తేలికగా గ్రహించు సమర్థత గలిగి ఆంతరమును చూడజాలవు. కాని జీవునకు తన అధిష్ఠానమగు పరమాత్మజ్ఞానముగలిగినగాని బ్రహ్మప్రాప్తి గలుగదు. కావుననే శ్రీకృష్ణ భగవానులు అర్జుమనకు బ్రహ్మవిద్యనుపదేశించెను. ఈ విద్యనుపదేశించునదియే భగవద్గీత. ఈ గ్రంథమందు 13వ, అధ్యాయ మున క్షేత్రక్షేత్రజ్ఞరూపమున యీ జీవాత్మ పరమాత్మలగురించిన స్వరూపము నుపదేశించుచు "క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం, యత్తత్ జ్ఞానం మతంమమ" అనగా యీ క్షేత్రక్షేత్రజ్ఞులను జీవాత్మపరమాత్మల స్వరూపమును వాస్తవముగ తెలిసి కొనుటయే, నన్ను (అనగా తననుతాను) తెలిసికొనుటయని నా మతము, అనగా అభిప్రాయమని, కృష్ణ పరమాత్మయే తెలుపుచున్నారు. త్రయోదశా ధ్యాయమందు జీవాత్మ పరమాత్మ స్వరూపములను తెలుపుచు, షష్ఠాధ్యాయ మగు ఆత్మసంయమ యోగాధ్యాయమందు దీనినెట్లు తెలిసికొని అభ్యసించ వలసినదియూ తెలిపియున్నారు. కాని ప్రతి బింబరూపమునయున్న జీవునకు, బింబరూపమున యీ పరమాత్మస్వరూపమును ప్రత్యేకించి స్పష్టముగా తెలిసి కొనుట అభ్యాసదశలో దురవగాహముగనుండును. అయినను మానవుడు పరమ ప్రయోజనము పొందుటకు సంపాదించవలసిన జ్ఞానమిదియే.

ఈ జ్ఞానము కలుగనియెడల, ముముక్షువు తన పరమార్థస్వరూపమును బాగుగ గ్రహించుట దుస్సాధ్యము. కావున సదృష్టాంతముగ, వివేకచూడామణి యందు శ్రీశంకర భగవత్పాదులు, శిష్యునకుపదేశించిన బోధను సంగ్రహ

ముగ నిచట గ్రహించి, విమర్శపూర్వకముగ తాత్పర్యార్థమును వ్రాయుచున్నాడను.

శ్లో॥ ఘటం జలం తద్గత మర్క బింబం,
విహాయసర్వం దివివీక్ష్యతేఽర్కః।
తటస్థ ఏత త్త్రితయావ భాసకః,
స్వయంప్రకాశో విదుషాం యథాతథా॥

శ్లో॥ దేహంధియం చిత్ప్రతిబింబమేతం,
విసృజ్యబుద్ధౌ నిహితంగుహాయామ్।
ద్రష్టారమాత్మాన మఖణ్డబోధం,
సర్వప్రకాశం సదసద్విలక్షణమ్॥

శ్లో॥ నిత్యంవిభుం సర్వగతం సుసూక్ష్మ,
మ న్తర్బహిః శూన్యమనన్య మాత్మనః।
విజ్ఞాయసమ్యఙ్నిజరూపమేత,
త్పుమాన్వివాప్మావిరజావిమృత్యుః॥

శ్లో॥ విశోక ఆనన్ద ఘనోవిపశ్చి,
త్స్వయం కుతశ్చిన్న బిభేతికశ్చిత్।
నాన్యోఽస్తి పన్థాభవబన్ధముక్తే,
ర్వినాస్వత త్త్వావగమం ముముక్షోః॥

పై శ్లోకముల తాత్పర్య విస్పష్టతకుగాను శ్లోకోదాహరణములయందు తెలిపిన అంశములను ప్రత్యేకించి ఇచట వివరించుచున్నాడను. 1. ఘటము, 2. ఘటములోని జలము, 3. ఘటజలములోని సూర్యప్రతిబింబము, 4. సూర్యుడు.

మొదటి మూడునుచేరి ప్రకాశింపజేయబడునవిగను, నాలుగవవాడగు సూర్యుడు పరమాత్మస్థానీయముగను ఇందు చెప్పబడినారు.

దీనితాత్పర్యమేమనిన — పైన యుదాహరింపబడిన, ఘటము, జలము, ఘటజలమందు ప్రతిబింబించిన సూర్యబింబము అనునట్టి యీ సర్వమును త్యజించి, వీటికి తటస్థముగనుండి, వీనిని ప్రకాశింపజేయుచూ, గగనమున తాను స్వయముగా ప్రకాశించునది సూర్యుడు. ఈయన ఘటాదికములకంటె భిన్నుడు. ఆప్రకారమే ఘటమువంటి స్థూలశరీరము, జలమువంటి బుద్ధి, సూర్యప్రతిబింబమువంటి చిత్ప్రతిబింబుడగు జీవుడు (చిదాభాసుడు) అను నీ మూడింటిని త్యజించి సర్వద్రష్టయు, అఖండజ్ఞానస్వరూపుడును, సర్వోపాధి, బాహ్యాంతరప్రకాశకుడును, నిత్యుడును, సర్వగతుడును, పరిపూర్ణుడును, బాహ్యాంతరభావరహితుడును, సర్వజీవుల బుద్ధిగుహయందుండువాడును అగు కూటస్థాత్మను, సంశయ విపర్యయరహితముగను, అపరోక్షముగను, తెలిసికొనిన పురుషుడు శోకరహితుడును, అమృతుడును, నిత్యానందరూపుడునగును. కనుక ముముక్షువునకు తన సంసార బంధ విముక్తికి స్వస్వరూపాత్మ జ్ఞానము కంటె నితర మార్గములేదు. కావున పై వివేచనను బాగుగ గ్రహించి వారి పరమార్థ స్వరూపము సూర్యునివంటి పరమాత్మయే యనియు యీ జీవసంఘాతమంతయు కల్పిత మాత్రమనియు నిశ్చయము నొందవలయును.

శ్రీకృష్ణ భగవానులు అధిష్ఠానాధ్యస్తములుగ భాసించుచున్న యీ జీవాత్మ పరమాత్మలు ఒక్కటియేగాని వేరుగాదను తాత్పర్యముతో—

శ్లో॥ యోమాంపశ్యతి సర్వత్ర, సర్వంచమయిపశ్యతి ।
తస్యాహంనప్రణశ్యామి, సచమేనప్రణశ్యతి ॥

అనగా ఎవడు సమస్త భూతములను తన యందునను, సర్వ భూతములయందు తనను జూచునో అట్టి బ్రహ్మైక్యానుసంధానము కలవారికి పరోక్ష పరోక్షములు (అనగా జీవ పరమాత్మలు) ఒక్కటిగనేయుండును. అని తెలుపుచు, ఏది తెలియదగినదో, ఏది తెలిసిన మోక్షము నొందునో అది తెలుపుదునని యీక్రింది విధమున అట్టి పరమాత్మ స్వరూపమును తెలుపుచున్నారు.

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి, యద్జ్ఞాత్వాఽమృతమశ్నుతే ।
అనాది మత్పరంబ్రహ్మ, నసత్తన్నా సదుచ్యతే ॥

శ్లో॥ సర్వతః పాణిపాదంత, త్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతశ్శ్రుతిమల్లోకే, సర్వమావృత్యతిష్ఠతి ॥

శ్లో॥ సర్వేన్ద్రియ గుణాభాసం, సర్వేన్ద్రియ వివర్జితం ।
అసక్తం సర్వ భృచ్చైవ, నిర్గుణం గుణభోక్తృచ ॥

శ్లో॥ బహిరన్తశ్చ భూతానా, మచరం చరమేవచ ।
సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం, దూరస్థం చాన్తికేచతత్ ॥

శ్లో॥ అవిభక్తంచ భూతేషు, విభక్తమివచ స్థితమ్ ।
భూతభర్తృ చతద్జ్ఞేయం, గ్రసిష్ణు ప్రభవిష్ణుచ ॥

శ్లో॥ జ్యోతిషామపితజ్జ్యోతి, స్తమసః పరముచ్యతే ।
జ్ఞానంజ్ఞేయం జ్ఞానగమ్యం, హృధి సర్వస్యధిష్ఠితమ్ ॥

ఈ తెలియదగినదెట్టిదనగా- అది ఆద్యంతములు లేనిదియు, నిరతిశయమైనదియునగు బ్రహ్మము. అది ఎటు చూచినను చేతులు కాళ్ళును, కన్నులు, శిరస్సు, ముఖము, చెవులు గలది. (అనగా సర్వ జీవ స్వరూపము) అది లోకమందలి సర్వమును ఆవరించుకొనియున్నది. అది ఇంద్రియ గుణములగు రూపాదుల నన్నిటిని ప్రకాశింపచేయునది. ఇంద్రియములన్నింటితోడను సంబంధించినటువంటిది. సంగములేనిది. అయినను సర్వమును భరించునది. సత్త్వరజస్తమో గుణములు లేనిది యయ్యును, సత్త్వాది గుణములను పాలించునది. అది భూతములకు లోపలను, పైనను నిండి యున్నది. స్థావరమును, జంగమమునునదియే. అయినను అతి సూక్ష్మమగుటచే నదియే యిదియని తెలిసికొనన లవిగానిది. మూఢులకు దూరముగను, విద్వాంసులకు చేరువగను నుండునది. అది భూతములయందభేదముగ

నున్నను, భేదముగల దానివలె నుండును. భూతములను పోషించుచున్నది, ప్రళయమందు మ్రింగునది. సృష్టి కాలమందు నానా రూపములుగ పుట్టునది యదియే అది సూర్య చంద్రాదులను గూడ ప్రకాశింప జేయునది. తమస్సు కంటె పైగా నుండునది. అదియే జ్ఞానమనునది. అదియే బ్రహ్మ, పరమాత్మ. ఇదియే జ్ఞేయ పదార్థము. దానిని జ్ఞానముచేతనే తెలిసికొనవలయును. అది అందరి హృదయముల యందున్నది. అని శ్రీకృష్ణ భగవానులు తెలుపు చున్నారు. ఇదియే పరమాత్మ. ఈ ఆత్మ విజ్ఞాన స్వరూపమును తెలిసికొనిన యడల దాని ఫలమును శ్రీ శంకర భగవత్పాదులు:

శ్లో॥ బ్రహ్మ భిన్నత్వ విజ్ఞానం, భవ మోక్షస్య కారణమ్ ।
యేనాఽద్వితీయ మానన్దం, బ్రహ్మ సంపద్యతే బుధైః ॥

అనగా ఆ పరమాత్మను నేనే "అహం బ్రహ్మాస్మి" యనెడి, బ్రహ్మాభిన్నా ఖండాకారవృత్తియే విజ్ఞాన మనబడును. ఇట్టి విజ్ఞానము సంసార బంధ విముక్తికి హేతువగును. అట్టి విజ్ఞానముగల పండితుడు అఖండానన్దము పొందును. అనగా తానేపరమాత్మయగు సచ్చిదానన్దరూప బ్రహ్మమై విల సిల్లును. ఇదియే జీవాత్మ పరమాత్మ జ్ఞానలాభము. కాని యీ జీవ పరమాత్మ వివేచనను బాగుగను, విస్పష్టముగను, నిశ్చయముగను గ్రహించి, తన స్వరూపమగు పరమాత్మ స్వరూప లాభమునందు ప్రీతిని సంపాదించుట కడు దుర్లభము. ఏలనన- లోక వ్యవహారమంతయు ద్వైతము. జీవునకు తన పరమార్థ వాస్తవ స్వరూపము నిర్వికార అద్వితీయ అఖండజ్ఞాన స్వరూపము. మానవునకు యీ జీవ పరమాత్మల వివేకమునకు అతి సూక్ష్మ బుద్ధియూ, శాస్త్ర ప్రమాణము నావశ్యకము. ఈ విచారము ఎంత చేసినను స్పష్టపడదు. కావున పరిపరివిధముల దీని విమర్శించి తెలిసికొనవలసియున్నది.

ఇంతవరకు మనము చేసిన విచారమునుబట్టి పరమార్థవాస్తవమున ఒక్కటియగు నిర్వికార, స్వప్రకాశ, అద్వితీయ, అఖండపరమాత్మనే కల్పిత మగు అవస్థాభేదముచే జీవ, పరమాత్మలని రెండుగా తలచుచున్నాము గాని

వస్తుభేధముచేతగాదని తెలిసికొంటిమి. ఈ విషయమునే "ఋతంపిబన్తౌ సుకృతస్యలోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే, ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి" తాను చేసినట్టి కర్మఫలముననుభవించు జీవాత్మయు, శరీరమునందలి శ్రేష్ఠమగు బుద్ధి గుహాయందు ప్రవేశించునట్టి (అనగా తెలుసుకొనబడునట్టి) పరమాత్మయు ఈ రెండాత్మలు ఎండనీడలవలె విలక్షణముననున్నవేకాని వాస్తవమునగాదని బ్రహ్మవిదులు చెప్పుచున్నారని కఠోపనిషద్వచనము తెలియజేయుచున్నది. ఇదియెట్లను నీవిమర్శ కొంచము చేయవలసియున్నది. ఏలనన బ్రహ్మవిద్యకు ఈజీవ, పరమాత్మల వివేచన లోకప్రకాశమునకు సూర్యుడెట్లు ప్రధానవిషయమో అట్లే ప్రధానమైనదగుచు జిజ్ఞాసువునకు పరమలాభము నొనగూర్చునది గావున మరియొకింత విపులముగ విచారించుదము.

జీవుడు పూర్వజన్మ వాసనాప్రేరేపితుడై సుకృత దుష్కృతకర్మముల నాచరించుచుండును. అనివార్యమగు ఈ కర్మఫలానుభవము కొరకు తిరిగి జన్మములనెత్తుచుండును. తానుకానట్టి "ఇదమ్" ఇది అని వ్యవహరింపబడు పదార్థములన్నియు ఆత్మకంటె భిన్నములైనను అవియే ఆత్మయని భ్రమపడి జీవుడు వానియందు తాదాత్మ్యభావము నొందుచున్నాడు. అనాత్మ వస్తువుల యందు ఆత్మభావమును పొందుటయే జీవత్త్వలక్షణము. బాహ్యప్రపంచము, అంతరములుగనున్న నన్నమయాది పంచకోశములనుగూడ నాత్మగాదను నిశ్చయజ్ఞానముతో వానిని త్యజించి బుద్ధిగుహాయందు స్వయంప్రకాశమై యున్నదియే ఆత్మతేజస్సని గ్రహింపగలిగిన వాడాత్మదర్శియగుచున్నాడు. ఆత్మదర్శనముచే నజ్ఞానకల్పితమగు జీవత్త్వముపోయి స్వస్వరూపము భాసించును. ఒకేవ్యక్తి అజ్ఞానకల్పితమగు జీవభావముచే కర్మఫలములను, జ్ఞానముచే స్వస్వరూపావస్థితిని ననుభవించ సమర్థుడగుచున్నాడు. సహజమగు స్వస్వరూపము దానియందజ్ఞానముచే ఆరోపితమగు జీవత్త్వముగూడ నొకే వ్యక్తియందు సంభవించుచున్నను జీవత్త్వభావముచే, స్వస్వరూపము అచ్ఛాదితమై యుండుటచే స్వస్వరూపానుభవము మాత్రము కలుగుటలేదు. కాని స్వస్వరూప మతనిని విడిచిపెట్టలేదు. నాటకశాలయందు దుర్యోధనుని పాత్రను

ధరించిన నటుని, అతని వాస్తవస్వరూపము అతనిని వీడిపోదు. పాత్రా నైపుణ్యముచే ఒకానొకప్పుడు పాత్రతాదాత్మ్యమునుబొంది స్వస్వరూపమును తాత్కాలికముగ మరచినను, వేషమును వదలి యదార్థస్థితిని పొందినప్పుడు తన పాత్రతాదాత్మ్యమును స్మరించుచు సిగ్గుపడును. ఇట్లే అనివార్యముగ నొక్కచోట గలసియున్న జీవ పరమాత్మస్వరూపములను తెలియచేయుటకుగాను ఆత్మలు రెండున్నట్లు కల్పనామాత్రముగ శాస్త్రము తెలుపుచున్నదే గాని నిజముగ ఆత్మలు రెండనిగాదు. ఆత్మ ఎల్లప్పుడును ఒక్కటియే. కాని అవస్థలుమాత్రము రెండుగలవు. సహజమగు నిర్వికార, స్వస్వరూపము సర్వదా యొక్కటియే. దానియందజ్ఞానముచే నారోపితమగు జీవాత్మావస్థ మరియొకటి. ఆరోపితమగు జీవుడును, ఆరోపణకాధారమగు నాత్మయు, వేషధారియొక్క వాస్తవస్వరూప, పాత్ర స్వరూపములవలె కలసియే యుండును. ఒకదానిని చెప్పినపుడు రెండవది స్ఫురించుచుండును. ఇట్లే జీవత్వము, జీవత్వారోపణ కధిష్ఠానమగు స్వస్వరూపముగూడ నవగత మగుచున్నది. అధిష్ఠానము అసంసారియగు నాత్మయు, ఆరోపితుడగు జీవుడు సంసారియునగుచు ఎండనీడలవలె విలక్షణులగుచున్నారు. సూర్యప్రకాశ స్వరూపము స్వభావముచేత ఆ తపము (ఎండ),మరియొక వస్తువు దాని ప్రసారముక్రింద చేరినప్పుడే ఆ వస్తుస్వరూపాను రూపమగు ఛాయ ఏర్పడును. కాని ఈ ఛాయకును ఎండకును నేమియు సంబంధములేదు. ఈ ఛాయ యనునది మధ్యనున్న యుపాధిచే కల్పితమగు చున్నది. ఛాయ కేవల మవాస్తవస్వరూపము. కాని సూర్యకాంతి మధ్యనున్న వస్తువుచేతగాని, దానిచే గలుగునట్టి నీడవలనగాని ఎంతమాత్రము సంబంధింపక దూరముననుండి ఈ రెంటికిని సాక్షిమాత్రముగనుండును. నీడలేని సూర్యప్రకాశముండును గాని, ఎండయందు ఎల్లప్పుడును నీడయుండవలెనను నియమములేదు. ఛాయలేక సూర్యాతపముండునుగాని, సూర్యాతపములేని ఛాయ సంభవము గాదు. ఆతీరుననే బుద్ధియందు ప్రతిఫలించిన ఆత్మప్రతిబింబము బుద్ధిధర్మము లనొంది వానితో నైక్యమునొందుచున్నది. ఇట్లైక్యము నొందువాదే

ఆభాసుడు, క్షీవుడు. ఆభాసమాత్రమగు నీయుపాధితాదాత్మ్యమే జీవత్వా వస్థ యనబడుచున్నది. ఇదియే కర్మఫలానుభవదశ. ఆత్మప్రకాశమనునది లేనిది జీవత్త్వము సంభవముకాదు. జీవునియొక్క బుధ్యుపాధి నిమిత్తను లగు ధర్మములు అవాస్తవములు, వేరు యని జీవుడు బాగుగ తెలిసికొనిన యడల జీవత్త్వముపోయి స్వస్వరూపము మిగులును. అట్టియెడ హృదయా కాశమున బాహ్యధర్మములచే వాస్తవ సంబంధమునొందక స్వస్వరూపమున ఆత్మ ప్రకాశించుచుండును. కాని ఇదియే బాహ్యోపాధి ధర్మములతో సంసృష్ట మైనప్పుడు జీవరూపమున భాసించుచుండును. ఇట్టి జీవుడు ఛాయవలె అనిత్యము. ఆత్మ సూర్యాతపమువలె ప్రకాశవంతము. ఇదియే జీవాత్మ పరమాత్మలకుగల వైలక్షణ్యము. దీనిని బాగుగ గ్రహించి ఆత్మ, ఉపాధులకు, ఎట్టి వాస్తవ సంబంధములేదని ముముక్షువులు నిశ్చయమునొంది వారిసాధనాభ్యాసముల నాచరించుచుండుట కర్తవ్యము.

ఇంకనూ ఈ జీవాత్మ పరమాత్మ జ్ఞానమును గురించి గీతలో పదమూడవ అధ్యాయమందు :

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యోవేత్తి తంప్రాహుః, క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి, సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞ యోర్జ్ఞానం, యత్తత్ జ్ఞానం మతంమమ॥

అనగా జీవాత్మ రూపమున నున్న యీ శరీరమునకు క్షేత్రమని పేరు. ఈ నానా శరీరములను తెలిసికొనుచు వాటితో నెట్టి సంబంధము నొందక ప్రకాశము నిచ్చుచుండెడి వాడే పరమాత్మయగు క్షేత్రజ్ఞుడు. ఇట్లు విద్వాంసులు తెలుపు చున్నారు. దేహము లన్నిటియందును ఉన్నటువంటి నన్నే అనగా తననే క్షేత్రజ్ఞునిగా తెలిసికొనుము. క్షేత్ర, క్షేత్రజ్ఞులను తెలిసికొనుటయే తనకు తాను

వాస్తవముగా తెలిసికొనుట, ఆత్మజ్ఞానము యనియు ఇదియే నన్ను తెలిసి కొనుట యను తాత్పర్యార్థమును శ్రీకృష్ణ పరమాత్మ తెలుపుచున్నారు.

మరియును క్షేత్రజ్ఞుడగు పరమాత్మ స్వరూపమును గురించి :

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా, త్పరమాత్మాయ మవ్యయః ।
శరీరస్థోఽపి కౌన్తేయ, నకరోతి నలిప్యతే ॥

శ్లో॥ యథాసర్వ గతం సౌక్ష్మ్య, దాకా శంనోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే, తథాఽఽత్మానో పలిప్యతే ॥

శ్లో॥ యథా ప్రకాశయత్యేకః, కృత్స్నం లోకమిమం రవిః ।
క్షేత్రంక్షేత్రీ తథాకృత్స్నం, ప్రకాశయతి భారత ॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ, మన్తరంజ్ఞాన చక్షుషా ।
భూత ప్రకృతి మోక్షంచ, యేవిదుర్యాన్తితే పరమ్ ॥

అనగా అర్జునా! పరమాత్మ అనాది యగుట వలనను నిర్గుణమగుట వలనను, అవ్యయమైనది. అనగా నాశములేనిది. కావున దేహమందున్నను నదియాచ రించునట్టి క్రియాదులతోడ నెట్టిసంబంధమును నొందక నేమియుచేయదు. జీవుని కర్మ ఫలములతో యెట్టి సంబంధమును పొందుటలేదు. సర్వ వ్యాపకమగు నాకాశము సూక్ష్మ భావము వలన నెట్లు సంబంధము, మార్పులను బొందుట లేదో అట్లే యీ పరమాత్మ సర్వ దేహములయందున్ననూ దేహముల యందలి గుణ దోషముల సంబంధము లెంతమాత్రము నంటకయే యుండును. ఒక్క సూర్యుడు ప్రపంచమునంతయు ఎట్లు ప్రకాశింపజేయుచున్నాడో యట్లే పరమాత్మయగు క్షేత్రజ్ఞుడు, జీవోపాధులగు క్షేత్రముల నన్నింటిని (అనగా శరీరములను) ప్రకాశింపజేయుచుండును. ఈ రీతిగ జీవ, పరమాత్మ రూప ముల నున్న క్షేత్ర క్షేత్రజ్ఞుల బేధమును జ్ఞాన దృష్టిచే నెవరు తెలిసికొందురో, ప్రకృతినుండి మోక్షమున కుపాయమగు ధ్యానాదికమును నెవరు బాగుగ తెలిసి

కొందురో, వారు మోక్షమును బొందుదురని శ్రీకృష్ణ పరమాత్మ తెలుపుచున్నారు. ఇవి సాక్షద్భగవద్వచనములు. పరమార్థమున జీవాత్మ పరమాత్మలొక్కటియేగాని భిన్న భిన్నములుకావు. కావున క్షేత్ర, క్షేత్రజ్ఞ రూపములనున్న జీవాత్మ, పరమాత్మల యథార్థజ్ఞానము స్వస్వరూపా ఖండానంద రూపమగునట్టి మోక్ష సాధనమని జ్ఞానాభ్యాసకులగు ముముక్షువులు గ్రహింతురుగాక.

ఇంత వ్రాసినను యీ జీవాత్మ రూపముననున్న ఆత్మ యేరీతిగా ఆనందస్వరూపుడని, సంశయముండవచ్చును. దానినిట్లు గ్రహించవలెను. పరమ ప్రేమకు విషయమే ఆనందమనబడును. అట్టి పరమ ప్రేమ అందరకును వారి ఆత్మయందే కలుగుచున్నదిగాని యితరములందు కలుగుట లేదు. పరమ ప్రేమ యనగా అన్నిటికంటెను అధికముగా ప్రేమింపబడునట్టి విషయము. బాగుగ విచారించి సూక్ష్మ బుద్ధితోడ చూచిన అట్టి ప్రేమ సర్వము కంటెను ఆత్మరూపుడగు తనయందే కలుగుచున్నది కాని యితరములయందు కలుగుటలేదు. భార్యా పుత్ర విత్తాదులను తన అనగా ఆత్మసుఖము (అనగా ఆనందము) కొరకే కోరుచుండును గాని వేరుకాదు. కావున జీవాత్మ స్వరూపముననున్న తానే పరమార్థమున ఆనంద స్వరూపుడు. ప్రతి జీవుడు కోరునదియును నిదియే గనుక తనను తాను వాస్తవముగ, గ్రహించగలిగిన, తన స్వరూపము ఆనంద స్వరూపమే. ఇదియే మోక్షము.

మానవునకు మోక్షమనునది జీవపరమాత్మైక్య జ్ఞానమువలననేగలుగునుగాని మరియొకవిధమునగలుగదు. అనగా యీ నానాజీవాత్మలు, పరమాత్మయనునది ఒక్కటియేగాని భిన్నభిన్నములుగావని తెలిసికొని స్వానుభవమునొందుట. కావున యిది యెట్లను జ్ఞానదార్ఢ్యముకొరకు మరికొంత విచారమావశ్యకము. పరమార్థమున జీవాత్మ పరమాత్మలొక్కటియేగాని భిన్న భిన్నములుగావు. ఇదియే మానవుడు తెలిసికొని స్వానుభవము నొందవలసిన

పరమ రహస్యము. ఈ పరమ రహస్యమేమియనిన, సర్వదా యొక్కటిగా యున్న అద్వితీయ అఖండ పరమాత్మయే మాయాప్రభావమువలన జీవత్వము నొందినవానివలె సృష్టియందు అనంత నానాజీవులుగ భాసించుచున్నాడు. ఇది మాయాకార్యము, అవాస్తవమైనను సత్యమైనదానివలె లోకానుభవము గలుగుచున్నది గావున జీవత్వమొందిన జీవుడు అనుభవమునుబట్టి యిప్పుడు భ్రాంతుడై యున్నాడు. ఎట్లనిన ఒక సార్వభౌముడు ఉన్మత్తుడై తన సామ్రాజ్యమును మరచి అన్యరాజ్యమందు భిక్షమెత్తుచు, అందుగూడ నేరము చేయుటచే బంధింపబడియున్నట్లు, జీవుడు పరమార్ధ వాస్తవమున తన ఆత్మ స్వరూపమగు నిత్యనిరతిశయ సుఖసామ్రాజ్యమును, అనాది అజ్ఞానావృతుడై మరచి యీ సృష్టి (ప్రపంచము)యందు జీవత్వమునొంది తన సుఖముకొరకు విషయముల యాచించుచు ప్రారబ్ధముచే బంధింపబడియున్నాడు. ఏ సార్వభౌముడైనను తన ఉన్మాదము తగ్గి అనగా నివర్తింపజేసుకొని తనను తాను తెలిసికొనినయడల తన సార్వభౌమత్వమునకు లోపముండదుగదా! అయినను కొన్ని కారణములచే, భౌతికమగు యీ సామ్రాజ్యము పరిచ్ఛిన్నముగనుక లోపముగలిగిన కలుగవచ్చును. కాని ఆత్మసామ్రాజ్యము అపరిచ్ఛిన్నము, సర్వాధిష్ఠాన నిత్యనిరతిశయసుఖము, కావున ఆత్మజ్ఞానముచే ప్రారబ్ధమును నిశ్శేషముగ జేసుకొని తమ స్వస్వరూపానుభవమునొందినయెడల సర్వ జీవులకును ఏకాధిష్ఠానమగు యీ ఆత్మసామ్రాజ్యము అపరిచ్ఛిన్న అద్వితీయ అఖండము గనుక దానినందరును యొకేవిధమున పొందవచ్చును. ఎందరైనను యేకకాలమందు అనుభవింపగలుగు పరమార్ధ వస్తువిదియొక్కటియే. ఈ ఆత్మ సామ్రాజ్యమనునది అపరిచ్ఛిన్నముగనుక తరుగదు. అవినాశి గనుక నశించదు. కేవలసుఖముగనుక దుఃఖరహితము. చట్టవిరుద్ధముగ నేరము చేసినవారలకు కారాగృహములెట్లు గల్పింపబడి యేర్పడియున్నవో, యట్లే జీవులకు యీ ప్రపంచమని స్పష్టముగా గ్రహించవలయును. చట్టవిరుద్ధములగు నేరములను బట్టి మానవుడు తాత్కాలికముగ కారాగృహమందు సాధారణ, కఠిన శిక్షలెట్లు అనుభవించుచుండునో యట్లే జీవప్రారబ్ధానుభవమునకు ఈ ప్రపంచ మనేక

విధములుగ యనేకరీతులలో సృష్టింపబడినదేగాన యే జీవుడును స్థిరముగ ఈ సృష్టియందుండుటకు వీలులేదు. జీవుడు తాను చేసిన సుఖదుఃఖ ప్రారబ్ధఫలము ననుభవింపగనే ఈ ప్రపంచమనునట్టి పెద్ద కారాగృహ మును విడచి వెళ్ళవలయును. కాని ఈ ప్రారబ్ధానుభవము శిక్షాకాలమున తప్పదు.

ఇచటనే వివేకుడగు జీవుడు గ్రహించవలసిన రహస్యమొకటి కలదు. అది ఏది యనిన అలవాటుపడిన క్రూరుడు, చోరుడు కారాగృహమందు శిక్ష యనుభవించుచున్నను తన మనసును సదా దుర్మార్గము మీదను, దొంగతనము మీదనే యోంచి యెప్పుడు విడుదల యైనను తిరిగి నేరముచేసి కారాగృహము నెట్లు ప్రవేశించి, మరల మరల శిక్ష నెట్లనుభవించుచుండునో యట్లే ఈ ప్రపంచమున జీవుడు తన ప్రారబ్ధ ఫలమను శిక్ష ననుభవించుచున్నను, తన అనాది అజ్ఞానముచే దీని కలవాటుపడి యిదియే తనకు నిత్యము, సత్యమని నమ్మి కోరికలజేయుచు, వాటి ఫలము ననుభవించుటకుగాను తిరిగి తిరిగి ఉచ్ఛ, నీచజన్మలెత్తుచు, సాధారణ, కఠిన శిక్ష ననుభవించుచుండును. సాధారణ జీవుడు-అలవాటుపడిన చోరుని వంటివాడు. అన్యభోగ ధనాదుల యందధర్మముగ నాసక్తుడై యనుభవించుచు, సదా శిక్షల చెందుచుండును. ఇదియే జీవాజ్ఞానము. సృష్టియందు యుత్కృష్ట జీవులగు మానవులకు గూడ తెలియని రహస్యమిది. ఈ రహస్యమునే శ్రుతిమాత తన సంతానమగు జీవులకు, అందు మానవునకు నీవు వాస్తవమున దుఃఖిత్వ, జడత్వ, పరిచ్ఛిన్నత్వములు గల వాడవుగావు. ఈ స్వశరీర, సర్వ దృశ్యమంతయు నీ ప్రారబ్ధము, గూడ నీవాచరించిన కామ కర్మఫల మనుభవించుటకుగాను కల్పితముగ యేర్పడినవే గాని యివి నీకు వాస్తవములుగావు, నీ వాస్తవ స్వరూపము సచ్చిదానంద, సత్యజ్ఞానానంత స్వరూపము. కావున దానిని నీ నిత్యానిత్య వివేకాదులను సాధనముతోడ గుర్తించి, శ్రవణ, మనన, నిదిధ్యాసనములను, సాక్షాత్సాధన ములచే పొందుము. వేరు మార్గములేదని మానవునకు బోధించుచున్నది.

శ్రుతిమాత నూరు తల్లుల సమానము గనుక వివేకులు ఈ బోధ నుపేక్షింప తగదు. కావున యుపేక్షనొందక ఆ బోధను సత్కర్మానుష్ఠానముచే గుర్వీశ్వరానుగ్రహమును సంపాదించి శాస్త్రీయ సాధనముల నభ్యసించి మానవుడు తన పరమార్థ రూపమగు స్వస్వరూపమును నభ్యసించుచుండవలయును. అప్పుడు ఈ దృశ్యానుభవములు, తన సుఖ దుఃఖ ప్రారబ్ధానుభవములును, కల్పితములనియు, తనకివి వాస్తవము కావనియు, తెలిసికొని కాల పరిపాకమున తన స్వరూపమును గుర్తించగలుగును. జీవుడిట్లిప్పుడు తన యధార్థ స్వరూపమును తెలిసికొన్నను తన అనాది అజ్ఞానము వలన ఈ ప్రపంచమున నలవాటు పడియుండుటచే, ప్రపంచమును విడచి తన వాస్తవ స్వరూపానుభవము గలుగదు. ప్రపంచము వాస్తవమని దీనియందు సక్తతాభిమానములు బాధించుచునే యుండును. కావున యిట్టి స్థితినుంచి విముక్తుడగుటకు ఆత్మజ్ఞానాభ్యాసకుడగు జీవుడు తన ప్రారబ్ధానుభవములు, అనిత్యములు, అవాస్తవములని తెలిసికొని తనకీప్రారబ్ధము విధించబడినశిక్ష వంటిదని గ్రహించి తన ప్రారబ్ధము నిశ్శేషమగు వరకు, ప్రీతినిశ్చయములతోడ తన స్వస్వరూపానుసంధానాదుల సతతము నభ్యసించుచుండిన యడల ప్రారబ్ధాంతమున పరమముక్తి నొందును.

ఈ ఆత్మానుసంధాన మెట్లుండవలయుననిన-నేను యీ స్థూల, సూక్ష్మరూప దేహమున యున్న శరీరమును గాదు. నాకు కర్తృత్వ భోక్తృత్వములతోడ వాస్తవ సంబంధములేదు. అయినను కల్పితమైన నా ప్రారబ్ధక్షయము కొరకు వ్యవహరించుచున్నాడను. ఈ స్వశరీర సర్వ దృశ్యమందునను నేనేమియుగాదు. ఇవి యన్నియు కల్పిత మాత్రములు, అనగా దీర్ఘ స్వప్న దృశ్యమువలె నాయందే గలుగుచు కాలక్రమమున నశించుచున్నవి, గాన వాస్తవము, నిత్యముగాదు.

నా వాస్తవ స్వరూపము :

"అహం," నేను శివః, శాంతః, సాక్షీ, ప్రత్యగాత్మా, పరమాత్మైవ. నేను మూర్తామూర్త స్వశరీర సర్వోపాధి వినిర్ముక్త, సజాతీయ విజాతీయ

స్వగత భేదరహిత, జగదుత్పత్తి స్థితిలయ వివర్త కారణ, స్వప్రకాశ, నిత్య నిర్వికార, సర్వాధిష్ఠాన, అఖండ పరిపూర్ణ చిద్ఘనానంద స్వరూపుడను. కేవల చిత్స్వరూపుడను. పరిపూర్ణుడను, చిద్ఘనానంద స్వరూపుడను. నిరవయవుడను గనుక నిష్క్రియుడను. కర్తృత్వ భోక్తృత్వములు వాస్తవమున నాకులేవు. ఇవి యన్నియు దేహ ధర్మములు. దేహమనిత్యము, నేను నిత్యుడను. ప్రారబ్ధము గూడ దేహముదేగాని నాదికాదు. అయినను ఈ కర్తృత్వాదులు నా ప్రారబ్ధమునుబట్టి దేహాధ్యాస వలన గలుగుచున్నవి గనుక దేహ ధర్మము లన్నియు నావను భ్రాంతి గలుగుచున్నది. కాని యిది వాస్తవముగాదు. వాస్తవమున నేను సత్య జ్ఞానానంద స్వరూపుడను, నేను పరమాత్మ స్వరూపుడను. నేనే స్వప్రకాశ సర్వాధిష్ఠానము. దేనియందు ఈ జగదుత్పత్తి స్థితి లయములు గలుగుచున్నవో, యేది స్వప్రకాశ సర్వాధిష్ఠానమో, దేని ప్రకాశముచే సూర్యచంద్రులును, ఈ స్వశరీర సర్వ దృశ్యమును ప్రకాశింపజేయబడుచున్నదో, యేది లేనిచో ఇవి యన్నియు ప్రకాశింపబడవో, యేది అఖండ ప్రజ్ఞానమై, సర్వోపాధి వినిర్ముక్తమై, సర్వ జీవుల హృదయ పుండరీకము లందున ప్రకాశించుచు అహముక్తితోడ తెలిసికొనబడుచున్నదో, యేది లేనిది ఈ అహముక్తి కలుగుటకు వీలుగాదో, అట్టి అద్వితీయ అఖండ పరిపూర్ణ జ్ఞాన స్వరూపుడను నేను. సర్వము నాయందే అధ్యస్తముగ భాసించుచున్నది గాని వాస్తవమున ఆత్మేతరమేదియును లేదు, అను యిట్టి నిశ్చయము నొంది ప్రారబ్ధాంతము వరకును, ప్రారబ్ధాను సరణమున యెట్టి సుఖ దుఃఖ భోగము లను భవించుచున్నను, వానియందు సక్తతాభి మానములకులోనుగాక, సర్వదా ఆత్మధ్యానాదులు గావించుటయే ఆత్మానంద ప్రకాశమునకు సాక్షాత్సాధనమని అభ్యాసకులు గ్రహింతురు గాక.

మానవునకు ఈ జీవాత్మ పరమాత్మ వివేకమువలన గలుగవలసిన లాభము జీవబ్రహ్మైక్యజ్ఞానము. ఇదియే బ్రహ్మసాక్షాత్కారము. దీనినిగురించి యిల్లెంతగా తెలిపినను బ్రహ్మజ్ఞానము ఆత్మవిచార, మనన, ధ్యానాభ్యాసాదులు

లేనిది యెట్టివారికైనను కలుగుట కష్టము. బ్రహ్మాభ్యాసలాభమునుగురించి శ్రీ విద్యారణ్యస్వామి పంచదశియందు తెలిపియున్నారు. కొన్ని శ్లోకముల తాత్పర్యార్థ సహితముగ, జిజ్ఞాసువులనుద్దేశించి, నిచట యుదాహరించు చున్నాడను.

శ్లో॥ బ్రహ్మసాక్షాత్కృతి స్త్వేవం, విచారేణవినానృణాం ।
ఆప్తోపదేశమాత్రేణన సంభవతి కుత్రచిత్॥

తాను శ్రవణమననములఁజేయనిది గురువులు చెప్పినంతమాత్రమున బ్రహ్మ సాక్షాత్కారము గలుగదు గాన బ్రహ్మవిచార మావశ్యకముగఁజేయదగినది.

శ్లో॥ పరోక్షజ్ఞాన మశ్రద్ధా ప్రతిబధ్నాతినేతరత్ ।
అవిచారోఽపరోక్షస్య జ్ఞానస్య ప్రతిబంధకః ॥

అవిశ్వాసము పరోక్షజ్ఞానమును జెఱుచును. అవిచారము అపరోక్షజ్ఞానముం గలుగనీయదు.

శ్లో॥ విచార్యాప్యా పరోక్ష్యేణ బ్రహ్మాత్మానం నవేత్తిచేత్ ।
ఆపరోక్ష్యావసానత్వా ద్భూయోభూయో విచారయేత్ ॥

ఒకమారు విచారించినయెడల బ్రహ్మసాక్షాత్కారము గలుగనిచో విసుగుజెందక సాక్షాత్కారము గలుగువరకు పలుమారు విచారము చేయవలయును.

శ్లో॥ విచారయన్నామరణం నైవాత్మానం లభేతచేత్ ।
జన్మాంతరే లభేతైవ ప్రతిబంధక్షయేసతి ॥

యావజ్జీవము విచారించినను బ్రహ్మసాక్షాత్కారము గలుగదేని నిరాశ జెందగూడదు. ప్రతిబంధము తొలఁగఁగానే జన్మాంతరమునందు బ్రహ్మ సాక్షాత్కారము శాస్త్రప్రామాణ్యముచేత తప్పక కలుగును.

శ్లో॥ కాలేన పరిచ్యంతే కృషిగర్భాదయో యథా ।
తద్వదాత్మవిచారోఽపి శనైః కాలేన పచ్యతే ॥

కృషిసల్పువానికి (వ్యవసాయమునకు) గింజల నాటిననాఁడే పంట యింటికి రానేరదు. గర్భము పదిమాసములు నిండినఁగాని ప్రసవించదు. అట్లులే శ్రవణము చిరకాలము చేసినంగాని ఫలింపదు. వెంటనే ఫలింపకపోయెనని చింతింపవలదు.

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతేహ్యవశోఽపిసన్ ।
అనేక జన్మసంసిద్ధస్తతోయాతి పరాంగతిమ్ ॥

తన యత్నము లేకయే పూర్వాభ్యాసవశమున తత్త్వజ్ఞానమువైపు ఆకర్షింపబడును. ఇట్టి యనేక జన్మసంసిద్ధుఁడు కైవల్యమును బొందును. ఇట్లు గీతాశాస్త్రము చెప్పుచున్నది. కనుక భావిప్రతిబంధ నివృత్తియందు కాలనియమము లేదని తెలియవలెను.

శ్లో॥ విచారాజ్జాయతేబోధోఽనిచ్ఛాయం ననివర్తయేత్ ।
స్వోత్పత్తి మాత్రాత్సంసారే దహత్యఖిల సత్యతామ్ ॥

వస్తు తత్త్వవిచారము వలన బోధ (జ్ఞానము) కలుగుచున్నది. ఆ బోధ అక్కరలేదనుకొను ఇచ్ఛకలిగినను, కలిగిన జ్ఞానమును ఆ యిచ్ఛ నివారింపఁ జేయఁజాలదు. అట్టిబోధ కలిగినతోడనే ప్రపంచము అసత్యమనితోచును.

శ్లో॥ నిశ్చిత్య సకృదాత్మానం యదాపేక్ష తదైవతమ్ ।
వక్తుం మంతుం తథాధ్యాతుం శక్నోత్యే వహితత్త్వవిత్ ॥

బ్రహ్మ సాక్షాత్కారముగలవాఁడు తనకిచ్ఛవచ్చినపుడెల్ల బ్రహ్మమునుగూర్చి వచించును, మననముచేయును, ధ్యానించును. దీనికొఱకెప్పుడును నితర వ్యాపారముల మాననవసరములేదు.

శ్లో॥ మూర్తిధ్యానస్య మంత్రాదేరపి కారణతాయది ।
అస్తునామ తథాప్యత్ర ప్రత్యాసత్తిర్విశిష్యతే ॥

సగుణోపాసనయును మంత్ర జపంబును బ్రహ్మసాక్షాత్కారమునకు కారణంబులేఐనను బ్రహ్మసాక్షాత్కారమునకు నిర్గుణోపాసన యెంత సన్నిహితమో, అవి అంత సన్నిహితములుగావు.

శ్లో॥ నిర్గుణోపాసనం పక్వం సమాధిస్స్యాచ్ఛనైస్తతః ।
యస్సమాధిర్నిరోధాఖ్యస్సోఽనాయాసేన లభ్యతే ॥

నిర్గుణోపాసన పరిపక్వమై, సవికల్పసమాధియగును. అనంతరము నిర్వికల్ప సమాధి యనాయాసముగ లభించును.

శ్లో॥ నిరోధలాభేపుంసోఽంతరసంగం వస్తుశిష్యతే ।
పునఃపునర్వాసితేఽస్మిన్ వాక్యాజ్జాయేత తత్త్వధీః ॥

నిర్వికల్పసమాధి లాభముగలుగుచుండగా పురుషునియొక్క స్వరూపమందు సంగరహితమగు ఆత్మవస్తువు శేషించును. ఈ యసంగాత్మవస్తువును మాటిమాటికి భావించుచుండగా, తత్త్వమస్యాది వాక్యములవలన 'అహంబ్రహ్మాస్మి' యనెడి పరతత్త్వజ్ఞానము గలుగును.

శ్లో॥ నిర్వికారాసంగ నిత్యస్వప్రకాశైకత్వ పూర్ణతాః ।
బుద్ధౌఝుడితి శాస్త్రోక్తా ఆరోహంత్య వివాదతః ॥

బ్రహ్మసాక్షాత్కారము గలుగఁగనే వేదాంతశాస్త్రమందుఁజెప్పఁబడిన ఆత్మ ధర్మములగు నిర్వికారత్వము, అసంగత్వము, నిత్యత్వము, స్వప్రకాశత్వము, అద్వితీయత్వము పరిపూర్ణత్వము ననునవి బుద్ధియందు నిర్వివాదముగను శీఘ్రముగను గలుగుచున్నవి. ఇట్లెవ్వనికి స్వసాక్షిత్వము స్ఫురించునో వాఁడే బ్రహ్మవిదుఁడు.

శ్లో॥ సాక్షాత్కర్తు మశక్తోఽపి చింతయేన్మామ శంకితః ।
కాలేనానుభవారూఢో భవేదా ఫలితో్ధ్రువమ్ ॥

బ్రహ్మసాక్షాత్కారము గలుగనివాఁడు నిర్గుణ బ్రహ్మధ్యానము చేసెనేని, యను భవా రూఢమగుచు నా యర్ధము వానికి ఫలించును.

శ్లో॥ యథాగాధ నిధేర్లబ్ధౌ నోపాయః ఖననంవినా ।
మల్లాభేఽపి తథాస్వాత్మ చింతాం ముక్త్వాన చాపరః ॥

గనిలోని రత్నములు దొరకవలెననిన భూమిని త్రవ్వక తీరదు. అట్లే ఆత్మ సాక్షాత్కారము గావలెననిన నిర్గుణోపాసనముకంటె వేఱుపాయములేదు.

శ్లో॥ అనుభూతే రభావేఽపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్ ।
అప్యసత్ప్రాప్యతే ధ్యానాన్నిత్యాప్తం బ్రహ్మకింపునః ॥

బ్రహ్మానుభవము లేకపోయినను నేనే బ్రహ్మమునని ధ్యానింపవలెను. ధ్యానము వలన లేనిది సయితము లభించును. స్వస్వరూపమగు బ్రహ్మము లభించునని వేఱెచెప్పనేల? లభించియే తీరునని భావము.

శ్లో॥ అనాత్మబుద్ధి శైథిల్యం ఫలం ధ్యానాద్దినేదినే ।
పశ్యన్నపి నచేద్ధ్యాయేత్కోఽపరోఽస్మాత్పశుర్వద ॥

ధ్యానము వలన దినములు గడచిన కొలది దేహేంద్రియాదులు నేనే యనెడి భ్రమ నశించును. ఇట్టి లాభము గనుపడుచున్నను, ధ్యానింపనివాఁడే నర పశువని తెలియనగును.

ఆత్మాభ్యాసమును గురించి యింత స్పష్టముగా తెలుపుచున్న యీ శ్లోకముల బట్టియు, అనేక శ్రుతి వచనముల బట్టియు, వివేకులందరకును దీని యావశ్యకత కనబడుచున్నది. మానవునకు పరమ లాభము ఈ జీవాత్మ పరమాత్మ వివేచన బాగుగ చేసి, జీవాత్మ పరమాత్మ లొక్కటియే యని తెలిసికొని దాని స్వానుభవము నొందుట వలనగాని కలుగదు. కావున ముముక్షువులు ఈ జీవాత్మ పరమాత్మ వివేచనను బాగుగ గ్రహించి, వారి వారి సామర్థ్యాను సారమున పరమాత్మాను సంధానాదుల నాచరించుచుందురుగాక.

——0——

# ఆత్మజ్ఞానమే మానవుని పరమలక్ష్యము

ఈ ప్రపంచమందు ప్రతిజీవియు కోరునది లాభము. ఈ లాభము ఆత్మలాభమనియు, అనాత్మలాభమనియు, రెండువిధములనున్నది. ఇందు జీవుడు ప్రపంచమువలన పొందుచున్న భార్యాపుత్ర ధనవస్తుకనకవాహన గృహ క్షేత్రాది లాభములన్నియు జీవకల్పిత అనాత్మసంబంధములు. ఇవి అనిత్యములై ఆయా జన్మాంతమువరకే సుఖదుఃఖానుభవములనిచ్చుచు యివియన్నియు తనకు నిత్యమైనవానివలె జీవుని వ్యామోహపరచుచు జనన మరణాదిప్రవాహ సంసారచక్రమున చర్వితచర్వణముగ భ్రమణము జేయించు చుండును. ఇందు నిత్యమైనదియు సత్యమైనదియు నేదియునులేదు. కాని ఏజన్మకాజన్మయందు తన సంసారసంపదలన్నియు తనకు నిత్యము, సత్యమని భ్రమించుచుండును. ఇదియే అనాది అజ్ఞానము. అజ్ఞానమువలన కలుగునది యెల్లప్పుడునూ మానవునకు దుఃఖమేగాని సుఖముగలుగదుగదా! ఇది అందరకునూ తెలిసినవిషయమే. మానవునకు యీ స్వశరీరాది ప్రపంచములే కల్పితమగునప్పుడు వాటివల్ల కలుగు సుఖమెట్లు శాశ్వతముకాగలదు. కాని సర్వమానవులునూ కోరునది శాశ్వతసుఖమే. అశాశ్వత సుఖముకన్న అందరకునూ శాశ్వతసుఖమందే యెక్కువప్రీతియను మాటనిర్వవాదము. మానవునకిట్టి శాశ్వతసుఖము అనగా నిత్యనిరతిశయసుఖము ఒక్క ఆత్మజ్ఞానము వలననే గలుగును కాని యితరమగు అనాత్మజ్ఞానమువలన కలుగదని, తత్త్వజ్ఞులును, సర్వశాస్త్రములును తెలుపుచున్నవి. ఏలనన మానవునకు శరీర ప్రపంచానుభవమంతయు సత్యానృతములు కలసి కలుగుచున్నదిగాని, కేవల అనృతమగు జడపదార్థమువలన కలుగుటలేదు. కలుగుటకు వీలులేదు. మానవునకు స్వశరీరాది సర్వ ప్రపంచానుభవములు తనవలననే కలుగుచున్నవిగాని, తాను లేనికాలమందు యెట్టి అనుభవమును కలుగుటలేదు. తను యున్నంత

కాలమే యీ జగత్తు భాసించుచున్నది. ఇట్లున్న స్వశరీరజగత్తును తెలిసికొను టకు జ్ఞానమావశ్యకముగదా! కావున తనలో జ్ఞానమున్నదనిగాని, తాను జ్ఞాన స్వరూపుడనిగాని, నిశ్చయమగుచున్నది. ఈ జ్ఞానమెట్టిదని విమర్శించిన యెడల, ఇది అహం—నేను, ఇదం-ప్రపంచము అని రెండువిధముల ప్రతీతి కలుగుచున్నది. అనగా స్ఫురించుచున్నది. ఇందు ఇదం, అను యీ దేహ ప్రపంచములురెండునూ యే జీవునకునూ నిత్యముగానుండుటలేదనుమాట అందరి అనుభవములోనున్నదే. కాని అహం అను స్ఫురణమాత్రము మాన వునకు అవస్థాత్రయ, కాలత్రయములయందునను నిత్యముగా కనబడుచున్నది. ఎట్లన ఏదోయొకవిధమున అవస్థాత్రయమగు జాగ్రత్స్వప్నసుషుప్తులయందు మానవునకు తను వున్నట్లు స్ఫురణ ప్రతీతి కలుగుచునేయున్నదిగాని, యీ అవస్థాత్రయమందునను, నేను లేను అని, యే జీవియు చెప్పజాలడు. ఇట్లే కాలత్రయమగు తన పూర్వజన్మ, ప్రస్తుతజన్మ, భవిష్యజ్జన్మలందునను, తాను యున్నట్లు తనకు యీజన్మానుభవములవల్ల స్పష్టమగును. ఈజన్మయందు తనకు కలుగుచున్న పుణ్య పాపఫలభోగములు క్రిందటిజన్మను సూచించును. తానిప్పుడు చేయు పుణ్యపాపకర్మములవల్ల తనకుత్తర జన్మలో భోగములు కలుగుననియు, అనగాతాను ఉత్తరజన్మలో యుందుననియును తెలుపును. ఈ విధమున ప్రతి మానవుడును తాను అహం నేను అని యిప్పుడను భవించుచున్న ప్రతీతిని, నిత్యముగా స్మరించుచున్నాడు. కావున యీ అహం నేను అను ప్రతీతి ప్రతి జీవికిని నిత్యమగుచు, నా దేహము నా ప్రాణము నా మనసు నా భార్యాపుత్రాదులుయను నీ ప్రపంచమంతయు అనిత్యమగు చున్నది. ఏలనన యివియన్నియు ఒక అవస్థలోనున్న అనుభవములు మరియొక అవస్థయందు కలుగక, ఏజన్మకు ఆ జన్మాంతమందుననే నశించుచున్నవి. కాని తాను మాత్రము నిత్యముగా యుండుచున్నాడు. ఏ జీవి యును తాను లేనికాలము తను తెలిసికొనుటలేదు. కావున అహం నేను, అను నట్టి తాను నిత్యుడు. ఇప్పుడు ఈ నిత్యుడగునట్టి అహంయొక్క పరమార్థ స్వరూపము నిత్యము, జ్ఞానము అని తెలిసినది. ఇంకనూ యీయనయే కేవల

ఆనందస్వరూపుడు. ఎట్లన ఎవరికినీ సుఖస్వరూపముగానిదానియందు ప్రేమ, ఆనందము కలుగవు. ప్రపంచములో సర్వపదార్థములకన్నను ప్రతి జీవికి యునూ అహం నేను అను తన ప్రతీతియందే పరమప్రేమగలుగుచు, తనకు అట్లు ప్రేమాస్పదమగు వస్తువుయందు ఆనందము కలుగుచున్నది. కాని అహంయను తనయందుమాత్రము పరమ ప్రేమానందములు కలుగుచున్నవి. తన సుఖము, ఆనందముకొరకు చిట్టచివరకు తనదనుకొనుదానినంతయునే గాక తానని భ్రాంతిచే నను కొనుచున్న యీ దేహావయవములను, దేహమును గూడ త్యజించుచున్నాడు. ఇది అంతయూ అహం అను తన సుఖముకొరకే గాని అన్యులకొరకుగాదు. ఈ సత్యజ్ఞానానం దస్వరూపుడే ఆత్మ, బ్రహ్మ అను పర్యాయపదములచే తెలియబడుచున్నాడు. ఈ బ్రహ్మ అద్వితీయ అఖండపరిపూర్ణస్వరూపుడని "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనివేదమాత తెలుపుచు, యీ నేను అహం అను కొను జీవుడు బ్రహ్మకంటె వేరుగాదని "జీవో బ్రహ్మైవనాపరః" అనిన్ని "తత్త్వమసి" ఆ బ్రహ్మ నీవే అనిగూడ బోధించుచున్నది. శ్రుతిమాత జీవునియందు పరమకారుణ్యముతో నింతగా బోధించుచున్నను, జీవుడు అనాదికాలమునుండి మాయావివశుడై తన అనాది అవిద్యా కామకర్మలచే పరిచ్ఛిన్న భ్రాంతుడగుచు నానాఉపాధితాదాత్మ్యాధ్యాసముతో సంసార దుఃఖము నొందుచున్నాడు. కావున వాస్తవమాలోచించిన తనకు స్వశరీరాది సంసార ముతో వాస్తవసంబంధమెంతమాత్రమును లేదు. కాని ఇప్పుడు ప్రాప్తమైన యీ ఉపాధి జీవుని ప్రారబ్ధ సుఖ దుఃఖ భోగానుభవమునకుగాను కల్పితమై యేర్పడినట్టిదిగావునను, యీ ప్రారబ్ధఫలము "నాభుక్తంక్షీయతేకర్మ" అనుటచే అనుభవమువల్లగాని నశింపదుగనుకను, జీవునకు తన ప్రారబ్ధమును నశింప జేసికొనుటకుగాను యీఉపాధి ప్రపంచములు రెండునుఆవశ్యకములగుచున్నవి. వాస్తవమున వివేకియగు జీవికి యీ ఉపాధిప్రపంచముల పరమప్రయోజనమిం తియే. కాని మానవుడు తన అవివేకముచే వీనిని తన కేవల ప్రారబ్ధానుభవక్షయ ముకేగాక, తిరిగి ఈ జన్మయందుగూడ పూర్వజన్మములయందువలెనే యీ

స్వశరీరాది జగత్తులను తనకు సత్యము నిత్యము అని నమ్మి, వీనియందు వ్యామోహితుడై తన ప్రారబ్ధానుభవముల చేయుచుండుటచే యిప్పుడుప్రారబ్ధానుభవములతోబాటు తనకు భావికర్మఫల ప్రతిబంధమును కలుగజేసుకొనుచున్నాడు. ఇదియే జీవులకు కలుగుచున్న పరమ అవివేకము. దీనివల్ల సంసార దుఃఖప్రవాహము కలుగుచున్నది. ఇట్టి సంసారచక్రమునుండి, విముక్తుడగుటకే ఆత్మజ్ఞాన మావశ్యకము. ఆత్మజ్ఞానమనగా మానవుడు తన పరమార్థ వాస్తవ స్వరూపమగు అఖండ సచ్చిదానంద స్వరూపమును గుర్తించి తనకు ఈ కర్తృత్వ భోక్తృత్వాదులతో వాస్తవ సంబంధము లేదనియు, అయినను తన ప్రారబ్ధానుభవముకుగాను కల్పితసంబంధము ప్రారబ్ధమున్నంత కాలము సాధారణముగ తప్పదనియు, నిశ్చయమునొంది నిరభిమానముతోడ తన ప్రారబ్ధము ననుభవించుచుండినయడల, యిట్టి కర్మానుభవము తనకు భావిప్రతిబంధము కలుగజేయదు. అట్టితరి కాలక్రమమున తానుమాత్రము నిర్విశేషముగ శేషించి అద్వితీయ అఖండపరిపూర్ణ చైతన్యస్వరూపుడగును. ఇదియే మోక్షము.

కాని ముముక్షువు తన ప్రారబ్ధానుభవమును నిర్లిప్తుడై చేయుటకు స్వశరీరాది జగత్సత్యత్వ భ్రాంతివలన తనకు అన్నియు, సత్యముగాను, నిత్యముగాను తోచి రాగద్వేషములతో సక్తతాభిమానముల నొందుచుండును. కావున ముముక్షువు శాస్త్రమువల్ల వినిన జగన్మిథ్యాత్వమును, తన పరమార్థ వాస్తవస్వరూపమును సర్వదా తన అనుభవములను,లోకానుభవములను గురించి సయుక్తికముగ విచారముచేయుచుండుట యావశ్యకము. వివేకియగువానికి యెంతవిచారించినను, నిత్యముగానుండునది ఒక్కటిగూడ నీప్రపంచమున గానరాదు. సుఖమన్ననో – విషయములవల్ల కలుగు సుఖములు, సుఖాభాసములు - అనిత్యములగుచు పర్యవసానమున దుఃఖమునే యిచ్చును. జగన్మిథ్యాత్వమును బాగుగ ముముక్షువు, తన నిత్యానిత్య వివేకాదులచే గ్రహించి, తన జ్ఞానబలముచే స్వశరీరాది సర్వదృశ్య త్యాగము, స్వస్వరూప గ్రహణము

సర్వదా మనస నిదిధ్యసనాభ్యాసములచే ప్రీతి నిశ్చయములతో నాచరించు చుండినయడల కాలక్రమమున తన వాస్తవస్వరూపమగు నిత్యనిరతిశయ సుఖప్రాప్తినొందును. ఇదియే జీవునకు ఆత్మజ్ఞానమువలనగలుగు పరమ లాభము. జీవునకు నింతకన్న పొందదగిన లాభములేదు. శ్రుతి "బ్రహ్మ సత్యంజగన్మిథ్యా" "నేహనానాస్తికించన" "జీవోబ్రహ్మైవనాపరః" అని తెలుపు చున్నది. ఇంకనూ విస్పష్టముగ కఠోపనిషత్తు: "ఏకోవశీ సర్వభూతాంత రాత్మా,ఏకంరూపంబహుధాయః కరోతి। తమాత్మస్థం యేఽనుపశ్యన్తిధీరాస్తేషాం సుఖం శాశ్వతంనేతరేషామ్" అనగా ఆత్మ అద్వితీయము, సమస్త జగత్తును తన వశమునందుంచికొన్నది. సర్వభూతములకు అంతరాత్మయు, శుద్ధ జ్ఞాన రూపియూనగుచు, ఉపాధి భేదవశమున, అనేక ప్రకారములుగ గనబడు చుండును. ఎవరలు యిట్టి పరమాత్మను,వారి హృదయాంతరమగు, బుద్ధిగుహ యందు దర్శించుదురో అనగా తెలిసికొందురో అట్టివారికి శాశ్వతసుఖము కలుగును. తదితరులకు కలుగదు; అని తాత్పర్యార్థము.

మరియును, "ఆత్మజ్ఞానం వినాసాధో, ఆధిర్వ్యాధిర్నశశ్యతి" అనగా మానవునకు దుఃఖ కారణములు - ఆధివ్యాధులు (ఆధి అనగా మానసిక వ్యాధులు. వ్యాధి అనగా దేహమునకు కలుగునట్టి వ్యాధులు), యీ రెండును తప్ప మానవునకు దుఃఖ కారణము మూడవదిలేదు. ఇవి ఒక్క ఆత్మజ్ఞానము వలనగాని నశించవను తాత్పర్యార్థమును శ్రీ వశిష్ఠ భగవానులు శ్రీరామచంద్ర మూర్తి కుపదేశించుచున్నారు. కావున యెట్టి వారికైనను వారి దుఃఖనివృత్తి ఆనంద ప్రాప్తికి, జీవుని పరమార్థ స్వరూపమగునట్టి ఆత్మజ్ఞాన మావశ్యకము.

ఈ విషయమునే శ్రీ శంకరులు "అజ్ఞాన సర్పదష్టస్య, బ్రహ్మజ్ఞా నౌషధంవినా" అనాది అజ్ఞానమను సర్పముచే కరువబడిన జీవునికి బ్రహ్మ జ్ఞానమను ఆత్మజ్ఞానౌషధము తప్ప మరి వేరొందేదియును లేదను తాత్పర్యా ర్థమును తెలుపుచున్నారు. ఇంకనూ "దీర్ఘ సంసారరోగస్య, విచారోహి మహౌషధం." జీవునికి సంసారమను దీర్ఘ రోగమునకు ఆత్మ విచారమే అనగా

ఆత్మజ్ఞానమే మహౌషధమని శ్రీ వశిష్ఠ భగవానులు తెలుపుచున్నారు. బ్రహ్మయన్నను, ఆత్మయన్నను, ఒక్కటియే. బ్రహ్మ జీవునకు తన పరమార్థ స్వరూపమేగాని వేరొండుగాదు. ఇదియే ఆత్మ, ఈ ఆత్మయే బ్రహ్మ. ఈ విషయమునే "అయమాత్మా బ్రహ్మ"యను మహా వాక్యము [illegible] బోధించుచున్నది.

అయినను జీవునకు తాను బ్రహ్మనుకాను అనునట్టి అజ్ఞాన స్వరూప మగునంధకారము తన బుద్ధి గుహయందనాది కాలమునుంచి యున్నది. మానవునకు ఈ అజ్ఞానమను చీకటి యున్నంత కాలము, దివాంధ పక్షులు (గుడ్లగూబలు) రాత్రి కాలమందే వాటి ప్రకాశమును పొందగలుగుచున్నట్లు (అనగా వాస్తవమున అది ప్రకాశముగాదు. చీకటి ప్రకాశమెట్లగును? కాదు.) మానవుడు తన అజ్ఞానమను చీకటి రాత్రియందే అనగా అనాత్మ [illegible] నీ ప్రపంచమందే, అనిత్య, అవాస్తవానందముల పొందుచు, [illegible] భ్రమించుచుండును. కాని తన సర్వ ప్రకాశమగు ఆనంద స్వరూపమును పొందలేకున్నాడు. ఇది అనాదిగ వచ్చుచున్నది. అయినను వేల సంవత్సరములనుంచి కొండగుహల యందుండునట్టి గాఢాంధకారము ఒక్కసారి చూపబడు దీప ప్రకాశముచే నెట్లు నశించునో అనగా పోవునో, అట్లే మానవుడు తన సదాచార శాస్త్రీయ ప్రయత్నములచే, ఆత్మజ్ఞానమను ప్రకాశమును తన బుద్ధి గుహయందు ప్రవేశపెట్ట గలిగినయెడల అనాదికాలమునుంచి తన బుద్ధి గుహయందుండిన అజ్ఞానమను నంధకారము ఒక్కమారుగ నశించును. తిరిగిరాదు. అట్టి తరి తాను తన అఖండ పరిపూర్ణానంద ప్రకాశముతోడ శాశ్వతముగ నుండును. అనగా తత్స్వరూపుడే యగును. తన బుద్ధి గుహయందీ అజ్ఞానమను చీకటి మరల ప్రవేశింపజాలదు. ఏలనన ఈ ఆత్మజ్ఞాన ప్రకాశము లౌకిక జ్యోతిః ప్రకాశములవలె కాలాంతరమున నశించునది గాదు. ఈ ఆత్మజ్యోతి స్వయంప్రకాశమగు నిత్య, నిరతిశయానంద స్వప్రకాశ స్వరూపము.

పరమార్థమున జీవుని వాస్తవ స్వరూపము యిట్టి నిత్య నిరతిశయా నంద రూపమైనను, మానవ సామాన్యము దీనిని గురించి యిది మనకిప్పుడు గనబడుచున్నట్టిదిగాని, అనుభవములో నున్నట్టిదిగాని కాదుగదా? ఇట్లిప్పుడు మనకు గనబడనట్టిదియును, అనుభవములో లేనట్టిదియును, నేదోయొక శాశ్వత నిరతిశయ సుఖమున్నది యని, యున్న సుఖమును వదులుకొని యీ ప్రయత్నము మనకేంమలకు? ఇప్పుడనుభవములోనున్నట్టి సుఖమును వదలి ప్రస్తుతము గనబడనట్టి ఆత్మ సుఖమునకు ప్రయత్నించుటెట్లు వివేకమగును? అను సంశయమును సాధారణముగ నొందుచుందురు. ఇది సరిగాదు. ఏలనన ప్రస్తుతము వారి యనుభవములో నున్నవాని యట్టి లోపములను బాగుగ వివేచన చేసి గుర్తించి ప్రజ్ఞావంతులు అధికలాభ సౌకర్యములకు ప్రయత్నించుటే వివేకముగాని, యెదరనున్న దాని ననుభవించుచు అధిక ప్రయత్నము చేయకుండుట పశు ధర్మముగాని మానవ వివేకమెట్లగును? ప్రజ్ఞానవంతులు ప్రస్తుతము తమ అనుభవ విషయ లోపములను తెలిసికొని ఆ లోపములను నివర్తింపజేసి ప్రజ్ఞాశక్తులను వృద్ధిచేసి అధికలాభ సౌకర్యముల నిప్పుడెట్లు బొందుచున్నారను విషయ మందరకును యనుభవమున నున్నదే. అనేక శతాబ్దములనుంచి ఆయా కాలమున మానవుల కగుపడనట్టియు, తెలియనట్టియు విషయములను బుద్ధిమంతులగువారు పరిశోధనల చేసి వస్తు విచారము గావించి అనేక అధికలాభ ప్రయోజనములను యీ శతాబ్దమున ఇప్పుడెట్లు అనుభవించుచున్నది యును సామాన్యముగ అందరకు విశదమే. ఇట్లు బుద్ధిమంతులచే వస్తు విమర్శ పూర్వకముగ గనిపెట్టబడిన యనేక విషయ ములను అనగా, విద్యుచ్ఛక్తి, ఆకసమున నున్న శబ్ద తరంగములు, అణువు యందున్న మహాశక్తి, యివి యన్నియు కేవల చక్షుర్గోచరములు గాని వైనను వస్తు పరిశోధనల వలననేగదా, వానిని గనిపెట్టి వాటి ప్రయోజ నము నిప్పుడు బొందుచున్నారు. విద్యుచ్ఛక్తి, అణుశక్తి కంటి కగుపడని వైనను వస్తు సూక్ష్మ పరిక్ష విచారముల వలన ఆ శక్తిని గనిపెట్టి అధిక వ్యయములతోడ వానిని సంపాదించియేగదా, విద్యుచ్ఛక్తి, అణుశక్తుల

మహత్తరములగు వివిధ ప్రయోజనములను మానవులీకాలమున [illegible]
శక్తి యెప్పుడును శక్తిమత్తును విడచియుండదు. కావున శక్తి శక్తి
మత్తుల కభేదము. పరమాత్మ శక్తి యగునట్టి ఆత్మశక్తి [illegible]
గొప్పది యను మాట విజ్ఞానవంతులందరును ఒప్పుకొను విషయమే. కావున
పూర్వకాలముననే వేద శాస్త్రములు, దివ్యదృష్టి గలిగిన మహాత్ములు, [illegible]
పుంగవులు, ఈ ఆత్మజ్ఞాన లాభమును వారు తెలిసికొని [illegible]
చున్నట్టి ఆత్మజ్ఞాన లాభ పరమ ప్రయోజనమును, మానవులకు [illegible]
జ్ఞానముల భిన్నములగుటచే నట్టిది ఒకే పదార్థమనియు, అది నిత్య [illegible]
పరిపూర్ణానంద స్వరూపమనియు, ఇది యేకము, అఖండమనియు, [illegible]
సిద్ధాంతమును గావించి యీ జ్ఞానమును సంపాదించునట్టి [illegible]
బోధించుచున్నారు. మానవుడీ ఆత్మజ్ఞానము నొందుటకు [illegible]
గాని, బాహ్య సంభార ప్రయత్నములతోగాని [illegible]
యీ నిత్య అఖండపరిపూర్ణానంద పదార్థము మానవునితో [illegible]
స్వరూపమై నిత్యముగనుండునదియేగాని వేరుగాదు. మానవునికి [illegible]
చుటకు కావలసిన ప్రయత్నము-శాస్త్రానువర్తియై సూక్ష్మబుద్ధితో [illegible]
నాత్మల విచారాదులగావించి యీ పరిపూర్ణానందస్వరూపము [illegible]
కొని స్వాత్మాభిన్నముగ ననుభవించుటయేగాని [illegible]
మానవుడు గ్రహించదగిన, గ్రహింపవలసిన విద్యలలోనెల్ల [illegible]
మైనది. దీనినే రాజవిద్యయని శ్రీకృష్ణభగవానులు గీతలో

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం
పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం,
సుసుఖంకర్తుమవ్యయమ్॥

అనగా యీ ఆత్మజ్ఞానము విద్యలలోనికెల్ల శ్రేష్ఠమును, [illegible]
బహుజనవిదితముగానిది) పవిత్రమును, ఉత్తమమైనదియును, [illegible]

బోధగలదియు, ధర్మమైనదియును, ఆచరించుటకు అతిసుఖకరమైనదియును, యెన్నటికిని నశించనిదియునునై యున్నదని తెలుపుచున్నారు. కావున యీ ఆత్మజ్ఞానపరమలాభమును గురించి సంశయించుట యనునది అవివేకమేగాని మరివేరుగాదు. ఈ ఆత్మజ్ఞానమనగా నెట్టిదియో శ్రీకృష్ణపరమాత్మయే యిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వం,
తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
ఏతత్ జ్ఞానమితిప్రోక్తం,
అజ్ఞానంయదతోఽన్యథా॥

అనగా, అధ్యాత్మజ్ఞాననిత్యత్వము, మోక్షమే సర్వోత్కృష్టమని యాలోచించుచుండుట అనగా మననము గావించుచుండుట యిదియంతయు జ్ఞానము (అనగా జ్ఞానాభ్యాసము) అని చెప్పబడినది. దీనికన్నవేరైనదంత యును, అజ్ఞానమని చెప్పబడినది ఈ అభ్యాసమే మానవుని పరమసుఖ సాధనము.

—o—

# జీవజగత్స్వరూపము

ఈ నానాజీవ జగత్స్వరూపములు రెండును అనాది జీవాజ్ఞానమువలన కల్పితములగుచు, పరమార్ధవాస్తవమున, నిత్యనిర్వికార, అఖండపరిపూర్ణ చిద్ఘనానందస్వరూపమగు పరమాత్మ (బ్రహ్మ) యందే భాసించుచున్నవిగాని, వీటికి పృధక్ సత్తాలేదని శాస్త్రము తెలుపుచున్నది. అనగా యీ రెండును, స్వాప్నికునియందు స్వప్నదృశ్యములాగున కనబడుచు, నశించునవేగాని యివి నిత్యము, వాస్తవముకాజాలవని అర్థము. పృధక్‌వ్యక్తిత్వముతోడ నేను, నేను, అని వ్యవహరించు జీవులందరును ప్రపంచాంతఃపాతులే. అయినను ప్రతి జీవునకును తన ప్రారబ్ధఫల మనుభవించుటకు "అహం" నేను ప్రతీతి యును, "మమ" నాదియను నీప్రపంచ ప్రతీతియును రెండును ఆవశ్యక ములగుచున్నవి. కాని యీ రెండును, అనాది జీవాజ్ఞానకల్పితములే. అనగా భ్రాంతిమాత్రములు, శాస్త్రమిట్లు మానవునకు బోధించుచున్నందునను, శాస్త్రము నూరుతల్లుల సమానముగనుకను, లోకానుభవమిందుకు వ్యతిరేక ముగా నుండుటచేతను, యిది యెట్లు? అని విచారించి తెలిసికొనవలసిన భారము మానవునియందున్నది. ఇందు మనకగుపడుచు ననుభవమునిచ్చు చున్నట్టి ప్రపంచమునుగురించి విచారించుదము.

ఈ ప్రపంచముననున్న మేధావంతులందరితో నొకసభగావించి, యీ ప్రపంచముయొక్క యధార్థమునుగురించి నిది యున్నదా? లేదా! యని ప్రశ్నించినయెడల,వారు నిర్దుష్టముగ నెటులను జెప్పజాలరు. ఏలనన యీ జగత్తు ఉన్నది, శాశ్వతము, వాస్తవము, యని జెప్పుటకు ఏ జీవునకున్నూ నిది నిత్యము అనగా శాశ్వతమగుటలేదు. సర్వమును సర్వదా మార్పుజెందుచు నశించుచునేయున్నది. కాని, వంధ్యా పుత్ర శశశృంగాదులవలె, లేదని చెప్పుద మన్నయెడల, ప్రతి జీవిచేతను నీ ప్రపంచమనుభవింపబడుచున్నది. సర్వుల

చేతను కొంత కాలమైనను ననుభవింపబడుచున్న నీ ప్రపంచమును లేదని జెప్ప వీలుకాదుకదా! కావున యీ ప్రపంచము, అందరిచేతను, అశాశ్వతముగ అనగా తాత్కాలికముగను, అవాస్తవముగను ననుభవింపబడుచున్నదనియే జెప్పవల యునుగాని, మరి వేరుదారిలేదు. ఏలనన వాస్తవమగు పదార్థమునకు ఎట్టిస్థితిలో నైనను, ఎంతకాలమునకైనను, ఎన్నటికినీ ఎట్టిమార్పును రాగూడదు. ఇది నియమము. కాని యీ ప్రపంచమట్లుగాక, నేనని తలచునట్టి యీ దేహాదులును యీ ప్రపంచమునుగూడ, కొంత పరిమిత కాలములోనే, షడ్భావ వికార ముల జెందుచు, నశించుచున్నవిగదా! కావున నివి, మానవునకెట్లు శాశ్వత మగుచు, తన శాశ్వతసుఖమునకెట్లు నమ్మకొనదగినవియగును? కావు. అయినను సర్వ జీవులకును వారివారి ప్రారబ్ధఫలానుభవమునకుగాను యీ ప్రపంచ మావశ్యకము. ఇది సర్వజీవులకును తాత్కాలికానుభవములనిచ్చుచు, సత్య మైనదానివలె నగుపడుచు, భ్రమింపజేయుస్వభావముకలది. అయినను జీవులకు వారివారి ప్రారబ్ధమునుక్షయింపజేసికొనునట్టి పరమలాభము ఈ ప్రపంచము తోడనే యున్నది. ఈ విషయ విమర్శ ముందు గ్రంధములో సవిస్తరముగ నిరూపింపబడినది గావున, నిచట వివరించుటలేదు. పర్యవసానమేమనిన, యీ స్వశరీర సర్వప్రపంచములు ఉన్నవనిగాని, లేవనిగాని నిర్దిష్టముగ జెప్పుటకు వీలుకానివి. ఏలనన యివి కల్పితమగు వ్యవహార స్థితియందు కల్పితమాత్రముగనుండునవి. పారమార్థిక వాస్తవస్థితియందు, ఎంతమాత్రము లేనివిగనేయుండును. జీవులకీ ప్రపంచానుభవమంతయు వారి వారి, ప్రారబ్ధ ఫలానుభవ నిమిత్తము, నేర్పడినదేగాని వేరుగాదు. అజ్ఞాన కారణము నశించ గనే అజ్ఞాన కార్యమగు నీ ప్రపంచము భాసించదు. కాని అంతవరకును భాసించు చుండును. కావుననే యీ ప్రపంచస్థితి - ఉండుటకును లేకపోవుటకును విలక్షణ స్వభావము కలదని జెప్పుటకన్న వేరుదారిలేదు. దీనినే శాస్త్రము "సద సద్వి లక్షణత్వం ప్రపంచ లక్షణం" అనిన్నీ యింకనూ "అనిర్వచనీయం" అనగా నిర్దిష్టముగా జెప్పుటకు వీలు లేనిది యనిగూడ తెలుపుచున్నది. ఈ ప్రపంచము మాయాకార్యము. మాయ యనగా లేనిది ఉన్నట్టుగా కనబరచునది, ఉన్నది

లేనట్లుగా కనబరుచునది యనియే అర్థము. ఉన్నది యున్నట్లు యథార్థముగ కన బరచునది తత్త్వజ్ఞానము. కావుననే యీ ప్రపంచము తత్త్వవిచార పరులకు వాస్తవముగ లేనిదిగను, అవిచార పరులకు సత్యమైన దానివలెను భాసించుచుండును. కావున విచార మావశ్యకము. దీనిని గురించి-శ్రీ శంకర భగవత్పాదు లీవిధమున, నుపదేశించుచున్నారు:

శ్లో॥ సదేవవిశ్వం విపరీతదృష్టేః, పరీతదృష్టేః జగదేవసత్స్యాత్ ।
అతద్ జ్ఞదృష్ట్యాతుమణిశ్శిలాస్యాత్, తద్జ్ఞస్య దృష్ట్యాతు
శిలామణిఃస్యాత్ ॥

అనగా విచారముచే నెవ్వడు బ్రహ్మరూపము నెరుంగజాలడో వానికి బ్రహ్మయే ప్రపంచముగ భాసించును. విచారముచే నెవ్వడాయనను నెరుంగగలడో వానికి నీ ప్రపంచమే బ్రహ్మమగును. ఇది యనుభవ విరుద్ధముకాదు. మణి స్వరూ పము నెరుగని వానికి ఆ మణియే సాధారణ రాయిగా తోచుటయు, దాని విలువ స్వభావము లెరిగినవానికట్లుతోచక, రత్నముగానే దోచుటయునందరి యనుభవములో నున్నదియేకదా. అనగా యీ విషయము సామాన్య ముగ నందరకును తెలిసినదియే యని తాత్పర్యము.

మరియును సామాన్య వ్యవహారమందు గూడ, నెప్పుడైనను సువర్ణ కంకణ, హారాదులు చూచినప్పుడుగాని కొనినప్పుడుగాని ప్రయత్నమవసరము లేకయే వాటి నామరూపములు గోచరించుచుండును. కాని సువర్ణము సత్య మైనదో, కాదోయని తెలిసికొనుటకు కొంత విశేష ప్రయత్న మావశ్యకము కదా. ఇదియును సామాన్యానుభవములోనిదే. ఇట్లే యీ ప్రపంచమంతయు నామ రూపములతోడ భాసించుచున్నను, వీని యథార్థమును తెలిసికొనుటకు శాస్త్రీయ పరీక్ష జ్ఞానము **(Scientific test & Knowledge)** ఆవశ్యకము. ఈ ప్రపంచము సత్యమను భ్రాంతి నేడు వచ్చినదికాదు. అనాది కాలమునుంచి వచ్చుచున్నది. ఈ భ్రాంతిని నిర్మూలించి వాస్తవమును తెలిసికొనుటకు ఎంత విచార మావశ్యకమో, ఎంత చిత్తశుద్ధి, సూక్ష్మబుద్ధి యావశ్యకమో

ప్రాజ్ఞులూహింతురుగాక. కావున నిత్యానిత్య వివేకాదులతోడ, సూక్ష్మబుద్ధితో నీ ప్రపంచ స్వభావమును బాగుగ విచారము చేయనివారలకు యీ స్వశరీర సర్వ ప్రపంచము, తదనుభవములు సర్వదా మారుచు, నశించుచున్నవైనను యిది యంతయును వాస్తవము, సుఖమను భ్రాంతి విడువదు. ఇట్లుగాక శ్రుతి యుక్త్యనుభవముల సహాయముచే యీ ప్రపంచమును విచారించిన యెడల, ఎచట జూచినను ప్రకాశమే కానవచ్చును, సర్వము అఖండ జ్ఞానరూపమున గోచరించుచుండును. అప్పుడీ ప్రపంచ నామరూపములు ఆభాసమాత్రములై కేవల వ్యవహార ప్రయోజన మాత్రములగును. కావున యీ విచారము, మానవుని పరమ శ్రేయోదాయకమగు ముక్తికి కారణమగును. ఇంకను శ్రీ శంకర భగవత్పాదులు ఈ ప్రపంచమును గురించి ఇట్లు బోధించుచున్నారు.

శ్లో॥ అసత్కల్పం మృషాప్రాయం, స్వప్నతుల్యం భ్రమోదితం ।
జగత్సర్వ మితిజ్ఞేయం పండితైస్తత్త్వదర్శిభిః॥

అనగా, విచార శూన్యులుగాక, జ్ఞానవంతులగు వారు ప్రయత్న పూర్వకముగ ఆత్మా నాత్మ విచారము గావించుచు, ఈ ప్రపంచముయొక్క యదార్థ రూపమును తెలిసికొనవలయును. వాస్తవ స్థితిలో నీ ప్రపంచమునందు, నామ రూపములకంటె నితరమగు పదార్థమేదియునులేదు. నామరూపములు కల్పితములు. కావున నీ ప్రపంచము సత్యము కానేరదు. ఉన్నట్లు తోచుటయేగాని దీనియందు వాస్తవమగు పదార్థమేదియును లేదు కావున, నిది కలవంటిది. జీవునకు తన ఆత్మయొక్క యధార్థ రూపమును తెలిసికొనలేక పోవుటచే, నీ ప్రపంచము యున్నట్లు తోచుచున్నదిగాని, మరేమియు లేదని తెలిసికొనవలయును.

ఇట్టి జగత్స్వరూపమునుగురించి "భ్రాంతిమాత్రమిదంసర్వం విశ్వం బ్రహ్మణికల్పితమ్" అనగా యీ ప్రపంచమంతయు బ్రహ్మమునందే కల్పింపబడి భ్రాంతిమాత్రముగయున్నదేగాని వాస్తవముగాదని శ్రీ శంకరభగవత్పాదులు బోధించిరి.

"స్వప్నమాయే యథాదృష్టే గంధర్వనగరం యథా,
తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః" ॥

అనగా స్వప్న మాయా గంధర్వనగరము లేవిధముగ చూడబడుచున్నవో అదేవిధమున వివేకులగువారిచే నీప్రపంచము చూడబడుచున్నదని వేదాన్తము లందు బోధింపబడుచున్నది. అనగా యీ కనబడు ప్రపంచమంతయు వాస్తవముగాదని తాత్పర్యార్ధమును మాండూక్యోపనిషత్తు తెలుపుచున్నది. జీవునకీప్రపంచము, ప్రపంచానుభవములు, నిమిత్తమాత్రములైన, అవాస్తవికములు, తాత్కాలికములేయగునుగాని నిత్యములు కాజాలవు. ఏలనన యీ స్వశరీర ప్రపంచోపాధులన్నియు జీవునకు తన ప్రారబ్ధభోగనిమిత్తముగ వచ్చినవి. ఇందు జీవుడు తన అజ్ఞానముచే యాత్రజేయుచుండును.

మానవునకీప్రపంచము జీవయాత్రా మార్గమధ్యమేగాని వేరుగాదు. ఈ ప్రపంచము యాత్రామార్గమధ్యముగనుకనే ఏ జీవుడును నిచట శాశ్వతముగ నుండజాలడు. ప్రతి జీవుడును చేయు నీ యాత్ర ఎక్కడికనిన, తెలిసియో, తెలియకయో, నిత్యము తాను కోరునట్టి నిత్య, నిరతిశయానంద, క్షేత్రమునకు. ఈ క్షేత్రము జీవునకు పరమార్ధస్వరూపమే. కాని అనాదికాలమునుంచి అజ్ఞానములో యుండుటచే వాస్తవమగు తన అఖండ, పరిపూర్ణానందస్వరూపమును మరచినను, తాను ప్రథమమున సహజముగ సుఖస్వరూపుడే గనుక అట్టి సుఖమును మాత్రము స్మరణ యందుంచుకొని దానినేకోరుచు, మాయావివశుడై దారి తప్పి యీ ప్రపంచమున తిరుగు మానవుడే యీ జీవయాత్రాపరుడు. పశ్వాది జీవులకు యాత్రాజ్ఞానముండదుగదా? కాని జీవరాశియంతయు నిట్టిదే. ఈ ప్రపంచ సృష్టికి పూర్వము స్వస్థతగ అఖండానందస్వరూపముతో నున్న వాడే మాయావివశుడై భ్రమించి యీ జీవత్వమునొంది యిల్లులేనివానివలె జీవయాత్రను చేయుచుండును. ఈ జీవయాత్రలోగూడ భ్రమించుచు, యాత్రా మార్గమధ్యమందు తనకు లభించునట్టి ధర్మశాలలను వాటి భోగానుభవములను తనవేననియు, తనకు నివి శాశ్వతమనియు, వ్యామోహితుడగుచుండును. కాని

ధర్మశాలలు యెట్టివారికైనను శాశ్వతములు కాజాలవుగదా! కావున యీ ధర్మశాల వదలి మరియొక ధర్మశాల ప్రవేశించుచు తన ప్రారబ్ధరూపముననున్న పరిస్థితులనుబట్టి సుఖదుఃఖానుభవములు జేయుచు దేశద్రిమ్మరివలె తిరుగుచుండును. ఇదియే జీవునకు సంసారము. ఈ సంసార భ్రమణము ఒక్క ఆత్మజ్ఞానమువలనగాని నశించదు. జీవుడిప్పుడు అనాత్మజ్ఞానమగు అజ్ఞానముతోడనున్నాడు. కావుననే యిట్టి తన సంతానమందు పరితాపము నొందుచు వారినుద్ధరించు తరణోపాయములను, తల్లి పిల్లలకు, వారి వారి శక్తిసామర్థ్యములనుబట్టి బోధించునట్లు, జీవుల సామర్థ్య తారతమ్యములనుబట్టి వివిధ మార్గముల బోధించుచు, ప్రజ్ఞావంతుడైన కుమారునికే ఆస్తియంతయు అప్పజెప్పునట్లు వివేకవంతులగు మానవజీవులకు పరమార్థ వాస్తవమును "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" "నేహానానాస్తికించన" "మాయామాత్ర మిదం ద్వైతం, అద్వైతం పరమార్థతః" "జీవోబ్రహ్మైవనాపరః" "తత్త్వమసి" "అయమాత్మాబ్రహ్మ" అను మొదలుగాగల వచనములతోడ శ్రుతిమాత బోధించుచున్నది. వేదరూపమగు శ్రుతిబోధ నూరు తల్లుల సమానముగనుక వివేకవంతులగు మానవులు యీ బోధను బాగుగ గ్రహించి వారి అఖండ పరిపూర్ణానందస్వరూపము నొందు భారము వారియందే యున్నది. అయినను అవివేకులగు మానవులు కొందరు యీ యుపదేశములతో మాకేమిపని, మేమిప్పుడు సుఖముగనే యున్నామని తలచుచున్నారు. అట్టివారి నుద్దేశించి "నచేదిహావేదీన్మహతీ వినష్టిః" అనగా జీవుడు తనకీ మానవజన్మ కలిగినపుడే తన స్వస్వరూపమగు ఆత్మజ్ఞానమును సంపాదించనియెడల, తాను భరించలేని గొప్పనష్టమును పొందువాడగునని శ్రుతిమాతయే బోధించియున్నది.

కావుననే "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత" అనగా అజ్ఞానమునందు నిద్రించుచున్న యోజీవులారా! మీరు లెండు, అజ్ఞాననిద్రనుండి మేల్కొని జాగరూకులుకండు, శ్రేష్ఠమగు సద్గుర్వనుగ్రహము నొంది తత్త్వమును అనగా మీ వాస్తవస్వరూపమును తెలిసికొనుడని వేదమాత

గొంతెత్తి తెలుపుచున్నది. జీవునకిదియే తాను చేరవలసిన మహాపుణ్యక్షేత్రము. దీనిని చేరిన తదుపరి యాత్రలతోడను, యీ యాత్రా మార్గమధ్యమగు ప్రపంచముతోడను జీవునకు పనిలేదు. వాస్తవమున సర్వము తానే యగును. ఇదియే జీవునకు తన అఖండ పరిపూర్ణానందప్రకాశము.

ప్రతి జీవుడును సర్వదా కోరుచుండు ఆనందము, పరమార్థ వాస్తవమగు తన ఆత్మస్వరూపమే. వాస్తవ మాలోచించిన జీవుని పరమార్థస్వరూపమే అఖండానందస్వరూపమగు బ్రహ్మ. ఆత్మ-బ్రహ్మ-స్వరూపానందము యివి యన్నియు పర్యాయపదములు. ఈ విషయమును వరుణకుమారుడగు భృగువు తనకు బ్రహ్మమునుపదేశింపవలయునని తండ్రిని కోరగా తండ్రి వలన, నుపదేశింపబడి, తాను మరల మరల విచారణచేసి, పంచకోశములు తాను కానని తెలిసికొని చివరకు ఆనందమే బ్రహ్మయని తెలిసికొనెను. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అనిన్ని, ఇదికాక "ఆత్మైవానందః" ఆత్మయే ఆనందస్వరూపము అనిన్ని శ్రుతివచనములు స్పష్టపరుచుచున్నవి. కావున జిజ్ఞాసువులు వారి ఆనందప్రాప్తికి, గురుశాస్త్రబోధవలన, జీవస్వరూపుడగు తమ పరమార్థ వాస్తవస్వరూపమునే బాగుగ గ్రహించి స్వానుభవము నొందవలయునుగాని, తాము కోరునట్టి అఖండానందస్వరూపము, తమను విడిచి, వేరుగ లేదని గ్రహించవలయును. కావున జిజ్ఞాసువులగువారికి ఆత్మ చింతనమే ఆనందప్రాప్తి సాధనము.

ఈ షడ్భేదమున్నను స్వప్నప్రపంచ, జాగ్రత్ప్రపంచములు రెండును ఒకేవిధమైనవని శాస్త్రము మానవునకు బోధించుచున్నది. ఇది ఎట్లు అని విచారించుదము. సర్వజీవులకును అవస్థాంతరకాలాంతరములయందు యీ రెండు ప్రపంచ పదార్థములును నశించుచునేయున్నవి. అనగా లేనివానితో సమము లగుచున్నవి. తాత్కాలికమగునట్టి నిద్రయను అజ్ఞానావస్థలేనిదే స్వప్న ప్రపంచముగలుగుటకు సంభవముగాదు. నిద్రయున్నప్పుడే స్వప్నము సంభవించును గాని,లేనిచో గలుగదుగదా? అట్లే జీవునకు తన అనాది అజ్ఞానమను నిద్రచే యీ

ప్రపంచానుభవములన్నియూ సత్యమైనవానివలె అనుభవమునకువచ్చుచున్నవి. ఈ జగదనుభవమంతయు జీవునకు తన యజ్ఞానమున్నంతకాలమే సత్యమైన దానివలె తోచుచు, జాగ్రదవస్థచే స్వప్నపదార్థములు నశించుచున్నట్లు తన మూలాజ్ఞానము నశించి తురీయావస్థను పొందగనే యీ జగదనుభవము లన్నియూ స్వప్నపదార్థతుల్యములేయగును. కాని యీస్వప్న జాగ్రత్పదార్థ ములు రెండును ఆయా అవస్థాకాలములయందు సత్యమైనవానివలె యనుభ వింపబడుచున్నవి. అనగా స్వకాల సత్యత్వము రెంటికిని సమానమైనను పర్యవసానమున రెండునూ, వాస్తవములగుటలేదు. సర్వజీవులకును జాగ్ర త్స్వప్న సుషుప్తులను మూడవస్థలే ప్రసిద్ధిగా అనుభవములోనున్ననూ, మాన వునకు శాస్త్రము తురీయమను నాలుగవ యవస్థ యున్నదనియూ అదియే జీవునకు మోక్షస్థితియనియు తెలుపుచున్నది. ఇది నిష్ప్రపంచము. జీవునకు తురీయము-పరమార్థవాస్తవస్థితియును, నిష్ప్రపంచమునునై యున్నది.తక్కిన మూడవస్థలును జీవునకు తన ప్రారబ్ధానుభవమునకుగాను యేర్పడిన కల్పితా వస్థలు. ఇవి కల్పితములు. కావున ముముక్షువగు జిజ్ఞాసువు జాగ్రత్స్వప్న సుషుప్తులను యీ మూడవస్థలయొక్కస్థితిని అసత్యమని అనగా యివి తనకు వాస్తవములుకావు, కల్పితమాత్రములని శాస్త్రీయముగ తెలిసికొని పరమార్థ వాస్తవము, నాలుగవస్థితియగు తురీయమును సాధించవలసియున్నది. ఈ ప్రపంచము జీవునకు పరమార్థ సత్యముగాదని "దీర్ఘస్వప్నమిదం సర్వం, విశ్వం బ్రహ్మణికల్పితం।" అని వశిష్ఠ వచనము తెలుపుచున్నది. వాస్తవమున నిద్రించియుండు జీవునియందే స్వప్న ప్రపంచమంతయు కల్పితమై స్వకాల సత్యత్వముతో నెట్లు భాసించుచున్నదో యట్లే జీవుని అనాది అజ్ఞానమువలన యీ ప్రపంచమంతయు తనయందే (అనగా జీవుడు పరమార్థ వాస్తవమున బ్రహ్మకంటె వేరుగాడు కనుక) కల్పితమై జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలతో కూడిన యీ ప్రపంచానుభవముల గలిగించుచున్నది. కాని వాస్తవమున యీ ప్రపంచము మిథ్యామాత్రమని శాస్త్రము తెలుపుతున్నది.

కావుననే ఏ జీవుడునూ యీ స్వశరీరాది ప్రపంచములను నిత్యముగా గాని, తాను కోరుకున్నంతకాలముగాని, నిలుపుకొనలేకున్నాడు. జీవుడు తానున్నంతకాలములోగూడ తాను కోరునట్టి సుఖమును పొందలేక పరాధీనుడుగానుండి మరణించుచున్నాడు. అందరకునూ స్వశరీరాది ప్రపంచానుభవములు, జన్మించిన క్షణము మొదలు, సాధారణముగ నూరు సంవత్సరముల వరకు వివిధ పరిమితకాల సుఖదుఃఖములను, ఒక క్షణము మొదలు కొన్ని సంవత్సరములుమాత్ర మిచ్చుచు నశించుచున్నవి. ఇది అందరకును ప్రత్యక్షమే. అయినను మానవులు దీని యధార్థమేమిటియని సాధారణముగ విమర్శింపజాలనివారై యున్నదియున్నట్లు, అనగా యీ స్వశరీరాది ప్రపంచ అనిత్యస్థితిగతులను తమకు నిత్య, సత్యములను భ్రాంతితోడ ననుభవించుచున్నారు. కాని యీ స్వశరీరాది ప్రపంచములు నిత్యసత్యమగుటకు నెంతమాత్రము నవకాశములేదు. ఏలనన జీవునకు స్వశరీర ప్రపంచములు రెండును తన ప్రారబ్ధ సుఖ దుఃఖభోగానుభవములకుగాను యేర్పడిన కల్పితములు. జీవునకివి రెండునూ నిమిత్తమాత్రముగ వచ్చినవేగాని వాస్తవములుగావు. ఈ నిమిత్తమేమియనిన జీవుని అనాది అవిద్యా కామకర్మఫలమే. జీవుడు నిత్యుడు. జీవత్వము అవిద్యాకల్పితము. అవిద్యయన్నను మాయయన్నను స్వల్పభేదమున్నను దాదాపు ఒక్కటియే. ఈ మాయాప్రభావముచే, జీవత్వ ప్రపంచములు రెండునూ ఆ పరమాత్మయందే కల్పితములైనవి. ఇందు జీవభావము అనుభవించువాడుగను, స్వశరీర ప్రపంచము అనుభవింపబడునదిగను యున్నది. కాని యివి రెండును కల్పితములే, గనుక యీ రెండును జీవభోగమునకు కొంతకాలము మాత్రముండి నశించుచున్నవి. ఇచట నశించుట యనగా యివి అవాస్తవములనునట్టి నిశ్చయానుభవముల నొందుటయేగాని, యీ ప్రపంచము ఘటపటములవలె భస్మమగునదిగాదు. ఏలనన యీ ప్రపంచమంతయు వాస్తవమునలేనిదైననూ యున్నదానివలె అజ్ఞానకాలమందు భాసించుచున్నట్టిది ఎట్లన కనుచీకటియందు త్రాడును చూచి పామని భ్రమించుటవంటిది. ఇచట యున్నది భ్రాంతిసర్పమే

గదా! ఇది నశించు టెట్లు. వ్యవహారమునందు నాశము యెల్లప్పుడునూ యున్న వస్తువుకేకాని, వాస్తవముగ లేకుండా ఉన్నట్లు నగుపడు వస్తువునకు నాశము లేదు. పరమార్ధ పదార్ధమునకు నాశములేదు. ఈ స్వశరీర జగత్తంతయు వాస్తవమునలేనిదయ్యూ, ఉన్నదానివలె భాసించుచూ, ఆ పరమాత్మను మరగుపరచి ఆ పరమాత్మనే యధిష్ఠానముగజేసికొని, ఆ పరమాత్మయందే భాసించుచున్నది. అనగా పరమాత్మ అధిష్ఠానముగను, జీవప్రపంచములు అధ్యస్తముగను యున్నవి. ఇందు అధిష్ఠానము వాస్తవము. అధ్యస్తము అవాస్తవము. కాని ఇచట నొక శంక కలుగవచ్చును. ఏదియన యీ ప్రపంచము, సర్వదా ఆయాజీవులచేతననుభవింపబచున్నట్లు తెలియుచున్నది కావున అసత్యమెట్లగును? అన్నది. ఇందొక రహస్యమున్నది. ఏమనిన ప్రతి జీవికి యునూయిది అసత్యమేయగుచున్నది.కాని యిట్టి అసత్యస్వభావముతోడనే యీ ప్రపంచము సత్యమైనదానివలె ప్రవాహ సత్యత్వముతోడ కన్పట్టుచున్నది. ప్రవాహసత్యత్వమనగా సర్వదా మారుచు సత్యముకానిదనియే అర్ధము. ఎట్లన, మహానదుల ప్రవాహమును మనము నిత్యమని తలచుచున్నను ప్రవాహజలము ప్రతిక్షణమునను మారుచునేయుండును. అయినను ఆనదీతీరములను యీ జల ప్రవాహమును కలిపి, మహానదులు నిత్యములని మనము తలంచుచున్నాము. ఇట్లే యీ ప్రపంచ నిత్యత్వముగూడ నున్నది. ఈ ప్రపంచము సర్వదా మారుచునేయుండునుగాని యిందు నిత్యముగానుండునదేదియును లేదని వారి, వారి, అనుభవములవల్లనే వివేకులు గ్రహించవచ్చును. సూక్ష్మబుద్ధితోడ విచారించునెడల యీ దేహప్రపంచములు సర్వదా మారుచునేయుండును. ఈ ప్రపంచమున జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతి, అనుషడ్భావ వికారములను (అనగా మార్పులు) చెందని పదార్ధమేదియును లేదు. నేను అనుకొనుచున్నట్టి తన దేహముగూడ యెంత జాగ్రత్తతో పోషించి కాపాడినను దానంతటదియే శైశవ బాల్య, యవ్వన, వార్ధక్యములను అవస్థల నొందుచు నశించుచున్నది. మానవుడు తాను జీవించియున్న కాలములో గూడ, తన సంబంధబాంధవ్యములు, ధనధాన్యసంపదలు, శత్రుమిత్రత్వములు,

అధికారసంపదలు, సుఖ దుఃఖ భోగములు, తన యిష్టానిష్టములు, యివి యన్నియూ నేకవిధముగ నుండుటలేదు. కాని వెనుకముందులుగ మారుచు యుండును. ఇది అందరి అనుభవములోనున్నదే. ఈ రోజు స్నేహితుడు, మరికొంతకాలమునకు విరోధియగుచున్నాడు. విరోధియగువాడు స్నేహితుడుగ మారుచున్నాడు. వీరు స్నేహితులు, వీరు విరోధులు అనువ్యవస్థ అట్లు తలచు వ్యక్తిమీద ఆధారపడియున్నదిగాని సృష్టి జాతిలోలేదు. ఈరోజు నాదియను కొనుచున్నదే కొంతకాలమునకు మరియొకరిదగుచున్నది. మరియొకరి సంపత్తి తనకు ప్రాప్తించుచున్నది. ఇదియంతయు జీవునియుక్క ప్రారబ్ధ సుఖ దుఃఖభోగానుభవములనుబట్టి కలుగుచున్నది. కాని తాను కోరినమాత్రమున కలుగుటలేదు. సర్వజీవులునూ సర్వదాకోరునది సుఖమే. కాని దీనికి మారుగ వారి, వారి ప్రారబ్ధానుసరణమున అధిక దుఃఖము స్వల్పసుఖము, అధిక సుఖము స్వల్పదుఃఖానుభవములు, సుఖదుఃఖములు రెండునూ కలసి కలుగుచు పర్యవసానమున దుఃఖమునే యిచ్చుచున్నవి. దీనినంతయును మానవుడు తన అనాది అజ్ఞానముచే స్వాభావికముగ తీసుకొని యీ సాంసారిక దుఃఖము నొందుచున్నాడు. కావున యీ కనబడుచున్నట్టి స్వశరీర, దృశ్యానుభవము లన్నియూ వాస్తవముకాదని, మానవునకు వేదమాత స్పష్టముగా "మాయా మాత్ర మిదం ద్వైతం, అద్వైతం పరమార్థతః" అనిన్ని "బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా, నేహనానాస్తికించన" అనగా యీ నానాగా కనబడుచున్నదంతయూ మాయామాత్రమనియు అనగా లేనిదే వున్నట్టుగా కనబడుచున్నదనియూ వాస్తవమున యున్నది సత్పదార్థమగు బ్రహ్మమొక్కటేననియూ, యీ కనబడుచున్న దేహప్రపంచములు వాస్తవముగ లేవనియూ బోధించుచున్నది. ఈ శ్రుతివచనము లసత్యములగుటకు వీలులేదు. ఏలనన,

శ్లో॥ పాషాణ ప్లవనంచాపి, సిధ్యేత్కాల విపర్యయే।
సక్వచిచ్ఛ్రుతి వాక్యానా, మప్రామాణ్యం తుసిధ్యతి ॥

అని వశిష్ఠవచనము తెలుపుచున్నది. పరమార్థవాస్తవమున జీవుడు బ్రహ్మకంటె వేరుకాదని శ్రుతి "జీవోబ్రహ్మైవనాపరః" అని తెలుపుచున్నది. ఈ బ్రహ్మ

అఖండపరిపూర్ణ జ్ఞానస్వరూపుడు. అయినను జీవత్వభ్రాంతిచే జీవునకు "అహం" నేను అను పరిచ్ఛిన్న ప్రతీతి గలుగుచున్నది. కాని యిది వాస్తవము గాదు. ఏలనన పరమార్ధవాస్తవమున జీవుడు బ్రహ్మాభిన్నుడని శ్రుతిస్పష్టముగా పై వాక్యమువలననూ, యింకనూ మహా వాక్యబోధవల్లను తెలుపుచున్నది. వేదము మానవునకు అసత్యమునుగాని, శ్రేయోదాయకముకాని దానినిగాని, చెప్పదు. వేదము నూరుతల్లులపెట్టని, "శ్రుతిః మాతృశతసమా" అను వచనము తెలుపుచున్నది. కావున నిది యెట్లని విచారించుట యావశ్యకము. బ్రహ్మ పరిపూర్ణసుఖస్వరూపుడు, జీవుడునూ యిట్టిస్వరూపుడేఅయినను అనాది అజ్ఞానముచే తన పరిపూర్ణ సుఖస్వరూపమును మరచి పరిచ్ఛిన్నత్వ రూపమును గ్రహించుటచే "అహం" నేనుయను ప్రతీతిగలుగుచున్నది. ఇట్లున్నను వాస్తవమున తాను సుఖస్వరూపుడగుటవల్లనే ప్రతిజీవి కోరు సమస్తమును తన కొరకే ప్రేమించుచున్నాడు. పరమప్రేమ సర్వముకంటెను తనయందె గలుగుచున్నది. కాని జీవుడు తానె, పరమ సుఖస్వరూపుడని, అవిద్యావశుడై గ్రహించలేకున్నాడు. జీవునకు యిదియే యనాది యజ్ఞానము. ఈ యజ్ఞానమును మానవుడు శాస్త్రవివేకముతోడను, తననిత్యానిత్య జ్ఞానముతోడను, నిర్మూలించి తను మరచిన తన పరపూర్ణ అఖండసుఖరూపమును గుర్తించగలిగినయడల యీ విషయసుఖములన్నియూ మాయ బంగారువంటి ఛాయామాత్రములని గ్రహింపగలిగి యీ స్వశరీర సర్వప్రపంచ విషయానుభవములయందునను, సక్తతా వ్యామోహములు క్షీణించి, నిమిత్తమాత్రములుగనుండును.

వాస్తవమున మానవునకు "అహం" నేను యను ప్రతీతి తన ప్రారబ్ధ క్షయమును గావించుకొనుటకునూ, తన పరమార్ధస్వరూపమును గుర్తించు సాధనముగానున్నూ, తన స్వాత్మాభిన్న బ్రహ్మజ్ఞానము నొందుటకు, ఉపలక్షణముగా నున్నదేగాని, తనకిది వాస్తవము, శాశ్వతముగాదు. అయిననూ తన వ్యవహారానుభవమునకున్నూ, ప్రారబ్ధనిర్మూలనమునకున్నూ, తద్ద్వారా పరమప్రయోజనమగు, తన నిత్యనిరతిశయ సుఖస్వరూపమును బడయుటకున్నూ యీ "అహం"నేను యను ప్రతీతి యేసాధనముగాని మరియొకటిగాదు.

ఈ పరిచ్ఛిన్న "అహం" ప్రతీతి తన అఖండ పరామార్థస్వరూపమునందే కల్పితముగనున్నది. ఇది మానవునకు, తన వ్యవహార పరమార్థములు సాధించుటకు యేర్పడిన యొక కల్పిత సాధనమేగాని, యీ "అహం" నేను యనునట్టి పరిచ్ఛిన్నోపాధి ప్రతీతియే తానుగాడు. జీవుడు వాస్తవమున స్వప్రకాశ, అఖండ పరమానందస్వరూపుడు. ఇదియే పరిపూర్ణ అఖండజ్ఞాన స్వరూపము. ఇట్టి సద్వస్తువుయొక్క అంతఃకరణ ప్రతిబింబమే జీవుడు. అద్వైతసిద్ధాన్తమునుబట్టి యీ జీవజగత్తులు రెండును పరిపూర్ణజ్ఞానస్వరూపమగు బ్రహ్మయందే కల్పితముగనున్నవి.

కాని యిచటనొక సంశయము గలుగుటకు అవకాశమున్నది. అది యేదియనిన — జీవుడు బ్రహ్మకంటె వేరుగాదని శాస్త్రము తెలుపుచున్నది. కాని యింతవిస్తారమగు ప్రపంచమంతయు ఆ పరమాత్మయందెట్లున్నదని సంశయము. ఈ ప్రపంచమంతయు జీవునియొక్క అనాది భ్రాంతివలన వాసనారూపమున బ్రహ్మయందె కల్పితముగనున్నది. ఈ వాసనలను నవియే సంస్కారములు. ఇవి గుప్తముగ జీవునియందేయుండి కాల పరిపాకముచే బహిర్ముఖములగుచు అనుభవముల నిచ్చుచుండును. ఇట్లనుభవింపబడునవియే యీ స్వశరీర జగత్తులు. ఈ విస్తారమగు జగత్తంతయూ అతిసూక్ష్మమగు వటబీజమందు, అతివిస్తారమగు వటవృక్షమంతయు నెట్లు ఇమిడియున్నదో అట్లునూ, ప్రాదేశమాత్రస్వాప్నికునియందు గలుగుచున్న అత్యంత విశాల స్వప్నపదార్థములలాగుననూ, మందాంధకారమున రజ్జువునందు దోచునట్టి సర్ప, సర్ప చలనాదికములాగుననూ, అజ్ఞానములో యీ ప్రపంచము సంకల్ప మాత్రముగనున్నదిగాని వాస్తవమునలేదు. కాని యీ ప్రపంచమువలననే సర్వ వ్యవహారములు జరుగుచున్నవి. జీవుడు తన పరమార్థమును పొందుటకు సర్వ సాధనములునూ, వ్యవహారమందు యున్నవి. కాని వ్యవహారమును విడచి సాధనములులేవు. జీవునకు పరమార్థము సిద్ధస్థితి. అయిననూ యిప్పుడు మానవుడు అజ్ఞానావృతుడై తన వాస్తవస్వరూపమును మరచియున్నందున తన పరమార్థజ్ఞానమును వ్యవహారసాధనమువలననే పొందవలయునుగాని

మరియొకదారిలేదు. ఈ వ్యవహారమందు పరమార్ధ సాధనములను శాస్త్రమే మానవునకు బోధించుచున్నది. జీవునకు వ్యవహారమనగా—శరీరధారణయేయని శాస్త్రము తెలుపుచున్నది.

వాస్తవమున మానవునకు గలుగుచున్న "అహం" నేను అను ప్రతీతి యున్నూ, "ఇదం" యీ ప్రపంచమనునదియునూ, తమ ప్రారబ్ధానుభవమున కున్నూ, పరమార్ధవాస్తవస్వరూపమగు అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమును గుర్తించుటకున్నూ, నేర్పడ్డ యుపలక్షణములేగాని, మానవునకివి వాస్తవము, శాశ్వతముగావు. అయినను యివి రెండును జీవుని వ్యవహారానుభవము నకున్నూ, ప్రారబ్ధ నిర్మూలనకున్నూ, తద్ద్వారా పరమ ప్రయోజనమగు తన నిత్యనిరతిశయ సుఖస్వరూపమును పొందుటకున్నూ మానవుడు వీనిని సాధ నములుగ నుపయోగించుకొనుటయే కర్తవ్యము. పరిచ్ఛిన్న "అహం" ప్రతీతి తన పరమార్ధస్వరూపమునందే కల్పితముగనున్నదిగాని యీ నేను అను ప్రతీతి తన పరమార్ధస్వరూపమును విడిచిలేదు. ఈ "అహం" ప్రతీతి మానవునకు తన వ్యవహార పరమార్ధములు బడయుటకుగాను కల్పితమైన యొకసాధనము. కాని యీ సాధనమే తానుగాడు. మానవునకు తన పరమార్ధ వాస్తవ స్వరూపము-పరిపూర్ణ అఖండజ్ఞానస్వరూపము. ఇట్టి సద్వస్తువుయొక్క అంతః కరణ ప్రతిబింబమే జీవుడు. ఈ జీవుడు కల్పితుడు. ఈ జీవుడే వ్యవహారియై పరిచ్ఛిన్న "అహం" నేను అను వృత్తితోనున్నవాడు. ఈయనయే సంసారి. శుద్ధజీవుడు అనగా పరమాత్మకు సంసారములేదు. కాని యీయన సాక్షిరూప మున సర్వజీవుల హృదయములయందునను, తాను ప్రకాశించుచు, తన ప్రకాశమువలననే సర్వమును, బాహ్యాంతరముల ప్రకాశింపజేయుచుండును.

అద్వైత సిద్ధాంతమునుబట్టి, జీవునకు యీ జగత్తంతయూ తన యనాది యజ్ఞానముచే గల్పితమై, యున్నదానివలె భాసించుచున్నదిగాని, యిది పరమార్ధ వాస్తవమున గానరాదు. కాని వ్యవహారకాలమందు మాత్రము సత్యమైనదానివలె, జీవుల కనుభవమునిచ్చుచుండును. అనుభవమనగా —

జ్ఞానము. ఈ వ్యవహారదానుభవములను వాస్తవమని తలచుటయే మానవునకు అనాద్యజ్ఞానమగుచున్నది. పరమార్థస్థితియందు యీ స్వశరీర సర్వప్రపంచములు అవాస్తవమేయగును. సుషుప్తిసమాధులందివి గానరావు. అయినను యీ జీవప్రపంచములను కేవల అసత్పదార్థముగ తోసివేయుటకున్నూ, సత్పదార్థముక్రింద, అంతనూ గ్రహించుటకునూ వీలులేదు. మరేమనిన యీ అహం ప్రతీతి సత్యానృతమిశ్రితమైయున్నది. అనగా గ్రహించవలసిన సత్యముతోడను, త్యజించవలసిన అసత్యముతోడను, చేరియున్నది. ఇందు వాస్తవమైనట్టి, మనలకు గావలసిన పరమార్థమును గ్రహించి, అవాస్తవమును జ్ఞానపూర్వకముగ త్యజింపవలయును, ఈ ప్రపంచసర్వాధిష్ఠానపదార్థము వాస్తవము. స్వశరీర సర్వదృశ్యము అధ్యస్తము. అనగా కల్పితముగనున్నది. ఇందు అనాత్మపదార్థము, అవాస్తవమునగునట్టి అధ్యస్తము దృశ్యమును జ్ఞానపూర్వకముగ త్యజించి, సత్యమగు సర్వాధిష్ఠానమును ముముక్షువులు స్వాత్మాభిన్నముగ గ్రహించవలెను. ఎట్లన-లోకములో మానవుడు భుజించుటకు బియ్యమే యావశ్యకమయిననూ, ప్రథమమున వరిధాన్యమును గ్రహించి, అందు తన కవసరములేనట్టి నిస్సారపదార్థమగు ఊకను, తవుడును, పొట్టును చెరగి విడపరచి తనకు కావలసిన తండులములనుమాత్రమెట్లు గ్రహించుచున్నాడో, యట్లె చిజ్జడ మిశ్రితమైన యీ "అహం" "ఇదం" పదార్థశోధన శాస్త్రీయముగ బాగుగగావించి, మానవుడు తన పరమార్థస్వరూపమగు ఆత్మ పదార్థమునే గ్రహించవలెను. ఈ జీవజగత్తుల విచారమువలన లాభమేమనినయడల- మానవుడు తన పరమార్థ వాస్తవస్వరూపమగు, అఖండపరిపూర్ణ ఆత్మ లాభమును పొందగలుగును. ఎట్లనిన:—



శ్లో॥ సర్వసంకల్పసంశాంతే, సర్వంబ్రహ్మేతినిశ్చయే।
భావయేదేకమాత్మానం, నిర్మలాకాశవత్సదా॥



శ్లో॥ నాహందుఃఖీనమేదేహః, బంధఃకఃస్యాత్మనిష్ఠితః।
ఇతిభావానురూపేణ, వ్యవహారేణముచ్యతే॥

శ్లో॥ దృశ్యం హ్యాదృశ్యతాంనీత్వా, బ్రహ్మాకారేణ చింతయేత్ ।
చిత్తం హ్యాచిత్తతాం ప్రాప్య, బ్రహ్మాకారేణ భాసతే ॥

శ్లో॥ దృశ్యం నాస్తీతినిశ్చిత్య, సర్వం బ్రహ్మేతినిశ్చయే ।
ఏకతత్త్వఘనాభ్యాసాత్, ప్రాప్నువన్తిపరం పదమ్ ॥

అని శ్రీ వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు—

వేదశాస్త్రములిట్లెంతగా జీవునికి, తన సుఖస్వరూపమును తత్సాధనములను బోధించుచున్ననూ, "ధనమూలమిదంజగత్" అను లోకోక్తిననుసరించి ప్రతి మానవుడునూ, తనకున్నదానికన్న అధికధనము కోరుచుండును. ఇదియే ఆశ. ఈ ఆశవలననే మానవుడు లోకమున బంధింపబడుచున్నాడు. "ఆశయాబధ్యతేలోకః" అను లోకోక్తిగూడయున్నది. ఈ ఆశ దోషమెరుగదు. ఈ ఆశకు ప్రధానకారణము స్వలాభాపేక్షయేకాని యీ అధిక ధనాపేక్ష స్వలాభసాధనముకాదు. ఉన్న ధనమునుగాని, అవాంఛితముగ సంప్రాప్తమైన ధనమునుగాని అనుభవించుటయందు దోషమును, శాస్త్రమే చెప్పుటలేదు. మరే మనిని ధన వ్యామోహితుడు కాగూడదనియూ,తన స్థితి, శరీరధారణలకు కావలసినధనముకన్న, నెక్కువ ధనార్జనా వ్యసనము నొందగూడదనియూ తెలుపుచున్నది. కాని మానవుడు తనకున్నట్టి ధనముతోడ తృప్తినొందజాలకున్నాడు. ఏలనన — తనకు కావలసిన సుఖమంతయూ యీ ధనముతోడ చేకూరునను యుద్దేశ్యముతోడ అందరునూ సర్వదా యీ ధనమునే కొరుచుందురు. గృహ కనక వాహనాభరణ విత్త క్షేత్ర పశుధాన్యాదులన్నియూ ధనమని వ్యవహరింపబడుచున్నవి. కాని యిట్టివియన్నియూ ఆయా జీవులయొక్క ప్రారబ్ధఫలానుభవములకు, వారివారి కర్మఫలానుసారమే కలుగుచుండును గాని, కోరుకున్నంతమాత్రమున రావు. ఈ భోగ భాగ్యములనునవి జీవాజ్ఞాన కల్పితమాత్రములు. జీవునికిట్టి అజ్ఞానమును పోగొట్టుటకే "సర్వం ఖల్విదం బ్రహ్మ, నేహనాస్తికించన" యని వేదమాత తెలుపుచున్నది. అయిననూ ధనము, దానివలన తాత్కాలిక లాభసుఖములు, యింద్రియ ప్రత్యక్షములు

గనుక ఏవిధముగనైను ధనార్జనయందిచ్ఛాపరులగుచు రాగద్వేషాదిక్లేశముల తోడ మానవులు ధనమును వారి స్వలాభసుఖముకొరకు కోరుచుందురు. పైన తెలిపిన ధనస్వరూపమంతయు తదితరదృశ్యముతోబాటు బ్రహ్మ వివర్తమే కాని వేరుకాదు. పరమార్థవాస్తవమున సర్వము బ్రహ్మస్వరూపమేకదా. కాని- ఇదియే మానవుని అనాది అజ్ఞానాచ్ఛాదితమగుటచే గృహ కనకా భరణ వాహన పశుధాన్య విత్తక్షేత్రాది, భిన్న భిన్న నానారూపముల భాసించు చున్నదిగాని యీ ధనాది రూపమున నున్నదంతయు పరమార్థ వాస్తవముకాదని తెలిసికొనలేకున్నాడు. కావుననే యెంత ప్రజ్ఞావంతులైన ధనికులైనను, వారు అతి పామరత్వ వ్యామోహములతోడ ప్రేమించుచున్నట్టి పుత్ర కళత్ర, ధనాదులన్నిటినీ, ఇచట విడచియే మరణించుచున్నారు. కాని మరణా నంతరము గూడ "అహం" నేను అను తాను మాత్రము మిగులుచున్నాడు. నేను అను తాను నశించుటలేదు. ఈ విచారమంతయు లోగడనే చేసియుంటిమి. కావున వివేకులు గ్రహించవలసినదేమనిన "అహం" నేను అను తాను నిత్యు డనియు, నాది అనగా తనది అనుకొనబడుచున్న ధనాదులన్నియూ, అనిత్య ములు తన ప్రారబ్ధఫల భోగ సాధనములు మాత్రమేనని బాగుగ శాస్త్రము వలన గ్రహించి,దానిని స్వానుభవమునందుంచుకొని ధనమందతి వ్యామోహితులుగాక ప్రారబ్ధాను సరణమున, సంప్రాప్తమగు ధనాదులతోడ సంతుష్ట చిత్తులగుచు ముముక్షువులగువారు, వారి, వారి సాధనాభ్యాసముల నాచరించుచుండుటయే వివేకము. తాను మాత్రము నిత్యము, స్వశరీర ధనాదులు అనిత్యములు. అను నిశ్చయము నొందుటయే నిత్యానిత్య వివేకమనబడును. ఈ నిత్యానిత్య వివేకమే, వైరాగ్యమునకు సాధనము. మానవునకు యీ వైరాగ్య సంపత్తి కంటె అధిక ధనము, బంధువులులేరు. ఈ విషయమునే "నవైరాగ్యాత్పరో బంధుః నసంసారాత్పరోరిపుః" అను ఆర్ష వచనము తెలుపుచున్నది. అనగా మానవునకు వైరాగ్యముకన్న అధిక బంధువుగాని, సంసారముకన్న అధిక శత్రువుగాని లేవని తెలుపుచున్నది. సంసారమనగా ఈ స్వశరీరాది, ధనాది సర్వమందునను వాస్తవ బుద్ధినొంది, వీటికొరకు, వీటియందు తాను రాగ

ద్వేషాది సక్తతాభిమానుడగుచుండుటయేగాని, అవి యుండుట మాత్రమే సంసారముకాదు. కావున జిజ్ఞాసువు తన ప్రారబ్ధ కర్మ ఫలానుసారమున ధనాదులచే తనకు కలుగు సుఖమునూ, వాటి నష్టముచే తనకు కలుగు దుఃఖమునూగూడ, యివి తనకు నిమిత్త మాత్రములుగా వచ్చినవేగాని యివి యన్నియూ తనకు నిత్యము, సత్యము కావను నిశ్చయమును వేద శాస్త్రజ్ఞానాభ్యాసమువలన సంపాదించవలసియున్నది. బ్రహ్మాండమంతయూ పరమాత్మ స్వరూపము. తదన్యబుద్ధి కల్పితము, అవాస్తవము. ఇట్టి జ్ఞానము విచారైకలభ్యము. జగత్తు సత్యమను భ్రాంతి దొలగినప్పుడు స్వాత్మయందధ్యస్తమైన కర్తృత్వ భోక్తృత్వ స్వరూపమగు ద్వైతబుద్ధి నశించి స్వశరీరాది ధనాదులయందు నిరభిమానత కలుగుచుండును. అప్పుడు ధన స్వరూపము అవాస్తవముగ గోచరించును. జిజ్ఞాసువునకు ఈ ధనాశ ప్రబల బంధహేతువు. కావుననే, దీనిని తొలగించుటకు ఈశావాస్యమందు ప్రప్రథమముననే "ఈశావాస్యమిదం సర్వం, యత్కించ జగత్యాం జగత్, తేనత్యక్తేనభుంజీథా మాగృధః కస్య స్విద్ధనమ్" ఈ ప్రపంచ రూపమున నున్నదంతయూ బ్రహ్మస్వరూపమే. అనగా బ్రహ్మయందే యీ సమస్త బ్రహ్మాండము, సకల పదార్ధములు అధ్యస్తముగా నున్నవిగాని, వాస్తవములుకావు. దీనికంతయు వాస్తవము అధిష్ఠానము బ్రహ్మయే. కావున సకలము, బ్రహ్మనుగా తెలిసికొని, అవాస్తవము, ఆభాస మాత్రమగు ధనాదికమందు కాంక్షనొందవలదు. ధనమంతయు బ్రహ్మస్వరూపము. ఇది యెవరిదియునూగాదు. కాన నీ ధనమునుగాని పరుని ధనమునుగాని నెప్పుడును కాంక్షింపవలదు. ధనమందెవరికినీ వాస్తవమగు స్వత్వములేదు. ఈ ధనము వాస్తవమున నెవరిదినికాదు. పరిదృశ్యమానమంతయు మిథ్యామాత్రమే గనుక, సర్వమును బరిత్యజించి, అనగా అసంగుడవై అనుభవింపుము. కాని ధనాదులయందు వ్యామోహితుడవగుచు కాంక్షింపవలదను తాత్పర్యార్థమును శ్రుతిమాత బోధించుచున్నది. కావున జ్ఞానాభ్యాసకులీ రహస్యమును బాగుగ తెలిసికొని, ప్రపంచ వ్యామోహితులుగాక, వారి బ్రహ్మను సంధానాభ్యాసాదులను, స్థిరచిత్తులై నిత్యాభ్యాసము నాచరించు

చుండిన కాలక్రమమున ఈ మాటల వాస్తవికత గోచరించుచుండును. కాల పరిపాకమున, "నాభివాంఛామ్య సంప్రాప్తం, సంప్రాప్తం నత్యజామ్యహమ్" మిథిలాయాం ప్రదగ్ధాయాం నమే దహ్యతి కించన" యను జనకులవారి ప్రసిద్ధ వచనములకు వాస్తవార్థము స్ఫురించుచుండును. కాని యట్టి స్వాను భవము నొందుటకు జన్మల లెక్కతోడ ప్రారబ్ధాంతము వరకు నభ్యాసాదుల చేయుచుండవలయును. జీవునకు "బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా" యను స్వానుభవ జ్ఞానముకన్న సంపాదించతగినది, సంపాదించవలసినది, పదు నాలుగు భువనములయందునను లేదు.

ఏలనన ఈ బ్రహ్మాండమంతయు వెదకి చూచినను పరమార్థ సత్యమగు పదార్థము ఒక్క అహం, అహం, నేను, నేను, అనుకొనునట్టి జీవుని పరమార్థ వాస్తవ స్వరూపమగు, బ్రహ్మ పదార్థము దప్ప మరేమియునులేదు. జీవత్వము కల్పితముగాని పారమార్థిక జీవుడు నిత్యుడు, వాస్తవుడు. ఈ జీవుని పరమార్థ వాస్తవ స్వరూపమే నిత్య నిర్వికార అఖండ పరిపూర్ణానంద స్వరూపము. ఇదియే ఆత్మ. ఇదియే పరమాత్మ స్వరూపము. అయినను ఇట్టి పరమాత్మ స్వరూపమే మాయా ప్రభావము వలన జీవ ప్రపంచములుగ తోచుచున్నది. ఇందు పార మార్థిక జీవుడు సత్యముగను, తక్కిన దృశ్యమంతయును అసత్యముగను నున్నవి. కాని ఈ రెంటికిని అధిష్ఠాన స్వరూపము పరమాత్మయే. జీవుని ఇట్టి పరమాత్మ స్వరూపమే తన అనాది జీవాజ్ఞానముచే అనాత్మరూపమగు స్వశరీర సర్వ ప్రపంచము వలన ఆచ్ఛాదితమై జీవునకు తన పరిపూర్ణానంద స్వరూపమును కప్పిపుచ్చుచున్నది. వాస్తవ మాలోచించిన యెడల ఈ ప్రపంచ మంతయు ముఖ్యముగ, ఆత్మ- అనాత్మ, యను రెండు ప్రధాన భాగములుగ నున్నదిగాని మూడవది ఏమియునులేదు. ఇందు ఆత్మజ్ఞాన స్వరూపము. (Knowledge) జీవుని పరమార్థ స్వరూపము అఖండానంద స్వరూపము. (Spirit) అనాత్మ స్వశరీర సర్వ ప్రపంచము. ఇది పరిచ్ఛిన్న భిన్న భిన్నవివిధ నానా స్వరూపము, జడము (matter) అజ్ఞానము, (Ignorance) ఇది అజ్ఞాన రూపము, దుఃఖము. ఈ జ్ఞానాజ్ఞాన స్వరూపములగు ఆత్మానాత్మలు ప్రకాశాంధ

కారములవలె విరుద్ధ స్వభావములైనను ఇందు జ్ఞానము సహజము, వాస్తవ ముగను, అజ్ఞానము అసహజ అవాస్తవముగను, అనగా కల్పిత మైనదిగను, నుండుటచే ఈ రెండునూ, మందాంధకారమున రజ్జువునందు తోచునట్టి సర్పభ్రాంతి లాగున చేరి ఈ ప్రపంచమున భాసించుచున్నవి. అనగా ఈ స్వశరీర సర్వ ప్రపంచము సత్యానృత మిశ్రితమైయున్నది. ఇందు జీవునియొక్క పరమార్ధ వాస్తవ స్వరూపము మాత్రమే అఖండ పరిపూర్ణానందాత్మ. తక్కినదంతయు జీవుని భ్రాంతి మాత్రముగ నున్నది. ఈ రెండును కల్పితముగ చేరియే ఈ ప్రపంచ వ్యవహారమంతయు నడచు చున్నది. కనుక ప్రపంచము, ప్రపంచ విషయములన్నియు కల్పితములగుచు అనిత్యములగుటచే వాటివలన కలుగుచున్నట్టి సుఖాద్యనుభవములు గూడ అనిత్యములే యగుచున్నవి. అయినను మానవుడు తన సుఖముకొరకు ప్రపంచ విషయములనే కోరుచుండును. దుఃఖము నెవ్వరును కోరరుగదా! అయినను ప్రారబ్ధానుసారమున దాని యనుభవము తప్పదు. ప్రాపంచిక సుఖ దుఃఖాను భవములు ప్రారబ్ధాధీనములు. "యథాకర్మ యథాశ్రుతమ్" అను వచనము దీనినే తెలుపుచున్నది. వాస్తవమున జీవునకు తన పరమానంద స్వరూపమగు స్వస్వరూపము అజ్ఞానముచే నాచ్ఛాదింపబడి యుండుటచే తన వాస్తవ సుఖ స్వరూపమును మాయావివశుడై తెలిసికొనలేక తస సుఖముకొరకు విషయ ములనే కోరుచుండును. కాని ప్రాపంచిక విషయములవలన కలుగు ఆనందము ప్రాపంచిక విషయముల లాగుననే ఆభాసమాత్రమే యగును. అనగా వాస్త వము, నిత్యము కాజాలదు. ఏలనన ఈ విషయ భోగానుభవములు జీవునకు కల్పితములు, నిమిత్త మాత్రముగ వచ్చినవేగాని వాస్తవముగాదు. కల్పిత పదార్థ మెన్నటికిని నిత్యము, సత్యము, కాదుగదా? కావున వివేకియగు మానవుడు ఈ విషయమును శాస్త్రీయముగ గ్రహించి, తన వాస్తవ స్వరూప మగు అఖండ పరిపూర్ణానంద రూపము నొందుటకు కల్పితమగు ఈ స్వశరీర దృశ్య భ్రాంతిని నివర్తింపజేయవలయును. అప్పుడు తన పరమార్థ వాస్తవ స్వరూపము అఖండ పరిపూర్ణానందమగు పరమాత్మ స్వరూపమేనని తెలియును.

కాని ఇట్లు స్వాత్మజ్ఞానము నొందుటకు తన అనాది అజ్ఞాన నిర్మూలన మావశ్యకము. ఏలనన ఈ అజ్ఞానమే తన జ్ఞాన స్వరూపమును కప్పిపుచ్చి ప్రపంచ రూపమున భాసింపజేయుచున్నది. అనగా జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడి యున్నది. కావున జీవుడు దృశ్యముతోడ వ్యామోహితుడగుచున్నాడు. దీనినే "అజ్ఞానేనావృతం జ్ఞానం, తేన ముహ్యంతి జన్తవః" అను భగవద్గీతా వాక్యము స్పష్టము జేయుచున్నది. కాన మానవుడు, స్వశరీర సర్వ దృశ్యానుభవములతో వ్యామోహితుడు గాక, వాటియొక్క అవాస్తవిక అనిత్యత్వములను బాగుగ గ్రహించుట మూలమున తన అజ్ఞానావరణమును నివర్తింప జేసికొన వలసిన భారము మానవునియందే యున్నది. సశాస్త్రీయముగ సద్గురు ప్రసాదము వలన జిజ్ఞాసువు, ఈ స్వశరీర సర్వదృశ్యము వాస్తవమను భ్రాంతిని నివర్తింప జేసికొనగలిగిన యడల యీ స్వశరీర సర్వ దృశ్యమంతయును, వానిచే కలుగునట్టి సుఖ దుఃఖాద్యనుభవములును మృతప్రాయమగును. అప్పుడు శాంత చిత్తుడై తన స్వస్వరూపాను సంధానాదుల నొనర్చ గలుగును. ఇట్టి అనుసంధానాద్యభ్యాస పాటవముచే కాల క్రమమున తన స్వస్వరూపానందమును నొందగలుగుచుండును. అట్టితరి మృతప్రాయమగు, నీ దృశ్య, దృశ్యానుభవము తనకు దుఃఖ కరముగాక అంతయు, నానంద స్వరూపమున భాసించుచు తన ప్రారబ్ధాంతమున అద్వితీయానంద అఖండ పరమాత్మ స్వరూపుడే యగును. జీవునకు తన స్వస్వరూపమగునట్టియు, నిత్య నిరతిశయానంద స్వరూపమగునట్టియు, జీవబ్రహ్మైక్యబోధయందే పరమ తాత్పర్యము గలది యగుచు వేదమాత "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా నేహనానాస్తి కించన" "మాయా మాత్రమిదం ద్వైతం అద్వైతం పరమార్థతః" "జీవో బ్రహ్మైవనాపరః" అని స్పష్టముగ తెలుపుచున్నది. ఈ వాక్య బోధను బాగుగ గ్రహించి తల్లాభమును పొందుట, లేక ఉపేక్షించి నష్ట, కష్టములు నొందుటయను బాధ్యత పురుషునియందే యున్నదిగాని, దైవమునందు లేదు. కుమారునికి తగినట్లు తండ్రివిద్యాధనముల నివ్వగలడుగాని, వానివినియోగము అనగా బాగుపడుట చెడుటయను భారముకుమారునిదేగదా. పరమార్థవిషయమున మానవునిస్థితిగూడ

యిట్టిదే, యని పై శ్రుతి వచనములనుబట్టి శాస్త్ర బోధానుసరణమున ఇంత వరకును సంగ్రహముగ వివేచన గావించియుంటిమి. ఇంక యీ సిద్ధాన్త విషయ దార్ఢ్యమునకుగాను లోకానుభవమును గూడ విచారించుదము.

ఇంతవరకును మనము చేసిన విచారమునుబట్టి పరమార్ధవాస్తవమున జీవుడు అఖండ పరిపూర్ణానందస్వరూపుడనియు, జీవుడు తన అజ్ఞానమువలన తాను విధిగాననుభవించవలసినట్టి ప్రారబ్ధ సుఖ, దుఃఖ, ఫలానుభవములకు యీ జగత్తు నాటకరంగమువంటిదని తెలిసికొనియుంటిమి. ఆధునికులగువారు కొందరును, పాశ్చాత్యదేశీయులునుగూడ "The world is a stage" అనగా యీ ప్రపంచము నాటకరంగమువంటిదని ఒప్పుకొనుచున్నారు. అయినను ఇట్లు చెప్పుటయు బోధించుటయునేగాని స్వానుభవమున దీనిని గుర్తించునట్టి వివేకులు అరుదుగనున్నారు. నాటకరంగము యెవరికిని శాశ్వతముకాజాలదు గదా? అయినను జీవుడు తన అజ్ఞానముచేత తనకిది శాశ్వతమని మరణించు వరకును వ్యామోహితుడగుచుండును. ఇదియే అజ్ఞానము. ఇదిగాక- నాటక రంగమందు నటుడు నల, హరిశ్చంద్ర, దుష్యంతాది చక్రవర్తుల పాత్రల నెంతనై పుణ్యముగ నటించినను తాను వాస్తవమున రాజగుటలేదుగదా? ప్రతాపరుద్రీయ నాటకమందు పిచ్చివానిపాత్రయగు యుగంధరవేషమునటించిన మాత్రమున, వాస్తవమున ఉన్మత్తుడుకాడు. కాని తాను వాస్తవమున ఉన్మత్తు డననుకొనుటకన్న అవివేకమున్నదా? అయినను యీ ప్రపంచనాటకరంగ మందు జీవుడు అను రాజనటుడు తన పాత్రపోషణమునకు కావలసినట్టి కిరీటము, రాజవస్తులు, సింహాసనము, ధనాగారములు, సామంతులు, మొద లగు నుపకరణములను తనవేనని భ్రమజెంది వ్యామోహితుడగుచు, వాటియందు రాగద్వేషాభిమానుడగుచు సక్తతాభిమానముల నొందుచున్నాడుగాని తన పాత్రాంతకాలము (జీవితాంతము) నందు సమస్తమును తాను యీ జగన్నాటక శాలయందే యుంచి వెళ్ళవలయునను అంశమును మరచి వీనియందతి వ్యామోహితుడగుచు సంకల్ప వికల్పములను చేయుచుండును. ఇట్లు మానవుడు తన కవాస్తవమగునట్టి యిట్టి జగన్నాటక సంభారములయందు వృధావ్యామో

హితుడగుచు తనకు భావిసంసారబంధమును సంపాదించుకొనుచున్నాడు. ఇది జీవునకు తన అజ్ఞానముచే అనాదిగ జరుగుచున్నది. కావున వివేకియగు జీవుడు యీ ప్రపంచనాటకరంగమందు తనకిప్పుడు కలుగుచున్న ఐశ్వర్యాది సంభారములు, అనుభవములు, నాటకరంగశాలలోనివంటివని శాస్త్రజ్ఞాన పూర్వకముగ తాను నిశ్చయమునొంది వీటినన్నిటిని తన జీవయాత్రా నాటక పాత్రకు మాత్రము కావలసిన సంభారములని తెలిసికొని యనుభవించుటయే వివేకము. అట్టియెడ యీ నటుడు నాటకరంగమందు తన పాత్ర నిర్వహణము పూర్తిఅయినవెంటనే ఆ పాత్రసంభారములన్నియు నిరభిమానముగ నాటక శాలలోనేయుంచివెళ్లి తన వాస్తవానుభవముల నెట్లుచేయగలుగుచుండునో అట్లే యీ మానవ విద్వన్నటుడు నిరభిమానముగ తన జీవిత పాత్రపోషణను గావించుకొనుచు జీవితాంతమును సంకల్పక్షీణుడై వాస్తవస్థితి నొందగలుగును. ఇదియే జీవునకు తన వాస్తవస్వరూపమగునట్టి పరమానందప్రాప్తికి సాధన మగునని వివేకులందరును గ్రహింతురుగాక.

మానవులీప్రపంచమును కార్యకారణములను భేదముతోడ ననుభవించు చుందురు. కాని శ్రుతి "మాయామాత్రమిదంద్వైతమ్, అద్వైతం పరమార్థతః" "నేహనానాస్తికించన" యని వాస్తవమున రెండవపదార్థమనునదియే లేదను తాత్పర్యార్థమును తెలుపుచున్నది. కావున వాస్తవమున యీ కార్య కారణములు ఒక్కటియా రెండాయని విచారించవలసియున్నది. ఏలయన అద్వైతసిద్ధాంతము యీ వాస్తవభేదమునొప్పదు. ఒప్పినయడల సిద్ధాంత మునకే భంగము. కాని అనుభవము కలుగుచుండగ యివి వాస్తవముగాపని తెలిసికొనుట యెట్లనిన, మనకు కలుగుచున్న స్వానుభవమునుబట్టియే తెలిసి కొనవచ్చును. స్వప్నానుభవములు అందరకును స్వానుభవములోనున్నవే. స్వప్నదృశ్యములను పరిపరివిధముల ననుభవించుచుందురు. ఇట్లనుభ వించుటలో తానువేరు, తనచే ననుభవించబడునట్టి రథ గజాశ్వములు, దారులు, యివి యన్నియు వేరుగయున్నట్లేగదా యనుభవించుచున్నారు? స్వప్నమందు తనకు సంతానము కలిగినట్లు చూచుచు తాను కారణము, తన

సంతానము కార్యము అను భేదముతోడనేగదా యనుభవించుచున్నాడు? కాని కారణమగుతాను వేరుగను, కార్యమగు తన సంతానము వేరుగను, వేరువేరుగ నచట అప్పుడు లేరుగదా! ఉన్నది తానొక్కడేగదా! కారణమగు తనయందే రథ గజాశ్వములను, కుమారుని, చూచుచున్నాడేగాని యవి తనకంటె నచట భిన్నముగ లేవుగదా? అయినను వేరుగనున్నట్లు చూచి యనుభవించు చున్నాడు. ఇదియే మాయ. అజ్ఞానము. అనుభవించుచుండినమాత్రమున ఆ పదార్థములు వాస్తవముగ నుండనక్కరలేదని లోగడనే నిరూపించియుంటిమి. స్వాప్నికుడు వివిధదృశ్యములతో, ఆకాశ, సముద్ర, భూమండలాదులను, జీవించిన, మరణించిన, సమస్తజీవులను చూచుచు వేలమైళ్లదూరములోనున్న ప్రదేశములను, సంఘటనలను, తనలోనే జూచుచు తన స్వప్నానుభవములను సత్యమైనవానివలెనే అనుభవించుచుండునుగదా! ఇట్టితరి కారణ రూప మున నుండి కర్తగా ననుభవించుచున్నట్టి తానును, కార్యరూపమున నుండి యనుభవింపబడునట్టి సమస్త దృశ్యమును తానొక్కనియందేగదా స్వప్నమందు గనబడుచున్నది. అచట వాస్తవముగనున్నది స్వాప్నికుడగు తానొక్కడేగాని, స్వప్నదృశ్యమంతయు తన ధీకల్పితమై వాస్తవమైనదానివలె గనుబడుచు ననుభవింపబడునదంతయు అవాస్తవమేగదా కావలయును? స్వప్నదశయందు కార్యకారణములు రెండును తానొక్కడేగదాయగుచున్నాడు? అనగా చూచునట్టితానును, తనచే సత్యమైనదానివలె జూడబడునట్టి దృశ్యమును రెండును ఒక్కటియేగదాయగుచున్నవి! ఇది యిట్లుండ మానవునకు జాగ్ర త్ప్రపంచ, స్వప్నప్రపంచములు అవస్థాభేదముచే వైలక్షణ్యముగ గనబడు చున్నను, ఆయా అవస్థానుభవములనుబట్టి విశేష తారతమ్యము గనబడదు. ఏలనన స్వకాల సత్యత్వము రెంటికిని సమానమే. అవస్థాంతర, కాలాంతరము లందు రెండును మారుచు లేనివేయగుచున్నవి. స్వప్న జాగ్రత్ పదార్థములు రెండును ధీకల్పితములే. కావున యీషద్భేదమున్నను, స్వప్నజాగ్రదనుభవములు దాదాపు ఒక్కవిధముగనే గలుగుచు ఆయాకాలములందు యేకవిధముననే అనుభవములనిచ్చుచుండును. కావున యీదేశకాలనిమిత్తములు, కర్తృత్వ

భోక్తృత్వాద్యనుభవములన్నిటికిని తానే కారణమనియు, కార్యకారణమను రెండుపదార్థములు వాస్తవముగ లేవనియు నీ వివేచనవలన స్పష్టముగ గ్రహించవచ్చును.

అద్వైత సిద్ధాంతము మానవునకు ఈ ప్రపంచము భాసించుట లేదని ఎన్నడును చెప్పుటలేదు. మరేమని తెలుపుచున్నదనిన- ఈ స్వశరీర సర్వ ప్రపంచము శబ్ద చలన చిత్రము అనగా సినిమాలో కనబడునట్టి దృశ్యము లాగున వాస్తవము గాదని తెలుపుచున్నది. కాని సినిమా వాస్తవమని ఎవ్వరును చెప్పుటలేదు. ఈ కాలమున సినీమా ప్రపంచమందరి యనుభవములో నున్నదియేగదా? సినీమా కనబడుచుండగ లేదనుటెట్లు? కాని అందులో నగుపడు జీవరాశి యంతయును, వివిధ దృశ్యములును వాస్తవము కాని యట్లు, ఈ ప్రపంచము వాస్తవము గాదని పసిబాలునకు తెలుపుచున్నట్లు మానవులకు శ్రుతి బోధించుచున్నది పసిబాలుడు తన అజ్ఞానముచే సినీమా చూచుచు ఆదృశ్యములన్నియు వాస్తవమని భయపడుచుండునట్లు, మానవుడీ ప్రపంచ దృశ్యానుభవములను వాస్తవములుగ దలచుచుండుటచే జీవునకీ భయక్లేశాది దుఃఖము కలుగుచున్నది. కాని ఈ ప్రపంచ వాస్తవ స్వభావమునుబట్టి కాదు. కాగా- సినిమా దృశ్యములను చూచి భయపడునట్టి పసిబాలునకు తల్లి చెప్పునట్లు వేదమాత మానవులకు బోధించుచున్నది. ఎట్లు వాస్తవము కాదో విచారించుదము. విచారించి చూచిన యడల సినీమా దృశ్యములలోని మహా సముద్ర, ఆకాశ భూమండలాదులును, జలపాత భూకంపాదులు అగ్ని పర్వతములు జ్వాలలును, జీవరాశి యంతయును, యుద్ధాది ధ్వంస విధ్వంసములును, అతి మనోహర, అతిఘోర దృశ్యములు మొదలగునవన్నియు, అచట ఎదరనున్న, షుమారు పది పన్నెండడుగుల తెల్లగుడ్డ తెరమీదనేగదా కనబడుచున్నవి. కాని వాటిని మనము చూచునప్పుడు తాత్కాలిక ఆనందానుభవములను పొందుచున్నను అచట వాస్తవముగనున్నది ఒక్క తెల్లగుడ్డ తెరయేకదా? సినీమా అవాస్తవమని తెలిసియు, తాత్కాలిక సుఖ దుఃఖాద్యనుభవములను పొందుచున్నాము. కాని ఆ దృశ్యములు, ఆ

దృశ్యముల వలన కలుగుచున్న అనుభవములు గూడ అవాస్తవమేగదా యగుచున్నవి. ఇచట ఒక విషయము ముఖ్యముగ గమనించవలసినదేమి యనిన, ఈ సినీమా తెల్ల తెరమీద రంగులు, చలనములు, కాల్పులు, జలతరంగములు, అగ్నిజ్వాలలు, గాలి వానలు కనబడుచున్నను యివి యేమియు ఆ తెరయొక్క శ్వేతవర్ణమును, స్థితిని మార్చుటగాని, జలముచే తడపబడుటగాని, అగ్నిచే కాల్పబడుటగాని, జరుగక ఆశ్వేతాంబర పటము ఒక్క తీరుననే నిర్వికారముగ యుండునట్లు, జీవుని పరమార్థ స్వరూపమగునట్టి ఆ పరమాత్మయందే, ఆయనకు వీటివలన యెట్టి వికారము, అనగా మార్పులేక, ఈ స్వశరీర సర్వ దృశ్యము, వాటి యనుభవములు కలుగుచున్నవని గ్రహించవలెను ఇప్పుడు జీవస్వరూపముననున్న పరిపూర్ణానంద స్వరూపుడగు ఆ పరమాత్మ ఎన్నడును ఎట్టి మార్పునుచెందడు. ఆయనకు మార్పుననది యిదివరకులేదు, యికముందు యుండదు. అనగా ఎన్నటికినీ కలుగదు. ఇంకనూ సినీమా తెరను విడచి ఒక్క బొమ్మయైనను కనుబడక, సర్వ చిత్రములు ఆ తెరయందే కనబడుచున్నట్లు, ఈ స్వశరీర సర్వ ప్రపంచము జీవుని పరమార్థస్వరూపమగు ఆ పరమాత్మయందే యున్నది గాని ఆ పరమాత్మను విడచి యీ దృశ్యములేదనియు, తెల్లగుడ్డ తెరమీద చీకటిపోయి దీపప్రకాశముపచ్చి బొమ్మలగుపడుట ఆగగనే శుద్ధతెర దాని యంత అదియే కనబడునట్లు, జీవునకు తన అవిద్యయను అజ్ఞానము నశించి విద్యయను జ్ఞానప్రకాశము కలుగగనే, నిత్య, నిర్వికార, అఖండ, పరమానంద స్వరూపమగు తన ఆత్మస్వరూపము దానంతటది, యేప్రయత్నములేక సర్వదా ప్రకాశించుచుండును. సినిమాదృశ్యమునకు తెల్లగుడ్డతెర యెట్లధిష్ఠానమో, అట్లే ఈ సర్వజగత్తునకు, జీవుని పరమార్థస్వరూపమగు బ్రహ్మస్వరూపమధిష్ఠానమని గ్రహించి, యీ స్వశరీర సర్వదృశ్యమును, కల్పితమాత్రమని గ్రహించవలయును.

ఇంకనూ స్వాప్నికుడు వ్యవహారమునందు వాస్తవుడై యున్ననూ, తనకు కలుగుచున్న స్వప్నదృశ్యములు, స్వప్నానుభవములన్నియు అవాస్త

వములైననూ స్వప్నకాలమందుమాత్రము వానినన్నిటిని వాస్తవమను భ్రాంతి తోడనేగదా యనుభవించుచున్నాడు. ప్రాదేశపరిమితిగల జీవునియందేగదా స్వప్నప్రపంచమంతయు కనుబడుచు స్వకాల సత్యత్వానుభవము నిచ్చుచున్నది. స్వకాలసత్యత్వము- జాగ్రత్స్వప్నములు రెంటికినీ సమానము. స్వప్నపదార్ధములు, వాటి యనుభవముగూడ నిద్రనుంచి మెలకువ వచ్చినప్పుడేగదా, అవియన్నియూ వాస్తవముగాదని తెలియుచున్నది. కాని కలలోయున్నంత కాలము స్వప్నానుభవములు అవాస్తవమని యెవరునూ గ్రహించుటలేదు. నిద్రావస్థనుంచి జాగ్రదవస్థకు మారినప్పుడు స్వప్నదృశ్యానుభవముల అవాస్తవికతను మనము గ్రహించగలుగుచున్నాము. ఇట్లే అజ్ఞానమున్నంతకాలము ప్రపంచ, అసత్యత్వము తెలియదు, కనుబడదు. కాని జీవుడు తన శాస్త్రీయ వివేకముచే ఆత్మజ్ఞానమును పొందినయెడల యీ ప్రపంచ అవాస్తవికత గోచరించును. ఇట్లే సినిమాలో దృశ్యమంతయు చీకటియున్నప్పుడే కనుబడునుగాని వెలుతురు రాగానే బొమ్మలు కనుబడవు. ఇట్లే మానవునకు ఆత్మజ్ఞానమను ప్రకాశము కలుగగనే యీ ప్రపంచ సర్వదృశ్యములు వాస్తవముగ కనుబడవు. అవి అవాస్తవములని తెలిసినప్పుడు, కనుబడినను భయము నొందడుగదా? కాని జీవుడు అజ్ఞానములో యున్నంతకాలము ఈ ప్రపంచ దృశ్యానుభవములన్నియూ వాస్తవముగతోచుచు, వానియందు సక్తతాభిమానములతోడ సంసారదుఃఖము నొందుచుండును. మరియునూ కనుచీకటిలో త్రాడుయందు భ్రాంతిచే తోచెడి సర్పము, సర్పావయవములు, చలనాదులుగూడ, దీపసహాయముతో త్రాడును చూడగానే సర్పము అవాస్తవములేయగుచు ఒక్కరజ్జువయెగదా వాస్తవమున మిగులుచున్నది. అట్లితరిగూడ సర్పభ్రాంతి స్ఫురించుచున్నను సర్పము మృతప్రాయమైనదిగనుక దానిభయముండదు. ఇట్లే జీవుని పరమార్ధవాస్తవస్వరూపమున్నూ, అఖండ పరమానందస్వరూపమునగు బ్రహ్మయందే మాయాప్రభావముచే, జీవుని అనాది అజ్ఞానమువలన ఈ స్వశరీర సర్వప్రపంచము కనుబడుచున్నదిగాని పరమార్ధవాస్తవమున యున్నది ఒక్క బ్రహ్మపదార్ధమేతప్ప తదితరమేదియును వాస్తవముగ

లేదనియు, ఈ ప్రపంచమంతయు మాయామాత్రమనియు, బ్రహ్మస్వరూపము పరమార్ధవాస్తవమున నీవేననియు, నీ ఈ స్వరూపముతప్ప తక్కినదంతయు మాయాకల్పితమనియు, నీవు భయపడవలదనియు శ్రుతిమాత బోధించుచున్నది.

సినిమాదృశ్యమంతయు మనలకు చీకటి యున్నప్పుడే కనబడును గాని, దీపప్రకాశమున్నప్పుడు కనుబడనియట్లు, జీవునికి అజ్ఞానమున్నంతవరకే ఈ ప్రపంచదృశ్యానుభవములు వాస్తవమున కనుపించునుగాని, జీవుడు స్వాత్మజ్ఞానమునొందినపిదప, ఈ ప్రకాశముచే, ప్రపంచానుభములన్నియు మృతప్రాయములగుచు మాయామాత్రముగనుండును. వాటి సత్యత్వభ్రాంతి యుండదు. దృశ్యముకనుబడుచున్నను మృతసర్ప సమానమగును. ఈ ఆత్మ జ్ఞానప్రకాశము వలన దీప ప్రకాశముచే సినీమాదృశ్య మగుపడనియట్లు ఈ ప్రపంచమదృశ్యమగును. జీవుడప్పుడే దృశ్య సంసారభ్రాంతి భయమునుంచి విముక్తుడగుచు తన స్వస్వరూపానందమును పొందగలవాడగును. కావున జ్ఞానాభ్యాసకుడు కలలోగూడ నీ ప్రపంచము సత్యమను భ్రాంతి నొందక నిర్లిప్తతతోడ తన ప్రారబ్ధానుభవములజేయుచు తన పరమార్ధస్వరూపము ననుసంధానము చేయుచుండవలయును. ఇదియే పరమ ముక్తిసాధనము.

ఈ ప్రపంచమున తల్లిదండ్రులును, వారికి కుమారులు, కుమార్తెలును, భర్తకు భార్య, భార్యకు భర్తయు, మొదలగు సంబంధ బాంధవ్యము లన్నియు, జీవులందరును వారివారి జీవయాత్రామార్గమధ్యమున వారివారి కర్మ ఫలానుభవములకుగాను యీ ప్రపంచమునందు కలియుటనుబట్టియే కలుగుచు న్నవిగాని అన్యవిధమునకాదు. సూక్ష్మబుద్ధితోడ వాస్తవమాలోచించినయడల రైలుబండి ప్రయాణీకులవలె వారివారి కలియికలనుబట్టి స్నేహ, విరోధ, బాంధవ్యములన్నియు గలుగుచు నివియన్నియు వారి ప్రయాణమున్నంత కాలమే యుండునుగాని తరువాత సంబంధముండదుగదా? రైలుబండీవంటి యీ ప్రపంచ ప్రయాణముగూడనట్టిదే. ప్రయాణముతర్వాత "ఎవరికివారే యమునాతీరే" యనునట్లేగదా? యగుచున్నారు. జీవులందరును వారివారి కర్మ

ఫలముల ననుభవించుటకే యీ ప్రపంచమను రైలుబండిని అధిష్ఠించుదురు. కాని రైలు, ప్రయాణీకులకెవరికిని శాశ్వతముకాదుగదా? కాని దీని ప్రయోజనము ప్రయాణీకులకేగదా యగుచున్నది. ఈ ప్రపంచమున జీవుడిట్టి ప్రయాణీకుడే. ఈ జీవుల సంబంధబాంధవ్యములుగూడ నిట్టివే. కాని యీ సంబంధబాంధవ్యములు కల్పితములేయయినను సంబంధబాంధవ్యములనునవి లోకధర్మవ్యవస్థా పరిపాలన కావశ్యకమగుచున్నవి. లోకాభిప్రాయమునుబట్టి తల్లిదండ్రులు, భార్యాపుత్రాదులు, మొదలగు బంధుజనము వారి సుఖమునకు సాధకమని తలంచుచుందురు. ఇది లోకదృష్టినిబట్టి కొంతవరకు నిజమైనను వీరందరు అన్నికాలములయందును, అందరకును, కేవల సుఖసాధనమేగాక దుఃఖకారణముగూడ నగుచున్నారు. ఇది లోకానుభవమేగదా? వాస్తవమాలోచించిన ప్రతి జీవునకును ఈ సుఖదుఃఖానుభవములువారి స్వకర్మఫలముగా యేదో యొక రూపమున (నిమిత్తముగావించుకొని) సంభవించును గాని ఈ సుఖదుఃఖ ఫలములను ఒకరికి మరియొకరెవ్వరును నివ్వజాలరు. ఆయా జీవుల స్వకర్మ ఫలముగనే నివి కలుగుచుండును. ఎవరికర్మఫలమును వారే యనుభవింపవలయును గాని ఒకరి కర్మఫలమును మరియొకరెట్లనుభవించుట సాధ్యముఃకాదు. ఫలమును సంపాదించువాడే అనుభవించువాడగును. వేరొకనికి వేసినశిక్ష మరియొకడెట్లనుభవించును. అనుభవించుటకు వీలులేదుగదా! కాని లోకమునందు మంచికలిగినప్పుడు తామే కర్తలమనుకొనుచు, కీడు వాటిల్లినప్పుడు అనగా దుఃఖానుభవముకలిగినయడల అన్యకర్తృత్వమును ఆపాదింతురు. ఇది కేవల అవివేకము. ప్రతివారికిని వారివారి ప్రారబ్ధఫలానుసరణముననే సుఖదుఃఖములు కలుగుచుండునుగాని మరియొకతీరున కలుగవు. ఈ విషయమును స్పష్టపరచుటకుగాను మాగురువర్యులు తరచు నీ క్రిందిశ్లోకము నుదాహరించుచుండెడివారు.

శ్లో॥ సుఖస్య దుఃఖస్య నకోపిదాతా, పరోదదాతీతి కుబుద్ధిరేషా।
అహంకరోమీతి వృథాభిమానః, స్వకర్మసూత్రగ్రథితోహిలోకః॥

కనుక వివేకులగువారందరును తమతమ సుఖ దుఃఖానుభవములకు కారణము, తాము చేసిన కర్మఫలమేననియు, యిది అన్యముకాజాలదనియు బాగుగ గ్రహించవలయును. ఇట్టితరి యిప్పుడు వారికి కలుగుచున్న మిత్ర, శత్రుత్వ భావనలు క్షీణించుచుండును. కావున సమస్త సంబంధబాంధవ్యములను, తమకు కలుగు సుఖ దుఃఖాదులను, కల్పితములు, భ్రాంతిమాత్రములునని నిశ్చయముగ తెలిసికొనివానినన్నిటిని యీ జగద్వ్యాపారమునకు మాత్రము కర్తృత్వాది నిరభిమానులై ఉపయోగించుకొనుచుండుటయే వివేక లక్షణము. ఎట్టివారికైనను తనబాధ్యతా కర్తృత్వసహితానుభవములు భారముగను, తన కర్తృత్వ బాధ్యతలులేని అనుభవములు అతి సుఖముగను నుండును. ఇది లోకానుభవము. పరమార్థవాస్తవమున జీవుడు కర్తృత్వాదిరహితుడు. ఈ కర్తృత్వాదులు జీవునకు తన అజ్ఞానముచే కల్పితములు. కల్పితములుగావున,నవి నిత్యముకాజాలవు. వివేకులు దీనిని బాగుగ గ్రహించవలయును. మరియును అలవాటుపడిన ఎడ్లబండిలో ప్రయాణముచేయుచుండగ తోలువాడు నిద్రపోయినను ఎడ్లు వాటిమార్గమున దారితప్పక నవి పోవుచు, బండితోలువాడు లేచునప్పటికి చాలదూరముపోయి మార్గమున ముందుచోటికి చేర్చును. బండివాడును చేరును. కాని మార్గమధ్యములోనేమియున్నదియు, నేమిజరిగినదియు, తెలియకయే, తాను ముందుకుపోవగలుగును. ఇట్లే యీ ప్రపంచమను బండియందు మానవుడు దేనితోడను వాస్తవమున సంబంధపడక నిద్రించినవానివలె కూర్చుండిన, ప్రారబ్ధమను జోడెడ్లు వాటిదారిననవి పోవుచునేయుండును. కాని బండినితోలువాడు మేలుకొని వానినడపించుభారము తనకు తగ్గి సుఖముగ నిద్రించగలుగును. ఇట్లే మానవుడు తన ప్రారబ్ధమను ఎడ్లను, తోలుటయను కర్తృత్వమును, త్యజించి నిద్రించువానివలె సుఖముగనుండిన ప్రారబ్ధము జరుగుచునే తన ప్రపంచానుభవమును పొందగలుగును. ప్రారబ్ధము దారిన పోవు యెడ్లలాగున నడచుచునేయుండును. ఇట్టివానికి ప్రారబ్ధానుసరణమున అనుభవములు ప్రాప్తించుచునేయుండునుగాని వానితో సంబంధజ్ఞానములేకయే నడచుచుండును. ఏలనన- ప్రారబ్ధము బలీయము.

ఇంకనూ యీ ప్రపంచమను రైలుబండిలో మానవుడు తన ప్రారబ్ధమను మూటబరువుతోడ ప్రయాణముచేయుచున్నాడు. ప్రయాణము చేయు కాలములోగూడ తన ప్రారబ్ధమను మూటను తన నెత్తిననే యుంచుకొని బండిలోనుండుట యవివేకమేగదా? బండి నెక్కగనే తన నెత్తిమీదనున్న ప్రారబ్ధమను మూటను తలమీదనుంచి తీసి బండిలోనుంచినయెడల తనను, తనమూటనుగూడ రైలుబండియే తీసికొనుపోవునుగదా? నెత్తిమీదనే మూట నుంచుకొనినమాత్రమున రైలుకు భారము తగ్గదుగాని, యిట్లుచేయుటచే జీవునకు భారము హెచ్చును. పర్యవసానము, అనవసరమగు భారమును మోయుటయేగాని ప్రయోజనమేమియును లేదుగదా? కావున వివేకులగువారు బండి నెక్కగనే వారి తలమీదనున్న బరువుమూటను తీసి రైలునందుంచుటయే కర్తవ్యము. ఇందుకుబదులు తన ప్రారబ్ధమను బరువు మూటను తననెత్తి మీదనే యుంచుకొని రైలుబండి ప్రయాణమంతయు చేయుట అవివేకమే గదా? కావున వివేకులు తన ప్రారబ్ధమను యీ మూటయందు వారి కర్తృత్వాదులను బరువును వదలినయెడల, ఆ మూటబరువును రైలుపెట్టెవంటి యీ ప్రపంచమే భరించును. మానవుడు, తానెప్పుడు సుఖముగ నీ ప్రపంచ ప్రయాణమునుచేయ సమర్థుడగును. ఇదియే మానవునకీ ప్రపంచ ప్రయాణ వివేకము. జ్ఞానాభ్యాసకుడు తన నిత్యానిత్య వివేక బలముచే తన ప్రారబ్ధానుసరణమున జరుగునట్టి జగదనుభవములయందు తన కర్తృత్వాద్యభిమానములను జ్ఞానపూర్వకముగ త్యజించినయెడల యీ ప్రపంచ ప్రయాణభారము తనకుండదు. కావున జీవజగత్తులిట్టివియని వారి ఆత్మానాత్మ విచారపాటవముచే జ్ఞానాభ్యాసకులు బాగుగ గ్రహించి సుస్థిరులై వారి వారి స్వస్వరూపానుసంధానాభ్యాసములను చేయుచుండినయెడల కాలక్రమమున పరమానంద స్వరూపమగు ఆత్మానుభవము నొందగలుగుదురు.

కాని అభ్యాసకులకు నిచట నొకశంక కలుగవచ్చును. అదియేదియనిన పరమానందరూపమగునట్టి ఆత్మ సాక్షాత్కారము, మంత్రజప యోగసాధనములచే పొందవలయునుగాని, యీ విచారమువలన నేమిఫలమని సంశయము

తోచవచ్చును. కాని అది సరికాదు. ఏలనన, శాస్త్రీయముగ చేయబడునట్టి ఆత్మానాత్మల విచారమువలన కలుగునది వివేకము. యోగము జ్ఞానసిద్ధికి సాధనమగునట్లే ఈ వివేకముగూడ, జ్ఞానసిద్ధికి సాధనము. రెండును శాస్త్రముచే తెలుపబడినసాధనములే. కాని జిజ్ఞాసువులగు కొందరకు సాంఖ్య ప్రక్రియ యగునట్టి ఆత్మవిచారానుసంధాన సాధనము లసాధ్యములుగనుండును. మరికొందరకు యోగసాధన మసాధ్యముగనుండును. కావుననే శాస్త్రము రెండుసాధనములను తెలుపుచున్నదని,

శ్లో॥ అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిత్ జ్ఞాన నిశ్చయః ।
ఇత్థం విచార్యమార్గౌ ద్వౌజగాద పరమేశ్వరః ॥

అను వాశిష్ఠవచనము తెలుపుచున్నది.

కాని కొందరు, పండితవర్యులగువారికిగూడ ఈ ఆత్మానాత్మవిచార మననానుసంధాన ప్రక్రియనుగురించి "నా శరీర సర్వప్రపంచానుభవములు దీర్ఘ స్వప్నానుభవములవంటివి. స్వశరీర సర్వదృశ్యము ఆత్మపదార్థమందే కల్పితము. ఈ ప్రపంచమంతయు ఆభాసమాత్రమే. ఇది యంతయు రజ్జువు యందు సర్పభ్రాంతిలాగున గలుగుచున్నదికాని వాస్తవముగాదుయని యును, నేను నిర్మలాకాశములాగున బ్రహ్మస్వరూపుడను, సత్యజ్ఞానానంత స్వరూపుడను, అఖండ పరిపూర్ణానందస్వరూపుడను, నేనే సర్వాధిష్ఠానము, నేనే పరమాత్మను" యనుకొనుచు, సర్వదా జీవప్రపంచరూపములనున్న ఆత్మానాత్మల విచారములజేయుచుండిన నేమిలాభము. లాభముకలదా? యను సంశయము విడువదు. "విచారాజ్జాయతేబోధః" అనగా ఆత్మానాత్మల విచారము వలన తత్త్వజ్ఞానము గలుగునని వశిష్ఠవచనము తెలుపుచున్నది. మరియును ఆత్మానాత్మ విచార వివేకముగలవారలకును, యోగమార్గమవలంభించువారలకును, జ్ఞానద్వారా ఒక్కవిధముననే మోక్షప్రాప్తి కలుగునను విషయము :—

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం, తద్యోగైరపిగమ్యతే।
ఇతిస్మృతం ఫలైకత్వం, యోగినాంచ వివేకినామ్ ॥

అను శ్రీకృష్ణపరమాత్మ గీతావచనము దృఢపరచుచున్నదని శ్రీ విద్యారణ్య స్వామి ఆత్మానందప్రకరణమున తెలుపుచున్నారు.

కావున ఆత్మానాత్మ విచారముచేసి జగన్మిథ్యాత్వజ్ఞాన నిశ్చయమునొంది స్వస్వరూప లాభమందు ప్రీతినిశ్చయముల నొంది, స్వస్వరూపాను సంధానాభ్యాసాదుల చేయగలుగు మహనీయులకు, అభ్యాస పాటవాదులనుబట్టి కాల క్రమమున ప్రారబ్ధాంతమందు శాస్త్రప్రమాణానుసారమున స్వస్వరూప పరిపూర్ణ అఖండానంద ప్రాప్తి తప్పక కలుగును. ఇది నిస్సంశయము.

పరమార్థ చింతతోడ బలవంతముగనైనను, వివేకరహితముగనైనను అనుష్ఠింపబడునట్టి, శాస్త్రీయ ధర్మానుష్ఠానము యెప్పటికిని వ్యర్థముగాదు. అట్టియెడ విచారాదులతోడ వివేకమునొంది చేయబడునట్టి జ్ఞానాను సంధానాభ్యాసము, వ్యర్థమగునని తలచుట శాస్త్రప్రమాణ విరుద్ధము. కావున జిజ్ఞాసువులిట్టి భ్రాంతిని దూరముచేయుట శ్రేయస్కరమని గ్రహింతురుగాక.

—-O—

# జగన్మిథ్యాత్వజ్ఞాన లాభము

మానవునకు సంసారబంధమంతయు, ఈ జగత్తుయొక్క యధార్థస్థితిని బాగుగ తెలిసికొనక బోవుట వలనను, నేను అనుకొనుచున్నట్టి తనను తాను వాస్తవముగ తెలిసికొనలేకపోవుట వలనను గలుచుచున్నది. అహం, నేను అను జీవత్త్వమును, నాది యను ఈ ప్రపంచము నంతయును భ్రాంతి మాత్రమని "మాయామాత్ర మిదం ద్వైతం, అద్వైతం పరమార్థతః" అను మొదలగు వచనములు స్పష్టముగా తెలుపుచున్నవి. ఏమనిన వాస్తవమున యున్న పదార్థ మొక్కటియే. ఈ స్వశరీర దృశ్యనానాత్వమంతయు గల్పితము. అనగా భ్రాంతి మాత్రమే వాస్తవముగా లేనిది యని తాత్పర్యార్థము. భ్రమ యనునది యెప్పుడు గలిగినను, యెచట గలిగినను, భ్రమకు అధిష్ఠాన ముండి తీరవలయును. నిరధిష్ఠాన భ్రాంతి గలుగుటకు వీలులేదు. ఇది అద్వైత సిద్ధాంతము. అట్టియెడ పై వాక్యమును బట్టియు, శ్రుతి పరమ తాత్పర్యమును బట్టియు, నేను- "అహం", "ప్రపంచము"- "ఇదం", అను రెండు భ్రమలును యేకాధిష్ఠానమునందే గలుగుచున్నవనియేగదా నిశ్చయమగును? అట్టి అద్వితీయ, సర్వాధిష్ఠాన, సత్పదార్థమునే శాస్త్రము బ్రహ్మ, పరమాత్మ, ఆత్మ మొదలుగాగల శబ్దములచే జీవునకు బోధించుచు, ఈ అద్వితీయ అఖండ పరమాత్మయందే, శుక్తియందు రజత-రంగ భ్రాంతులవలెను, రజ్జువు యందు సర్ప భ్రాంతివలెను, జీవునకు అనాది భ్రాంతి కలుగుచున్నదని తెలుపుచున్నది. ఈ అనాది భ్రాంతియే జీవాధ్యాస మనబడుచున్నది. ఈ అధ్యాస యనునది భ్రమ రూపము. ఈ భ్రమ జీవునకు తనయందే అనాదిగ కలుగుచున్నది గనుక యిది అనాది జీవ భ్రాంతియని తెలియబడుచున్నది. ఈ అనాది భ్రమ కార్యములనే వ్యవహారమందురు. జీవునకు ప్రపంచ వ్యవహారమంతయు గల్పితమైనను, యిది జీవుడు తన పరమార్థ వాస్తవ స్వరూపమును బాగుగ తెలిసికొనునంతవరకే యుండి నశించును గనుక దీనిని వ్యవ

హార సత్యమని, అనగా మాయ బంగారము వంటిదనియు, జీవునకీ స్వశరీర జగత్తులు సత్యముగావనియు, అవిద్యా కల్పితములనియు, శాస్త్రము బోధించు చున్నది. ఇట్లు బోధించుచున్నను మానవులకు ఈ ప్రపంచము సత్యమను భ్రాంతి బలీయము. కావుననే జీవుడు ఈ అనాది భ్రాంతినుండి విముక్తుడగు టకు శాస్త్ర, శ్రవణ, విచార, సాధనాభ్యాసాదులావశ్యకములు. మానవునకు స్వశరీర ప్రపంచ భ్రాంతి యంతయు, స్వప్రకాశ అద్వితీయ అఖండమగు తన ఆత్మ స్వరూపమునందే స్వప్న సాదృశ్యముగ అనాది భ్రాంతిచే గలుగు చున్నది. ఈ అధ్యాసము బలీయము కావున మానవునకిట్టి అధ్యాసను నిర్మూ లించి ఆత్మ స్వరూపమును బోధించుటకే శ్రీ శంకర భగవత్పాదులు ప్రస్థా నత్రయమునకు భాష్యయములు గావించి, అందు సూత్ర భాష్య ప్రారంభము నందే అధ్యాస భాష్యము గావించుచు యిట్లు తెలుపుచున్నారు.

"భార్యా పుత్రాదిషు సకలేషు వికలేషువా, అహమేవ, వికలస్సకలోవేతి మన్యతే। సత్యానృతే మిథునీకృత్య, అహమిదం, మమే దమితి, నైసర్గికోయం లోక వ్యవహారః, తస్య ప్రహాణాయ, ఇయం శారీరక మీమాంసా, ఆరభ్యతే।" అని యుపక్రమించి అధ్యాస భాష్యము గావించియున్నారు.

ఈ అధ్యాస యనునది అనాది జీవభ్రాంతి వలన గలుగుచున్నది. ఇది యంతయు మాయాకార్యము, అజ్ఞాన పరిణామము. మాయ అన్నను, అజ్ఞాన మన్నను, అవిద్యయన్నను. కించిద్భేధమున్నను, జిజ్ఞాసువులు దాదాపు యొక్క టిగనే గ్రహించవచ్చును. మానవునకు, ఈ అధ్యాస నివృత్తికిని, మోక్ష స్వరూపమగు తన స్వస్వరూప ప్రాప్తికిని జగన్మిథ్యాత్వజ్ఞానము, స్వాత్మాభిన్న పరమాత్మ జ్ఞానము ఆవశ్యకము. ఈ విషయములో శ్రీ శంకర భగవత్పాదులు దక్షిణామూర్తి స్తోత్రమందు "విశ్వం, దర్పణ దృశ్యమాననగరీతుల్యం నిజాం తర్గతం। పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా॥" అను మొదలుగాగల పదిహేను శ్లోకములతోడ అద్వైత సిద్ధాంతమును, జగన్మిథ్యాత్వమును, సులభముగను, గంభీరముగను, అతి స్పష్టముగనూ

తెలుపుచున్నారు. శ్రుతిస్మృతులు అవతార పురుషులగు పూర్వాచార్యులు గూడ యిట్లు యెంత బోధించుచున్నను ఈ ప్రపంచమందు సత్యత్వ బుద్ధి, నేను, నాది, యను అహంకార మమకారాదులు, వీనియందు సక్తతాభిమానములు, రాగద్వేషాదులు, మొదలగునవి సాధారణముగ జీవుని (మానవుని) విడువవు. కావున పునః పునః ఈదృశ్య మిధ్యాత్వజ్ఞానము ఆవశ్యకము. మానవుడు దృశ్యకోటిలోనివాడే గనుక ఈ విచారము స్వాత్మానంద ప్రాప్తికి సాధనమగును. పరమార్ధ వాస్తవమున జీవుడు బ్రహ్మ స్వరూపుడే యైయున్నను, తన పరమాత్మ స్వరూపము – నిత్య నిరతిశయానందమగు బ్రహ్మ స్వరూపము – అనాది అజ్ఞాన కార్యములగు ఆవరణ విక్షేపాదులచే మరుగుబడి యుండుట వలన, ఆత్మజ్ఞానముచే దానిని తెలిసికొని స్వానుభవము నొందుటయే యిచట ప్రాప్తియని గ్రహించవలయును. జీవునకు ఆత్మ ప్రాప్త ప్రాప్యము. ఈ విషయమునే "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి" అను వచనము విశదపరచుచున్నది. మానవునకు తన సంసార దుఃఖ కారణమగు అధ్యాసను నిర్మూలించి అఖండ సచ్చిదానంద రూపమగు తన ఆత్మానంద పరమ లాభము నొందుటకు సాధనముగ నీ జగన్మిధ్యాత్వజ్ఞాన విచార మావశ్యకము. మరియును "సర్వం ఖల్విదం బ్రహ్మ" "నేహనానాస్తి కించన" యీ సర్వ ప్రపంచము బ్రహ్మయేగదా! అనగా బ్రహ్మయే యనిన్నీ, నానాగా గనుబడు దృశ్యమేమియును లేదు, అనగా వాస్తవము గాదని శ్రుతి వచనములు తెలుపుచున్నవి. ఇంకనూ ఈ ప్రపంచ, ప్రపంచానుభవములను గురించి

శ్లో॥ సమస్తం ఖల్విదం బ్రహ్మ, సర్వ మాత్మేద మాతతమ్ ।
అహమన్య ఇదం చాన్య, దితి భ్రాంతింత్యజానఘ ॥
"దీర్ఘస్వప్న మిదం విశ్వం, విశ్వం బ్రహ్మణి కల్పితం,"

విస్తారంబగు జగంబంతయు బ్రహ్మ స్వరూపంమే యగును. నేను వేరు, ప్రపంచము వేరుయనునట్టి భ్రాంతిని విడువుము. అని శ్రీ వశిష్ఠ భగవానులును, యీ ప్రపంచమంతయు దీర్ఘకాలముందు స్వప్నము వంటిది. ఇది యంతయు

బ్రహ్మ (ఆత్మ) యందే కల్పితమై అజ్ఞాన కార్యముగ భాసించుచున్నదిగాని వాస్తవమున లేదని శ్రీ శంకర భగవత్పాదులును, విస్పష్టముజేయుచున్నారు. కాని యిది యెట్లని విచారించనిదే తెలియదు. కావున యీ జగన్మిధ్యాత్వజ్ఞానమును గురించియు, దాని లాభమునుగురించియు విపులముగ శ్రుతియుక్తి అనుభవములతో ముందు నిరూపింపబడును.

సూక్ష్మబుద్ధితోడ బాగుగ నాలోచించి అనుభవ పరిశీలనలను గావించువారలకు యీ ప్రపంచమంతయు గట్టిగ నున్నదనిగాని, లేక బొత్తుగ లేదనికాని చెప్పుటకు సాధ్యముకాదు. ఏలనన యున్నదియని చెప్పుటకు యీ ప్రపంచమున శాశ్వతముగనుండునదేదియు గనుబడుటలేదు. అన్నియును నశించుచునేయున్నవి. ప్రపంచ పదార్ధములు లేవని చెప్పుదమనిన, పదార్ధములన్నియు ప్రత్యక్షానుభవము నిచ్చుచున్నవి. ఇట్టి ప్రపంచమును లేదనుటెట్లు? కావుననే శాస్త్రవేత్తలు యీ ప్రపంచస్వరూపమును "అనిర్వచనీయము." (అనగా ఎటు చెప్పుటకును వీలుగానిది) అని నిర్వచించిరి.

ఈ ప్రపంచమునిట్లే యనుభవింపగూడదాయని తలచినయడల నేజీవునికైనను స్వస్వరూపప్రాప్తి సాధనోపాయముగ జగన్మిధ్యాత్వజ్ఞాన మావశ్యకమగుచున్నది. ఎవరికైనను సాధనములేనిది సిద్ధిని బడయుట సంభవము కాదుగదా? కావుననే జీవునకు తన పరమార్ధ వాస్తవస్వరూపమొక్కటియే సత్యమని బోధించుటకుగాను యీ జగన్మిధ్యాత్వ జ్ఞానమును సాధనోపాయముగ అద్వైత సిద్ధాంతము బోధించుచున్నదిగాని వేరుగాదు. యదార్ధమున జీవుని పరమార్ధస్వరూపమొక్కటియే పరమార్ధ సత్యమనియు, యీ దృశ్యరూపమున నున్న స్వశరీర ప్రపంచమంతయు అనిత్యమగు వ్యవహారసత్యమాత్రమనియు అద్వైతసిద్ధాంతము బోధించుచున్నది. పరమార్ధ సత్యమనగా అవస్థాత్రయ, త్రికాలాబాధిత పదార్ధము. ఇట్టిది-అహం, నేను, అనుకొనునట్టి పరమాత్మ పదార్ధము తప్ప తదితరమేదియును లేదని అద్వైతసిద్ధాన్తము. వ్యవహారసత్యమనగా కృత్రిమ సువర్ణాభరణములు, కృత్రిమ వజ్రమణులు

వంటిది. అయినను జనసామాన్యమంతయు వాటినుపయోగించుకొనుచునే తృప్తిజెందుచున్నారు. అట్టివారికి యీ ప్రపంచములేదని యెన్నడును అద్వైత సిద్ధాన్తము చెప్పుటలేదు ఈ ప్రపంచము వారికి ప్రయోజనకారి కాదనియూ గూడ చెప్పుటలేదు. మాయాకార్యమగు నీ ప్రపంచము అనాది. జీవుడును అనాదియే. ఇట్టి జీవుడు, అనాదియగు నీ ప్రపంచమంతయు మాయా మాత్రమేగాని వాస్తవముగాదని గ్రహించగలుగునంతవరకు వానికి సమస్తము సత్యమే. తన యిహపర సాధన ధర్మములనన్నిటిని దీనిద్వారానే సంపాదించ వలసి యున్నది. అట్టివారికి వారివారి ధర్మాచరణలకు యిహపరములు రెండును సత్యమే. కాని యివి రెండును కాలాంతరమున నశించునవి. ఇట్టి జ్ఞానమును సంపాదించి సతతజ్ఞానాభ్యాసాదులచే బ్రహ్మ భావమునొందగలిగిన జ్ఞానుల దృష్ట్యా యీ ప్రపంచము మిథ్యగా భాసించునుగాని అంతకు తక్కువ స్థితిలో నున్న వారికందరకును, యీ భూలోకమేగాక సమస్త లోకములును సత్యము లాగుననే తోచుచుండును. అట్లుండి వారి సమస్త ధర్మములును ఆత్మజ్ఞాన సాధనములుగ జేయుచుండవలెననియే అద్వైతసిద్ధాన్తము. అయినను సామర్థ్య ప్రాజ్ఞతలుగల పురుషులు కొందరు యీ కృత్రిమ సువర్ణాభరణములు, కృత్రిమ వజ్రమణులతోడ తృప్తిజెందక, సత్య సువర్ణాభరణములను కోరుచు వానినెట్లు సంపాధించుటకు యత్నించుచుందురో అట్లే అనేక కోటి జన్మల సుకృత, పుణ్య పరిపాక సామర్థ్యముతోడ యీ వ్యవహార సత్యస్వరూపమగు ప్రపంచానుభవములతోగూడ తృప్తిజెందక శాశ్వత పరిపూర్ణానందసుఖమును కోరి ప్రయత్నించుచుందురు. అట్టివారినుద్దేశించియే అద్వైత సిద్ధాన్తము ఈ జగన్మిధ్యాత్వమును బోధించుచున్నది.

కావుననే అద్వైతసిద్ధాంతము ఈ జగత్తు అనగా స్వశరీర సర్వ ప్రపంచమును మిధ్యయని తెలుపుచున్నది మిధ్య యనగా లేదు అని అర్థము కాదు. మరేమనిన - ఉన్నట్లుగా కనబడుచున్న ఈ ప్రపంచమంతయు వాస్తవముకాదని తెలుపుచున్నది. కాని ఈ ప్రపంచము భాసించుట లేదని యెన్నడును చెప్పుటలేదు ఈ ప్రపంచము జీవునియొక్క ప్రారబ్ధ సుఖదుఃఖ

భోగానుభవములకుగాను కల్పితమైనది. ఈ ప్రారబ్ధఫలమును జీవుడు సాధారణముగ తప్పించుకొనజాలడు. అందులకుగాను జీవునకు ఈ ప్రపంచముయొక్క అనిత్య అవాస్తవికతలను బాగుగ తెలిసికొని, యిదియంతయూ తనకు, కల్పితమాత్రముగ వచ్చిన తాత్కాలిక భోగమేనని గ్రహించి, వీటియందు, యివి యన్నియూ తనకు సత్యములు, నిత్యములుయను భ్రాంతిని పొందక, యాత్రికులు ధర్మశాలలయందు వారి యాత్రాకాలమును గడుపు చందమున, నిరభిమానముతోడ తన కర్మఫల సుఖ దుఃఖ భోగములను అనుభవించుచుండవలయునేగాని, వీని యందు పామర మమకారబుద్ధితో వ్యామోహితుడు గాకూడదని శాస్త్రము తెలుపుచున్నది. ఇట్టి వ్యామోహము వల్ల తనకు అనగా మానవునకు రాగద్వేషములు మెండగుచు తన్మూలమున సంసార దుఃఖము కలిగించుచుండును కావుననే శ్రుతి "మాయామాత్రమిదం ద్వైతం" అని ఈ ప్రపంచ నానాత్వమంతయూ మాయామాత్రము అని, మానవునకు బోధించుచున్నది. ఈ ప్రపంచము మాయ బంగారమువంటిది కాని వాస్తవ బంగారముకాదు. అయినను మాయబంగారులోగూడ, అసలు బంగారుకాని యితరలోహములను, బాగుగ కరగించుటమూలమున తీసివేసి మంచి బంగారునుమాత్ర మెట్లుమిగుల్చుకొందుమో అట్లే చిజ్జడ మిశ్రితమగు "అహం" నేను అను స్వశరీరమందున దుఃఖ భూయిష్ఠమగు జడాంశమును భాగ త్యాగలక్షణముచే జ్ఞానపూర్వకముగ త్యజించవలయును ఇట్లే ఇదం అను ప్రపంచమునందుగూడ తనకు భాసించుచున్న నామ, రూప, అస్తి, భాతి, ప్రియములయందు కల్పితమగునట్టి నామరూపములను త్యజించవలయును. అప్పుడు తనకు "అహం" నేను "ఇదం" ప్రపంచము రూపముల భాసించుచున్న వానియందు జడాంశము త్యాజ్యమైనందున, సర్వాంతరముగను, సర్వపరిపూర్ణముగను, సర్వాధిష్ఠానముగను నున్న అద్వితీయ అఖండపరిపూర్ణ చైతన్య స్వరూపుడై తాను మాత్రము నిర్విశేషముగ శేషించును శాస్త్రము జీవునకు జగన్మిధ్యాత్వమును బోధించుటయందు పరమ తాత్పర్యమిదియే, కావున బ్రహ్మ జ్ఞానాభ్యాసకులు ఈ స్వశరీర సర్వ ప్రపంచానుభవములయొక్క

హెచ్చు తగ్గులను, మార్పులను, అనిత్యత్వములను, వారి పరమార్థ సత్యత్వ దృష్టితోడ విమర్శ, విచారములు చేయుచుండిన జగద నిత్యత్వ అవాస్తవికతలు తెలియుచు, ఈ దృశ్యమంతయు స్వప్న పదార్థానుభవమువంటిదిగ తోచి, తనకు యిప్పుడు స్వశరీర విషయ భోగములయందు గలుగుచున్న సక్తతాభిమానములు, రాగద్వేషాదులు, అభ్యాస పాటవమునుబట్టి క్రమముగ క్షీణించుచుండును. ఇదియే ఈ జ్ఞానలాభము, మహనీయులగు ఋషిపుంగవులు "దీర్ఘస్వప్న మిదం విశ్వం" అనగా జీవునకు ఈ ప్రపంచానుభవమంతయు దీర్ఘస్వప్నమువంటిదని తెలుపుచున్నారు. అనగా స్వప్నపదార్థానుభవములవలె ఈ ప్రపంచ సుఖ, దుఃఖానుభవములు గూడ కొంతకాలమేయుండి అవాస్తవములగుచున్నవి. కాని ఈ ప్రపంచ విషయములు వాటి యనుభవములు స్వప్నపదార్థములకన్న కొంచెము దీర్ఘకాల ముండుననియు, అయినను ఈ రెండును తాత్కాలికములే యగుచు అవాస్త వములై నశించునవేయనియు తెలుపుచున్నారు. స్వప్న జాగ్రతలకు స్వకాల సత్యత్వము సమానము. కాన రెండును మిథ్యామాత్రములే యగుచున్నవి. కావున స్వప్న జాగ్రదవస్థానుభవములకు కొంచెము భేదమున్నను వివేక దృష్టిచే సమానములని అభ్యాసకులు గ్రహించవచ్చును. జాగ్రత్స్వప్నములను, ఆయా అవస్థలయందు అనుభవములను సత్యమైనవానినివలె నొందుచున్నను, ఆయా అవస్థాంతమునయందు రెండును భాసించుటలేదుగదా? మానవుడు స్వప్నకాలమందున భిక్షమెత్తితినను దుఃఖముగాని, రాజ్య పరిపాలనము చేసితినను సుఖమునుగాని, మెలకువ వచ్చిన తరువాత పొందదుగదా? మెలకువ వచ్చినంత మాత్రమున, నవి లేనివే యగుచున్నవిగదా? అట్లే జగన్మిథ్యాత్వ దార్ఢ్యము వలన యీ ప్రపంచానుభవములు నగునని అభ్యాసకులు తెలిసికొనవల యును. కాని పాఠకులు దీనినిబట్టి వ్యవహారమందు జాగ్రత యుండకూడదను అపార్థమును నొందకూడదు. ఏలనన మానవునకు వ్యహారము ప్రారబ్ధాధీనమై కల్పితమైనదైనను "ప్రారబ్ధమను భోక్తవ్యం, కృతం కర్మ శుభా శుభమ్" అను వచనము చొప్పున ప్రారబ్ధము అనుభవము వలనగాని నశిం

చదు. మోక్షప్రాప్తి ప్రారబ్ధక్షయము వలనగాని కలుగదు. కావున వ్యవహారానుభవము ప్రారబ్ధ క్షయమున కావశ్యకము. కనుక యీ జగన్మిధ్యాత్వ దార్ఢ్యముతోడ అభ్యాసకులు వారి వారి ప్రారబ్ధమును నిర్లిప్తతతోడను, క్షీణించిన సక్తతాభి మానములతోడను నిరభిమానముగ ననుభవించుటయే వివేకము. జీవుని పరమానంద ప్రాప్తి సాధనము. అప్పుడు జీవుడు తాను, విధిగా ననుభవించవలసిన సుఖదుఃఖ ప్రారబ్ధము లెంతటివైనను, తన జగన్మిధ్యాత్వజ్ఞాన నిశ్చయానుభవముతోడ అట్టి వాటి నన్నిటిని, తన స్వప్న దృశ్య పదార్ధముల లాగున ననుభవించ సమర్ధుడగును. అట్టి మహనీయుని జ్ఞానమును, దృశ్యానుభవములు బాధింపజాలవు. ఏలనన పరమార్ధ వాస్తవమున, తన అద్వితీయ నిర్వికార అఖండ పరిపూర్ణ జ్ఞానము సత్యమైనదిన్నీ, స్వశరీర సర్వదృశ్యమంతయు, తన ప్రారబ్ధానుభవ నిమిత్తము, కల్పితమగునట్టి అసత్యము గనుక, ఎన్నటికినీ పర్యవసానమున అసత్యము సత్యమును, అవాస్తవము వాస్తవమును, అనృతము ఋతమునూ, అబద్ధము నిజమునూ, సహజలక్షణములను కల్పితలక్షణములును, భ్రాంతిజ్ఞానము యదార్ధజ్ఞానమును బాధింపజాలవు. ఇట్లుండ జిజ్ఞాసువుయొక్క- సత్యజ్ఞానమును-అసత్యము, కల్పితము, అనిత్యమగునట్టి దృశ్యజ్ఞానమెట్లు బాధింపగలదు?బాధింపజాలదు, కాని అభాసమాత్రముగనుండును. ఇట్లున్నది, జ్ఞానిని బంధింపజాలదు. కాని సర్పముచే విడువబడిన కుబుసమువలె నుండును. ఇట్టి జగన్మిధ్యాత్వ నిశ్చయ జ్ఞానానుభవముతోడ, తన స్వస్వరూపజ్ఞానమును, సంపాదించువాడే తత్త్వవిదుడు, ఇట్టి మహనీయునకు అవిద్యాతత్కార్యములు, తన తత్త్వజ్ఞాన బలము వలన బాధితములగును. కావున జ్ఞానికి ఈ దృశ్యమంతయు మృతప్రాయమైనదగును, అట్టితరి ఈ స్వశరీర సర్వదృశ్య మతని నెట్లుబంధించును? బంధకరముకాకుండగనే జ్ఞాని, తన ప్రారబ్ధానుభము నొందగలుగును. దృశ్యానుభవములిట్టి జ్ఞానికి, నిర్బాధకములగును. ఈ విషయమును:—

శ్లో॥ బాధితం దృశ్యతామక్షైస్తేన బాధోనదృశ్యతే ।
జీవన్నాఖుర్నమార్జారం హంతి హన్యాత్కథం మృతః ॥

శ్లో॥ అపిపాశుపతా స్త్రేణ విద్ధశ్చేన్న మమార, యః ।
నిష్ఫలేషు వినున్నాంగో నంక్ష్యతీత్యత్ర కా ప్రమా ॥

అనగా దృశ్యము తత్త్వజ్ఞానముచే బాధితమై కనుబడుచుండుగాక. ఇట్లు కనుబడు దృశ్యము జ్ఞానమును బాధించదు. బ్రతికియుండినను ఎలుక పిల్లిని చంపజాలదు. ఇక చచ్చిన ఎలుక పిల్లిని ఎట్లు బాధింపగలదు? అట్లే తత్త్వజ్ఞానముచే మృతప్రాయమగు ఈ దృశ్యము జ్ఞానమును బాధింపజాలదు. మరియు పాశుపతాస్త్రముచేత హతుడుగానివాడు మొండిబాణముచేత హతుడగుట ఎట్లు సంభవమో, తత్త్వజ్ఞానమునకుపూర్వమే దృశ్యముచేత బాధితముగాని జ్ఞానము, బాధితమైన దృశ్యముచేత యెట్లు బాధింపబడును? ఇదియు నట్లే అసంభవము.

శ్లో॥ తిష్ఠంత్వ జ్ఞానతత్కార్య, శవా బోధేన మారితాః ।
నభీతిర్యోద్ధ సమ్రాజః, కీర్తిః ప్రత్యుత తస్యతైః ॥

జ్ఞానముచేత మిధ్యాభూతములుగ గ్రహింపబడి, హతప్రాయములగు దృశ్యములుండుగాక, వానిని చూచి తత్త్వవిదుడు యివి ఏమిచేయునోయని భయపడడు. యుద్ధములో వీరులతో పోరాడి వారిని చంపిన శూరుడు వారి శవములజూచి భయమునొందునా? కీర్తినే పొందును. అటులనే జ్ఞానికి కీర్తియే సంభవించునని శ్రీ విద్యారణ్యుల పై వచనములు స్పష్టము చేయుచున్నవి ఇదియే గొప్ప లాభము.

మానవునకు ఈ జగన్మిధ్యాత్వజ్ఞానమును గురించి యిట్టి గొప్ప లాభమును శ్రుతి స్మృతి పురాణములును, పూర్వాచార్యుల గ్రంధరాజము లనేకములును, స్పష్టముగా బోధించుచున్నవి అయినను యీ జగన్మిధ్యాత్వమును గురించి యెంతగ నెట్టి యుదాహరణ, నిరూపణలతోడ బోధించినను యీ దృశ్య మిధ్యాత్వ నిశ్చయము మానవునకు కలుగుట సామాన్యముగాదు. ఏలనన ఈ సిద్ధాన్తము మానవుని స్థూలదృష్ట్యా అనుభవ విరుద్ధముగ కనబడు

చుండును. కాని నిత్యానిత్య వివేకముకలిగిన సూక్ష్మబుద్ధికి నట్లుగాక జగన్మిథ్యాత్వము స్ఫురించుచుండును. కాని అట్టివారికిగూడ దృశ్యమిథ్యాత్వజ్ఞాన నిశ్చయానుభవముల నొందుటకు సతత మననాద్యభ్యాసము లావశ్యకమగుచున్నవి, అందులకే ఈ విషయములను నిరూపణ ప్రక్రియాభేదములచే వివిధముగను, విపులముగను బోధించుచునట్టి యావశ్యకత కలుగుచున్నది.

ఈ జగన్మిథ్యాత్వజ్ఞాననిశ్చయము జ్ఞానాభ్యాసకుని యిహపర, పరమ లాభసాధనము. జ్ఞానాభ్యాసి తాను, అధ్యస్తమగునట్టి ఈ ప్రపంచముయొక్క మిథ్యాత్వజ్ఞాన దార్ఢ్యము నొందునప్పుడే స్వాధిష్ఠానమగు స్వాత్మ స్వరూపమునుగూడ గ్రహించగలుగును, ఏలననిన నిరధిష్ఠాన భ్రాంతి కలుగుటకు వీలులేదు. కావున జగత్స్వభావమగు భ్రాంతిని వివేచనజేసి గ్రహించునప్పుడే తన అధిష్ఠానస్వరూపమగు ఆత్మస్వరూపముగూడ ఆవశ్యకముగ స్ఫురణకు వచ్చుచుండును, అయినను ప్రారబ్ధమునుబట్టి యెంతటి జ్ఞానాభ్యాసికైనను ప్రపంచానుభవములు సాధారణముగ తప్పవు, కావున తన పరమార్థస్వరూపమగు అధిష్ఠానజ్ఞానముతోడ, నీ ప్రపంచమును వేషధారియైన నటునకు తన సహజ నామ రూపములు, ధరించిన పాత్ర నామ వేషరూపములు నెట్లు సమముగ యేకకాలముననే స్ఫురించుచుండునో, అట్లే యుండును, తాను నటించు పాత్రవేష ప్రయోజనమునుగూడ తన సహజ స్థితి పోషణకెట్లు సాధనముగ గ్రహించుచుండునో యట్లే జగన్మిథ్యాత్వజ్ఞాన దార్ఢ్యముల నొందిన యీ బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తాననుభవించవలసిన ప్రపంచ పాత్రానుభవములనన్నిటిని గ్రహించుచు, (అనుభవించుచు) వీని నన్నిటిని తన స్వస్వరూపప్రాప్తికి సాధనములుగనే గ్రహించుచు నిమిత్తమాత్రుడై తన శరీర యాత్రను జరుపగలుగుచుండును. ఇట్టి సందర్భములో నటుని పాత్రపోషణమంతయు ఆత్మార్థమేయగునట్లు జ్ఞానాభ్యాసి తన జగదనుభవముల నన్నిటిని ఆత్మార్థమే చేయుచుండును. (అనగా చేయుచుండవలయును) నటుడు తన పాత్రను ఎంత నైపుణ్యముగను, రసవంతముగను నొనర్చినను పాత్రనిర్వహణమునందుగల, హర్ష, దుఃఖ, క్లేశాదులను తాను

వాస్తవముగ నొందకయేగదా సమర్థించగలుగును? ఇట్లే జగన్మిథ్యాత్వమును బాగుగ గుర్తించి నిశ్చయమునొందిన జ్ఞానాభ్యాసకుడు తన ప్రపంచ సుఖ దుఃఖానుభవముల నిమిత్తమాత్రముగ నొందగలుగుచు తన ఆత్మానుసంధానాదులయందు సుస్థిరుడై యుండగలుగుటచే కాలక్రమమున, స్వాత్మలాభమును, ప్రపంచానుభవములందు అనుభవసౌలభ్యమును నొందగలుగుచు యిహ, పర లాభములను నొందగలుగును. ఇది లోగడ నొకవిధముగ జెప్పబడినను అభ్యాసకుల జ్ఞానదార్ఢ్యములకుగాను తిరిగి వివిధములుగ జెప్పబడుచున్నది. "ఆవృత్తిరసకృదుపదేశాత్" అను న్యాయముననుసరించి పునః పునర్బోధ నైపుణ్యమునుబట్టి జ్ఞాననిశ్చయ సామర్థ్యపాటవములు గలుగుచుండును. గాన అభ్యాసకులు యీ విషయమున పునరుక్తిదోషమను భ్రమను జెందక యీ విషయజ్ఞాన దార్ఢ్యమును సంపాదించవలయును. అప్పుడే యిది పరమప్రయోజన సాధనమగును. కాని యీ సిద్ధాన్త పర్యవసితమగు కేవల "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" యనునట్టి వాక్యముతోడనే చరితార్థమునొందుట అసాధారణ విషయము. జ్ఞానాభ్యాసకుడు యీ జగన్మిథ్యాత్వజ్ఞానమును బాగుగ గ్రహించి నిశ్చయమునొంది, సర్వజగదధిష్ఠానమగు తన స్వరూపమును అఖండ పరిపూర్ణ సచ్చిదానందరూపముగ అనుసంధానాదులజేయుచు—

"అందుగల డిందులేడని సందేహము వలదు నేను సర్వోపగతిన్,
ఎందెందు వెదకిచూచిన నందందేగలను సర్వకాలములందున్" అను నిశ్చయముతోడ నుండి తన జ్ఞానమాత్రస్వరూపమును నటులజూడ సమర్థుడగును.

కావున జగన్మిథ్యాత్వజ్ఞాన నిశ్చయానుభవములతోడ స్వస్వరూపానుసంధానాదుల నాచరించు మహనీయులగు ముముక్షువులకు ప్రారబ్ధ పరిపాక కాలక్రమమున వారి స్వస్వరూపమగు ఆత్మానందము కరతలామలకమువలె సాక్షాత్కారమగును. కావున నిస్సంశయముగ నిట్టి నిశ్చయ దార్ఢ్యముతోడ జిజ్ఞాసువులు వారిసతతాభ్యాసాదుల నాచరించుచుండుట పరమ ముక్తిదాయకమని వేరుగజెప్పబనిలేదు.

ఈ జగన్మిథ్యాత్వజ్ఞాన, స్వస్వరూప మననాను సంధానాదుల గురించి యీ గ్రంథమునుబట్టి తెలుపసాధ్యమైనంతవరకిందు తెలిపినాడను. కాని యీ విషయములను నిస్సంశయముగ గ్రహించుట సులభసాధ్యముగాదు. ఏలనన మానవునకు తన వాస్తవస్వరూపమగునట్టి ఆత్మజ్ఞానము అసగా బ్రహ్మ జ్ఞానమనునదియును, ఈ స్వశరీర సర్వప్రపంచము సత్యమను భ్రాంతియును అనేక కోటిజన్మలనుంచి అనాదిగ వచ్చుచుండుటచే తాను తన అజ్ఞానముచే ననుభవించుచున్న ఈ లోకానుభవములన్నియు వాస్తవముగనే తోచుచుండుట చేతను యెన్నివిధముల బోధించినను, జగన్మిథ్యాత్వ జ్ఞాననిశ్చయము, స్వస్వ రూపాత్మానందమందు విశ్వాస, ప్రీతి, నిశ్చయములు, గలుగుట యనునది కష్టసాధ్యమగుచున్నది. దీనికిగాను విశేషబోధ ప్రక్రియ యావశ్యకము. కావున యీ విషయ విచారబోధలను జిజ్ఞాసువుల జ్ఞానదార్ఢ్యములకుగాను శ్రుతి, యుక్త్యనుభవపూర్వకముగ పరిపరివిధముల నిరూపించి బోధించుట అవసరమగుచున్నది. ఈ ఆవశ్యకతను గుర్తించియే యీ జగన్మిథ్యాత్వజ్ఞాన స్వస్వరూప మననాను సంధానాదులయొక్క వివిధవిషయములను గురించి, యింకను విపులముగను, నుదాహరణలతోడను అనుభవ నిరూపణముల తోడను, శ్రుతి, స్మృత్యాది ప్రమాణములతోడ స్పష్టముగను విచారపూర్వక ముగను తెలిసికొనగోరు జిజ్ఞాసువులనుద్దేశించి "బ్రహ్మవిద్యానుసంధానదర్ప ణము" "జ్ఞానామృతసారము" లను గ్రంథముల, విపులముగ సులభశైలిలో రచించినాడను.

— —o— —

# జీవుని అర్థ పరమార్థ వివేచన

జీవునకు అర్థ పరమార్థములు రెండునూ కలసియే యుండును. ఎట్లన యీ అహం నేను అని ప్రతి మానవునకునూ కలుగుచున్న ప్రతీతియందు అర్థ పరమార్థ స్వరూపములు రెండునూ గలవు. ఇందు అర్థము దుఃఖ జడ పరిచ్ఛిన్నముగను, అవాస్తవముగను, సాధనముగను, నున్నది. పరమార్థ స్వరూపము, అద్వితీయ, అఖండా పరిచ్ఛిన్న వాస్తవ సుఖ స్వరూపముగ నున్నది. ఇదియే జీవునకు పరమ పురుషార్థమగు మోక్ష స్వరూపము. ఇది జీవునకు సిద్ధము. కాని జీవుడు తన అనాది అజ్ఞానము వలన, తనకు అర్థ రూపమగు పరిచ్ఛిన్నత్వమునే గ్రహించి తనకు వాస్తవమగునట్టి తన పర మార్థ స్వరూపమును మరచి సంసారభ్రాంతుడగుచు దుఃఖము నొందుచున్నాడు. కావుననే జీవునియందు పరమకారుణ్యముతో శ్రుతిమాత "జీవోబ్రహ్మైవనా పరః" అనగా జీవుడు తన పరమార్థ స్వరూపమున, బ్రహ్మకంటె వేరుకాదని తెలుపుచున్నది. ఇట్టి తన పరమార్థ స్వరూపమును బాగుగ, గుర్తించి స్వాను భవము నొందుటకు అహం నేను అను ప్రతీతిలో తనకు యిప్పుడు స్ఫురించు చున్న అర్థ రూపమగు స్థూల సూక్ష్మోపాధియుతమగునట్టి శరీరమే తనకు పరమార్థజ్ఞాన సాధనమని ముముక్షువు గ్రహించి తన అర్థ స్వరూపమగు నీ శరీరాదులను తన పరమార్థజ్ఞాన సాధనముగ తెలిసికొనవలయును. అర్థమనగా సాధనము, పరమార్థమనగా సిద్ధమగు మోక్ష స్వరూపము. ఇదియే జీవుని నిత్య నిరతిశయ సుఖ స్వరూపము, బ్రహ్మ. ఇది నిష్ప్రపంచము కాని ప్రపం చములోనిదికాదు. జీవునకు పరమ పురుషార్థమగు స్వస్వరూపమునే పరమాత్మ బ్రహ్మయను నామములతో శాస్త్రము బోధించుచున్నది. ఈ జ్ఞానమే జీవుడు తన నిత్య నిరతిశయ సుఖమునకు సంపాదించవలసిన పరమ పురుషార్థము. దీనిని సంపాదించుటకు, యీ స్థూల సూక్ష్మోపాధులును ప్రారబ్ధ సుఖ దుఃఖ భోగమున కేర్పడిన యీ ప్రపంచమునూ కలసి జీవునకు

అర్థము — అనగా సాధన స్వరూపమగుచున్నది. ఇదియే జీవునకు తన పరమార్థ సాధనముగాని మరియొండులేదని ముముక్షువు నిశ్చయము నొంది, తన పరమార్థ వాస్తవ స్వరూపమగు స్వప్రకాశ, సర్వాధిష్ఠాన, పరిపూర్ణ అఖండ సచ్చిదానంద స్వరూపమే, తన అనాది అజ్ఞానముచే అహం, ఇదములను అర్థరూపముగా భాసించుచున్నదిగాని వేరొండు వాస్తవముగ లేదను నిశ్చయమునొంది, యీ అర్థ రూపమగు స్వశరీర సర్వ ప్రపంచము, మిథ్యా మాత్రమని గ్రహించవలయును. అర్థరూపమగు నిదియంతయూ తనయందే స్వాప్నికుని యందు స్వప్న పదార్థములు భాసించుచున్నట్లున్నదని తెలిసికొన వలయును. ఈ రహస్యమును ముముక్షువు శాస్త్ర శ్రవణ మననాదులచే బాగుగ తెలిసికొని, తన పరమార్థ స్వరూపమును ప్రీతి నిశ్చయములతో ధ్యానాదు లాచరించుచుండిన యెడల కాల పరిపాకమున తన పరమార్థ స్వరూపము నొందగలుగును. ఇదియే మోక్షము. కాని యిది, చదివినంత సామాన్య ప్రయత్నముచే లభించునట్టిది కాదు. ఏలనన ఇది అలౌకిక సత్పదార్థము. జీవునకు యీ లోక వాసన సంసారాజ్ఞానముతోడ గూడి అనేక కోటిజన్మల నుంచి వచ్చుచున్నది. కావున యిప్పుడు అనగా యీ మానవ జన్మయందు శాస్త్రీయముగ సత్కర్మానుష్ఠానము, శ్రవణ, మనన, నిదిధ్యసనాద్యభ్యాసము చిరకాల మావశ్యకము. అనగా ప్రారబ్ధాంతము వరకు సతతాభ్యాసాదు లావశ్యకములు. అభ్యాస పాటవమును బట్టి ప్రారబ్ధాంతమున, జీవుడు తన పరమార్థ ప్రాప్తి అనగా మోక్ష స్వరూపము నొందును. ఇది నిశ్చయము.

పరమార్థమునందు, అర్థము కల్పితము. అయినను, జీవునకు సర్వ వ్యవహార ప్రయోజనములును యీ అర్థముతోడనే కలుగును. అర్థ ప్రయోజన ములన్నియూ, ప్రారబ్ధమును బట్టియే జరుగుచుండును. ప్రారబ్ధమనుభవింప వలసినదేగాని, మనము విడుచుదమన్నను, సాధారణముగ నిది విడువదు. ఈ విషయమును లోగడనే సవిస్తరముగ నిరూపించియుంటిమి. కావున అర్థ రూపమున నున్న సి ప్రారబ్ధ ఫలమును సశాస్త్రీయముగ ననుభవించుచు మానవుడు తన పరమార్థ స్థితిని పొందవలయునేగాని వేరు మార్గము లేదు.

జీవునకు పరమార్ధ మధిష్ఠానము. అర్ధము అధ్యస్తము. అధ్యస్త పదార్ధమెల్లప్పుడునూ అధిష్ఠానమందు కల్పితమైనదిగా నుండును గాని స్వతంత్రముకాదు. అర్ధము పరమార్ధము మీద ఆధారపడియుండును. కావుననే మా గురువర్యులు "పరమార్ధములో అర్ధమున్నదిగాని, అర్ధములో పరమార్ధము లేదు." అని తరుచు బోధించుచుండెడివారు. కాని ప్రధమమున కొంతకాలము యిట్లు కేవలము శబ్ద చాతుర్యమును (అనుసరణను) బట్టియే తెలుపుచున్నారని తలచుచుండెడివాడను. కాని అభ్యాస పరిపాకముచే దాని వాస్తవార్ధము నిట్లు గ్రహించ గలిగితిని. అధ్యస్తమగునట్టి అర్ధము పరమార్ధము నాశ్రయించుకొనియుండును. అధిష్ఠానమగు పరమార్ధ స్వరూపము స్వతంత్రము.

ఇంకను మానవునకు అర్ధ పరమార్ధములు రెండునూ సుఖము కొరకేయైనను అర్ధముచే కలుగు సుఖము కల్పితము, అనిత్యము, సాధన మాత్రమే యగుచున్నది. పరమార్ధము సిద్ధవస్తువు, నిత్య పరిపూర్ణ సుఖ స్వరూపము. జీవుడు సుఖ స్వరూపుడే తానైస్వానుభవము నొందునప్పుడు సుఖ సాధనమగు అర్ధముతో బనియుండదని, ముముక్షువులు గ్రహింతురుగాక. పరమార్ధ సుఖమనుభవించు మహనీయునకు అర్ధముచే కలుగు సుఖము లానుషంగికములు గాని ప్రధానములు గాజాలవు. ఏలయన యిట్టివి యన్నియూ ప్రారబ్ధ బలము వలన కలుగునవి. జ్ఞాని వీనిని కోరడు. ద్వేషింపడు.

——o——

# అంతఃకరణ పరమ ప్రయోజనము

జీవునకు యీ స్థూలదేహము తామసమైన కాష్ఠతుల్యమగు బాహ్య ఉపకరణము. సూక్ష్మదేహముగూడ యిటువంటిదేకాని యిది, సాత్విక రాజసాత్మకమై మిశ్రితమైనందున, దీని యొక్క ప్రయోజనము మానవునకధికము. ఇది జీవున కాంతరముననుండుటచే అంతఃకరణమని తెలియబడుచున్నది. కరణమనగా పనిముట్టు. కాని యీ అంతఃకరణమనునది అతి సూక్ష్మమైనది. మానవునకు నిది పరమ ప్రయోజనకారి కాగలదు. దీనినే మానవుడు అహం ప్రతీతితో వ్యవహరించుచున్నాడు. అహం ప్రతీతియందు రెండంశములుగలవు. 1 చిదంశము, 2 జడాంశము. ఇందు చిదంశము సత్యము, అధిష్ఠానము. జడాంశము, అసత్యము, అధ్యస్తముగానున్నది. కావున మానవుడు వీటి రెంటిని తన జ్ఞానబలముతోడ వేరువేరుగజేసి తెలిసికొనినయెడల తన సత్యస్వరూపము, చిదంశమునగు సర్వాధిష్ఠానమే తన పరమార్ధ వాస్తవ స్వరూపమనియూ, తన నిత్యస్వరూపమనియూ, పరమ సుఖస్వరూపమనియూ, తెలియగలదు. ఇంకనూ తనయందే అధ్యస్తముగనున్న యీ మూర్తామూర్త స్వశరీర సర్వ ప్రపంచమంతయూ, కల్పితమై అవాస్తవముగ నుండి తనకు సంసార దుఃఖమునిచ్చుచున్నదను నిశ్చయమునొందును. అట్టితరినద్దానినంతయూ జ్ఞానపూర్వకముగ త్యజించినయడల తాను మాత్రము నిర్విశేషముగ పరమసుఖస్వరూపుడై శేషించును.

ఇది ఎట్లనిన పరమార్ధవాస్తవమున జీవుడు పరిపూర్ణ జ్ఞానస్వరూపుడు. ఈ జ్ఞానమనునది నిత్య, నిర్వికార, అఖండ, స్వప్రకాశ, సుఖస్వరూపము. ఇట్టి కేవల జ్ఞానస్వరూపుడు తానై యుండగా, జీవుడు దానిని మరచి తన జ్ఞానస్వరూపమందు అధ్యస్తమగుచున్న జ్ఞాతృజ్ఞేయములయందు, నేను, నాది, యను అభిమానముతోడ యీ సంసార దుఃఖము నొందుచున్నాడు. కాని

సర్వాధిష్ఠానమగు తన స్వస్వరూప జ్ఞానము అఖండ సుఖస్వరూపముగాని వేరొండుగాదు. కాని వస్తుతః శాంత జల స్వరూపమగు నిస్తరంగ మహా సముద్రమే బాహ్యవాయు, మలిన ప్రసారములచే బిందువులుగాను, వీచికలుగాను, తరంగములుగాను, పెద్ద అలలుగాను, నురుగుగాను, బుడగలుగాను, సుడిగుండములుగాను, యింకనూ బహువిధములుగ మారుచు భయంకరముగ బయటికగుపడుచున్ననూ, లోపలకు అనగా షుమారు పది యడుగులలోతుకు వెళ్ళగలిగినయడల జలమంతయు శాంతమగు అఖండాకారముగ నెట్లుండునో, యట్లే మానవుడు తన అనాది యజ్ఞానముచే తనయందు, తన బాహ్యమందగుపడుచున్న వివిధ, పరిచ్ఛిన్న, భిన్నభిన్నోపాధులను చూచుచు ద్వంద్వానుభవములను, అనగా సుఖ దుఃఖములు, రాగద్వేషములు, కామక్రోధములు, శీతోష్ణములు, కలిమిలేములు మొదలుగాగల యనుభవములను పొందుచుండునేగాని ప్రయత్నముచే సర్వాంతరముగనున్నట్టి తన స్వస్వరూపానుభవమును పొందగలిగినయడల నివియేవియునుండవు. ఏలనన యీ స్వశరీర సర్వప్రపంచము తనయందే కల్పితమాత్రముగ, దీర్ఘస్వప్నము లాగుననున్నదేగాని వాస్తవమునలేదు. ఇది యంతయు వ్యవహారమందు స్వాప్నికుడుమాత్రము సత్యమగుచు స్వప్నపదార్థములెట్లు అసత్యములు, భ్రాంతిమాత్రములగుచున్నవో యట్లే పరమార్థవాస్తవమున నిత్యుడైన తనయందే యీ ప్రపంచము స్వప్నపదార్థములవలె భాసించుచున్నది. ఇది యంతయూ భ్రాంతిమాత్రము. ఈ భ్రాంతినివృత్తికొరకే మానవునకు ప్రయత్నమావశ్యకము. ఆ ప్రయత్నమెట్టిదియనిన - అఖండ, శాంతమహా సముద్రానుభవము నొందుటకు సముద్రపు పైభాగమునుంచి పది యడుగులు లోనకుబోవు ప్రయత్నమువంటిది. ఇట్టి ప్రయత్నముకు దృఢగాత్రము, సాధనప్రయత్నములావశ్యకములుగదా? అట్లే దృఢగాత్ర, స్థానీయముగ చిత్తశుద్ధిని సంపాదించి, సాధన స్థానీయముగ, శ్రవణ, మనన, నిదిధ్యాసనములను గ్రహించి సతతాభ్యాసముచేయు ముముక్షువు కాలక్రమమున యీ దృశ్యసంసారానుభవములను వదలి, సర్వాంతరముగనున్న తన స్వస్వరూపాను

భవమగు సత్యజ్ఞానానంత లక్షణమును గ్రహించ సమర్థుడగును. ఇట్టి సమర్థతను సంపాదించి నిరంతరాభ్యాసముచే కాల పరిపాకమున ప్రారబ్ధక్షయమునొంది తన స్వస్వరూపమగు బ్రహ్మస్వరూపమునొంది ముక్తుడగుననుటకు ఎంత మాత్రము సందియములేదు. అప్పుడు తన అఖండ సచ్చిదానందరూపమున కేమియు భంగములేదను నిశ్చయముతో తన ప్రారబ్ధానుభవములను నిమిత్త మాత్రముగ యనుభవింపగలుగుచుండును. ఇదియే జీవన్ముక్తి. దీనిని సంపాదించుట అతి ప్రయత్న సాధ్యముగాని చదువుట, వినుట, యంత తేలికపనికాదు. ఏలనన మానవుడు అనాదిజన్మ పరంపర వాసనలతోగూడి యజ్ఞానావృతుడుగ నున్నాడు. జీవునకీ యజ్ఞాన సంసారభ్రాంతి, మహావృక్షమునకు వేళ్ళు అతిలోతుగా పాతుకొనియుండునట్లును, జీర్ణించిన పురాణ దీర్ఘవ్యాధిలాగుననునున్నది. కావున దీనికి దీర్ఘకాల కఠినచికిత్స ఆవశ్యకము. ఆ చికిత్సఏదియనిన-దీర్ఘకాల సత్కర్మానుష్ఠానములతోడ చిత్తశుద్ధిని సంపాదించి దానివలన నిత్యానిత్య వివేకాదులు, తీవ్ర వైరాగ్యము సంపాదించుట మొదటి సోపానము. తదుపరి గుర్వీశ్వరానుగ్రహములతోడ శాస్త్రవిచారము గావించి, మూర్తామూర్త, స్వశరీర, సర్వదృశ్య, మిధ్యాత్వ నిశ్చయమును, దీర్ఘకాలాభ్యాసముతోడ సంపాదించుట ద్వితీయ సోపానము. తదుపరి భాగత్యాగలక్షణతోడ మహా వాక్యశ్రవణముచేసి స్వస్వరూపము పరమాత్మయే యని గ్రహించి దానిని పలువిధముల మనన, నిదిధ్యాసనములుగావించుచుండుట తృతీయసోపానము. ఇది గూడ పరోక్షజ్ఞానమే. ఇట్టి పరోక్షజ్ఞానమును, అపరోక్షానుభవమునొందుటకు, చరమవృత్తి సాక్షాత్కార పర్యంతము, నిరంతరమభ్యసించుట చతుర్ధ సోపానమై కైవల్యము నొనగూర్చును. ఇదియే విదేహముక్తి. ఇదియే జీవునకు మోక్షము, ముక్తి. దీనికన్న మానవుడు పొందగలిగినలాభములేదు. ఇదియే మానవునకు పరమావధియగునట్టి మోక్ష సామ్రాజ్యము. అప్పుడు అఖండపరిపూర్ణ సచ్చిదానందస్వరూపుడు తానేయగుచు తనకు భిన్నమగు వస్తువేదియునూ యుండక సర్వము తానే యగును. కాని అంతవరకును, జీవన్ముక్తునకుగూడ అహంకారముండును. అయినను

జీవన్ముక్తుడు సదహంకారముతోడ లోక వ్యవహారస్థితియందు యుండును. అది యెట్లుండవలెననిన, వశిష్ఠభగవానులు శ్రీ రామచంద్రమూర్తి కిటుల బోధించియున్నారు. (రామావతారము స్థితప్రజ్ఞుని వ్యవహార నిరూపణను బోధించునట్టిది.) నీవు యీ స్థూల, సూక్ష్మరూపంబులనున్న శరీరమే నేను "అహం" అను మొదటి అహంకారము సంసార బంధము కలిగించునదిగావున, యీ పరిచ్ఛిన్న మైననేనను దురహంకార భ్రాంతిని వదలి సదహంకారముతోడ నుండుము. ఈ సదహంకారము మూడు విధములుగ కలసియుండును. ఇది జీవన్ముక్తులయందే యుండును. ఆవిషయమునే - ఇట్లు శ్రీరామచంద్ర మూర్తికి తెలుపుచున్నారు.

శ్లో॥ అతీతస్సర్వభావేభ్యో వాలాగ్రా దప్యహంతనుః ।
ఇతి ద్వితీయో మోక్షాయ నిశ్చయో జాయతే సతామ్ ॥

శ్లో॥ జగజ్జాల పదార్థాత్మా సర్వమేవాహ మక్షయః ।
తృతీయోనిశ్చయోఽప్యేవం మోక్షాయైవ రఘూత్తమ ॥

శ్లో॥ జగచ్ఛాసదిదంశూన్యం శూన్యవ్యోమసమం సదా ।
ఏవమేవ చతుర్థోఽపి నిశ్చయో మోక్షసిద్ధయే ॥

శ్లో॥ సర్వమాత్మాఽహమేవేతి నిశ్చయో యోమహామతే ।
తమాదాయ విషాదాయ నభూయో యాతితేమతిః ॥

అనగా, నేను సర్వపదార్థములకంటె నతీతుడను, కేశముయొక్క కొనకంటె సూక్ష్మమైనవాడను, యనునట్టి నిశ్చయమును సత్పురుషులకు మోక్షప్రాప్తికై గలుగుచున్నది. నేను జగత్సంబంధమగు సర్వపదార్థ స్వరూపుడను, నిత్యుడను, అనునట్టి నిశ్చయంబును, మోక్షదాయకమైనదేయగును. ఈ జగత్తు శూన్యము. శూన్యంబగు నాకాశముతో సమానము. అను నిశ్చయముగూడ మోక్షసిద్ధికి సాధనంబగును. సర్వంబును, నేనును, ఆత్మయే,

అనునట్టియే నిశ్చయముగలదో దానిని గ్రహించితివేని నీయొక్క మనస్సు మరల దుఃఖంబు పొందనేరదు.

ఇట్టి నిశ్చయంబుతోడ——

శ్లో॥ పూర్ణాం దృష్టి మవష్టభ్యధ్యేయ త్యాగవిలాసినీం।
జీవన్ముక్త తయాస్వస్థోలోకే విహరరాఘవ॥

శ్లో॥ అంతస్సంత్యక్త సర్వాశో వీతరాగో వివాసనః।
బహిస్సర్వసమాచారో లోకే విహర రాఘవ॥

శ్లో॥ బహిః కృత్రిమ సంరంభో హృదిసంరంభ వర్జితః।
కర్తాబహిరకర్తాంతర్లోకే విహర రాఘవ॥

శ్లో॥ ఉదారపేశలాచారస్సర్వాచారాను వృత్తి మాన్।
అంతస్సర్వపరిత్యాగీ లోకే విహర రాఘవ॥

శ్లో॥ అంతర్వైరాశ్యమాదాయ బహిరాశోన్ముఖేహితః।
బహిస్తప్తోంఽత రాశీతోలోకే విహర రాఘవ॥

శ్లో॥ అయం బంధుః పరశ్చాయ మయం చాహమయం భవాన్।
ఇతి మిథ్యాదృశోరామ విగళంతు తవాధునా॥

శ్రీరామచంద్రా! ముందు చెప్పిన అహంకారరూపమగు వాసనను విడచుటచేత ప్రకాశించుచున్నట్టి బ్రహ్మదృష్టి నవలంబించి జీవన్ముక్తిత్వము చేత స్వస్థుడవై విహరించుము. లోన సమస్తమగు నాశలను విడచి వైరాగ్యవంతుడవును, వాసనారహితుండవును, నగుచు లోకమునందు పైకి సమస్త కృత్యంబులుజేయుచు విహరించుము. పైకి రాగద్వేషాది వికారంబులుగల వాడవుగను, లోపల నెట్టి వికారంబులులేనివాడవుగను, పైకి కర్తవు, లోన

అకర్తవునై లోకంబున విహరించుము.మృదువగు వ్యవహారంబులు గల వాడవుగను, పైకి సర్వకర్మంబులజేయుచు, లోన సర్వకర్మఫలంబును విడచిన వాడవునై లోకమునందు విహరించుము. లోన ఆశలేనివాడవయ్యును, పైకి ఆశానుకూల వ్యాపారంబుజేయువాడవును, పైకి పరితాపంబుగలవాడవును, లోననెట్టి పరితాపంబునులేనివాడవునై లోకమునందు విహరించుము. ఇతడు బంధువుడు, ఇతడు పరుడు, నేను, నువ్వు, అను మొదలగు భేదదృష్టులు నీకు యిప్పుడు నశించుగాక. అని వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు.

—o—

# జ్ఞానాభ్యాసకునికి ప్రపంచోపయోగము

జ్ఞానాభ్యాసకుడు శాస్త్ర శ్రవణ మెంతగా చేసి పరమార్థ సత్యమును బాగుగ గ్రహించినను యీ ప్రపంచానుభవ సంబంధములన్నియు బాధించు చునే యుండును. ఎంత జ్ఞానియైనను (అభ్యాసకుడు) జగదనుభవములను కేవలముగ విడుచుటకు సమర్థుడుగాడు. ఏలనన జీవునకు సుఖ దుఃఖాది భోగములు ప్రారబ్ధాధీనములు. ప్రారబ్ధము విధింపబడిన శిక్షవంటిది. "నాభుక్తం క్షీయతే కర్మ, కల్పకోటి శతైరపి" అని వచనము తెలుపు చున్నది. తత్త్వజ్ఞానమునకు ప్రారబ్ధమును నశింపజేయు శక్తిలేదు. కాని, జీవుడనుభవింపవలసియున్న ప్రారబ్ధానుభవములయందు సక్తతాభిమానము లను, సుఖదుఃఖాద్యనుభవములను ఈ తత్త్వజ్ఞాన ఫలము క్షీణింపజేయగలు గును. కావున ప్రారబ్ధానుభవములయందు తారతమ్యముండును. తత్త్వజ్ఞాన బలమును బాగుగ సంపాదించిన జ్ఞానాభ్యాసకుడు జగన్మిథ్యాత్వజ్ఞాన దార్ఢ్యమును బాగుగ సంపాదించినవాడు గావున తన ప్రారబ్ధానుసరణమున గలుగునట్టి సుఖదుఃఖ భోగానుభవములయందు అధిక సక్తతాభి మానముల నొందక క్షీణించిన రాగద్వేషాదులతోడ, తన అనుభవములను నిమిత్త మాత్రముగ చేయుచుండును. అయినను యిట్టి మహనీయుని గూడ దేహతాదాత్మ్య బుద్ధి ప్రారబ్ధమున్నంత కాలము సాధారణముగ విడువదు. "నాభుక్తం క్షీయతే కర్మ" "ప్రారబ్ధమను భోక్తవ్యం" అను వచనానుసారము ప్రారబ్ధము భోగము వలనగాని నశించదు. కావున అజ్ఞాని లాగుననే జ్ఞానియు గూడ ప్రారబ్ధమును విధిగా ననుభవించవలసియున్నది. జ్ఞాని — అజ్ఞానులకు ప్రారబ్ధ సుఖదుఃఖ భోగము సమానము. కాని వారి, వారి జ్ఞాన తారతమ్య మును బట్టి అనుభవ తారతమ్యము గలుగుచుండును. ఏట్లన — అజ్ఞాని తన దృశ్యానుభవములన్నియు సత్యమను నిశ్చయ బుద్ధితో ననుభవించుచుండును.

జ్ఞానాభ్యాసకుడు తత్త్వజ్ఞాన బలముతోడ తన అనుభవములను మానసికముగ నిరసించుచు అనగా వానినన్నిటిని అవాస్తవికములను బుద్ధితోడ అనుభవించుచు తనకు ప్రాప్తమగునట్టి స్వదేహ, భార్యా, పుత్ర, మిత్ర, విత్త, గృహ, క్షేత్రాది సంపదలన్నియు తన ప్రారబ్ధానుభవముకుగాను యేర్పడిన కల్పితములు, అనిత్యములు, ఆభాసమాత్రములు, అను నిశ్చయముతోడ యథాప్రాప్త సంతుష్ట చిత్తుడై సర్వదా తన ప్రారబ్ధక్షయమును ప్రతీక్షించుచుండును. ఇట్టి అనుభవములు భావి ప్రతిబంధమును తనకు కలిగింపజాలవు. తత్త్వజ్ఞాన బలముచే సంచిత కర్మ అంతయు నశించును. ఇప్పుడు పొందిన తత్త్వజ్ఞానము వలన ఆగామి కర్మ ఫలము గలుగదు. ఇట్లు జ్ఞానికి తన పూర్వోత్తర కర్మలు నశించుచుండగా మిగులునది తన ప్రారబ్ధము మాత్రమే. ఈ ప్రారబ్ధమును క్షయింపజేసుకొనుట యొక్కటియే శేషించును. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అను వచనానుసరణమున ప్రారబ్ధమును యీ దేహమను ఉపకరణముతోడనే ననుభవించ వలసియున్నది. జ్ఞానికి యీ స్వశరీర ప్రపంచములతోడ ప్రయోజనము, తన ప్రారబ్ధక్షయమును గావించుకొనుట మాత్రమే గాని మరియొక ఏదియును వాస్తవమాలోచించినలేదు.

కావున జ్ఞానాభ్యాసకులు, నిత్య నిరతిశయానంద స్వరూపమగునట్టి ముక్తియను పరమ ప్రయోజనము నొందుటకు యీ ప్రపంచమును ఎట్లు పయోగించు కొనవలయునను విషయమును వశిష్ఠ భగవానులు శ్రీరామ చంద్రమూర్తికి యోగవాశిష్ఠమునందు :

శ్లో॥ అనాగతానాంభోగానా, మవాంఛన మకృత్రిమం ।
ఆగతానాంచ సంభోగ, ఇతి పండిత లక్షణమ్ ॥

శ్లో॥ అతోరాఘవ తత్త్వజ్ఞో, వ్యవహారేషు సంస్థితః ।
నష్టం నష్టముపేక్షస్వ, ప్రాప్తం ప్రాప్తముపాహర ॥

శ్లో॥ దేశక్రమేణ ధనమల్ప విగర్హణేన,
తేనాంగసాధుజన మర్జయ-మానసపూర్వం ।

తత్సంగమోత్థ విషయాద్యవహేళనేన,
సమ్యగ్విచార విభవేన తవాత్మలాభః ॥

అనగా తనకు సంక్రమించని భోగములను యేవిధమైన మనోవ్యాపారముతో కోరకుండ, తనకు ప్రారబ్ధానుసరణమున సంక్రమించిన సుఖ, దుఃఖ, భోగము లెట్టివియైనను, నిర్లిప్తతతోడ ననుభవించుట పండితునియొక్క లక్షణము. కావున రామచంద్రా యథార్థమును బాగుగ గ్రహించిన వాడవై సర్వ వ్యవహారములను ఆచరించుచు, నష్టమైనవాటిని గురించి యెద్విధముగను విచారము నొందక, ప్రాప్తములైన వాటిని పాలించుచు యనుభవింపుము.

(స్వల్ప దోషమైనను లేనిదే ధనార్జనము జరుగదు. కొంచమైనను ధనము లేనిది మానవునకు దేహధారణ, స్థితి, వ్యవహారములు నడువవు.)

కావున స్వల్ప దోషయుక్తంబగు దేశాచారంబుచే ధనము నార్జింపుము. ఆ ధనముతో సత్కారముచేసి సాధుజనుల సంపాదింపుము. ఆ సజ్జన సాంగత్యముచే గలిగిన విషయ వైరాగ్యముచేతను, ఆత్మవిచార మహిమచేతను నీకు ఆత్మ సాక్షాత్కారము లభించును. ఇదియేముక్తి యనితెలుపుచున్నారు.

మరియును మా గురువర్యులు మానవులకు ఆహార పరమ ప్రయోజనమును గురించి ప్రతిరోజును భోజన సమయమందున మాచే చదివించుచుండిన శ్లోకమును నిచట తాత్పర్యార్థముతోడ యుదాహరించుచున్నాడ.

శ్లో॥ ఆహారార్థం కర్మ కుర్యాదనిన్ద్యం,
కుర్యాదాహారం ప్రాణసంరక్షణార్థం ।
ప్రాణాస్సంధార్యాస్తత్త్వజిజ్ఞాసనార్థం,
తత్త్వం జిజ్ఞాస్యం యేనభూయో నదుఃఖమ్ ॥

(అనగా ఎట్టివారికైనను భౌతికదేహ మున్నంత కాలము ఆహార మావశ్యకము. కావున) ఆహారము కొరకు దేశ, కాల, పరిస్థితుల ననుసరించి అనిన్ద్య

మైన కర్మను, నాచరింపుము. ప్రాణరక్షణార్థమై ఆహారము నుపయోగింపుము. ప్రాణరక్షణ గావించుకొనుచు తత్త్వ చింతన జేయుచుండుము. అట్టి తత్త్వ జ్ఞానము వలన నీకు తిరిగి దుఃఖమెన్నటికినీ గలుగదు. అనగా నిరతిశయ సుఖము శాశ్వతముగ నొందుదువు. ఇదియే ముక్తియను తాత్పర్యార్థమునిది బోధించుచున్నది. కావున జిజ్ఞాసువులు ఆత్మజ్ఞానమే యీ దేహధారణ ప్రపంచ వ్యవహారములకు పరమ ప్రయోజనమని గ్రహింతురుగాక.

ఆత్మజ్ఞానియైనను, అజ్ఞానివలె ప్రారబ్ధానుభవము నీ ప్రపంచమున నొందవలసి యుండిన యడల, యీ ఆత్మజ్ఞాన లాభమేమి? అని సంశయము గలుగవచ్చును. ఈ ప్రపంచమున జ్ఞాని, అజ్ఞానుల ప్రారబ్ధభోగము సమానమైనను, యనుభవ తారతమ్యముండునని శ్రీ విద్యారణ్యముని-

శ్లో॥ జ్ఞానినోఽజ్ఞానినశ్చాత్ర, సమే ప్రారబ్ధ కర్మణి ।
నక్లేశో జ్ఞానినోధైర్యా, న్మూఢః క్లిశ్యత్య ధైర్యతః ॥

శ్లో॥ మార్గే గంత్రోర్ద్వయోశ్శ్రాంతౌ, సమాయామప్య దూరతాం ।
జానన్ ధైర్యాద్ద్రుతం గచ్ఛ, త్యన్యస్తిష్ఠతి దీనధీః ॥

అనగా జ్ఞాని, యజ్ఞానులకు ప్రారబ్ధ కర్మ ననుభవించుట సమానమే యయినను ధైర్యము వలన జ్ఞాని దుఃఖపడడు. అజ్ఞాని దుఃఖపడును. జ్ఞానికిని, యజ్ఞానికిని నిదే భేదము. జ్ఞాని, యజ్ఞాను లిరువురు యొకచోటికి బోవలయునని బయలుదేరి పోవుచుండగా, మార్గ మధ్యమున కొంత దూరము పోవుసరికి నిరువురకును ప్రయాణ శ్రమ సమముగా నుండినప్పటికిని, జ్ఞాని ధైర్యము చేత చేరవలసిన గమ్యస్థానమందు లక్ష్యము చెడక ధగ్గరగా నున్నట్లు తలచుచు అనాయాసముగా గమ్యస్థానము చేరును. రెండవ వాడగు యజ్ఞాని, దుర్బల చిత్తుడు, లక్ష్యము లేనివాడు గనుక కాళ్ళు పడిపోవుచున్నవని దుఃఖించుచు మార్గ మధ్యముననే నిలిచిపోవును. ఈలాగున జ్ఞాని, యజ్ఞాను లిరువురకు

ప్రారబ్ధ కర్మానుభవమునందు సామ్యముండినను, దుఃఖపడుటలో మాత్రము భేదము గనబడుచున్నది. ఇంకనూ

శ్లో॥ వివేకేన పరిక్లిశ్య, న్నల్ప భోగేనతృప్యతి ।
అన్యథానంత భోగేఽపి, నైవ తృప్యతి కర్హిచిత్ ॥

శ్లో॥ పరిజ్ఞాయోప భుక్తోహి, భోగోభవతి తుష్టయే ।
విజ్ఞాయ సేవితశ్చోరో, మైత్రమేతి నచోరతామ్ ॥

జ్ఞాని ఆత్మానాత్మ వివేకముచేత ప్రారబ్ధ కర్మము క్షయింపలేదని క్లేశము నొందుచుండినను కామములేని (క్షీణించిన) వాడు గనుక స్వల్ప సుఖము చేతనే సంతృప్తి నొందుచున్నాడు. అవివేకి కామలంపటుడగుటచే యెప్పుడును సంతృప్తి చెందడు. ఈ ప్రపంచమున వివేకముతో విషయ సుఖంబుల ననుభవించిన యడల యది బంధహేతువుగాక, తృప్తికలుగును. యెట్లన, దొంగయని బాగుగ తెలిసి, వానితో స్నేహము చేసిన యడల వాడు ఆపకారి గాక స్నేహితుడు గూడ నగును ఇట్టి అనుభవము లోకమందున్నది. ఇట్లే జ్ఞాని యీ ప్రపంచ మిథ్యాత్వమును బాగుగ గ్రహించి స్వస్వరూపము నెరింగిన వాడు గనుక చోరసదృశములగు నీ ప్రపంచానుభవములు బంధకరములుగావు. ఇంకనూ, యీ జ్ఞాని తన చిత్తమును యెల్లప్పుడును స్వస్వరూపమందు బంధించి యుండువాడు గావున యీ ప్రపంచమున నెంత స్వల్ప సుఖముతోడ నయినను తృప్తి నొంది సంతసించును. ఈ విషయమునే శ్రీ విద్యారణ్యులు సదృష్టాంతముగ :

శ్లో॥ బద్ధముక్తో మహిపాలో, గ్రామమాత్రేణ తుష్యతి ।
పరైరబద్ధో నాక్రాంతో, నరాష్ట్రం బహు మన్యతే ॥

అనగా శత్రువులచేతఁ బట్టువడి విడువఁబడిన రాజు ఒక్క గ్రామమును నీకిచ్చితిమి యనినంత మాత్రమున నెంతో తృప్తిపడును. శత్రువులచేత

చిక్కక నిరంకుశముగ ప్రవర్తించెడి రాజునకెన్ని రాజ్యము లిచ్చినను తృప్తియే గలుగదు. ఇట్లే ఏకాగ్రతను పొందిన మనస్సున కెంతమాత్రము సుఖము లభించినను తృప్తి కలుగును. వివేక శూన్యమై నిగ్రహింపబడని మనస్సునకెన్ని భోగములు కలిగినను యెప్పటికిని తృప్తినొందక కోరికలతో దుఃఖము నొందుచునే యుండును. అని తాత్పర్యార్థమును తెలుపుచున్నారు.

ఇచట జ్ఞాని యనగా జ్ఞానాభ్యాసకుడు. అట్టివాడెవడనగా, పంచ భూతాత్మకమగు యీ దేహేంద్రియాది సంఘాతము, అనగా పంచకోశములు నేను కాను. నేను వాస్తవమున సజాతీయ విజాతీయ స్వగత బేధ రహితమగు నిత్యనిర్వికార అద్వితీయ స్వప్రకాశ అఖండ పరిపూర్ణ చైతన్యస్వరూపుడను. సత్యజ్ఞానానంతస్వరూపుడను. అని ప్రీతినిశ్చయములతో గ్రహించి స్వానుభవము నభ్యసించువాడు. అయినను నా ప్రారబ్ధ శేషమువల్ల నేనీ యుపాధి బద్ధుడనై యున్నవానివలె అధ్యాసమునన్ను బంధించుచున్నది. కావున యీ కర్మ దేహేంద్రియాదులదిగాని నాకు వాస్తవ సంబంధము లేదను నిశ్చయముతోడ క్షీణించిన సక్తతాభిమానములతో ప్రారబ్ధక్షయమును మాత్రము గావించువాడు.

వాస్తవమగు బ్రాహ్మణు డిట్టివాడే. జాతి బ్రాహ్మణ శబ్దము గౌణము. కేవల వర్ణ విభాగమునకు శాస్త్రము తెలుపుచున్నట్టిది. అయినను వర్ణాశ్రమ ధర్మములను పరిపాలించుట శాస్త్రవిధి. ఇట్లు తెలిసికొని శాస్త్రవిధి ప్రవర్తకుడై శాస్త్ర శ్రవణ, సత్కర్మానుష్ఠానాదులతో జ్ఞానాభ్యాసాదుల నాచరించవలయునే గాని, కర్మను మానుట వల్లగాని, యథేష్టా చరణము వల్లగాని జ్ఞానాభ్యాస మున కర్హుడు గాజాలడు. ఏలనన, ముముక్షువునకుతన ప్రారబ్ధము పూర్తిగ క్షయించినగాని, విదేహముక్తి యనువది కలుగదు. ఈ ప్రారబ్ధము, అను భవించుట వలనగాని, నశించదు. ఇది పూర్తిగ నశించినగాని మోక్షప్రాప్తి యుండదు. అనగా జీవుడు తన స్వస్వరూపానంద స్థితిని శాశ్వతముగ నొంద జాలడు.

మానవునకు తత్త్వజ్ఞానము, తాను సాధారణముగ విధిగా ననుభవింపవలసిన ప్రారబ్ధ సుఖదుఃఖ భోగానుభవములను అవి పరమార్థ వాస్తవములు గావు కల్పిత మాత్రములనియే తెలియజేయును గాని, ప్రారబ్ధమును నశింపజేయజాలదు. కావున జ్ఞానియైనను తన ప్రారబ్ధమును, ప్రపంచానుభవము తోడనే, నశింపజేయవలయునుగాని వేరు మార్గములేదు. కాని యీ తత్త్వజ్ఞానము, సుఖదుఃఖ భోగముల ననుభవించుటయందు వాటి తీవ్రతను తగ్గించును. అనగా జ్ఞాని సుఖదుఃఖముల రెంటిని, అవియెంతటివైనను అల్పదృష్టి అల్పానుభవముతోడ, పొందుచుండును. దీనికి కారణము, శ్వశరీర సర్వదృశ్య విషయములును, వాస్తవములు కావని జ్ఞానికి కలుగు తత్త్వ నిశ్చయమే. అభ్యాసకులకు తత్త్వ నిశ్చయము కలిగినను, మోక్ష ప్రాప్తికి, శేషించిన తన ప్రారబ్ధమడ్డుచుండును. కావున జ్ఞానాభ్యాసకుడు తన తత్త్వజ్ఞాన బలముతోడ సర్వానుభవములను క్షీణించిన సక్తతాభిమానములతోడ నొందగలుగుచుండును. ఇట్లనుభవింపబడు సుఖదుఃఖ భోగములు భావి ప్రతిబంధములు కావు. వేయించిన ధాన్యము ఆహారమునకు మాత్రమెట్లు పనికివచ్చుచు, వాటియందుండు అంకుర శక్తి యెట్లు నశించునో అట్లే సక్తతాభిమాన రహితముగ నొందునట్టి జ్ఞానియొక్క భోగానుభవములు గూడనగును. కావున జ్ఞానికి యీ ప్రపంచ ప్రయోజనము తన ప్రారబ్ధ క్షయమును మాత్రము గావించుకొనుటయే. జ్ఞానికైనను ప్రారబ్ధమును బట్టి జరుగవలసినవి తప్పవు. తాను కోరుకున్నది జరుగదు, జరుగునది అనివార్యము, అనునట్టి నిశ్చయముతోడ, సంకల్పములు క్షీణించిన వాడగుచు, జ్ఞాని యగువాడు, నీ ప్రపంచము ననుభవించుచు తన ప్రారబ్ధ మెప్పుడు నశించునాయని, తలచుచు, స్వస్వరూపానుసంధానాద్యభ్యాసముల నిరంతరమాచరించుచుండును.

———

# మానవుని ప్రారబ్ధ పురుషకారములు

ప్రతి జీవుడు మూడు స్వరూపములుతోనుండును. ఒకటి పారమార్ధికము, రెండు కారణ-సూక్ష్మశరీరయుక్తము, మూడు స్థూలశరీయుక్తము. ఇందు సర్వజీవులకును పారమార్ధిక స్వరూపము అఖండాద్వితీయ పరిపూర్ణ చైతన్య మొక్కటియే. కాని స్థూల సూక్ష్మ శరీరములు భిన్నభిన్నములుగ అనగా వేరు వేరుగ తోచుచుండును. ఈ రెండింటిలో ప్రతి జీవునకునూ రెండవదియగు సూక్ష్మకారణ శరీరము అనాది జీవాజ్ఞానముతో ప్రారంభమగుచు మోక్షపర్యంతము జనన మరణ సంసార చక్రరూపమున తన ప్రారబ్ధానుభవమునకుగాను అనేక ఉచ్చ, నీచ, అతి నీచోపాధులగు స్థూలశరీములను గ్రహించుచు సుఖ దుఃఖ భోగములతో సంసార ప్రవాహమున నీదులాడుచుండును. అనగా భ్రమణముచేయుచుండును. ఇట్టి సంసారచక్రమందు చిదాభానుడు, జీవుడు సూక్ష్మశరీరి. ఈ సూక్ష్మశరీరియగు చిదాభానుడే యీ స్థూల శరీరమును ఏజన్మకాజన్మాంతమందు మరణరూపమున వదలివైచుచు తిరిగి తిరిగి తన ప్రారబ్ధ సుఖదుఃఖ ఫలభోగమునకు తగిన మరియొక క్రిమి, కీటక, పశు, పక్షి మానవాది జన్మల నొందుచుండును. ఇట్లు పొందు జన్మలలో ప్రతి జన్మమునందుననూ సంప్రాప్తమైన స్థూలోపాధిని, దాని సంబంధబాంధవ్యములను తనకు శాశ్వతమనియు, సత్యమనియు, నిత్యమనియు వ్యామోహితుడగుచు, పామరత్వాదులతో అతిసక్తతాభిమానములనొందుచు, రాగద్వేషయుక్తుడై కామక్రోధాదులతో తన వ్యవహారకర్మము లాచరించుచుండును. ఇట్లు సంసార వ్యామోహితుడై సక్తతాభిమానములతో తాను చేయు కర్మలన్నియూ అనగా తన ప్రారబ్ధానుభవములన్నియు తన పుణ్యపాపఫలములకు కారణమగుచు భావిప్రతిబంధమును గలిగించుచుండును. ఇట్లు జీవునిచే తన జన్మ పరంపరలో చేయబడిన కర్మఅంతయు జేరి జీవునకు సంచిత కర్మగా నేర్పడును. ఈ సంచిత కర్మరాశియందు కాలపరిపాకముచే ఫలోన్ముఖమైన

కొంత కర్మఫలమే జీవునకు ప్రారబ్ధముగ నేర్పడి యట్టి సుఖదుఃఖప్రారబ్ధాను భవములకుగాను తిరిగి తిరిగి జన్మల నొందుచుండును. ఇట్టి ప్రారబ్ధఫలమే ప్రతి జీవునకును ఈ జన్మయందు సుఖ దుఃఖభోగములనిచ్చుచుండును. ఈ భోగములన్నియు తన కర్మఫలములేకాని అన్యులవిగావు. కావున తాను విధిగా తన ప్రారబ్ధఫలము ననుభవింపవలసియున్నది. ఇట్టి తన ప్రారబ్ధఫలము ననుభవించువిధానమందు జీవునకు స్వతంత్రముగలదుగాని యనుభవము తప్పదు. ఇచటనే జీవునకు పురుషకార మావశ్యకమగుచున్నది. పురుషకార మనగా పురుషుడుచేయు ప్రయత్నము. ఇట్టి ప్రయత్నము శాస్త్రీయముగ జేయుట పురుష వివేకము. వివేకియైన పురుషుడు తన యిచ్ఛాప్రయత్నములు శాస్త్రీయముగనున్నవా. లేవా యని పరిశీలించుకొని శాస్త్రవిధానము నవలం బించుట పురుషార్ధసాధనము. జీవునకు నిత్య నిరతిశయ సుఖమునిచ్చునట్టి జ్ఞానమొక్క శాస్త్రమువల్లనేగలుగును. కాని అన్యవిధముగ గలుగుటకు వీలు లేదు. ఇట్టి పరమ పురుషార్ధప్రాప్తికొరకే పురుషకారమావశ్యకమగుచున్నది.

గీతాచార్యులైన శ్రీ కృష్ణభగవానులుగూడ, యశఃకాములు శాస్త్ర విధానము నవలంబింపవలయుననియు, లేనిచో యిహపర సౌఖ్యములురెండును చేకూరవనియు ఈ క్రిందివిధమున తెలుపుచున్నారు-

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే, కార్యాకార్య వ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం, కర్మకర్తు మిహార్హసి ॥

శ్లో॥ యశ్శాస్త్రవిధి ముత్సృజ్య, వర్తతే కామకారతః ।
నససిద్ధిమవాప్నోతి, నసుఖంన పరాంగతిమ్ ॥

అనగా మానవుడు యేపనిచేయవలయును, యేపని చేయరాదుయను వ్యవస్థవిషయమై శాస్త్రమే ప్రమాణముగావున శాస్త్రమునందు జెప్పబడిన విధానమును తెలిసికొని కర్మముల నాచరించవలయును. ఇట్టిదియే పురుష ప్రయత్నము, పురుషకారమునగును ఎవడు శాస్త్రమునందు జెప్పబడిన విధుల

నతిక్రమించి యథేచ్ఛగా సంచరించునో వాడు యిహలోక సౌఖ్యమునుగాని, పరలోక సౌఖ్యమునుగాని, మోక్షమునుగాని నొందజాలడు. కావున పురుషునకు తన శాస్త్రీయ ప్రయత్న మావశ్యకము. ఏలనన- శాస్త్రమనగా సర్వధా, పురుషునకు తెలియనట్టియు, శ్రేయోదాయకమగునట్టియు, విధానమును తెలుపు నదియే కాని, మరియొకటిగాదు. అశాస్త్రీయ పురుష ప్రయత్న ఫలములన్నియూ అనిత్యములగుచు పర్యవసానమున జీవుని దుఃఖసాగరమున ముంచును.

పురుషప్రయత్నములేనిది, అదృష్టఫలమున్నను ఫలకారి గాజాలదు. పురుషకార, ప్రారబ్ధములు గూడినప్పుడే పురుషునకు ఫలప్రాప్తిగలుగును. లేనిచో గలుగదు. పరమేశ్వరుడుగూడ పురుష ప్రయత్నపూర్వకముగనే ఫలమును గలిగించును. లేనిచో అదృష్టఫలమున్నను అనుభవమునకురాదు. ఎట్లన- నీక్రింది యుదాహరణమువలన స్పష్టము. ముగ్గురు బాటసారులు అరణ్యమార్గమున ప్రయాణము చేయుచుండిరి. అందు నిద్దరు తండులముల నేకరించియు, యొకడు ఏమియు లేకయు ప్రయాణము చేయుచుండిరి. మార్గమధ్యమందు మధ్యాహ్నకాలమున వారందరకును ఆకలిబాధమొండాయెను. అందరును ఈ ఆకలిబాధ సమానముగ కొంతకాలమునొందినవారైరి. కాని వీరిలోనొకడు కొంగున బియ్యముగలవాడు జ్ఞప్తికివచ్చి, జలముండుతావుకు వెళ్ళి తండులములుగడిగి అగ్నిసహాయముచే తన తండులములను పచనము చేసి భుజించి క్షుద్బాధనుండి విముక్తుడయ్యెను. కాని తండులములున్న రెండవ వాడుగూడ తన ప్రయత్నముచేయు వివేకములేక తండులములులేని మూడవ వానివలెనే ఊరకయుంటి, ఆకలినిమాత్రము తలచుచు(తండులములను అదృష్ట మున్నవాడు గూడ అదృష్టము లేనివానివలెనే) క్షుత్పీడితుడాయెను. అదృష్ట మున్నవానికైనను, ప్రయత్నములేనిది ఫలముగలుగదుగదా? ఈ పై నిరూ పణనుబట్టి అదృష్టమను తండులములున్నవానికైనను, తన పురుషప్రయత్నము చేతగాని క్షున్నివారణ ఫలముగలుగలేదు. కావున అదృష్టఫలమున్నను పురుష కారమువలనగాని ఫలముగలుగదని ముముక్షువులు గ్రహించి తమ శాస్త్రీయ ప్రయత్నముచేయుచుండవలయును. కాని యూరకున్న ఫలముగలుగదు.

---

# చిద్భాస్కరుడు

చిద్భాస్కరుడనగా స్వప్రకాశ అఖండ పరిపూర్ణజ్ఞాన స్వరూపుడు. ఈయన ప్రతిజీవుని హృదయాంతరమునను పరిపూర్ణుడై సాక్షీరూపమున నుండును. అనగా అచట ఆవిధమున తెలిసికొనబడువాడని అర్ధము. ఈయన జ్ఞానులకు తెలియబడుచు అజ్ఞానులకు తెలియబడకుండగ నుండిననూ యీయన నిత్యనిరతిశయ సుఖస్వరూపుడు, ఈయన పరిపూర్ణుడు, స్వప్రకాశుడు, నిత్యుడు. ఈయన ప్రకాశమువలననేసర్వజీవులకునూ బాహ్యాంతర ప్రకాశము గలుగు చున్నది. సూర్యుని ప్రకాశముగూడ యీయనవలననే కలుగుచున్నది ఈ లోక భాస్కరుడగు సూర్యుడు జీవులకు బాహ్యప్రకాశమును మాత్రమే ఇవ్వసమర్థు డగుచున్నాడు. అంతర ప్రకాశము నివ్వజాలడు. ఈ చిద్భాస్కరుడగు పరమా త్మయే సర్వజీవుల అంతరముననుండి అంతర ప్రకాశముచేతను, సూర్య చంద్రా దుల ద్వారా బాహ్య ప్రకాశముచేతనూ సర్వప్రపంచమునూ భాసింపజేయు చున్నాడు. అనగా ఆయన ప్రకాశమువలననే యీ సర్వము ప్రకాశింపజేయబడు చున్నదని శ్రుతి:- "తస్య భాసాసర్వమిదం విభాతి" అని తెలుపుచున్నది. లోక మునకంతయు సూర్యుడొక్కడే అయినను సమస్త జీవులకు, సమస్త ప్రదేశ ములయందునను ఒక్కొక్కడుగ నెట్లగుపడుచూ, సర్వులచేతనూ లోక భాస్కరుడొక్కడేయని యెట్లు తెలిసికొనబడుచున్నాడో, అట్లే సమస్త జీవుల హృదయ పుండరీకముల యందునను ఒక్కొక్క డుగనున్నవానివలె నగుపడుచున్ననూ ఈ పరమాత్మయగు చిద్భాస్కరుడు ఒక్కడేయని గ్రహించవలయును. సూర్యుడు ప్రతి ప్రతిబింబమందుననూ పరి పూర్ణుడై యుండునట్లు యీ చిద్భాస్కరుడు ప్రతిజీవునియందు పరిపూర్ణుడుగ నుండును. ఇంకనూ ఆకసముతో నెట్టిసంబంధమునూ లేక మేఘమండల మంతయు వివిధముగ ఆకసమునందే యుండుచున్నట్లు యీ చిద్భాస్కరుడు

యీ వివిధోపాధులతో నెట్టిసంబంధమునూలేక, యీ సర్వోపాధులయందు నుండును. కాని మేఘవికారములాకాశమును పొందనియట్లు యీ ఉపాధి వికారములతో నెంతమాత్రము చిద్భాస్కరుడు సంబంధము నొందక సాక్షీ రూపుడుగతాను ప్రకాశించుచుండును. ఆయన ప్రకాశమువలననే సమస్త జీవవ్యవహారములు నడచుచున్నవి. అయినను లోకభాస్కరునితోడ నెట్టి సంబంధములేని మేఘజాలము వివిధప్రదేశములయందు, వివిధములుగ సూర్యప్రకాశమునెట్లు తాత్కాలికముగ మరుగుపరచుచుండునో అట్లే యీ వివిధోపాధి ధర్మములచే తాత్కాలికముగ యీ చిద్భాస్కరుడు బాధించబడి నట్లు కనబడుచుండును. కాని యిది, మేఘములవలన కల్పింపబడిన చీకటి వలె, జీవకల్పితాజ్ఞానమేగాని మరివేరేమియుగాదు. ఎవరెట్లుచూచిననూ స్వప్రకాశుడుగాన యీ చిద్భాస్కరుని ప్రకాశమునకెన్నడునూ, యెచటనూ వాస్తవ లోపముండదు. అయినను ఈ పరమాత్మయగు చిద్భాస్కరుడు, సర్వజీవులకునూ ఆయా ఉపాధిసంకోచ, వికాస జ్ఞానములను బట్టి, ప్రకాశ అప్రకాశములతో నొప్పుచు ఆయాజీవుల ప్రారబ్ధ వాస నానుసరణమున, సుఖదుఃఖానుభవముల నిచ్చుచున్నవానివలె నగుపడు చుండును. కాని, వాస్తవమాలోచించిన సూర్యునితోడ నేలకి సంబంధము లేక పోయినను ఆయాప్రదేశములయందు సూర్యప్రకాశము మరుగుబరుచు చున్నట్లు, ఈ వివిధోపాధులునూ వాటిధర్మములచే చిద్భాస్కరుని ప్రకాశమును మరుగుబరచుచుండును. ఇది అజ్ఞానధర్మము. కావున మానవుడు తన వివేకము తోడ, ఉపాధిధర్మములు తనకు వాస్తవముగ సంబంధించినవి కావని తెలిసి కొని, నిరశించి, తన జ్ఞానముతోడ నొక్కసారి ఈ చిద్భాస్కరుని దర్శింప గలిగినయెడల పరమార్థవాస్తవమున జీవుడు పరమాత్మస్వరూపుడేగనుక అట్టి మహనీయుడు తననుతాను వాస్తవముగ తెలిసికొనినవాడగును. అప్పుడు "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" యనువాక్యమునను సరించి తాను బ్రహ్మ స్వరూపుడేయగును. ప్రపంచమనుభవించుచున్నట్టి దివారాత్రములతో సూర్యుని కెట్టివాస్తవసంబంధములేదు. అనగా ఆయనకదలికవలన నివికలుగుటలేదు,

మరేమి యనిన ఆయనచుట్టునూ, తనచుట్టునూ తాను చేయుచున్నట్టి భూమి యొక్క భ్రమణమువలననే,నీ యుదయా స్తమయములు దివారాత్రములుకలుగు చున్నవి. కాని,యిట్లు భూభ్రమణమువలన కలుగుచున్న సూర్యోదయా స్తమాన ములు, సూర్యునియందెట్లాపాదించబడుచున్నవో అట్లే, స్వప్రకాశ నిత్యనిర్వి కారుడగు చిద్భాస్కరునియందు, వివిధోపాధి ధర్మములవలన కలుగుచున్నట్టి సుఖదుఃఖాదివికారములు, జీవాజ్ఞానముచే నాపాదింపబడుచున్నవి. ఇదియే అజ్ఞానము. జీవుడు అజ్ఞానమునుండి విముక్తుడగుటయే మోక్షము. ముక్తి.

ఈ చిద్భాస్కరుడే, సర్వజీవుల హృదయాంతరాళములయందునను ఉజ్వల ప్రకాశుడై తెలియబడునట్టియు, సర్వజీవులకునూ, నేను, నేను, అను అహం ప్రతీతినిచ్చుచున్నట్టియు, సర్వబాహ్యాంతరముల ప్రకాశింప జేయుచున్నట్టియు, ఆత్మజ్యోతి. ఈయనయే సర్వమును, సూర్యచంద్రాదు లనుగూడ ప్రకాశింపజేయునట్టి ఆత్మజ్యోతి, ఈ విషయమును "నతత్ర సూర్యోభాతినచంద్రతారకం, నేమావిద్యుతో భాంతికుతోఽయమగ్నిః। తమేవ భాంతమనుభాతిసర్వం, తస్యభాసాసర్వమిదం విభాతి" యనుశ్రుతివచనము బోధించుచున్నది. ప్రతిఒక్కరికినీ, నిదియే ఆత్మజ్యోతి, సర్వమును ప్రకా శింపజేయునది. ప్రకాశమన్నను, జ్యోతియన్నను ముఖ్యార్థము- తెలివి. అనగా జ్ఞానమనియే, ఇదియే జ్ఞానజ్యోతి, ఆత్మ, జ్ఞానము, బ్రహ్మ, చిద్భా స్కరుడు యని తెలియబడువస్తువు. ఇదియే పరమాత్మ. ఇదియే జీవుని పర మార్థ వాస్తవ స్వరూపము. ఆత్మస్వరూపము. జీవుడు- చిద్భాస్కరుడగు ఈ ఆత్మజ్ఞాన ప్రకాశసహాయముచే, ఈ స్వశరీరదృశ్యనానాత్వము, పరమార్థ వాస్తవముకాదనియు, ఆత్మేతరమంతయు జడమనియు, ఈ సర్వము వాస్తవమున ఆత్మఅనగా తన ప్రకాశము చేతనే తెలియబడుచున్నదనియు తాను అనగా నేను చిద్భాస్కరుడగు, స్వప్రకాశ నిత్యనిర్వికార అఖండ పరిపూర్ణుడననియు తెలిసికొనవలెను. ఇది అఖండ పరిపూర్ణస్వరూపము, స్వశరీర సమస్త దృశ్యము దానినుండియే కలిగి, దానియందే లయమగుచు,

నిర్విశేషముగ ఆ అఖండ పరిపూర్ణపదార్థమే శేషించును. తదితరమేమియు నుండదు. ఇదియే పూర్ణజ్యోతి. ఇదియే ప్రతివారి హృదయగుహాయందునను యుండి తెలియబడు పరిపూర్ణాత్మజ్యోతి. దీనిని తెలిసికొని స్వానుభవము నొందువాడే ముక్తుడు.

శ్రీ శంకరభగవత్పాదులు శిష్యునకు ఈ జ్ఞానజ్యోతి రూపమగు చిద్భాస్కరుడు తనలోనే యున్నాడని స్పష్టపరచి బోధించుటకు "కింజ్యోతి" యను నీ క్రిందిశ్లోకమందు ప్రశ్నోత్తరరూపమున నిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ కింజ్యోతిస్తవ? భానుమానహని మేరాత్రౌప్రదీపాదికం।
స్యాదేవం రవిదీపదర్శనవిధౌకింజ్యోతి రాఖ్యాహి మే?
చక్షుస్తస్యనిమీలనాదిసమయే, కిం? ధీర్ధియోదర్శనే।
కిం? తత్రాహమతోభవాన్ పరమకంజ్యోతిస్తదస్మిప్రభో॥

అనగా (శిష్యుని ప్రశ్నించుచున్నారు.) నీకు జ్యోతిస్సుఏది? పగలు సూర్యుడు, రాత్రులందు దీపాదులును. సూర్యచంద్రాదులను చూచుటకు ప్రకాశమేది? నేత్రములు. నేత్రములు మూసినకాలమున, నీకు జ్యోతిస్సు ఏది? బుద్ధి. నీబుద్ధినిచూచుటలో జ్యోతిస్సు ఏది? నేనే "అహం" కావున వీనికన్నిటికినీ పరమజ్యోతిస్స్వరూపుడవునీవే, అని తెలిసికొనుము. స్వామీనిజము, నేనే పరమజ్యోతిస్స్వరూపుడనై యున్నాను. (అని శిష్యుడు గ్రహించెను.) ఈ ఆత్మజ్యోతిస్వరూపుడే చిద్భాస్కరుడు.

కావున తన పరమార్థ స్వరూపమైన, జ్ఞానమగు పరంజ్యోతి సహాయమున తానే ఈ స్వశరీర సర్వదృశ్యమునకు అధిష్ఠానమని, అఖండమని, పరిపూర్ణమని, గుర్వీశ్వరానుగ్రహములతో తెలిసికొని, ప్రతి జీవుని హృత్పుండరీకమందున తెలియబడునట్టియు, స్వాత్మాభిన్నమగు నట్టియు, చిద్భాస్కరుడు తానే అనగా నేనేయని స్వానుభవమునొందు మహనీయులకు ముక్తికరతలామలకము. కాన ఈ చిద్భాస్కరుని జ్ఞానమువలన కలుగు మహత్తరలాభమిట్టిదియని జిజ్ఞాసువులు గ్రహింతురుగాక. ఇదియే ఆత్మానందస్వరూపము.

---

# ప్రణవోపాసన

ముముక్షువులకు ప్రణవోపాసన మహత్తర ఫలకారి. ప్రణవమనగా ఓంకారము. "ఓం, ఇత్యేకాక్షరం బ్రహ్మ" అని యీ ప్రణవము బ్రహ్మ స్వరూపమని శ్రుతి తెలుపుచున్నది. ఈ "ఓం" ప్రణవము, సగుణ నిర్గుణో పాసనలు రెంటికినీ ప్రతీకము. నిర్గుణ బ్రహ్మోపాసనకు ప్రణవాను సంధాన మమృతము, ఏలనన, నిర్గుణ బ్రహ్మ స్వరూపము దురవగాహము. ఎంతటి ప్రజ్ఞావంతునికైనను, అగ్రాహ్యముగ నుండు నిర్గుణాను సంధానమునందు చిత్తము స్థిరమై పూర్తిభావము నొంది నిలచుట కష్టసాధ్యము. అట్లు నిలిచి నను స్వల్పకాలముకన్న బ్రహ్మ లక్ష్యమునందు నిలువదు. కావున దురవగాహ మైన అట్టి లక్ష్యముకు ఓం, కారమును ప్రతీకముగ గ్రహించవలయునని శాస్త్రము తెలుపుచు యీ ప్రణవోపాసనను, అనేక విధానములుగ బోధించు చున్నది. వీనిని శాస్త్ర సంప్రదాయము ననుసరించి, గురుముఖతః గ్రహించ వలయును. ముముక్షువుల అనుసంధానమునకు, ప్రణవ లక్ష్యార్థమగు నిర్గుణ బ్రహ్మమందు చిత్తము నిలుపుటకిది, ఆలంబనమగును. బ్రహ్మాభ్యాసకులకు అనుసంధాన సౌలభ్యమును కలిగించుచు పరమ శ్రేయోదాయకమగునది, యీ ప్రణవోపాసన. దీనినే "ప్రణవోధనుః, శరోహ్యాత్మా, బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే"అని శ్రుతిప్రణవ,నిర్గుణ బ్రహ్మోపాసనావిధానమున తెలుపుచున్నది. కావున నిది ముముక్షువులకు-ఉపాస్యము, పరమప్రాప్తిసాధనమునగుచున్నది.

"ఓం" ప్రణవోపాసనమును చేయునప్పుడు ముముక్షువు ఉపాస్యము బ్రహ్మస్వరూపమనియూ, అదియే తాననియూ, తన స్వస్వరూపము జగదు త్పత్తిస్థితిలయ వివర్తకారణ సర్వాధిష్ఠాన నిత్యనిర్వికార అఖండపరిపూర్ణ చిదనానంద స్వరూపమను భావమునునొంది, అనుసంధానము చేయుచుండుట సర్వశ్రేయోదాయకము, శీఘ్ర పరమప్రయోజనకరము.

మరియును బ్రహ్మజ్ఞానసాధకుడు సర్వదా ప్రణవాక్షరమగు "ఓం" కారమును, మానసికముగ శ్వాసప్రశ్వాసలతోడ స్మరించుచుండుటయు, అభ్యాసకుడు తన హృత్కమలమందున ఉజ్వల స్వర్ణ రేఖనుబోలిన ప్రణవాక్షరమును కోటి సూర్యప్రకాశములతోడ సర్వదా ధ్యానించుచుండుటయు, ప్రణవలక్ష్యార్ధమగునట్టి, నిత్యనిర్వికార అఖండ చిద్ఘనానందస్వరూపమును స్వాత్మాభిన్నముగ అనుసంధానముజేయుచుండుటయే పై శ్రుతివాక్యమునకు తాత్పర్యార్ధమని గ్రహించవలయును. ఇట్టి సతతాభ్యాసమే శీఘ్రముక్తికి సాక్షాత్సాధనమని శాస్త్రప్రమాణమునుబట్టి అభ్యాసకులు నిశ్చయముగ తెలియనగును.

—o—

# ప్రణవలక్ష్యార్థము

శ్రుతిమాత ప్రణవమును జిజ్ఞాసువులకు బ్రహ్మజ్ఞానాభ్యాస సాధనముగ "ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే" అని ప్రధానముగ బోధించుచున్నది. అనగా యిది ప్రణవ లక్ష్యార్థమగు నిర్గుణాత్మానుసంధానము. అట్టి అనుసంధానమెట్లుండవలెనో సూచించునట్టి కొన్ని అనుసంధాన శ్లోకముల రచించి నీక్రింద నుదహరించుచున్నాడను. సాధకులకు సంస్కృత రేఖా రూపమగు (ఓం) కారమును వారివారి హృత్కమలమందు తేజోరూపమున తదాలంబనగ గ్రహించి ప్రణవమును మానసికముగగాని వేరు సద్గురూపదిష్ట మార్గమునగాని ఉచ్చరించుచు, తల్లక్ష్యార్థమును ఈ శ్లోకములయందు సూచించిన విధముగ నిరంతర భావన జేయుచుండుట సాక్షాన్ముక్తి దాయకమగు ఈ అభ్యాసమున కావశ్యకము. కావున సాధకులగు జిజ్ఞాసువులు వారి అనుసంధానాభ్యాసముల నిట్లు గావించుచు కాలక్రమమున తల్లాభమును పొందుదురుగాక.

శ్లో॥ జ్యోతిః ప్రణవలక్ష్యార్థం
పారావార వివర్జితమ్ ।
నిత్యం సర్వగతం శాంతం
తద్బ్రహ్మాస్మి పరం పదమ్ ॥

శ్లో॥ స్వాత్మాభిన్న స్స్వప్రకాశః
పరిపూర్ణ ఇవాంబరమ్ ।
జ్యోతిః ప్రణవలక్ష్యార్థో
హ్యచలోఽహం సనాతనః ॥

శ్లో॥ జ్యోతిః ప్రణవలక్ష్యార్థః
స్వప్రకాశో నిరంజనః।
నిత్య స్సర్వగత స్థాణు
రచలోఽహం సనాతనః॥

శ్లో॥ జ్యోతిః ప్రణవలక్ష్యార్థ
మద్వితీయ మఖండితమ్।
స్వాత్మాభిన్నం స్వప్రకాశం
తద్బ్రహ్మాస్మి పరం పదమ్॥

శ్లో॥ జ్యోతిః ప్రణవలక్ష్యార్థం
సంవిద్రూపమఖండితమ్।
స్వాత్మాభిన్నం సుఖం నిత్యం
తద్బ్రహ్మాస్మి పరం పదమ్॥

శ్లో॥ ఇదం ప్రణవలక్ష్యార్థం
మోహన్నామ కృతం శుభం।
అనుధ్యాయంతి యే నిత్యం
సుసుఖం ప్రాప్నువన్తితే॥

---0---

# హితోపదేశము

హితోపదేశమనగా మానవుని యిహపరశ్రేయస్సులకు చేయునట్టిబోధ. ఇట్టి బోధలలో మానవునకు పరమలాభమగునట్టి శ్రేయస్సు-తన నిత్యనిరతిశయ సుఖప్రాప్తి, అనగా మోక్షము. మానవునకు ఈ మోక్షమనునది ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానమనగా మానవునకు తన వాస్తవ స్వస్వరూపజ్ఞానమేగాని మరేమియుగాదు. ఇట్టి ఆత్మజ్ఞానమును గురించియు, దానిస్వరూపసాధనములనుగురించియు, ఋషిసంప్రదాయ ప్రాప్తపూర్వాచార్యబోధ వచనముల కొన్నిటి, ముముక్షుజనోపయోగము సుద్దేశించి తాత్పర్యార్థముతోడ, నీప్రకరణమున సంగ్రహించుచున్నాడను. అయినను జిజ్ఞాసువులు వీని సంపూర్ణార్థమును బాగుగ మనోగోచరము గావించుకొనుటకు సద్గురు ముఖమున తెలిసికొనుట మంచిది. ఇట్లు తెలిసికొనిన పిదప, ఆత్మజ్ఞానలాభమునకు చిరకాలాభ్యాసాదులావశ్యకములు. అయినను దీనికన్న మానవుడు పొందదగిన అధికలాభమేదియునూలేదు. ఈ ఆత్మజ్ఞానమే పరమలాభము, శాశ్వతము. జిజ్ఞాసువులబోధకుగాను శ్రీరామచంద్రమూర్తికి వశిష్ఠభగవానులుచేసిన హితోపదేశమందు కొన్ని శ్లోకములను తాత్పర్యార్థముతో నిచట తెలుపుచున్నాడను.

శ్లో॥ దీర్ఘస్వప్నమిమంవిద్ధి, దీర్ఘంవాచిత్తవిభ్రమం ।
దీర్ఘంవాపి మనోరాజ్యం, సంసారం రఘునందన ॥

ఓ రామచంద్రా । ఈ సంసారమును దీర్ఘమగు స్వప్నముగాఁగాని, లేక ఆకాశనైల్యమువలె చిరకాలానువృత్తమగు చిత్తవిభ్రాంతినిగాఁగాని, లేక దీర్ఘమగు మనోరాజ్యమునుగాఁగాని యెరుంగుము.

శ్లో॥ ఆభాసమాత్రమేవేదం, నసన్నాసజ్జగత్త్రియం।
ఇత్యన్యకలనాత్యాగం, సమ్యగాలోకనం విదుః ॥

ఈ జగము బాధ్యముగావున సద్రూపముగాదు. ప్రతీయమానము గావున నసద్రూపంబునుగాదు. మరియేమనిన? నీజగము ప్రతిభాసమాత్ర మైనదేయని భేదకల్పనను విడుచుట యేదిగలదో అదియే లెస్సయగు జ్ఞానమని వచించిరి.

శ్లో॥ చిద్వ్యోమైవకిలాఽస్తీహ, పారావార వివర్జితం ।
సర్వత్రా సంభవచ్చైత్యం, కల్పాంతేషుచ శిష్యతే ॥

ఆద్యంత వర్జితంబును, దృశ్యసంస్పర్శరహితంబును, కల్పాంత ములయందు శేషించునదియునగు చిదాకాశంబేకలదు.

శ్లో॥ నదేవోదేహరూపోవా, నదేవశ్చిత్తరూపకః
అకృత్రిమమనాద్యంతం ,దేవనందేవ ఉచ్యతే ॥

దేవుడనగా కమలపత్రాక్షుండుగాని, త్రినేత్రుండుగాని, దేహ రూపుండుగాని, చిత్తరూపుండుగాని, గానేరడు. ఇకనేమనిన, నుపాధి రహితంబును, ఆదిమధ్యాంతవర్జితంబునగు దేవనము అనగా పరిపూర్ణానంద జ్ఞానస్వరూపమే దేవుడని చెప్పబడును.

శ్లో॥ అజ్ఞాతశివతత్త్వానా, మాకారాద్యర్చనంకృతం ।
యోజనాధ్వన్యశక్తస్య, క్రోశాధ్వాపరికధ్యతే ॥

యోజనము దూరమనిన భయపడువానికి క్రోశము దూరమని చెప్పంబడునటుల నిట్టినిరాకారంబగు శివతత్త్వము నెరుంగని వారలకు సాకారము నందర్చనము విధింపఁబడియెను.

శ్లో॥ స్నాతంతేనసమస్తతీర్థసలిలై, స్సర్వాపిదత్తాఽవని,
ర్యజ్ఞానాంచకృతం సహస్ర,మఖిలా దేవాశ్చసంపూజితాః ।
సంసారాచ్చసముద్ధృతాః స్వపితర, స్త్రైలోక్యపూజ్యోఽప్యసౌ,
యస్యబ్రహ్మవిచారణేక్షణమపి, స్థైర్యం మనఃప్రాప్నుయాత్॥

ఎవనిచిత్తము బ్రహ్మవిచారమునందు క్షణమునేపైనను స్థైర్యము నొందునో వాడు సమస్త తీర్థములయందునను స్నానము చేసినవాడును, సమస్తభూమిని దానము చేసినవాడును, సహస్రయజ్ఞములు చేసినవాడును, సకల దేవతలను పూజించినవాడునగును. వాని పితరులు సంసారమునుంచి యుద్ధరింపబడుదురు. వాడు ముల్లోకములయందును పూజ్యుండగుచున్నాడు, అని భరద్వాజమునీంద్రుడు శ్రీరామచంద్రమూర్తికి తెలియజెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకంయథాస్ఫురతి వారితరంగభంగై, రేవంపరిస్ఫురతి చిన్నచ కించిదేతత్,
త్వంబంధమోక్షకలనేప్రవిముచ్యదూరే, స్వస్థోభవాఽభవభయోఽ భయసారఏవ॥

జలమొక్కటియే యనేకములగు తరంగములరూపముతో ప్రకాశించునట్లు చిత్తొకటియే నానారూపంబులఁ బ్రకాశించుచున్నది. ఇదియేకాని దృశ్యము కొంచెమైననులేదు. అట్లుగావున నీవు బంధమోక్షకల్పనలను దూరముగ విడచి సంసారభయరహితుండవును, బ్రహ్మమేసారాంశముగాఁ గలవాఁడవునై స్వస్థుండవగుము.

ఇంకనూ జీవునకు మనోరూపమగు సూక్ష్మశరీరమును గురించి యిట్లు తెలుపుచున్నారు:—

శ్లో॥ తస్మిన్నిత్యే తతేశుద్ధే చిన్మాత్రే నిరుపద్రవే।
శాంతే సమసమాభోగే నిర్వికారోదితాత్మని॥

శ్లో॥ యైషాస్వ భావాతిగతం, స్వయంసంకల్ప్య ధావతి।
చిచ్చైత్యం స్వయమమ్లానా, మననాన్మనఉచ్యతే॥

వ్యాపకమైనట్టియు, నిర్మలమైనట్టి చిత్తుమాత్రమే రూపముగాఁ గలిగినట్టియు, ఉపద్రవరహితమైనట్టియు, అంతట సమానముగా నిండి

యుండునట్టియు, నిర్వికారమగునట్టి యీ యాత్మతత్త్వమునందలి జ్ఞానము తన స్వభావమగు జ్ఞానరూపమునకు విరుద్ధముగా జడాత్మకమగు దృశ్యమును కల్పించి దానినే అనుసరించుచు తాను బ్రహ్మరూపమైనదిగాన ఉపద్రవములేనిదైనను, ఉపాధివశము వలన ఉపద్రవముకలదియై మననశక్తివలన మనస్సుగా అగుచున్నదని తెలుపుచున్నారు.

ఇంకను వశిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రమూర్తికి, హితము నిట్లు బోధించుచున్నారు—

శ్లో॥ దిక్కాలాద్యనవచ్ఛిన్నమదృష్టోభయకోటికం।
చిన్మాత్రమక్షయం శాంతమేకం బ్రహ్మాస్మినేతరత్ ॥

శ్లో॥ ఇతిమత్వాఽహమిత్యంతర్ముక్తాముక్త వపుర్మహాన్ ।
ఏకరూపః ప్రశాంతాత్మామౌనీస్వాత్మ సుఖోభవ ॥

రామచంద్రా! దేశకాల వస్తుపరిచ్ఛేదరహితంబును, ఆద్యంతరహితంబును, చిన్మాత్రంబుననగు బ్రహ్మంబే నేనని నిశ్చయించి అభిమానము లేనందున విడువఁబడినదియు, ప్రారబ్ధవశంబున విడువఁబడనిదియునగు శరీరముగలవాఁడవును, శాంతచిత్తుండవును, నాత్మారాముఁడవును నగుము.

శ్రీ శంకరభగవత్పాదులు వివేకచూడామణియందు బ్రహ్మభ్యాస విధానమును శిష్యునకు యిట్లుబోధించుచున్నారు. ఎట్లన :—

శ్లో॥ బ్రహ్మప్రత్యయ సంతతిర్జగదతో బ్రహ్మైవసత్సర్వతః,
పశ్యాధ్యాత్మదృశా ప్రశాన్తమనసా సర్వాస్వవస్థాస్వపి ।
రూపాదన్యదపేక్షితుందిమభితశ్చక్షుష్మతాం విద్యతే ।
తద్వద్బ్రహ్మ విదఃసతఃకిమపరం బుద్ధేర్విహారాస్పదమ్ ॥

అనగా (రజ్జువు) తాడునందారోపింపబడిన సర్పముతోచునప్పుడు అధిష్ఠానమగు రజ్జువు గనుపడదు. ఇదియే వివర్తమనబడును. ఆ ప్రకారమే ఈ ప్రపంచ మంతయు బ్రహ్మయొక్క వివర్తరూపమగుటవలన సర్వము అధిష్ఠానరూప మగు బ్రహ్మమేయగును. "ప్రతీతి త్త్వాత్వప్రిత్యయః" అనెడి వ్యుత్పత్తివలన బోధయే, అనగా స్వరూపజ్ఞానమే బ్రహ్మము. కాబట్టి సర్వకాల సర్వావస్థల యందును ఆధ్యాత్మదృష్టితో శాంతచిత్తుడవై సర్వమును సద్రూపమగు బ్రహ్మముగనే తెలిసికొనుము. ఇచట నేను బ్రహ్మస్వరూపుడనేగదా, కావున బ్రహ్మను జూచు టెట్లు? అను సంశయము నొందగూడదు. ఏలనన నేత్రములతో జూచువాడు దృశ్యపదార్థమునే జూచునుగాని అన్యపదార్థమును చూడజాలడు. ఈ పరమాత్మరూపమగు బ్రహ్మజ్ఞానమిటులకాదు. బ్రహ్మభ్యాసకునకు స్వశరీర సర్వమును రజ్జువుయందుతోచిన సర్పము రజ్జువుకంటె వేరుగానట్లు బ్రహ్మయే యగుచున్నది. కావున సర్వమును బ్రహ్మమాత్రముగనే జూడవలయును. అనగా, జ్ఞానదృష్టితోచూచువానికి బ్రహ్మేతరమేదియును గోచరింపదు (ఇదియే దీనిభావము).

శ్లో॥ కస్తాం పరానన్ద రసానుభూతి ముత్సృజ్యశూన్యేషు రమేత విద్వాన్ ।
చన్ద్రేమహాహ్లాదిని దీప్యమానే చిత్రేన్దుమాలోకయితుం కఇచ్ఛేత్ ॥

అనగా దుఃఖమిశ్రితముగాని నిత్య, నిరతిశయానన్ద సుఖమును, నుపేక్షించి ఆనన్దశూన్యములును, తుచ్ఛప్రాయములునునగునట్టి విషయముల నేవిద్వాంసుడు (బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు) అపేక్షించును? అనగా కోరడు. పరమాహ్లాద రూపు డగు రాకా చంద్రుడు ప్రకాశించుచుండ చిత్రపటమందు చంద్రునిజూడ నేవివేకియైనను యిచ్ఛయించునా? "నకేచన జగద్భావా స్తత్త్వజ్ఞం రంజయం త్యమీ। నాగరం నాగరీకాంతం, కుగ్రామలలనాఇవ" అనివశిష్ఠవనము తెలుపుచున్నది.

శ్లో॥ అసత్పదార్థానుభవేనకించి, న్నహ్యాస్తి తృప్తిర్నచ దుఃఖహానిః ।
సదద్వయానన్ద రసానుభూత్యా, తృప్తఃసుఖం తిష్ఠసదాత్మ నిష్ఠయా ॥

అనగా మిథ్యాపదార్థమువలన నించుకయైనను తృప్తిగలుగదు. సంప్రాప్తమైన దుఃఖము దొలగదు. కావున ఆత్మా ద్వితీయ బ్రహ్మానంద రసము ననుభవింపుచు సంతృప్తుడవై సర్వానుభవములనొందుచు సుఖింపుము.

శ్లో॥ స్వమేవసర్వతః పశ్యన్మన్య మానః స్వమద్వయమ్।
స్వానన్దమను భుంజానః కాలం నయమహామతే॥

అనగా "అహం" నేను యనునది ప్రజ్ఞానముగాని, (అనగా సర్వాధిష్ఠాన పరిపూర్ణ అఖండజ్ఞానస్వరూపము) యీ స్థూల సూక్ష్మశరీరముగాదు. దృశ్య పదార్థములయొక్క నామరూపములు కల్పితమాత్రములు ఇట్టి నామరూపముల నుపేక్షింపగా శేషించునది స్వరూపజ్ఞానము మాత్రమే. కనుక యిట్టి సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితమును, అద్వితీయమునునగు జ్ఞాన (బ్రహ్మ) స్వరూపమే నేను అని నిశ్చయించి తలంచుచు ఆత్మానందము ననుభవింపుచు కాలము గడుపుము.

శ్లో॥ అఖణ్డబోధాత్మని నిర్వికల్పే, వికల్పనంవ్యోమ్ని పురః ప్రకల్పనమ్।
తదద్వయానన్దమయాత్మనా సదా శాన్తింపరామేత్య భజన్వమౌనమ్॥

అనగా సర్వవికల్ప శూన్యమైన అఖండజ్ఞానస్వరూప పరమాత్మయందు అది, యిది, నేను, నీవు యను వికల్పమునొందుట (కల్పించుట) ఆకాశమునందు నగరకల్పనజేయుటవంటిది. కావున ఆత్మాద్వయానన్దస్వరూపుడవై పరమ శాంతితో మౌనమునవలంబింపుము. మౌనమనగా మిథ్యా సంకల్ప వికల్ప హేతువగు దృశ్యనానాత్వ బుద్ధిశాంతించియుండుటయే. కాని కేవల వాఙ్మౌనము మౌనముకాదని బ్రహ్మవాదులు తెలుపుచున్నారు.

కావున ఈ పై హితోపదేశబోధను సక్రమముగ శాస్త్రీయముగ గ్రహించి ముముక్షువులగు జిజ్ఞాసువులు వారివారి అభ్యాసపాటవలాభము నొందురుగాక.

"యావద్విజ్ఞాన సామీప్యం, తావచ్ఛైత్ర్యిష్ఠ్యంవివర్ధతే," అని విద్యారణ్య వచనము తెలుపుచున్నది. ఇచట విజ్ఞానమనగా స్వాత్మజ్ఞానమేయని గ్రహించవలయును.

జిజ్ఞాసువులు దీనిని పఠించినంతమాత్రమున తృప్తినొందగూడదు. ఏలనన అభ్యాసమువలనగాని యేసిద్ధియైనను పొందబడదు. అన్ని సిద్ధులును అభ్యాసమువలన పొందబడునని వేదము తెలుపుచున్నది. ఈ విషయమునే "అభ్యాసాత్సర్వసిద్ధిః స్యాదితి వేదానుశాసనం" అని వశిష్ఠవచనముగూడ తెలుపుచున్నది.

జిజ్ఞాసువులు వారివారి, ప్రారబ్ధానుసరణమున గలుగునట్టి సుఖ దుఃఖాది భోగములను యథాప్రాప్తముగ సంతుష్టచిత్తులై యనుభవింపవలయునేగాని, విషయములయందు రాగద్వేషాదులనొందుచు విషయ చింతనము చేయ గూడదు. విషయచింతనమనగా లేనిదానిని కావలెననియు, ఉన్నదానిని పోవలె ననియు, విషయములనుగురించి ధ్యానించుచుండుట, కోరుచుండుట. జీవునకు సుఖదుఃఖానుభవములు తన కర్మఫలమునుబట్టి ప్రారబ్ధానుసరణమున, గలుగు చుండునుగాని కొరినమాత్రమునరావు. కేవల కోరికలచేవచ్చునది దుఃఖమేగాని సుఖమురాదు. శాస్త్రము నిష్కామునకే సుఖముగలుగునని తెలుపుచున్నది గావి, కామలంపటులకుగాదు. కావున ముఖ్యముగ జిజ్ఞాసువులగు అభ్యాసకులు వారి జగన్మిథ్యాత్వజ్ఞాన దార్ఢ్యముతోడను, జ్ఞాన వైరాగ్యములతోడను విషయ చింతనమును వదలుట నభ్యసించవలయును. ఏలనన, ఈ విషయచింతన మనునది మోక్షప్రాప్తికి బంధహేతువు ఎట్లన. మోక్షప్రాప్తికి సాధనమగు బుద్ధిని నశింపజేయును. నశింపజేయుటయనగా కాలుష్యముచేయును. ఈ విషయమునే శ్రీకృష్ణభగవానులు గీతలలో వివరముగ నిట్లు తెలుపుచున్నారు-

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంస, స్సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సఞ్జాయతేకామః, కామాత్క్రోధోఽభిజాయతే ॥

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహ. స్సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో, బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥

అనగా విషయములను ధ్యానించువానికి వానియందు సజ్గముగలుగును. అట్టి విషయాసక్తివలన కోరిక పుట్టును. కోరికవలన కోపముగలుగును. క్రోధమువలన అవివేకముగలుగును. అవివేకమువలన స్మరణ భ్రంశము గలుగును. స్మరణజ్ఞానము పోవుటవలన బుద్ధి నశించును. బుద్ధి నశించినతోడనే తానేనశించును. కాబట్టి విషయచింతనమే యుండరాదు.

విషయ చింతనములు సంకల్పములను వృద్ధి పొందించుచుండును ఈ సంకల్పములే సంసార బంధహేతువులు. "సంకల్పమన ఏవ. సంసారః, నిస్సంకల్పమన ఏవ బ్రహ్మ," యని వశిష్ఠవచనము తెలుపు చున్నది. కావున ప్రధానముగ ముముక్షువులకు యీ విషయచింతనమనునది విషతుల్యము. అభ్యాసకులు దీనిని ముఖ్యముగ గమనింతురుగాక.

ప్రాజ్ఞులు మనమిట్లుచేయుట సాధ్యమాయని శంకించగూడదు. అభ్యాసమువలన సర్వసిద్ధులను బడయవచ్చును. అనగ సాధింపలేనిది నేదియును నుండదని వేదము, ఋషివచనములునూగూడ తెలుపుచున్నవి. ఇంకనూ యిట్టి సంశయమే అర్జునునికి కలిగినప్పుడు శ్రీకృష్ణభగవానులు "అభ్యాసేనతుకౌన్తేయ వైరాగ్యేణచ గృహ్యతే" అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను, సాధింపవచ్చునని తెలుపుచున్నారు. కావున జిజ్ఞాసువులు వారి ఆశయమగు ముక్తిని అభ్యాసము, వైరాగ్యముఅను సాధనములచే సంపాదించగలరు. ఇందు సందియములేదు.

మరియును యోగవాశిష్ఠమునందు శ్రీ రామచంద్రమూర్తికి, యీ ప్రపంచము యొక్క అసత్యత్వమును, జ్ఞానాభ్యాసకుడు యీ ప్రపంచమున నుభవించుచు ఆత్మజ్ఞానము సంపాదించవలయునని చేసిన యుపదేశ బోధను సంగ్రహించి బ్రహ్మజ్ఞానా భ్యాసకులగు జిజ్ఞాసువుల, సిద్ధాన్త జ్ఞాన

దార్ఢ్యమునకుగాను ఆ శ్లోకములనిచట తాత్పర్యార్ధముతో నుదాహరించు చున్నాడను.

శ్లో॥ సృష్టిరేవమియం రామ సర్గేఽస్మిన్‌స్థితి మాగతా।
విరించి రూపాన్మనసః పుష్పలక్ష్మీ ర్మధోరివ॥

శ్లో॥ స్వ సంకల్ప కృతాస్సర్వే దేవాసుర నరామరాః।
స్వ సంకల్పోపశమనే శామ్యంత్య స్నేహదీపవత్॥

శ్లో॥ ఆకాశ సదృశం సర్వం కల్పనామాత్ర జృంభితం।
జగత్పశ్య మహాబుద్ధే సుదీర్ఘ స్వప్నముత్థితమ్॥

శ్లో॥ నజాయతే న మ్రియతే ఇతి కించిత్కదాచన।
పరమార్థేనసుమతే మిథ్యా సర్వంతు విద్యతే॥

శ్లో॥ కోశమాశాభుజంగానాం సంసారాడంబరం త్యజ।
అసదేత దితిజ్ఞాత్వా మాఽత్రభావం నివేశయ॥

శ్లో॥ గంధర్వనగర స్యార్థే భూషితే దూషితే ఽథవా।
అవిద్యాంశ సుతాద్యైర్వాకః క్రమస్సుఖదుఃఖయోః॥

శ్లో॥ ధనదారేషు వృద్ధేషు దుఃఖ యుక్తం నచేష్టతః।
వృద్ధాయాం మోహమాయాయాంకస్సమాయా సవానిహ॥

శ్లో॥ యైరేవజాయతే రాగో మూర్ఖస్యాధికతాం గతైః।
తైరేవభోగైః ప్రాజ్ఞస్య విరాగ ఉపజాయతే॥

శ్లో॥ అతో రాఘవ తత్త్వజ్ఞో వ్యవహారేషు సంస్థితః।
నష్టం నష్టముపేక్షస్వ ప్రాప్తం ప్రాప్తముపాహర॥

శ్లో॥ అనాగతానాం భోగానా మవాంఛనమకృత్రిమం।
ఆగతానాంచ సంభోగ ఇతి పండిత లక్షణమ్॥

శ్లో॥ యస్యస్యాదిద మిత్యాస్థా నివృత్తా సర్వవస్తుషు।
క్రోడీకరోతి సర్వజ్ఞం నావిద్యా తమవాప్తవీ॥

శ్లో॥ శుద్ధం సదసతోర్మధ్యం పదం బుధ్యావలంబ్యచ।
సబాహ్యా భ్యంతరం దృశ్యం మాగ్రృహాణ విముంచమా॥

శ్లో॥ యస్య నేచ్ఛాన వాఽనిచ్ఛాజ్ఞస్య కర్మణి తిష్ఠతః।
నతస్యలిప్యతే ప్రజ్ఞా పద్మ పత్రమివాంబుభిః॥

శ్లో॥ ఉచ్చైః పదాయ పరయా ప్రజ్ఞయా వాసనాగణాత్।
పుష్పాద్గంథ మివోదారం చేతో రామ పృథక్కురు॥

శ్లో॥ నత్యజంతి న వాంఛంతి వ్యవహారం జగద్భవం।
సర్వమేవాను వర్తంతే పారావార విదోజనాః॥

శ్లో॥ తేశూన్యేఽపి నఖిద్యంతే తేదేవోద్యాన సంగినః।
నియతించ న ముంచంతి మహాంతో భాస్కరా ఇవ॥

శ్లో॥ స్వాలోకిత శ్శాస్త్రిదృశాస్వ బుద్ధ్యా స్వానుభా వితః।
ప్రయచ్ఛతి పరాంసిద్ధిం త్యక్త్వాత్మానం మనఃపితా॥

శ్లో॥ వివేకం పరమాశ్రిత్య బుధ్యా సత్య మవేక్ష్యచ।
ఇంద్రియారీనలం తీర్త్వా తీర్ణోభవభవార్ణవాత్॥

శ్రీరామచంద్రా వసంత ఋతువు నుండి పుష్పసంపద గలుగునట్లు బ్రహ్మస్వరూపంబగు మనస్సునుండి సృష్టియగు నీ ప్రపంచమంతయు గలిగిన దాయెను. దేవ, రాక్షస, మనుష్యాదులందరును తమ సంకల్పము చేతనే గలిగినవారు. కావున తమ సంకల్పము ఉపశమించిన యెడల, చమురు లేని దీపములలాగున అణగిపోవు చున్నారు. సమస్తమగు జగంబును ఆకాశ ముతో సమానమై శూన్యమైనదానిగను, కల్పనామాత్రంబుచే గలిగినదానిగను దీర్ఘ స్వప్నమువంటిదానిగను, జూడుము. (అనగా తెలిసికొనుము) ఈ ప్రపం

చమున ఏదియును పుట్టుటగాని, చచ్చుటగాని, లేదు. వాస్తవమున నిది యంతయు నసత్యంబేయగును. ఆశలను సర్పంబులకు నివాసంబగు నీ సంసారాడంబరమును విడువుము. ఈ సంసారము వాస్తవముకానిదని, అసత్యంబని, తెలిసికొని దీనియందు తాత్పర్యముతోడ యెంతమాత్రము సక్తత నొందకుము. గంధర్వనగరము యొక్క (అనగా ఆకసమున గనుబడు చిత్ర విచిత్రరంగులుగల మేఘమండలము) స్థితిని భూషించినను, లేక దూషించినను, సుఖముగాని, దుఃఖముగాని గలుగనట్లు అవిద్యాంశంబులగు పుత్ర కళత్రాదులను భూషించినను, దూషించినను, సుఖంబుగాని, దుఃఖంబుగాని కలుగక యుండుము. ధన దారాదులు అభివృద్ధినొందగ దుఃఖమే గలుగును గాని సుఖంబు గలుగదు. మోహమను మాయ యుండగా యెవరికి శాంతి గలుగును? ఎవరికి గలుగదని భావము. భోగంబులు అభివృద్ధినొందినకొలది పామరునకీ రాగాదులు యెట్లధికమగు చుండునో, యట్లే ఆభోగంబుల యభివృద్ధి జ్ఞానవంతునకు వైరాగ్యహేతువగుచున్నది. శ్రీరామచంద్రా! కావున ఇట్లు తెలిసికొని తత్త్వజ్ఞానము గలవాడవై వ్యవహారముల యందు ప్రవర్తించుచుండినను నష్టమైన దానిని యుపేక్షించి ప్రాప్తమైనదానిని గ్రహించుచుండుము. ప్రాప్తించని సుఖ దుఃఖాదిభోగంబుల గోరక, ప్రాప్తించిన సుఖ దుఃఖములను సమానముగ ననుభవించుటయే పండిత లక్షణమగును. ఇది నాకుండవలయునను సమస్తవస్తువిషయమగు కోరిక యెవనికి లేకపోవునో యట్టి మహనీయుని అసత్యమగునట్టి అవిద్య (అనగా మాయ) ఆవరింపదు. అనగా దానివలన సంసార బంధము నొందడు. ఏలనన ఈ విద్వాంసుడు మాయా స్వరూపము నెరిగిన వాడుగావున, "విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రీమేతి నశత్రుతామ్" తెలిసి సేవింపబడునట్టి, అనగా స్నేహము చేయబడునట్టి చోరుడు అపకారిగాక ఉపకారిగనే యుండునట్లు, అట్టి విద్వాంసుని మాయాకార్యమగు నీప్రపంచము, ప్రపంచానుభవములు, బంధింపక, జిజ్ఞాసు సాధనాభ్యాసములకుపకరించును. శ్రీరామచంద్రా! నిర్మలమైనట్టి, దృక్దృశ్యములకు మధ్య యుండునట్టి తత్త్వమును అనగా అఖండ, నిర్వికార, పరిపూర్ణ జ్ఞానస్వరూపమును నీబుద్ధిచే

గ్రహించి, బయటయును, లోపలయును, నుండునట్టి దృశ్యమును గ్రహింపక యు, విడువకయు, నుపేక్షింపుము. (అనగా ఈ స్వశరీర సర్వ దృశ్యము నందును సక్తతాభిమానముల నొందక నుపేక్షాభావముతో నుండవలయునని అర్థము.) ఎవ్వడు యిష్టానిష్టంబులులేక అవశ్యకర్తవ్యంబగు కర్మంబును మాత్రము చేయుచుండునో అట్టి వాని యొక్క మనస్సు తామరాకు, జలంబు నంటక యుండునట్లు హర్ష విషాదంబుల నొందదు. కైవల్య పదము ప్రాప్తించుటకై ప్రజ్ఞాతిశయముచేత పుష్పమునుంచి పరిమళమును (సుగంధ మును) వేరుచేయునట్లు, లోకవాసనలనుండి మనస్సును వేరుచేయుము. తత్త్వ జ్ఞానసంపన్నులగుజనులు జగత్సంబంధంబగు వ్యవహారమును విడువకయు, కోరకయు, సర్వంబును యథాప్రాప్తంబుగజేయుచుందురు. ఇట్టి జ్ఞానవంతులు శూన్యస్థలమందున, అనగా లేమికాలములయందు దుఃఖపడరు. నందనోద్యా నంబులున్న కాలంబునను ఆసక్తిచెందరు. సూర్యుని యట్లు నియతిని తప్పరు. సృష్టిస్వరూపమును తెలిసికొనిన యడల మాయయొక్క స్వరూపము స్పష్ట మగును. కావున శాస్త్రి దృష్టిచేత పర్యాలోచనచేయబడినట్టియు, స్వానుభవ ముచే నిశ్చయించుకొనబడినట్టియు మనస్సు, తాను లయమునొంది కైవల్యము నిచ్చుచున్నది. శ్రీరామచంద్రా! ఉత్కృష్టమగు వివేకమునాశ్రయించి బుద్ధిచే తత్త్వమునెరింగి యింద్రియములుఅను శత్రువులను జయించి సంసారసాగర మును దాటుము.

శ్లో॥ అయమహమితి నిశ్చయోవృథాయ
స్తమలమపాస్య మహామతేస్వబుద్ధ్యా।
యదితరదవలంబ్య తత్పదంత్వం,
వ్రజపిబభుంక్ష్వనబధ్యసేఽ మస్కః॥

శ్రీరామచంద్రా! ఇది-నేను అను అహంకారపరిచ్ఛిన్నమగు వ్యర్థ నిశ్చయమును బుద్ధిచే బొత్తిగా విడచి అపరిచ్ఛిన్నరూపమగు బ్రహ్మమును నేనని యెరిగి సంకల్పరహితుండవై ఎట్లు విహరించినను బంధమునొందవు.

అని యిట్లు శ్రీరామచంద్రమూర్తికి వశిష్ఠభగవానులు యీ ప్రపంచ ప్రపంచానుభవములను గురించి బోధించుచు నింకనూ బ్రహ్మాభ్యాసకుని, స్థితి లాభములనుగూర్చి-

శ్లో॥ హృదయంనావలుంపంతి, భీమాస్సంస్మృతిభీతయః ।
సామ్యంపరముదేత్యంతర్నిర్మందర ఇవార్ణవః ॥

శ్లో॥ సముద్రస్యేవగాంభీర్యం స్థైర్యం మేరోరివస్థితిః ।
అంతశ్శీతలతాచేందోరివోదేతివిచారిణః ॥

శ్లో॥ సచ్ఛాస్త్రసాధువృత్తీనామవిరోధినికర్మణి ।
రమతే ధీర్యథాప్రాప్తే సాధ్వీవాంతః పురాజిరే ॥

అనగా, భయంకరములగు సంసారోపద్రవములు అట్టివారి మనసును భేదించ నేరవు. (అనగా ఎట్టి వికారమును పొందింపజాలవు.) మందర పర్వత మథనమువలన సంక్షోభములేని సాగరమువోలె లోన శ్రేష్ఠమగునట్టి సమబుద్ధి పొడమును.ఆత్మవిచారణ చేయువానికి,సముద్రమునుబోలు గాంభీర్యంబును, మేరుపర్వతముయొక్క స్థైర్యమును, చంద్రునిలోనున్న చల్లదనమును బోలు చల్లదనంబును గల్గును. ఆత్మవిచారణము చేయువానియొక్క బుద్ధి, వేద, శాస్త్ర, సజ్జన స్వభావములకు విరోధించిన కార్యములందును, అప్రయత్నముగా సంప్రాప్తమగు వస్తువునందునను, పతివ్రత అంతఃపురమునందేయుండి, సంతస మొందునట్లు, సంతోషము నొందుచుండును, అని తెలుపుచున్నారు.

ముముక్షువనగా కొంతవరకైనను సాధనచతుష్టయ సంపత్తి నొంది,మోక్ష ప్రాప్తినిచ్ఛయించుచు, సాధనములగు ఆత్మవిచారానుసంధానాదులను, నిత్యముగా నభ్యసించుచుండెడివాడు. వీరిని గురించి తెలుపుచున్నట్టివచనములను కొన్నింటిని, జ్ఞానాభ్యాసకుల నుద్దేశించి యిచట తెలుపుచున్నాడను. వీరు కాలక్రమమున వారి,వారి స్థితి అభ్యాస పాటవములబట్టి,

జీవన్ముక్తిలాభమును మెల్లమెల్లగ నొందుచుందురు. ఇట్టివారి వ్యవహారమెట్లుండుననిన-

శ్లో॥ దృశ్యతే లోకసామాన్యోయథాప్రాప్తానువృత్తిమాన్ ।
ఇష్టానిష్టఫలప్రాప్తౌ హ్యాదయేవాసనాజితః ॥

శ్లో॥ సుఖాసనోపవిష్టేనయథాసంభవమశ్నతా ।
భోగజాలంసదా చారవిరుద్ధేషు నతిష్ఠతా ॥

శ్లో॥ యథాక్షణం యథాదేశం ప్రవిచారయతాసుఖం ।
యథాసంభవసత్సంగమిమం, మోక్షకథాక్రమమ్ ॥

శ్లో॥ ఆసాద్యతేమహాన్ జ్ఞేనబోధస్సంసార శాంతిదః ।
నభూయోజాయతేయేన యోనియంత్ర ప్రపీడనమ్ ॥

ఈ జీవన్ముక్తి స్థితియందుండు బ్రహ్మాభ్యాసకుడెట్లుండుననిన, శాస్త్రముచేతను లోకముచేతను సిద్ధించిన వానిననుభవించుచు ఇష్టము సిద్ధించిననూ, సిద్ధించకుండినను, మనసునపొంగుగాని, (అనగా ఉబ్బిపోవుట) దుఃఖమును గాని నొందక లోకసామాన్యముగ నుండును. ఇంకను, సుఖకరంబగు నాసనంబున గూర్చుండునట్టియు, సంభవించిన భోగంబులనొంది తృప్తి నొందునట్టియు, సదాచారమునకు విరుద్ధమగు పనుల జేయనట్టియూ, దేశకాలంబుల ననుసరించి సంభవించు సత్సాంగత్యము గలిగి, మోక్షశాస్త్రమును విచారముజేయు నీ పండితుడు, యోనియంత్రములయొక్క బాధను మరల బొందనివాడగుచు (అనగా జన్మాదులతో తిరిగిపనిలేక) గొప్పజ్ఞానమును పొందుచున్నాడు.

మరియును నీ అభ్యాసకుడు-

శ్లో॥ తావద్విచారయే త్ప్రాజ్ఞో, యావద్విశ్రాంతిమాత్మని ।
సంప్రయాత్య పునర్నాశాం, శాంతింతుర్యపదాభిధామ్ ॥

అనగా, యీ లక్షణములు గలిగి మధ్య మధ్య ధర్మార్థముల నార్జించుచు, యెంతకాలములో నాత్మయందు ఊరటను పొందునో (అనగా ఆత్మయందే సుఖమునొందగలుగునో) ఎంతకాలములో మరల నశించనట్టి తురీయమను పేరుగల శాంతిని పొందునో అంతకాలమువరకును (అనగా ప్రారబ్ధాంతమున కలుగు చరమ వృత్తి సాక్షాత్కారమువరకును) ఆత్మవిచారము చేయుచునే యుండవలయును. అని వశిష్ఠబోధ తెలుపుచున్నది.

ముముక్షువగునట్టి జ్ఞానాభ్యాసకునికి అఖండాకారవృత్త్యభ్యాసము ఆవశ్యకమగుచున్నది. ఏలనన తాను యిచ్ఛయించునట్టి మోక్షస్వరూపమిదియే. అఖండాకారవృత్తియనగా స్వాత్మాభిన్న అఖండ స్వరూపానుభవము. అఖండమనగా దేశ, కాల, వస్త్వపరిచ్ఛిన్నము. ఇది పరిపూర్ణానంద స్వరూపము. ఇట్టి స్థితి సర్వజీవులకును సుషుప్తికాలమం దనుభూతమగు చుండును. కాని యిది తమోగుణప్రధానమై వృత్తిహీనముగ అజ్ఞానము వలన గలుగుచుండుటచే యీ సుషుప్తిసుఖము తాత్కాలికమగుచు తమస్సును వృద్ధిచేయుచుండును. అయినను యీ సుషుప్తిసుఖము సర్వజీవులకును స్వభావమునుబట్టి కొంతవర కావశ్యకమగుచున్నది. కాని దీనియం దధికభోగ ప్రవృత్తిని శాస్త్రము నిషేధించుచున్నది. గీతాచార్యులుగూడ నిట్లే తెలుపు చున్నారు. వృత్తి అజ్ఞానమందు లయమగుచు, గలుగుచున్నట్టి అఖండా కారానుభవమే సుషుప్తి. ఇది అజ్ఞానరూపము, తమోగుణప్రధానము, గనుక శాస్త్రము నిషేధించుచున్నది. కావున జ్ఞానాభ్యాసకుడు తనపురుషార్థ సాధన ముగ నీ యఖండాకారవృత్తిని, తన జ్ఞానము తోడ నభ్యసించుచుండవల యును. అనగా వృత్తిని అఖండాకారాకారితముగ జేయుచుండవలయును. ఎట్లనిన ఈ నామరూపాత్మకముగనున్న మూర్తా మూర్త స్వశరీర, సర్వ ప్రపంచసృష్టియంతయు దేశ, కాల, వస్తు, పరిచ్ఛిన్నమై నశించునదిగావున, అభ్యాసకుడు జ్ఞానముతోడ తన వృత్తిని దేశ, కాల, వస్త్వ పరిచ్ఛిన్నముగ జేసి, సజాతీయ, విజాతీయ, స్వగత, భేదరహితమగు పరిపూర్ణ చైతన్య మును స్వాత్మాభిన్నముగ అనుసంధానాద్యభ్యాసముల జేయుచుండవలయును.

ఇదియే అఖండాకారవృత్తి. సాధకులకిట్టి యభ్యాసమునకు శాస్త్రము నిర్మల మహాకాశమును, నిస్తరంగ మహాసముద్రమును, యుదాహరణములుగ తెలుపుచున్నవి. కాని వీని గ్రహణము అభ్యాసకునకు ప్రథమముననే ఒక్క సారిగ గలుగుట కష్టము. కావున సులభముగ దెలియుటకు నీ సామాన్యోదాహరణమునుగూడ గ్రహించవచ్చును. మొదలు స్వచ్ఛమై తెల్లగానుండు ఒక్క కాగితము మీదనే భిన్న భిన్న రూపములగు యనేక రేఖలను అక్షర సంకేతములుగ గల్పించి అనగా వ్రాసి వాటి వ్యవహార ప్రయోజనమును మనము యెట్లు పొందుచున్నను వీటికన్నిటికిని ఆధారమగునది యొక్క శ్వేతపత్రమేగదా? అదియే వీటికాధారమై అక్షరములను, మార్చినను అక్షరములను శుభ్రముగ తుడిచివేసినను ఒక్క శుద్ధకాగితము మాత్రమెట్లు మిగిలి యుండునో, యట్లే ఈ సర్వనామరూపములను త్యజించగా, (అనగా జ్ఞాన పూర్వకముగ నివి యన్నియు లేవని నిశ్చయము నొందుట) అప్పుడు మిగులునది ఊహాకుమించిన ఒక్క అఖండ పరిపూర్ణ శుద్ధచైతన్య స్వరూపమే. దీనిని స్వాత్మాభిన్నముగ ననుసంధించిన యిదియే యఖండాకారవృత్తి యనబడును. ఇదియే సర్వాధిష్ఠాన పరమాత్మ స్వరూపమనియు, యిదియే తాననియు, తెలిసికొని, యీ వృత్తిని సదా అభ్యసించుచుండుటచే కాలక్రమమున అఖండ బ్రహ్మాకారవృత్తి యేర్పడును. దీనినే బ్రహ్మాకారవృత్తి యనియు, స్వస్వరూపానుసంధానమనియు శాస్త్రము బోధించుచున్నది. కావున యీ విద్యాభ్యాసావశ్యకతను జిజ్ఞాసువులు గ్రహింతురుగాక.

అభ్యాసకులు అచటచట తెలిపినదే తెలుపుచున్నారను సంశయము నొందగూడదు. ఏలనన, "గ్రంథలాఘవాద్బుద్ధి లాఘవం, ప్రయోజనమితి" "అనగా గ్రంథముయొక్క లాఘవమువల్ల బుద్ధికి లాఘవము గలుగుట ప్రయోజనము. ఆ కారణముచే ఈ బ్రహ్మస్వరూపము, అనుసంధాన వాక్యములు, సాధనములు, మాటిమాటికి జెప్పబడుచున్నవి. పరమ ప్రయోజనము గలుగుటకుగాను ఒకేయర్థము నిచ్చువాక్యములను మాటిమాటికి జెప్పినను పునరుక్తిదోషము రానేరదు. ఎక్కడ, యొకే అర్థము నిష్ప్రయోజనముగ

మాటిమాటికి జెప్పబడునో, అచటనే పునరుక్తిదోషము సంభవించును. ఇచట జీవునకు పరమప్రయోజనముననుసరించి ప్రతినిరూపణ, ప్రకరణములందునను, ఏకార్థకవాక్యములను దాహరించుట స్వలాభముకొరకేగాని వ్యర్థము గాజాలదని, వార్తికకారులగు సురేశ్వరాచార్యులవారి పై వచనము తెలుపుచున్నది.

జ్ఞానాభ్యాసకుడు తను (అనగా"అహం" నేను,) యిక్షుఖండమందెక్కడ జూచినను మాధుర్యమేయుండునట్లున్నూ, లవణఖండమందెక్కడ జూచినను, వుప్పగనే యుండునట్లున్నూ, నేను అద్వితీయ, అఖండ, పరిపూర్ణ స్వరూపుడనై యెచట జూచినను జ్ఞానస్వరూపముగ నిండి పరిపూర్ణుడనై యున్నాను. నాస్వరూపమైన జ్ఞానేతరమేదియును యెచటను, వాస్తవముగ లేదు. నా పరిపూర్ణ స్వరూపము అఖండజ్ఞానము. దీనినే శ్రుతి "పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అని తెలుపుచున్నది. కావున నేను సర్వదా అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూడనని అఖండాకార వృత్తినభ్యసించుట యావశ్యకము.

బ్రహ్మజ్ఞానాభ్యాసకులనుకూడ సంసారవియోగ దుఃఖములు బాధించుచుండును. కాని జీవునకు గలుగునట్టి యనేక జన్మలను, ఆయాజన్మల యందు గలుగునట్టి సంబంధ బాంధవ్యములను వివేకముతోడ నిప్పుడు గుర్తించుట వలన ఆత్మజ్ఞానంబుగలిగి దానివలన చిత్తమునకుపశాంతి గలుగును. కావున పుణ్య పావనోపాఖ్యానమునుంచి శ్లోకములకొన్నిటినిచట తెలుపుచున్నాడను. పుణ్యుడు, పావనునితో నిట్లనియె-

శ్లో॥ మాతాపితృ సహస్రాణి సమతీతానితేసుత.
పుత్రబాంధవ బృందాని జంతోర్జన్మనిజన్మని ।
శోచనీయా యదిస్నేహాన్మాతా పితృసుతాస్సుత,
తదతీతాన శోచ్యంతే కిమజస్రం సహస్రశః,

తమ్ముడా! నీకు తల్లిదండ్రులు అనేక సహస్ర సంఖ్యాలైనవారుగడచిరి. ప్రాణికి ప్రతిజన్మంబునను బాంధవజాలంబు ఏర్పడుచుండును. తల్లిదండ్రులు

పుత్రులు మొదలగువారినిగూర్చి ప్రేమచే దుఃఖింపవలసిన యడల తొల్లింటి జన్మంబుల యందు గడచిన సహస్రసంఖ్యలగు మాతా పిత్రాదులను గూర్చి యేల దుఃఖింపవు.

శ్లో॥ బంధుమిత్ర సుతస్నేహ ద్వేషమోహదశాదయః ।
స్వసంజ్ఞామాత్రకేణైవ ప్రపంచోఽయంవితన్యతే ॥

బంధువులు, మిత్రులు, పుత్రులు, స్నేహము, ద్వేషము, మోహము, ఈ రూపమగు ప్రపంచము తనదు పేరుమాత్రముచేతనే పెరుగుచున్నది.

శ్లో॥ బంధుత్వేభావితోబంధుః పరత్వే భావితఃపరః ।
విషామృతదశేవేహ స్థితిర్భావ నిబంధినీ ॥

బంధువుడని భావింపబడినవాడు బంధువుడగును. పరుడనిభావింపబడినవాడు పరుడగును. విషామృతదశవలెనీస్థితి మనోభావమునుబట్టి గలిగినదేయగును.

శ్లో॥ ఏకత్వేవిద్యమానస్య సర్వగస్య కిలాత్మనః ।
అయంబంధుః పరశ్చాయ మిత్యేషా కలనాకుతః ॥

ఒక్కడేయగు నాత్మ సర్వవ్యాపకుండై యుండగా, వీడు బంధువుడు, వీడు పరుడు అనునిట్టి భేదకల్పన యెట్లు కలదు.

శ్లో॥ రక్తమాంసాది సంఘాతాద్దేహాః దేవాస్థిపంజరాత్ ।
కోఽహంస్యామితి చిత్తేన స్వయంపుత్రవిచారయ ॥

శ్లో॥ దృష్ట్యాతు పారమార్థిక్యా నకశ్చిత్త్వం నచాప్యహం ।
మిథ్యాజ్ఞానమిదం పుణ్యః పావనశ్చేతి వల్గతి ॥

శ్లో॥ బభూవుస్తే సుపుణ్యాసుస్థలీషు మృగయోనిషు ।
బహవో బంధవో మార్గాస్తాన్ కథంనానుశోచసి ॥

శ్లో॥ బభూవుస్తే మహాభ్రేషు శిఖరేషు మహీభృతాం ।
బహవో బాంధవాస్సింహాః కింతానపినశోచసి ॥

ఓ తమ్ముడా! ఈదేహము ఆత్మకానేరదు. అయినను ఎముకల పంజరంబగు నీదేహము మొదలుకొని నేనెవ్వడనని నీయంతట చిత్తమునవిచారింపుము. పారమార్థిక దృష్టిచేత, నీవును, నేనును, యెవ్వరము లేము. పుణ్యుడనియును, పావనుడనియును నిది భ్రాంతిజ్ఞానమేయగుచున్నది. మన పూర్వబంధువు లనేకులు పుణ్యస్థలములయందునను, మృగయోనులయందునను, జన్మించి యుండిరి. వారినందరినిగూర్చియేల దుఃఖించవు. నీయొక్క పూర్వబంధువులగు ననేకసింహంబులు పర్వతములయందున్నవి. వానిని గురించి యేల శోకింపవు. అని తాత్పర్యార్థము. ఇంకనూ తమ్ముడగు పావనునితో పుణ్యుడిట్లనెను. మరియు నీవు దశార్ణ దేశంబులయందు వనగజంబవుగాను, తుషారదేశంబు లయందు రాజపుత్రుడవుగాను, పుండ్రదేశంబులయందు వనవాయ సమవుగాను, హైహయదేశములయందు సామంతుడవుగాను, త్రిగర్త దేశములయందు గర్దభమవుగాను, సాల్వదేశములయందు దేనెటీగవు గాను, సరళ వృక్షంబునందు పక్షివిగాను, నిరతములగు ననేక యోనుల యందు అనేకవేలమారులు ఈజంబూద్వీపంబున జన్మించినాడవు. కావున:-

శ్లో॥ భావాభావవినిర్ముక్తం జరామరణ వర్జితం ।
సంస్మరాత్మానమవ్యగ్రోమావిమూఢమతిర్భవ ॥

తమ్ముడా! నీవు భావాభావంబులును, జరామరణంబులును, లేనట్టి ఆత్మను ఏకాగ్రచిత్తుడవై స్మరింపుము. మూఢబుద్ధివిగాకుము, అనియిట్లు పుణ్యుని చేత పావనుడు బోధింపబడినవాడై భూతలమున సూర్యోదయమయినట్లు ఆత్మజ్ఞానమును బొందినవాడాయెను.

ప్రకరణమునుబట్టి యిది ఆత్మ జ్ఞానాభ్యాసకులగు జిజ్ఞాసువులకు తెలుపు చున్నట్టి, హితోపదేశముగావున ముముక్షువులకు మరియొక విషయమును నిచట

ముఖ్యముగ తెలుపవలసియున్నది. అది ఏది యనిన, యీ మానవజన్మ పుణ్యపాపఫలమిశ్రితముగావున ప్రతిమానవుడును యేదోయొకకాలమున తెలిసియో తెలియకయో పాపకార్యములను జేయనివారుండుట అరుదు. జ్ఞానాభ్యాసకులకు అవియన్నియు నిప్పుడు, అనగా అభ్యాసకాలమున జ్ఞప్తికి వచ్చుచు అట్టివియన్నియు తన మనోదౌర్బల్యముకు హేతువగుచుండును. ఎల్లప్పుడును దౌర్బల్యమువలన దౌర్బల్యమే గలుగుచుండును గాని బలమెట్లు రాగలదు? రాదు. జ్ఞానాభ్యాసికి కావలసినది మనోబలము. మనోబలము లేనివారు ఆత్మజ్ఞానమును పొందజాలరని "నాయమాత్మాబలహీనేనలభ్యః" అని శ్రుతి మాతయే తెలుపుచున్నది. కావున ఆత్మజ్ఞానాభ్యాసముకు, అభ్యాసకుడు తన మనో దౌర్బల్యమును జ్ఞానపూర్వకముగ త్యజించవలసిన యావశ్యకత యున్నది. దానినెట్లుజేయుట యనిన నీవిధమున తెలిసికొని, జేయనగును.

ముముక్షువగు ఆత్మజ్ఞానాభ్యాసకుడు, యిప్పుడు పూర్వమానవుడు గాడు. ఏలనన యిప్పుడు అహం నేను అను తాను యీదేహాదులుకాను అనునట్టి నిశ్చయము నొందినవాడు. తనకిప్పుడు స్మరణమున కొచ్చి తనను బాధించునట్టి పాపకార్యములు తాను 'యీదేహాదులే నేను' అనునట్టి తన అజ్ఞానకాలములో జేయబడినవి. కాని యిప్పుడాదేహాదిసంబంధమును జ్ఞానపూర్వకముగ తాను వదలినవాడగుటచే, తనకిప్పుడు వాటితో నెట్టి వాస్తవ సంబంధమునులేదు. ఎట్లన ఋణగ్రస్తుడు తన ఋణములధికమైనవి యని తెలిసికొని తన ఆస్తిపాస్తులను వదలి ఋణవిమోచనపత్రమును, (అనగా ఇన్‌సాల్వెన్సి పిటిషను) రాజద్వారమున సమర్పించినప్పుడు తన ఋణబాధల నుండి విముక్తిని పొందునట్లు, తానుగూడ నిప్పుడు యీ దేహాది సంబంధముల సక్తతాభిమానములనుశాస్త్రీయముగ త్యజించిన వాడు గావున లోగడతన అజ్ఞానకాలములో తాను చేసిన పాపకార్యములతోడ తనకెట్టి సంబంధము వాస్తవముగ నిప్పుడు లేదనియు, యీ దేహసంబంధము ప్రారబ్ధ కల్పిత మనియు నిశ్చయముగ గ్రహించి, తన మోక్షప్రాప్తికిగాను స్వాత్మాభిన్నాత్మాను సంధానము జేయుచుండవలయును. ఇట్లుజేయుట యనునది మనో

బలమువలనగాని, సాధ్యముగాదు. ఇందులకు తన ఆత్మయే సాధనముగాని మరియొకటి కాజాలదు. తానాచరించునట్టి సుకృత దుష్కృత రూపమున, తన ఆత్మయే తనకు మిత్రుడుగను, శత్రువుగను గూడ నగుచున్నది. కావున అభ్యాసకుడు తనను తన ఆత్మవలననే రక్షించుకొనవలయును. ఈవిషయమే గీతలో-

శ్లో॥ ఉద్ధరేదాత్మనాఽఽత్మానం, నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవహ్యాత్మనోబన్ధు, రాత్మైవరిపురాత్మనః ॥

శ్లో॥ బన్ధురాత్మాఽఽత్మనస్తస్య, యేనాత్మైవాత్మనాజితః ।
అనాత్మనస్తు శత్రుత్వే, వర్తేతాఽఽత్మైవశత్రువత్ ॥

అనగా, తనను, తనచేతనే ఉద్ధరించుకొనవలయును. తనను తను నశింప జేసుకొనరాదు. తనకుతానే బంధువు తనకుతానే శత్రువుగా తెలియ వలయును. ఏ మనస్సుచేత దేహేంద్రియాదులు జయింపబడుచున్నవో ఆ మనస్సే వాని యాత్మకు బంధువు. ఇంద్రియనిగ్రము లేనివానికి తన ఆత్మయే శత్రువువలె నపకారియగును, అని తెలుపబడినది.

దీనివివరణమేమియనిన- ముముక్షువుకు మోక్షప్రాప్తికి తన ఆత్మయే సాధనముగాని మరియొకటి కాజాలదు. తనకు తాను ఆత్మహాని యొనర్చుకొనగూడదు. నేను యీ దేహాది పరిచ్ఛిన్నుడను, దరిద్రుడను, పాపిని, యనుకొనుచుండుటవలననే తన ఆత్మకు తాను హానిచేసినవాడగుచు సంసార దుఃఖముపాలగును. ఇట్లుగాక తన పరమార్ధస్వరూపమును గుర్తించి తానే ఆత్మస్వరూపుడననియు, దేహాదులు తనకు గల్పితములనియు, వాస్తవమున సచ్చిదానందస్వరూపుడు తానే నినియు తానే సర్వాధిష్ఠాన, నిత్య, నిర్వికార, పరిపూర్ణుడనియు నిశ్చయమునొంది స్వస్వరూపాత్మానుసంధానాదుల జేయుచుండుట వలన తన ఆత్మ తనకు మిత్రుడగుచు తనను కాలక్రమమున సంసారదుఃఖవిముక్తుని గావించును. ఇంకనూ ఏమనస్సుచేత తనదేహేంద్రియాదులు తాను గానని తెలిసికొనగలుగునో, అట్టి మనసు తనకు మిత్రుడును, ఏమనస్సుచే యీ

దేహాదిసంఘాతమంతయు, తాను అనగా నేనేయని భ్రమించుచున్నాడో అట్టి మనసు తనకు శత్రువనియు తెలియవలయును. కావున జ్ఞానాభ్యాసకుడు వాస్తవమున తన దేహాదులు తాననుకొనుటగాని, తాను దరిద్రుడను, పాపిని, దుర్బలుడను, అని తలచుచుండుటగాని కూడదు. అభ్యాసకుడు తన పరమాత్మస్వరూపమును మరువక, ప్రీతినిశ్చయములతో అనుసంధానాదుల, సతతాభ్యాసము చేయుచుండినయడల ఆత్మలాభమునకు తనకుగావలసిన మనోబలము తప్పక సిద్ధించును. ఏలనన, ఆత్మబలమే బలముగాని, దేహబలము బలముగాదు. దేహసంబంధియైన మనస్సునకు గూడ బలము ఆత్మజ్ఞానము వలననే రావలయునుగాని వేరువిధమున రాజాలదు. మానవుడే యుత్కృష్ట కార్యము జేయవలయునననను దేహబలముకన్న మనోబలమే యావశ్యకముగదా!

ఈ గ్రంథనిరూపణలయందు చివర అచటచట దీనిని బాగుగ గ్రహించవలయును, తెలిసికొనవలయునని అభ్యాసకులకు పలుమారులు తెలుపబడియున్నది. ఏలనన యెట్టివారికైనను యీ బ్రహ్మజ్ఞానము దెలియుటయనగా, స్వానుభవము నొందుటయే ముఖ్యార్థము. బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు యిట్టి జ్ఞానానుభవములు యొక్కమారుగ గలుగవు. కాని యీ బ్రహ్మజ్ఞానమును, తనవృత్తిజ్ఞానముతోడ మెల్లమెల్లగ మననాద్యభ్యాసములు జేయుచు సంపాదింపవలయును. తీవ్రముముక్షువైన జ్ఞానాభ్యాసికి అభ్యాసపాటవముచే యీ జ్ఞానలాభము క్రమక్రమముగ గలుగుచుండును. ఈ అభ్యాసమునకు ప్రారబ్ధాంతమున తన చరమవృత్తి సాక్షాత్కారము అవధి.

ఈ బ్రహ్మవిద్యాఫలము ప్రత్యక్షముగాని, కాలాంతరమందే గలుగు ఫలముగాదు. జీవన్ముక్తిసుఖ ఫలమునిచ్చునట్టి శాస్త్రమిదియొక్కటియే. అనగా జీవదశయందే బ్రహ్మసుఖానుభవము జీవునికి గలుగుచుండుట. కాని యిట్లు కలుగుటకు యీ అద్వైత సిద్ధాంతమును ప్రామాణ్యముతోడ బాగుగ తెలిసికొని స్వానుభవమును సంపాదించవలసియున్నది. తెలియుట యనగా

వాస్తవికార్థమును శాస్త్రీయముగ గ్రహించి దానిని ప్రీతినిశ్చయములతో స్వానుభవము నొందుటయేగాని. కేవల శాస్త్రగ్రంథపఠన జ్ఞానముగాదు. స్వానుభవముకురాని యట్టి జ్ఞానము తెలియనిదానిలోనే లెక్క. తెలియుట యనగా విషయమును చదువుటయును, దానిని తన ప్రజ్ఞావిశేషములచే గరతలామలక ముగ నొకరికి మనోహరముగ ప్రావీణ్యముతోడ చెప్పుటయేగాదు. తెలి యుట యనగా ఆవిషమునందు ప్రీతి, నిశ్చయములను సంపాదించి స్వాను భవములోనికి తెచ్చుకొని దాని అనుభవలాభము నొందుట.

ఇట్లు స్వానుభవమునొందుటకు చిరకాలాభ్యాసమావశ్యకము. బ్రహ్మా భ్యాసమునకు స్వదేహేంద్రియాది సర్వదృశ్య త్యాగమును, స్వస్వరూప మనన నిదిధ్యసనాదుల ప్రారబ్ధాంతము వరకును, యభ్యసించుచుండుటయును ప్రధా నము. కేవలవేదాంతశాస్త్రపఠనము బ్రహ్మాభ్యాసమునకు గౌణసాధనము. ముఖ్య మగునది, ఆత్మజ్ఞానలాభపర్యవసానమిచ్చునది, శ్రవణానంతరము స్వాత్మా భిన్న పరమాత్మ మననధ్యానాదికములేగాని, యితరములు గావు. త్యాగ మనగా స్వశరీర పుత్రమిత్ర కళత్రాదివిషయములయందు సక్తతాభిమాన ములను జ్ఞానపూర్వకముగ త్యజించి నిర్లిప్తుడుగ నుండుట. ఇట్లు గావించు టకు జగన్మిథ్యాత్వనిశ్చయము, స్వస్వరూప ప్రాప్తియందు ప్రీతిని సంపా దించుట యావశ్యకము. ఇది కేవలవేదాంతశాస్త్రపఠన ప్రవీణత మాత్ర ముననే గలుగుననునది సరిగాదు. ఎచటనైనను, అట్లు గలిగిన మహనీయు లకు అది వారి పూర్వాభ్యాసఫలమని నిశ్చయించుకొనవచ్చును. స్వాత్మాభిన్న బ్రహ్మమనన నిదిధ్యసనాద్యభ్యాసాదులు లేక యెప్పుడైనను ఆత్మాపరోక్ష జ్ఞానము గలుగదు. కావున ముముక్షువులగు శాస్త్రిపాండిత్య ప్రకాండులకును, శాస్త్రపాండిత్యములేని సామాన్యులగు జిజ్ఞాసువులకును గూడ, స్వాత్మాభిన్న బ్రహ్మానుసంధానధ్యానాదిక సతతాభ్యాసములను ప్రారబ్ధాంతమున ఆత్మసాక్షా త్కారపర్యంతము, నాచరించుచుండుట యావశ్యకము. ఇట్లుగాక భ్రాంతియు తులై మధ్యలో అభ్యాసాదులమానిన యడల ఆరూఢపతితుడగునని

వివేక చూడామణియందు శ్రీ శంకరులు బోధించుచున్నారు. ఈ సందర్భమునసే బ్రహ్మాభ్యాసములేని కేవలశాస్త్రపాండిత్యము, ఆత్మజ్ఞానమును అనగా ముక్తినివ్వజాలదని రెండుశ్లోకములవలన తెలుపుచున్నారు.

శ్లో॥ వీణాయారూపసౌందర్యం తంత్రీవాదనసౌష్ఠవమ్ ।
ప్రజారంజనమాత్రంతు, నతుసామ్రాజ్యసిద్ధయే ॥
వాగ్వైఖరీ శబ్దఝురీ, శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్ ।
వైదుష్యం విదుషాంతద్వత్, భుక్తయేనతు ముక్తయే ॥

అర్ధము స్పష్టము. శ్రీ భగవత్పాదుల యీ శ్లోకములతాత్పర్యము శాస్త్రపఠన పాండిత్యమును నిరసించుట యందుగాదు; మరేమనిన- మోక్షార్థులకు అదియే ప్రధానము గాదనియు, శాస్త్రప్రకాండులగు వారైనను ఆత్మానుసంధానాదుల చిరకాలమభ్యసించని యడల మానవుని పరమ ప్రయోజనమగు స్వాత్మజ్ఞానలాభము గలుగదని యే తాత్పర్యమని గ్రహింతురుగాక.

— —o— —

# స్వస్వరూపానుసంధానము

ముముక్షువుని పరమ ఆశయము మోక్షప్రాప్తి. జీవునకు మోక్షమనునది పరమార్థమున, తన ఆత్మస్వరూపమేగాని యింకొకటికాదు. కావున ముముక్షువు సర్వదా స్వాత్మాభిన్న పరమాత్మధ్యానమునే చేయుచుండవలయును. ఈ పరమాత్మను యెచట, ఎట్లు, ధ్యానింపవలయుననిన. ప్రతి జీవుని హృదయ పుండరీకమునందును అతిసూక్ష్మరూపముతో, పంచకోశములతో నెట్టి సంబంధములేక చిదాకాశరూపమున ఉజ్జ్వలప్రకాశముతోనుండును. ఈయనయే స్వశరీర, సర్వప్రపంచాధిష్ఠానము. ఈయనయేసాక్షి, ప్రత్యగాత్మ, పరమాత్మ, బ్రహ్మ, యనునట్టి పర్యాయపదములతో తెలియబడువాడు. ఈయనయే జీవుని పరమార్థ వాస్తవస్వరూపము. జిజ్ఞాసువులు అతిసూక్ష్మబుద్ధితో యిట్టి తమ పరమార్థ వాస్తవరూపమును గుర్తించి అనగా వృత్తిగోచరముగావించుకొని నిశ్చలచిత్తులై తమ పరమార్థస్వరూపమును సర్వదా నిట్లు అనుసంధించుట శీఘ్రమోక్షదాయకము. ఎట్లన:- నేను "అహమ్" అఖండపరిపూర్ణుడను. అసఙ్గ స్వప్రకాశుడను. అద్వితీయుడను. సత్యజ్ఞానానంత స్వరూపుడను. నేను మహాకాశమువంటి చిదాకాశరూపుడను. నిత్యుడను, నిర్వికారుడను. ఇట్టి నాయందె యీ స్వశరీర సర్వోపాధులన్నియు దర్పణములోని ప్రతిబింబములవలె, నామమాత్రము వాస్తవసంబంధము లేకుండగనె మహాకాశమునందు మేఘములు వచ్చుచు, పోవుచున్నట్లుగ గలుగుచున్నవి సాంసారిక ధర్మము లన్నియు స్వ, పర భేదముతో తెలియబడుచున్నయీ యుపాధి ధర్మములే. నాకు వాస్తవముగ దీనితో సంబంధములేదు నేను దేనితో సంబంధించక లోకమున కుపకారాపకారములు చేయుచున్న లోకభాస్కరుని వంటివాడను. నాకు యీ సంబంధములన్నియూ కల్పితములు. ఈ కలిమిలేములు, సుఖదుఃఖములు, లాభనష్టములు, నాకు వాస్తవముగ సంబంధించినవిగావు. ఇవి యన్నియు దేహ ధర్మములు.

అయినను, జీవుడిప్పుడు తన ప్రారబ్ధ ఫలానుభవ వశమున యుపాధిబద్ధుడై దేహతాదాత్మ్యాధ్యాసముతో నున్నవాడు. కావున ఎంతజ్ఞానియై (అనగా జ్ఞానాభ్యాసకుడు) తన పరమార్థస్వరూపమును వాస్తవముగ తెలిసికొన్నను ప్రారబ్ధాంతమువరకునూ, దేహధర్మములు బాధించుచునేయుండును. శరీరమున్నంత కాలము శరీరధర్మములు విడువవు. కనుక వాటినన్నిటిని దేహధర్మములుగను తనకు వాస్తవసంబంధములేనివానిగను నిశ్చయము నొందవలయును. ఇట్టి జ్ఞానముతో దేహధర్మములనన్నిటిని వ్యవహారప్రయోజన మాత్రములుగ గ్రహించి తప్పనిసరియగు తన ప్రారబ్ధ సుఖదుఃఖభోగానుభవములను నిర్లిప్తతతో, అనగా అత్యాసక్తితో రాగద్వేషాదియుతుడుగాక, ననుభవించుచూ, ప్రారబ్ధమును క్షయింపజేసుకొనవలయును. ముముక్షువునకు యీ స్వశరీర ప్రపంచములతోడ గలుగవలసిన పరమప్రయోజనమిదియే ప్రారబ్ధము భోగమువలనగాని నశించదు. ప్రారబ్ధము నశించినగాని మోక్షప్రాప్తిగలుగదు. కావున ఫలావగతి పర్యంతము ముముక్షువు స్వస్వరూపానుసంధానాదులాచరించుట యావశ్యకము. బ్రహ్మజ్ఞానాభ్యాసియగు ముముక్షువు తాను ప్రారబ్ధానుసరణమున, నెట్టి సుఖదుఃఖాదిభోగానుభవములనొందుచున్నను; సర్వదా తన స్వస్వరూపమునిట్లు, మననధ్యానాదులు చేయుచుండవలయును. ఎట్లనిన నాహందేహః, నాహం ప్రాణః, నాహంమనః, నాహం విజ్ఞానానందమయ నాపః" అని గుర్వీశ్వరానుగ్రహ,శాస్త్రీయజ్ఞానముతోడ నిశ్చయమునొంది, తన స్వరూప స్వానుభవసిద్ధిని బడయుటయందు ప్రీతినిశ్చయములుగలవాడై, తన పరమార్థ వాస్తవస్వరూపమునిట్లు నిరంతరాభ్యాసము గావించుచుండవలయును.

"అహం సాక్షీ, ప్రత్యగాత్మా, శివః, శాన్తః, అనన్తః, పరమాత్మైవ" "అహం సర్వ మిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః, అహంకారా భిధాయా సాకల్ప్యేతేనతువాస్తసీ" "అహం సర్వస్యప్రభవోమత్తస్సర్వంప్రవర్తతే,మత్స్థానిసర్వభూతాని, నచాహంతేష్వ వస్థితః" నేనే కేవల జ్ఞానస్వరూపమున సర్వాధిష్ఠానముగనున్నవాడను. సర్వాధిష్ఠాన వాస్తవస్వరూపుడనగు నాయందే యీ స్వశరీర సర్వదృశ్యము అధ్యస్తముగ అనగా కల్పితమై అవాస్తవ

ముగనున్నను వాస్తవమగుదానివలె గనపడుచున్నది. కావున అవాస్తవమగు దీనితోడ వాస్తవస్వరూపుడనగు నాకు నెట్టి వాస్తవసంబంధము నుండుటకు వీలులేదు. కావుననే, నాకు యీ స్వశరీర బంధుమిత్ర, కళత్ర పుత్ర విత్త గృహక్షేత్రాదుల సంబంధములన్నియు నా ప్రారబ్ధ సుఖదుఃఖభోగానుభవములకు నిమిత్తమాత్రముగ కల్పితములుగాని, నాకు నివియేవియు వాస్తవములుగావు. నా వాస్తవస్వరూపమేదియనిన, కేవలస్వరూపజ్ఞానమాత్రము. ఇది **అఖండము,** అద్వితీయము, స్వప్రకాశము. ఇదియే నా వాస్తవస్వరూపము. ఇదియే స్వరూపసుఖము, అవినాశి, ఆత్మపదార్థము. తక్కినదంతయునూ అనాత్మపదార్థము. నశించునది, దుఃఖరూపము. నేను సత్యజ్ఞానానంత స్వరూపుడను. నా స్వరూపము అద్వితీయము. అఖండసచ్చిదానందస్వరూపము. నేను చిదాకాశ స్వరూపుడను "చిదాకాశస్వరూపోహం, నిర్మలాకాశ వత్సదా, అఖండ పరిపూర్ణోహం, పరమాత్మాహమచ్యుతః" ఏది అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమో, ఏది నిత్యమో, నిరవయవమో, నిష్క్రియమో, స్వప్రకాశమో, ఏది సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమో, ఏది జగదుత్పత్తి, స్థితిలయ, వివర్త అభిన్న నిమిత్తోపాదానకారణమో, అట్టి అఖండ పరిపూర్ణ చిదానంద స్వరూపమేనాది. నాహం చిదాభాసః, అహం చిదేవ "చిదేవ పంచభూతాని, చిదేవ భువనత్రయం, చిదేవాహం చిదేవాన్యత్, చిద్భిన్నం నహికించన" కావున చిదేవాహం, చిదేవాహం, బ్రహ్మైవాహం, బ్రహ్మైవాహం, అహం బ్రహ్మాస్మి అను నిశ్చయజ్ఞానముతోడ ముముక్షువులు స్వస్వరూపాను సంధానాదుల నాచరించుచుండవలెను.

ఇట్లు జ్ఞానాభ్యాసకుడు బాగుగ తెలిసికొని నిశ్చయమునొంది, తన స్వస్వరూపాఖండ ఆనందప్రాప్తికి, తన స్వస్వరూపమే యగునట్టి బ్రహ్మాత్మానుసంధానము ఎట్లుచేయవలసినదియును ఉదాహరణ పూర్వకముగయోగవాశిష్ఠమునందు శ్రీ రామచంద్రమూర్తికి వశిష్ఠభగవానులు చేసిన బోధను, ముముక్షు జ్ఞానతాత్పర్యముసకుగాను తాత్పర్యార్థముతోడ నిచట సంగ్రహించుచున్నాను:-

శ్లో॥ యథాతృణాదికం క్షిప్తం రుమాయాం లవణంభవేత్ ।
అచేతనం జగత్తద్వచ్చైతన్యే చేతనీభవేత్ ॥

శ్లో॥ యథావై లవణ గ్రంధిస్సముద్రే సైంధవో యథా ।
నామరూపా ద్వినిర్ముక్తః ప్రవిశ్యైతి సముద్రతాం ॥

శ్లో॥ యథాజలే జలంన్యస్తం క్షీరేక్షీరం ఘృతేఘృతమ్ ।
అవినష్టాభవంత్యేతే గృహ్యంతేన విశేషతః ॥

శ్లో॥ తథాఽహం సర్వభావేన ప్రవిష్టశ్చేతనే సతి ।
నిత్యానందే సమస్తజ్ఞె పరేపరమ కారణే ॥

శ్లో॥ నిత్యం సర్వగతం శాంతం నిరవద్యం నిరంజనమ్ ।
నిష్కలం నిష్క్రియం శుద్ధం తద్బ్రహ్మాస్మి పరంపదం ॥
కేవలం సత్య సంకల్పం శుద్ధం బ్రహ్మాస్మ్యహం పరమ్ ।

శ్లో॥ పుణ్యపాప వినిర్ముక్తం కారణం జగతః పరం ।
అద్వితీయం పరంజ్యోతిర్బ్రహ్మాస్మ్యానంద మవ్యయమ్ ॥

శ్లో॥ ఏవమాదిగుణైర్యుక్తం సత్త్వాదిగుణవర్జితం ।
ఆవిష్టం సకలం బ్రహ్మ సదాధ్యాయేత్సు కర్మకృత్ ॥

అనగా తృణము (గడ్డిపరక) మొదలగునది ఉప్పుకొటారునందుంచబడి నదై లవణమే యగునటులను, లవణము సముద్రమునందుంచబడి కరిగి సముద్రజలరూపము నొందునటులను, అచేతనంబగు ఈ ప్రపంచమంతయు చేతనంబునందు విలాపనము చేయబడినదై చేతనమే యగుచున్నది. మరియు జలంబునందుంచబడిన జలంబును, క్షీరంబునందుంచబడిన క్షీరంబును, ఘృతంబునందుంచబడిన ఘృతంబును, నాశంబునొందనివై యభిన్నంబుగ గ్రహింపబడునట్లు, నిత్యానందంబును పరమకారణంబును, (పరిపూర్ణ జ్ఞానస్వరూపంబును) నగు చేతనంబునందు ప్రవేశించిన "అహమ్" అను నేనును, నైక్యంబునొంది యున్నవాడను. మరియు నేనునిత్యంబు, సర్వగతంబును, శాంతంబును,

అనింద్యంబును, నిష్కలంబును, నిష్క్రియంబును, సిద్ధంబును (అఖండపరిపూర్ణ జ్ఞానస్వరూపంబును) నగుబ్రహ్మంబునగుదు. మరియు నేను పుణ్యపాప వినిర్ముక్తంబును, జగత్కారణంబును, అద్వితీయంబును, నగు బ్రహ్మంబు నగుదు. ఇట్లు ముముక్షువు గురుశుశ్రూషాదిపరుండై నిర్గుణంబగు బ్రహ్మంబు నెపుడును ధ్యానించుచుండవలెను

ఇట్టి సిద్ధిని జిజ్ఞాసువు తన సతతాభ్యాసమువలననే సాధించవలయును గాని వేరులేదు. అభ్యాసమువలన సర్వసిద్ధులును పొందనగును. కావున నీవు సర్వంబునువిడిచి ఆత్మానుసంధానాభ్యాసమునందు మనసు సుస్థిరమైనదానినిగ జేయుమని—

శ్లో॥ అభ్యాసాత్సర్వసిద్ధిః స్యాదితి వేదానుశాసనం ।
తస్మాత్త్వం సర్వముత్సృజ్య కుర్వభ్యాసే స్థిరంమనః ॥

అనియుగూడ వాశిష్ఠవచనము తెలుపుచున్నది. జిజ్ఞాసువులు వారి, వారి, సతత, బ్రహ్మాభ్యాసముతోడ చిత్తమును స్థిరముచేయుటయే సమాధి.

బ్రహ్మజ్ఞానాభ్యాసమునకు, సమాధి స్వరూపమును బోధించుటకుగాను వశిష్ఠభగవానులు శ్రీ రామచంద్రమూర్తికిచేసిన యుపదేశవచనములను, తాత్పర్యార్థముతోడ నిచట సంగ్రహించుచున్నాడను.

శ్లో॥ నిత్యప్రబుద్ధ చిత్తత్వాత్కుర్వంతోఽపిజగత్క్రియాః ।
ఆత్మైకతత్త్వ తన్నిష్ఠాస్సదైవ సుసమాధయః ॥

అనగా బద్ధపద్మాసనస్థుండై యున్నను, బ్రహ్మాంజలిచేయుచున్నను, చిత్తవిశ్రాంతి నొందనివానికి సమాధి కలుగదు ఆత్మనెరుగని మూఢుడు ఊరక యుండినను, వ్యవహారముచేయుచుండినను వానికెప్పటికిని సమాధి కలుగనేరదు. ఆత్మతత్త్వము నెరింగినవారలు వ్యవహారకృత్యముల జేయుచున్నవారైనను స్వాత్మయందే స్థైర్యముగలవారలగుటచేత యెల్లప్పుడును సమాధి గలవారలే యగుదురు.

శ్లో॥ సమాహితా నిత్యతృప్తా యథాభూతార్థ దర్శినీ।
సాధో! సమాధి శబ్దేన పరా ప్రజ్ఞోచ్యతే బుధైః ॥

అనగా ఓసాధువా! సుస్థిరంబును, యధార్ధదృష్టి యుక్తంబును, నగు పరమ జ్ఞానము సమాధి శబ్దముచే చెప్పఁబడును.

శ్లో॥ అక్షుబ్ధానిరహంకారా ద్వంద్వేష్వననుపాతినీ।
ప్రోక్తా సమాధిశబ్దేన, మేరోః స్థిరతరాస్థితిః ॥

అనగా సంక్షోభరహితంబును, అహంకార నిర్ముక్తంబును, ద్వంద్వదోషవర్జితంబును, మేరువుకంటె నతిస్థిరంబును నగు నిలుకడ సమాధి శబ్దముచే చెప్పబడుచున్నది.

శ్లో॥ నిశ్చింతా విగతా భీష్టా, హేయోపాదేయ వర్జితా।
ప్రోక్తా సమాధి శబ్దేన, పరిపూర్ణా మనోగతిః ॥

అనగా చింతారహితంబును, వాంఛా విముక్తంబును, హేయోపాదేయ వర్జితంబును, పరిపూర్ణంబును నగు మనోగతి సమాధిశబ్దముచే చెప్పబడుచున్నది. మరియును,

శ్లో॥ నిర్వికారతయావృత్త్యా, బ్రహ్మాకారత యాపునః।
వృత్తి విస్మరణం సమ్యక్, సమాధిర్జ్ఞాన సంజ్ఞకః ॥

అనగా, విషయానుసంధానములేని అంతఃకరణవృత్తిచేత, బ్రహ్మాకారముగా చక్కఁగా ప్రపంచ సంస్కాఁర రహితముగ, మరల, ద్వైతాను సంధానములేకుండుటయేదియో, అది జ్ఞానమనెడి సమాధియగును. అని శ్రీ శంకర భగవత్పాదులు అపరోక్షానుభూతియందు నిర్వచించుచున్నారు. ఇంకను "సమాధిః సంవిదుత్పత్తిః పరజీవైక్యతాంప్రతి" అనువాక్యము జీవేశ్వరైక్య జ్ఞానము గలుగుటయే సమాధియనబడునని తెలుపుచున్నది.

కావున జ్ఞానాభ్యాసకులకు వారి వృత్తిని కేవల బ్రహ్మాకారముచేయుటయే, జ్ఞానసమాధియని అభ్యాసకులు గ్రహింతురుగాక,

——o——

# ఆత్మవిజ్ఞాన సంగ్రహము

ప్రతి జీవునకున్నూ ఆత్మయనగా, తానే. ఆత్మ ప్రతిపురుషుని శరీరములో యున్నది నేనాత్మకాదని జెప్పుపురుషు డెవడును యుండడు. విజ్ఞానమనగా తన పరమార్ధ స్వరూపమును మానవునకు యదార్ధముగా తెలుపునది. ఇది వీని సంగ్రహము. జ్ఞానమనగా బ్రహ్మజ్ఞానమనియే అర్ధము బ్రహ్మజ్ఞానమనగా విచారణవలన గలిగిన ఆత్మజ్ఞానము. సూర్యుడుదయించగనే వెలుగు కనబడునట్లు జ్ఞానముదయించగనే సదాత్మగోచరమగుచుండును. ఈ ఆత్మజ్ఞానములోననే పాలలో మాధుర్యమున్నట్లు జ్ఞేయము అనగా తెలిసికొనవలసిన వస్తువగు బ్రహ్మమున్నది. సదాత్మజ్ఞానము కలుగగనే అది ప్రసన్నమగును. ఇదియే అఖండాత్మానందస్వరూపము. నిత్య నిరతిశయ పరమార్ధ శుద్ధాత్మరూపుడగు తనయందే అనాది మాయావశమున యీ జీవజడనానాత్వ దృశ్యమంతయు వివిధోపాధులుగ ఘటాదులవలె కల్పింపబడినదై ఈ వివిధోపాధులను నభిమానించుచుండుటచే అనాది వాసనలతో కూడుకొని రాగద్వేషాది యుక్తుడగుచు జీవుడు సంసార దుఃఖమును పొందుచున్నాడు.

మానవునకు ఈ సంసార దుఃఖమంతయు ఆత్మజ్ఞానము లేనందువలననే గలుగుచున్నది. ఏ జీవునకు స్వాత్మజ్ఞానము గలుగునో అట్టివానికి దుఃఖము పశమించును మానవునకీ సంసార దుఃఖము పశమించుటకు ఆత్మజ్ఞానాభ్యాసము రసాయనము సేవించుటవంటిది. స్వాత్మజ్ఞానముకలిగినంతనే దుఃఖముపశమించును కాని ఆత్మజ్ఞానమునొందిన తత్త్వజ్ఞునకైనను యీ ప్రపంచమే చటికినిపోదు, నశించదు, వాస్తవమున యుండినగదా, నశించుట. మందాంధకారమందున త్రాడుయందుతోచెడి సర్పమును చచ్చిన సర్పశరీరముగ నెవరైనను చూడగలుగుదురా? దీపపుసహాయమున అది సర్పముగాదు, త్రాడుయని తెలిసికొనుటయే యిచట సర్పనాశము.

అట్లే ఆత్మతత్త్వము నెరిగినవానికి ఈ ప్రపంచము వాస్తవముగాదను నిశ్చయముగలిగి బ్రహ్మరూపమున ప్రకాశించుచుండును. అప్పుడు ప్రపంచము బాధనొందును. కాని ఘటాదులవలె నాశమునొందదు. ఆత్మతత్త్వము నెరిగిన తత్త్వజ్ఞునకుకూడ దేహధర్మములుండుట తప్పదుగనుక జీవనాది వ్యవహార ములు సిద్ధించు నిమిత్తము ద్విత్వమును, జ్ఞానసమాధికాలమందు యేకత్వ మును తాత్కాలికముగ గలుగుచుండును కాని అట్టి మహనీయునకు సర్వదా అఖండాత్మజ్ఞాన నిశ్చయము మాత్రముపోదు. సర్వము బ్రహ్మగనే భాసించు చుండును. ఏలనన పరమార్థమున బ్రహ్మేతరమేదియును వాస్తవమున లేదు. ఈ ఆత్మయే బ్రహ్మ స్వరూపమని "అయమాత్మా బ్రహ్మ" యనియు, "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "జీవో బ్రహ్మైవనాపరః" అనగా బ్రహ్మ తన కన్న రెండవవస్తువులేని ఏకపదార్థము అఖండము పరిపూర్ణమనియు, జీవుడు బ్రహ్మకంటె వేరుగాదనియు శ్రుతివచనములు బోధించుచున్నవి కాని సర్వుల కును ఈ ప్రపంచము నానాగాను, చిత్రవిచిత్ర భిన్నవిభిన్నములుగను, గను బడుచు వ్యవహార భోగానుభవముల నిచ్చుచున్నది. కావున జీవుడీస్వ శరీరదృశ్యమంతయు వాస్తవమనుభ్రాంతి నొందుచున్నాడు. జీవుని యిట్టి భ్రాంతినుండి విముక్తుని జేయుటకే శ్రుతిమాత "ఏకోవశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధాయః కరోతి; తమాత్మస్థంయేఽను పశ్యన్తిధీరా, స్తేషాం సుఖం శాశ్వతంనేతరేషామ్." అని స్పష్టముగా బోధించుచున్నది. (దీని అర్థములోగడ వివరింపబడినదిగాన వ్రాయుటలేదు) కావున శాశ్వతసుఖమును బడయగోరిన వివేకులకు, ఈ స్వశరీరజగత్తులను స్వాత్మాభిన్నస్వప్రకాశ అద్వి తీయ అఖండ చైతన్య పరిపూర్ణముగ తెలిసికొనవలసిన యావశ్యకతను శాస్త్రమే బోధించుచున్నది. జీవుని అఖండాత్మజ్ఞానమునకును నిరతిశయ శాశ్వతసుఖమునకును ఆత్మజ్ఞాన మావశ్యకము పరమార్థవాస్తవమునను న్నది అఖండాత్మ యొక్కటియే. దీనినే బ్రహ్మ, పరమాత్మ, సంవిత్, జ్ఞానము, మొదలుగా గల పర్యాయపదములతో శాస్త్రము బోధించుచున్నది. ఆత్మ సర్వజీవులయందునను అంతర్యామిగా యున్నాడు. ఆయన ప్రకాశమువలననే

సర్వోపాధులు తమతమ కార్యముల జేయగలుగుచున్నవి. మన యందరి కోశ పంచకములోనున్నదైన యీ ఆత్మయే ప్రత్యగాత్మ యనబడుచున్నది. ఈయననే - విధి, దైవము, ధాత, సర్వేశ్వరుడు, విష్ణువు, శివుడు, యను మొదలుగాగల నామములతోడ జీవతరణోపాయ సాధనముగ శాస్త్రము బోధించుచున్నది. ఈ విషయమునే "ఉపాసకానాంసిద్ధ్యర్థం బ్రహ్మణోరూప కల్పనా" అను వచనము తెలుపుచున్నది. కావున యే జీవుడు (అనగా మానవుడు) దీనిని బాగుగ విచారించి తెలిసికొని స్వానుభవము నొందగలుగునో అట్టి మహనీయుడే జీవన్ముక్తుడగుచు ప్రారబ్ధమును నిరభిమానముగ ననుభవించుచుండును. ఇట్టివాడు దేనితోడను సంగము నొందడు ఇష్టానిష్టపదార్థముల సంయోగవియోగములు గలిగినప్పుడు మనసు హర్షశోకాదులను నొందుటయే సంగము, లేక బంధము నొందుటయని చెప్పబడును. ఇదియే సుఖదుఃఖములకు కారణము. ప్రాప్తించిన సుఖదుఃఖభోగములందు మనసును నిర్వికారముగనుంచుటయే అసంగమని శాస్త్రము తెలుపుచున్నది. ఇట్టి అసంగవాసనలు జ్ఞానులయందు సహితము ప్రారబ్ధక్షయమగునంతవరకు యుండును. కాని యివి జ్ఞానికి భావిప్రతిబంధమును గలిగింపజాలవు. మరల జన్మమును గలిగించువాసనలే బంధకారణమగు సంగమని చెప్పబడును. సంసార బంధకారణములగు దృశ్య సంబంధ సక్తతాభిమానములు, మానవునకు బాగుగ నభ్యసించి స్వానుభవము నొందబడిన ఆత్మతత్వజ్ఞానమువలనగాని క్షీణింపవు.

జీవుడు అనాది అవిద్యావశమున భ్రాంతినొందినవానివలెనగుచు శరీరధారియై యీ ప్రపంచమున జన్మించుట తన ప్రారబ్ధఫల సుఖదుఃఖభోగముల ననుభవించుటకేగాని మరి వేరుగాదు. ప్రారబ్ధమున్నంతకాలము జన్మపరంపర తప్పదు జీవునకీ ప్రారబ్ధశేషములేనిచో జన్మమనునదియే యుండదు. జన్మయే లేనియెడల మరణమెక్కడినుండి వచ్చును? అట్టివాడు జరామరణ వర్జితుడగును. ఇదియే జీవునకు అమృతత్త్వము, ముక్తి, మోక్షము, నిత్యనిరతిశయ సుఖము యని శాస్త్రము తెలుపుచున్నది. దీనినిబట్టి శాశ్వతసుఖమును కోరు

పురుషునకు తన ప్రారబ్ధమును నిశ్శేషముగ అనగా మరల కలుగకుండునటుల జేసికొనుట యావశ్యకము మానవునకిట్లుగావించుటయనునది యొక్క సదాత్మ జ్ఞానమువలనగాని గలుగదు.

కావున వివేకులగువారికి, వారి ప్రారబ్ధానుసారి సుఖదుఃఖభోగానుభవములను అనాయాసముగ ననుభవించి యా సుఖదుఃఖములెంతటివి, యెట్టివి యైనను నిర్లిప్తతతోడ ననుభవించి ప్రారబ్ధక్షయమునుగావించుకొని యుపాధి విలయానన్తరమున పునర్జన్మరహితమగు నిరతిశయ శాశ్వతసుఖము నొందుటకు సర్వవేదాన్త సిద్ధాన్తసారమును, విజ్ఞానరూపమునుయగునట్టి ఆత్మవిజ్ఞాన మంత్రార్థమును, వారి నిత్యానుసంధాన ప్రయోజనమునకుగాను సంగ్రహముగ నీ క్రింద వివరించుచున్నాడను. ఈ స్వశరీర ప్రపంచమంతయు నానాగా గనబడుచు వివిధానుభవములనిచ్చుచున్నను, నివి యిన్నియు యొక్కటియగు రజ్జువుయందు తోచెడి సర్పానుభవముల లాగునను, యొక్కదేయగు స్వాప్నికునియందు గలుగునట్టి స్వప్నదృశ్యానుభవములలాగునను, గలుగుచున్నవి, స్వప్నభ్రాంతికి నిద్దురయు, రజ్జువుయందు సర్పభ్రాంతికి మందాంధకారమును, నిమిత్తము లెట్లగుచున్నవో యట్లే యీ దృశ్య సుఖదుఃఖ సంసారానుభవములకు అజ్ఞానమే నిమిత్తముగనున్నది. పై దృష్టాంతముల యందు దృశ్యనానాత్వానుభవములు యెన్నిగలుగుచున్నను ఈ దృశ్యానుభవమంతయు యొక్కటియగు యధిష్ఠానమందే యెట్లుగలుగుచున్నదో యట్లే జీవునకు, గల్పితమగు యనాది యజ్ఞానమువలన, సర్వదా యొక్కటియగు అద్వితీయ అఖండ పరిపూర్ణాత్మయందే యీ స్వశరీర దృశ్య నానానుభవములు గలుగుచున్నవి, గనుక ఈ స్వశరీర దృశ్య నానానుభవములకు అనాది అజ్ఞానమే నిమిత్తమగుచున్నది. కాన వివేకియగు జీవుడు (మానవుడు) శాస్త్రీయప్రయత్నములచే భ్రాంతిరూపముననున్న తన యనాది యజ్ఞానమును నివర్తింపజేసినయడల సర్వము మిథ్యయేయగుచు తానుమాత్రము చిన్మాత్రుడై నిర్విశేషముగ శేషించును. ఇదియే జీవుని స్వస్వరూపము, పరమార్థము, మోక్షము. ఇది శాశ్వత సుఖస్వరూపము. దీనిన భిలషించునట్టి జిజ్ఞాసువు తన

అనాదిజ్ఞానమును నిర్మూలించుటకు తన స్థితిని విచారించి జగన్మిథ్యాత్వమును గ్రహించి స్వస్వరూపమునుగూర్చి యిట్లు చింతించుట, యనుసంధించుట యావశ్యకము. ఎట్లనిన:—

"అహం", నేను నాప్రారబ్ధ ఫలభోగానుభవ నిమిత్తమై కల్పితముగ నేర్పడి, నిమిత్తము తీరిన తోడనే, దహింపబడుచున్నట్టి యీ దేహాదులను గాను. ఏలనన, నేను నా యిల్లు, నా ఆవు, యని యనుకొనుచున్నట్లే, నాదేహము, నామనస్సు, నా ప్రాణముయని అనుభవించుచున్నాను. నా యిల్లు, నాఆవు నెప్పుడైనను నేను ఆగుదునా! కాను. కావుననేను, వీనిననుభవించునట్టి స్వామిని, అధిష్ఠానమునుగాని నేను యివి యెట్లగుదును? కాన ఇది భ్రాంతి, అవాస్తవమేగదా! ఈ నా దేహమే అవాస్తవము, అస్థిరమగుచున్నప్పుడు యీ దేహాదుల వలన నాకు గలుగుచున్న సిరిసంపదలు, స్వస్వామిత్వము, బాంధవ్యములు మాత్రము, యెట్లు వాస్తవములగుచు నాకు స్థిరములగును? కావు. నాదేహము మొదలు కళత్ర పుత్ర విత్త గృహ క్షేత్రాదులన్నియు అల్పకాలమేయుండి యిందు నాకు నేదియును స్థిరముగ యుండుటలేదు. నా తలిదండ్రులు మొదలగు బంధువర్గము, సిరిసంపదలు, మొదలగునవి ఆయా స్థితులనుబట్టి అల్పకాలమగు కొద్దిసంవత్సరములలోనే నశించుట నేనే చూచుచున్నాను. ఇట్లే యీనాదేహము గూడ నశించునదేయని నాకు తెలుసును, తెలుసుకొనువాడెప్పటికినీ తెలుసుకొనబడునట్టియు, చూచువాడెప్పటికినీ చూడబడునట్టియూ పదార్థము గాజాలడుగదా! కావున నివి యన్నియు నాకు వాస్తవమున సంబంధించిననిగావు. అయినను శరీరము, సిరిసంపదలు, బంధుబాంధవ్యములు నివియన్నియు నావనిన్నీ, నేనే యనిగూడ భ్రాంతి నొందుచున్నాడను. భ్రాంతియన్నను, అజ్ఞానమన్నను యొక్కటియేగదా! ఎప్పటికైనను భ్రాంతిచే ననుభవింపబడువస్తువునిజమగునా? అజ్ఞానము వలన వాస్తవసుఖములు గలుగునా! కలుగవు. కాన నేను అజ్ఞుడనై అవాస్తవములు అనిత్యములగు సుఖ దుఃఖములనే, యివి నాకు వాస్తవములు, నిత్యములు యనినమ్మి

భ్రాంతితోడ యీ దృశ్యమందు వ్యామోహితుడ నగుచున్నాడను. ఇందుచే దృశ్యమందు సక్తతాభిమాన వ్యామోహపామరత్వముల మరణాంతమువరకునొందుచు దుఃఖములపాలగుచు మరణదుఃఖముతోడ ఈ దేహమును విడుచుచున్నాడను. స్వశరీర సర్వదృశ్యమందునను వృథాగా యిట్లు పొందు సక్తతాభిమానములతో నావలన చేయబడిన కర్మఫలమనుభవించుటకు తగిన పరిస్థితులయందు ఉచ్చనీచ అతినీచ జన్మపరంపరల నొందుచున్నాడను. ఏజన్మకాజన్మయందు నేను, శరీరసంపద్ బంధుసంబంధములయందు రాగద్వేషాదులనొందుచు పామరుడనై వానినభిమానించుచు వాని సంయోగవియోగ దుఃఖములనొందుచున్నాడను. ఇదియంతయు నాకు అనాత్మపదార్థములను ఆత్మగా తలచుచున్నట్టి భ్రమజ్ఞానముచే గలుగుచున్నది. ఇదియే నాకనాదియజ్ఞానము. సంసారాంధకారము దీనినిప్పుడు తెలిసికొంటిని గాన యీ అంధకారమును నా ఆత్మజ్ఞానమను జ్యోతిచే నిర్మూలించగలను. అప్పుడు నాకు నావాస్తవస్వరూపమగు నిత్యనిరతిశయానంద ప్రాప్తి గలుగును. (ఇదియంతయు సవిస్తరముగ లోగడ ప్రకరణములలో తెలుపబడినను మరల సంక్షిప్తముగ సాధకునకిచట సింహావలోకనముగ తెలుపబడినదియని గ్రహించవలయును.) జ్ఞానాభ్యాసకుడు నిస్సంశయముగ నిట్టి నిశ్చయమునొంది, ప్రీతితోడ తన స్వస్వరూపానుసంధానాభ్యాసము నిట్లాచరించుచుండవలయును.

బాగుగ విచారించిన యీ స్వశరీర సర్వదృశ్యమందునను నేనేదియునుగాను. నేను సర్వసాక్షిని. నేను కేవలజ్ఞానస్వరూపుడను. సర్వమును బ్రకాశింపజేయువాడను నేనే. ఈ ప్రపంచమంతయు జ్ఞానాధీనమైయున్నది. జ్ఞానస్వరూపుడనగు నేనులేనిది ఈ ప్రపంచమే అనుభవింపబడక లేనిదే యగుచున్నది. నేనుమాత్రము త్రికాలాబాధితముగ నిత్యుడనైయున్నాను. ఈ ప్రపంచము మిథ్యామాత్రము. ఇదిఅంతయు నాస్వస్వరూపమందే అధ్యస్తమగుచు, స్వాప్నికునికి స్వప్నపదార్థానుభవములాగున నాకు మరికొంత దీర్ఘానుభవమునిచ్చుచున్నది. నాకు స్వశరీర దృశ్యమంతయు, అనిత్యము,

అవాస్తవములగు సుఖదుఃఖభోగములను స్వప్నకాలముకన్న మరికొంత దీర్ఘకాలము భోగానుభవములనిచ్చుచు కాలాన్తరమున సర్వమును మాయమై పోవుచున్నది. అప్పుడు మిగులునది, నిత్యనిర్విశేషముగ నుండునది నా ఆత్మ స్వరూపమొక్కటియే. ఇతడే పరమాత్మ, ఒక్కడగు ఈ పరమాత్మయే సర్వ జీవుల హృదయమందునను ప్రకాశించుచు నేను, నేను, యను అహమ్ ప్రతీతితో తెలుసుకొనబడుచున్నాడు. ఈయనయే సర్వజీవులకును బాహ్యాం తరప్రకాశములనిచ్చువాడు. అనగా సూర్యచంద్రదీపాది ప్రకాశము లేనప్పు డును, సర్వేంద్రియ వ్యాపారము విరమించి నిద్రించుచున్నప్పుడును నేను, నేను, యని ప్రతీతమగుచున్నట్టి ఆత్మస్వరూపుడు యీయనయే. పరమార్ధ మున యీయనయే నేను. నేనే సర్వాధిష్ఠానము. పరమార్ధమున నా ప్రకాశము వలననే సూర్యచంద్రాదులు ప్రకాశించుచున్నారు. పరమార్ధమున యిట్టి నేనే నిత్యనిర్వికార అద్వితీయ అసంగ సర్వాధిష్ఠాన అఖండపరిపూర్ణ చిద్ఘనానన్ద స్వరూపుడను. నాకుమించి వాస్తవమగు పదార్ధమేదియుడు నిత్యముగలేదు. కనబడునదంతయు మాయామాత్రము, నశించునది. నేనుమాత్రము నిత్య బుద్ధముక్తుడను. జననమరణాది రహితుడను. ఈ జననమరణ, రాగద్వేష క్షుత్పిపాసాదిధర్మములన్నియు, దేహధర్మములేగాని ఆత్మస్వరూపుడనగు నాకు సంబంధించినవిగావు. ఇవియన్నియు నాప్రారబ్ధఫలమనుభవించు నిమిత్త ముగ యేర్పడిన కల్పితములు. దీనినంతయు ఇప్పుడు బాగుగ తెలిసికొంటిని. నేను అద్వితీయుడను. పరిపూర్ణుడను, త్రివిధభేదరహితుడను, నిర్వికారుడను, స్వప్రకాశుడను. పరమానన్దస్వరూపుడను. ఆత్మేతరమగు వస్తువు వాస్తవ ముగనేదియునులేదని బాగుగ యిప్పుడు గ్రహించితిని. అయినను ఉపా ధియున్నంతకాలము దేహధర్మములు సాధారణముగ విడువవు. తత్త్వ జ్ఞానము ప్రారబ్ధసుఖదుఃఖ భోగానుభవముల సాధారణముగ నశింపజేయ జాలదు. కావున నేను యీదేహముతోడ నా ప్రారబ్ధక్షయమును నిరభిమానముగ వ్యవహరించుచు బడయుదునుగాక. ఏలనన దృశ్యరాగద్వేషాది అభిమాన ములతోడ నొందునట్టి నా ప్రారబ్ధభోగానుభవములు నాకు ఫాపప్రతిబంధకారణ

ములగుచు ప్రారబ్ధమును శేషింపజేయుచుండును. కాన నా ప్రారబ్ధమును నిశ్శే షము గావించుటకు యిదియే యుపాయము. వాస్తవమాలోచించిన యీ వ్యవహారములతోడ నాకు వాస్తవసంబంధములేదు, ఉండుటకు వీలులేదు. ఏలనన యీ దేహము ప్రాణాధీనము. ప్రాణములేనిచో వ్యవహారమనునది యుండుటకు వీలులేదు. ఈ ప్రాణము వాయుభూత వికారమగు స్పందము. ఈ ప్రాణస్పందముమీదఅధారపడి నాకీసంకల్పవికల్పాది వ్యవహారము గలుగుచున్నది. కావున వాస్తవమున నేనుకానట్టి ప్రాణమునకు సంబంధించి నవే సర్వవ్యవహారములు. కనుక యీ ప్రాణదేహాదికముతోడ నాకు సంబం ధము అజ్ఞానకల్పితము, అవాస్తవికము అనబడుచున్నది. పరమార్ధ వాస్తవ మున నేను ప్రపంచాతీతుడను. నేను మూర్తామూర్త స్వశరీర సర్వదృశ్య విముక్త, సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత, జగదుత్పత్తి స్థితిలయవివర్త కారణ, నిత్య, నిర్వికార, అసంగ, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, అఖండ చిద్ఘనా నన్దస్వరూపుడను. నిరవయవుడను గనుక నిష్క్రియుడను. కావున కర్తృత్వ భోక్తృత్వములు నావికావు కల్పితములు, దేహధర్మములు.

పై విధమున సాధకుడగు జిజ్ఞాసువు తన స్వస్వరూపమును, జగన్మిథ్యా త్వమును బాగుగ అనగా సంశయవిపర్యయరహితముగ తెలిసికొనుట యావ శ్యకము. సాధకుడిట్లు తెలిసికొని తనస్వస్వరూపమును ప్రీతినిశ్చయముల తోడ నిరన్తరము పరిపూర్ణ నిర్మలమహాకాశమువలె అనుసంధానాద్యభ్యాస ములనాచరించుచుండ కాలక్రమమున ప్రారబ్ధాంతమందు ముక్తి లభించియే తీరును. ఇట్లాచరించు మహనీయుని ముక్తికాన్త తానొద్దన్నను విడువదు. అనగా ముక్తికాలక్రమమున అప్రయత్నముగ లభించియే తీరును. ఇదియే ఆత్మానందప్రకాశము.

— o —

# అనుసంధాన సారము

శ్రుతిపరమ తాత్పర్య మహావాక్యబోధయగునట్టి, అద్వితీయ అఖండ పరిపూర్ణ చిద్ఘనానంద స్వాత్మాభిన్న, బ్రహ్మైక్యమును, అభ్యాసకుల జ్ఞాన దార్ఢ్యమునకుగాను గాంధర్వ విద్యయందు కృతులను పల్లవిచరణములతోడ వివిధముగ రచించునటుల పరమ సారాంశముగ, ఆత్మానుసంధాన శ్లోకరూపము గావించి యీ క్రింద యుదాహరించుచున్నాడను. అభ్యాసకులు సాదరముగ వీని తాత్పర్యమును, సామర్థ్యమున్నయడల స్వయముగాగాని, లేనిచో సద్గురుముఖమునగాని బాగుగ గ్రహించి యీ శ్లోకములను పలుమారులు పఠించి మననాదుల నభ్యసించుచుండుటచే స్వాత్మాభిన్న పరమాత్మజ్ఞాన మభివృద్ధినొంది కాలక్రమమున ప్రారబ్ధాంతమందు తత్స్వరూపులేయగుదురు. ఇది శాస్త్రప్రమాణము. దేనిని సాధించుటకైనను శ్రద్ధ, అభ్యాసాదులు ఆవశ్యకములుగదా!

## స్వస్వరూపానుసంధాన శ్లోకములు

శ్లో॥ చిన్మాత్రమమలంశాన్తం, స్వప్రకాశమనన్యకమ్ ।
మనోవచోభిరగ్రాహ్యం, మేతద్బ్రహ్మ పరంవిదుః ॥

శ్లో॥ అహంసర్వమిదం విశ్వం, జ్ఞానమాత్రస్వరూపతః ।
స్వాత్మాభిన్నంపరంజ్యోతిః, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ అఖండపూర్ణోహం, నామరూపవివర్జితః ।
స్వాత్మాభిన్నంపరంజ్యోతిః, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ బ్రహ్మైవ పంచభూతాని, బ్రహ్మైవ భువనత్రయమ్ ।
స్వాత్మాభిన్నం పరంజ్యోతిః, తద్బ్రహ్మాస్మిపరంపదమ్ ॥

శ్లో॥ అహంసర్వస్యప్రభవ, స్సర్వవ్యాపీ మహేశ్వరః ।
సూక్ష్మాత్సూక్ష్మతరంచైవ, తద్బ్రహ్మాస్మిపరంపదమ్ ॥

శ్లో॥ నిత్యం సర్వగతం శాన్తం, నిరవద్యం నిరంజనమ్ ।
నిష్కలం నిష్క్రియం శుద్ధం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ అఖండసంవిదాకారం, సచ్చిదానన్దలక్షణమ్ ।
అద్వితీయంపరంజ్యోతిః, తద్బ్రహ్మాస్మిపరంపదమ్ ॥

శ్లో॥ జ్ఞానమాత్రస్వరూపంచ, పరిపూర్ణ మివామ్బరమ్ ।
నకించిద్భావనాకారం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ సర్వంశాన్తం నిరాకారం, పరమం శాశ్వతం సుఖమ్ ।
సర్వభూతాన్తరాత్మస్థం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ సర్వాధిష్ఠానమాత్రంచ, సర్వస్యాస్యప్రకాశకమ్ ।
వర్జితం నామరూపాభ్యాం, తద్బ్రహ్మాస్మిపరం పదమ్ ॥

శ్లో॥ సర్వసాక్షీప్రత్యగాత్మా, పరమాత్మా హామచ్యుతః ।
కూటస్థః కేవలోవ్యాపీ, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ చిదాకాశం పరంశాంతం సర్వసంగ వివర్జితమ్ ।
సుఖాత్సుఖంచ యన్నిత్యం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ జ్ఞానానన్దఘనంశాన్తం, జగత్పరమకారణమ్ ।
నిష్క్రియంచ నిరాలమ్బం, తద్బ్రహ్మాస్మిపరంపదమ్ ॥

శ్లో॥ సర్వాధిష్ఠాన చిన్మాత్రం, సర్వోపాధి హ్యదిస్థితమ్ ।
కోటిసూర్యప్రతీకాశం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ అకృత్రిమమనాద్యన్త, మద్వితీయ మఖండితమ్ ।
స్వాత్మాభిన్నం సుఖం నిత్యం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ దిక్కాలాద్యనవచ్ఛిన్నం, ప్రజ్ఞానఘన విగ్రహమ్ ।
కారణం సర్వజగతాం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ జ్ఞానానన్ద ఘనంనిత్యం, నిర్మలస్ఫటికప్రభమ్ ।
ఆధారం సర్వభూతానాం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ స్వశరీరవి నిర్ముక్తం, స్వశరీర హృదిస్థితమ్ ।
అఖండ సంవిదాకారం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ పరిపూర్ణ చిదానన్దం, సర్వ జీవహృదిస్థితమ్ ।
స్వాత్మాభిన్నం స్వప్రకాశం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ నిర్గుణం నిష్క్రియం నిత్యం, సర్వభూత వివర్జితమ్ ।
కేవలం సంవిదాకారం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ నిష్క్రియం నిర్మలం శాన్తం, ప్రజ్ఞాన ఘనమవ్యయమ్ ।
స్వాత్మాభిన్నం శివం శుద్ధం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ చిద్వ్యోమైవకిలాస్తీహ, చిచ్ఛివం హ్యచలంధ్రువమ్ ।
నకించిద్భావనాకారం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ ఏకమేవాద్వితీయంచ, నేహనానాస్తికించన ।
జ్ఞానమాత్రమిదం సర్వం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ జ్ఞానమాత్రమిదంసర్వం, పారావారవివర్జితమ్ ।
అఖండసంవిదాకారం, తద్బ్రహ్మాస్మిపరంపదమ్ ॥

శ్లో॥ అనాద్యన్తం జగద్బీజం, సంవిద్యచ్ఛ నిరామయమ్ ।
సర్వత్రావస్థితం శాన్తం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ జన్మజన్మాన్యనుస్మృత్య, జాగ్రత్స్వప్న సుషుప్తిషు ।
యత్సాక్షిభాసతే నిత్యం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో॥ సత్యం జ్ఞానమనన్తంచ, సచ్చిదానన్ద లక్షణమ్ ।
చిత్సుఖం స్వాత్మనోఽభిన్నం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్॥

శ్లో॥ నక్షత్రమాలికాస్తోత్రం, మోహన్నామ సుధీకృతమ్।
స్వస్వరూపాను సంధాన, సిద్ధిదం, మోక్షదం శుభమ్॥

ఏకతత్త్వమగు యీస్వస్వరూపాను సంధానాదులను జిజ్ఞాసువులయభ్యాస సౌలభ్యమునకుగాను వివిధముగ నక్షత్రమాలా శ్లోక రూపమున గావించినాడను. ఇందు విషయభేదముండదు. ఉండుటకు సిద్ధాన్తమొప్పదు. పదసరళినిబట్టి ఈ శ్లోకములతిసులభములనిపించును. కాని యివి, అతిగంభీరమగు అద్వైత సిద్ధాన్తసారసంపుటి. స్వస్వరూప సంధానమున కమృతతుల్యములు. కావున పైనతెలుపబడినయటుల ఈ శ్లోకముల అర్థమును యెంతబాగుగ గ్రహించి దానియందెంతప్రీతి నిశ్చయములతో, నెంతెంత నభ్యసించిన అభ్యాస పాటవమునుబట్టి యంతంత లాభముగలుగుచుండును. ఇది ప్రత్యక్షము. ముముక్షువులకు సతతము స్వస్వరూపాను సంధానాదుల నాచరించుట సాక్షాన్ముక్తిమార్గమని శాస్త్రము నిర్దిష్టముగ తెలుపుచున్నది. అయినను అభ్యాస కులకు నిది మొదట కొంచము క్లేశకరముగనుండును. కావున అభ్యాసకులిచట తెలుసుకొనవలసిన రహస్యమొకటిగలదు. ఏదియనిన సాధకులీ బ్రహ్మాభ్యాస మందు విసుగుజెందగూడదు. ఏలనన దేహమున్నంతకాలము దేహధర్మములు సాధారణముగవిడువవు. ఎందుచేతననిన జీవుడిప్పుడు అనగా యీజన్మమందున, తన ప్రారబ్ధఫల మనుభవించుటకు దేహతాదాత్మ్య ధ్యాసరూపమైన శయ్యయందు తన మనసుతోడ శయనించి యుండును. జీవునకీ జన్మయనునది విధింపబడిన శిక్షవంటిది. అయినను యిది కల్పితముగాని వాస్తవముగాదు. ఈ జన్మల నిత్యములు. ఇందు సుఖములన్నియు అవాస్తవ ములు, తాత్కాలికములు, దుఃఖ పర్యవసితములు. కాని ఈ వ్యవహార భోగాను భవములన్నియు అనిత్యములు, అవాస్తవములు, గల్పితములే యగుచున్నను నివి యన్నియు వాస్తవములైనవానివలె మానవుని వ్యామోహింపజేయు చుండును. ఈ విషయ భోగానుభవములన్నియు అనిత్యములు, సర్వ సంసార దుఃఖమునకు కారణములు. అయినను జీవులువిషయసుఖములనే కోరుచుందురు. ఇదియే మాయాకల్పిత అవిద్య, అజ్ఞాన తల్పము. ఇందు శయనించుచే

జీవునకు సంసార పరంపరా కారణము. కావున జీవుడు యీ అజ్ఞానతల్పము నుంచి లేచి జాగరూకుడై దీనిని నిర్మూలించినగాని తన శాశ్వత స్వస్వరూపానంద ప్రకాశము లభింపదు. ఈ స్వస్వరూప ప్రకాశమే అఖండాత్మానందము. నిత్యనిరతిశయసుఖము. ఆత్మజ్ఞానాభ్యాసకుడగు ముముక్షువు, దీని నొందుటకు తనమనస్సునుశాస్త్రశ్రవణాదిఉత్తమబోధాచరణములచే అజ్ఞానశయ్యనుంచిలేవనెత్తి తన ఆత్మ నుద్ధరించుకొనవలయును. ఈ ఆత్మోద్ధరణమునకు సంస్కృత మనస్సే సాధనము. కావున సుబుద్ధియగునట్టి సంస్కృత మనసుతోడ జిజ్ఞాసువు తన పరమలక్ష్యమగు శాశ్వతసుఖప్రాప్తినొందుటకు, యీ స్వశరీర సర్వదృశ్య మిథ్యాత్వమును బాగుగ గ్రహించి నిశ్చయమునొంది, యీ దేహధర్మములు అనిత్యములు, అవాస్తవములను నిశ్చయజ్ఞానమొంది సద్వృత్తి నాశ్రయించి స్వాత్మాభిన్న అఖండ బ్రహ్మాకారముగ స్వస్వరూపానుసంధానాదులను ప్రారబ్ధాంతమువరకును అనగా ఆత్మసాక్షాత్కార పర్యంతము విసుగుజెందక ప్రీతినిశ్చయములతోడ సర్వదా అభ్యసించుచుండవలయును. ఇదియే పరమముక్తికి సాక్షాత్సాధనమనియు వేరుమార్గము లేదనియుగూడ శాస్త్రము కంఠోక్తిగ బోధించుచున్నది. ఈ విషయమంతయు విపులముగ లోగడనే నిరూపింపబడియున్నను సందర్భానుసారమున యిప్పుడిది అభ్యాస రూపముగ తెలుపబడినదని జిజ్ఞాసువులు గ్రహించి, సర్వదా బ్రహ్మాత్మసంస్థితి నభ్యసించుచుందురుగాక. ఇదియే స్వస్వరూపానుసంధానము జిజ్ఞాసువులను మోక్షము నొందింపజేయు సాధనములలో ఈ స్వస్వరూపానుసంధానమే అత్యుత్తమమైనది, గొప్పదియని "మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవగరీయసీ, స్వస్వరూపానుసంధానం భక్తిరిత్య భిధీయతే" అని శ్రీ శంకరభగవత్పాదులు నిర్వచించుచున్నారు. కావున జిజ్ఞాసువులకిదియే, అనగా ఆత్మానుసంధానమే అమృతసిద్ధి సాధనమని ప్రీతి నిశ్చయముల తోడ గ్రహింతురుగాక. ఈ సందర్భమున పై శ్లోకముల పరమ తాత్పర్యముగా శ్రీ భగవత్పాదులు రచించినఆత్మపంచ కమునుంచి మూడుశ్లోకముల నిచట నుదాహరించుచున్నాడను.

శ్లో॥ నాహందేహో నేంద్రియాణ్యంతరంగం,
నాహంకారః ప్రాణవర్గోన బుద్ధిః ।
దారాపత్యక్షేత్ర విత్తాదిదూర,
స్సాక్షీనిత్యః ప్రత్యగాత్మా శివోహమ్ ॥

శ్లో॥ నాహంజాతోన ప్రవృద్ధోననష్టో,
దేహస్యోక్తాః ప్రాకృతాస్సర్వ ధర్మాః ।
కర్తృత్వాదిశ్చిన్మయ స్యాస్తినాహం,
కారస్యైవహ్యాత్మనోమే శివోహమ్ ॥

శ్లో॥ మత్తోనాన్యత్కించి దత్రాస్తి విశ్వం,
సత్యం బాహ్యం వస్తుమాయో పక్లృప్తమ్ ।
ఆదర్శాంతర్భాసమానస్యతుల్యం,
మయ్యద్వైతేభాతి తస్మాచ్ఛివోహమ్ ॥

సాధకులగు జిజ్ఞాసువులకిచట, ఆత్మానుసంధానాభ్యాసమును గురించి కొంచెము వివరించుట యావశ్యకము. ఆత్మవిచారానుసంధానాదులవలన జగన్మిథ్యాత్వ జ్ఞానమందునను, ఆత్మావలోకమందునను బుద్ధిస్థైర్యము నొందును. ఇదిప్రయత్నసాధ్యము. ప్రపంచమును విడచుటకు ప్రయత్న మక్కరలేదు. కాని స్వశరీర సర్వ ప్రపంచము వాస్తవముగాదను నిశ్చ యమునొందుటకు ప్రయత్నము కావలయును. ఇట్టిప్రయత్నముతోకూడిన అభ్యాసాదులే జీవునకు తరణోపాయములు. జిజ్ఞాసువులు వారి అభ్యాస పాటవమునుబట్టి యీ ఆత్మవిచారస్వస్వరూపానుసంధానాదులవలన కాలక్రమ మున ఆత్మాపరోక్షానుభూతినొందుచు ప్రారబ్ధముననుసరించి జీవన్ముక్త విదేహ ముక్తులగు చుందురు. ఈ రెండును సమములేగాని బాహ్యావ్యవహార స్థితి యందు మాత్రము తారతమ్యము నగుబడుచుండును. ఇదియే మోక్షము.

ముక్తి. దీనికి సాధకులు చేయవలసినది ఆత్మవిచారముతోగూడిన నిరంతర స్వస్వరూపానుసంధానమే. ఆత్మస్వరూపమద్వితీయ స్వప్రకాశ పరిపూర్ణ అఖండము గనుక, నిదిప్రకాశించిన కొలదియు నీ దేహప్రపంచములయందు సత్యత్వబుద్ధి క్షీణించుచుండును. ఆత్మ శాశ్వత అద్వితీయ అఖండ సుఖ స్వరూపము. కావున అది నేనే, యనునిశ్చయము గలుగుచుండగ, అజ్ఞానావరణము క్షీణించుచుండును. శాస్త్రవిచారవివేకముతోడ స్వశరీర సర్వదృశ్యమును వాస్తవము గాదని జ్ఞానపూర్వకముగ నిషేధించిన యడల, వాస్తవముగ మిగులునది యేదియో యదియే ఆత్మ. అదియే తాను. ఇది సర్వవేదాన్తపరమ సిద్ధాన్తసారము, మహనీయుల అనుభవము. కావున నిత్యమగు ఆత్మస్వరూపము మిగులునంతవరకును, అదివరకాత్మగాభావింపబడిన వాటినన్నిటిని నిస్సంశయ జ్ఞానపూర్వకముగ త్యజించి నేను పరిపూర్ణ జ్ఞానస్వరూపుడను. స్వతంత్రుడను, దేశకాలవస్త్వ పరిచ్ఛిన్నుడను, నిత్యుడను, అను నిశ్చయము నొందవలయును. ఇట్లెంతగ శాస్త్రవిచారమువలన గ్రహించినను సాధకులకు ప్రథమమున ఈ స్వస్వరూపానుసంధానాభ్యాసకాలమందున, తాను వాస్తవమున పరమాత్మస్వరూపుడనను జ్ఞానమున్నను యిప్పుడుతాను యుపాధి బద్ధుడనైయున్నాననియు, తన కిప్పుడున్న అజ్ఞానము పోవలయుననియు వృత్తిగలుగుచుండును. ఇది భ్రాంతి. స్వస్వరూపానుసంధానవిక్షేపకరము. ఏలనన తాను వాస్తవమున త్రికాలాబాధిత అద్వితీయ అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపుడు. ఈవిషయమును తానిప్పుడు బాగుగగ్రహించినవాడు. ఈ ప్రపంచ మంతయు జ్ఞానాధీనము. తాను త్రికాలముల యందునను, అనగా నిత్యముగ అద్వితీయ అఖండపరిపూర్ణుడై యున్నాడు. ఈ ప్రపంచము మాయాకార్యము. కావున అజ్ఞానపరిణామ మగు నీజగత్తంతయు తనయందే అనగా స్వాత్మాభిన్నముగ స్వప్నపదార్థములవలె, మరికొంత దీర్ఘకాలము భాసించుచు, తాత్కాలికానుభవములనిచ్చుచు, అవాస్తవమగుచుండును. పిశాచమువలె యున్నట్లు గనబడుటయెగాని, పరమార్థమున నీప్రపంచము వాస్తవముగ త్రికాలముల యందుననులేదు. కాని సర్వదా, జ్ఞానులకు బ్రహ్మాభిన్న

ముగను, అజ్ఞులకు జగదాకారముగను భాసించుచుండును. ఇందు ఆత్మరూప మగు బ్రహ్మ అధిష్ఠానము, ప్రపంచమంతయు అధ్యస్తమునని లోగడ పలుమారులు, తెలుసుకొనియుంటిమి. కావున పరమార్థవాస్తవముననీ ప్రపంచము సత్యముగాదు. కనుకనే వ్యవహారకల్పనచే కొంచము భేదమున్నను శాస్త్రము జాగ్రత్స్వప్నానుభవములను భ్రాంతి మాత్రములని రెంటిని సమానముగనే ప్రబోధచేయుచున్నది. స్వప్నపదార్థములెప్పుడైనను వాస్తవ ములగునా? స్వకాలసత్యత్వముతోడస్వప్న, జాగ్రత్పదార్థములు రెండునుమిథ్యా మాత్రములగుచు కాలాంతరమునలేనివే యగుచున్నవిగదా ? ఇట్లువాస్తవము నలేని దృశ్యముపోవలయుననియు, తానిపుడు ఉపాధిబద్ధుడనై యున్నాననియు, అనుసంధించుట భ్రాంతియేగదా? జీవునకజ్ఞానావరణముగూడ వాస్తవముగాదు. కాని యిది చిరకాలభ్రాంతి. ఇది కొండమీదనగుబడు మేఘమువలె భాసించు చుండును. దగ్గరకు వెళ్ళిచూచినయడల ఆమేఘమేయగుబడదు. కావున, జ్ఞానా భ్యాసకుడు యీభ్రాంతినిగూడ ప్రయత్నముతో విడువవలయును, అట్లు విడచి వాస్తవమునయున్నట్టి. స్వాత్మాభిన్న అద్వితీయ అఖండపరిపూర్ణాత్మస్వరూప మునే శాంతచిత్తుడై, నిర్మలమహాకాశములాగున చిదాకాశాను సంధానమ భ్యసించుచుండవలయును. అభ్యాసకాలమందు దేహాదిజగత్స్వరూపములు భాసించినను అవితనకు యెట్టిసంబంధములేక ఆకసమునందుండు మేఘజాల మువంటివియనియు, తనకు వాటిసంబంధము ఆభాసమాత్రమనియు నిరసించి తన స్వస్వరూపమందారూఢుడగుచుండవలయును. ఎంతటి అభ్యాసకునకైనను దేహమున్నంతకాలము దేహధర్మములుండునుగాన, నవివాస్తవముగావనునట్టి నిశ్చయజ్ఞానముతోడ నాచరించి చిరకాలాభ్యాసపరిపాకములవలననే యీ సాధకుడు తన నిత్యనిరతిశయ పరిపూర్ణప్రకాశమునొందును. సందియములేదు. శాస్త్రము, మహనీయుల యనుభవముగూడ నిట్లేబోధించుచున్నవి.

---

# బ్రహ్మజ్ఞానాభ్యాసకుని స్వగతాభిసంధి

ఉపనిషత్పరమ తాత్పర్యసారములగు మహావాక్యములు, బ్రహ్మ స్వరూపమగు అద్వితీయ అఖండ పరిపూర్ణ చిద్ఘనానంద స్వరూపుడను నేనే యని, ఉద్ఘోషించి బోధించుచున్నవి. ఈ ప్రపంచనానాత్వ-ఉపాధ్యనుభవము లన్నియు యథార్థములు కావనియు, పరమార్థవాస్తవముననున్నది, ఒక్క-అఖండ పరిపూర్ణ వస్తువేననియు, అది నాకన్న భిన్నముకాదనియు, గూడ శాస్త్రము స్పష్టముగ తెలుపుచున్నది. శాస్త్ర ప్రమాణమును బట్టియు, అనుభవమును బట్టియు. నిజమాలోచించిన, నాకు యీ ప్రపంచముతోడ వాస్తవమగునట్టి సంబంధమేమియును గనుపడుటలేదు. పరమార్ధమున నేను నిష్ప్రపంచుడను. ప్రపంచాతీతుడను. ఈ ప్రపంచమున నగుపడుచు, నాచే ననుభవింపబడుచున్నట్టి స్వశరీరాది సర్వమునందును, నాకు నేదియును నిత్యముకాజాలక సర్వము నశించుచున్నది. ఈ ప్రపంచమంతయు గతజీవుల యొక్క రుద్రభూమిగ తప్ప, మరివేరుగ నేమియును కనుబడుటలేదు. ఇందు శాశ్వతమని నేనాధారపడుటకు నేదియును నగుపడుటలేదు. ఈ దేహాదిసంఘాతము నాకు నిమిత్తమాత్రముగ కల్పితమై యిట్టి ప్రపంచమునకును, నాకును సంబంధమును కల్పించి శాశ్వతమైన దానివలె తోపింపజేయుచున్నది. ఇది యంతయు భ్రాంతిమాత్రము, మాయాప్రభావముగ గన్పట్టుచున్నది. వాస్తవ మాలోచించిన నాకు యీ సంబంధముననదియే కల్పిత మాత్రముగదోచు చున్నది. నా యీ స్వశరీరాది సంబంధములే కల్పితములైనప్పుడు, వాటివలన గలుగుచున్నట్టి సుఖదుఃఖములు ఎట్లునాకు వాస్తవములగును? కావు. నాకీ ప్రపంచమున గలుగుచున్న సంబంధబాంధవ్యములు, స్వస్వామిత్వములు మొదలగునవి యన్నియు భ్రాంతి కల్పితములు, అనిత్యములు. కావుననే నాకీ సంసార దుఃఖము, వాటియాథార్థ్యమును గ్రహింపజాలనందున చర్విత చర్వ

ణముగ ప్రాప్తమగుచున్నది. నేనింతవరకును శ్రుతి యుక్తి అనుభవముల ననుసరించి చేసిన తత్త్వవిచార విమర్శ మననాదులవల్ల యీ రహస్యము నిప్పుడు బాగుగ తెలిసికొంటిని.

నాకీ దేహాదిసంఘాతమంతయు కల్పితమాత్రముగ నా ప్రారబ్ధఫలానుభవనిమిత్తమై యేర్పడినది కనుక, విదియంతయు నిమిత్తమున్నంతకాలమే యుండునుగాని తదుపరివీటి ఆ భాసముగూడ నుండదు. ఆ నిమిత్తమేది యనిన, నాప్రారబ్ధము. ఈ ప్రారబ్ధము నాకు విధింపబడిన శిక్షవంటిది. ఈ ప్రపంచమంతయు నా నాజీవ ప్రారబ్ధ ఫలానుభవనిమిత్తమై, అనగా-నానాజీవులకును వారివారి కర్మఫలములననుభవించుటకుగాను కల్పింపబడిన, మహా కారాగారమువంటిది. జీవునకు పుణ్యపాపఫలములు రెండును బంధములే. ఒకటి బంగారుసంకెలి, రెండవది ఇనుపసంకెలి. కాని రెండును జీవునకు బంధమగునట్టి సంకెళ్లే. అనగా-శృంఖలములు. కావున ప్రాజ్ఞునకు నీ ప్రపంచమున గలుగుచున్నట్టి సుఖదుఃఖములు, సంబంధ బాంధవ్యములు, సిరిసంపదల యొక్క ప్రయోజనములును వ్యావహారిక మాత్రములు. ఈ ప్రయోజనము లన్నియు కారాగృహ నివాసకాలమందున శిక్షితునకు నివ్వబడునట్టి నివాస-ఆహార-వస్త్ర-ఘట-శరావాదులవలనగలుగు దుఃఖము, సాన్నిధ్యమున యున్న కారాగృహాధికారుల పరిపాలనాగృహముల ముందుండు వృక్షపుష్ప లతాదికములచేత నప్పుడప్పుడు తనకు గలుగు సుఖసంతోషముల వంటివేగాని అధికములు గాజాలవు. ఏలనన-రెండును తాత్కాలికములే. జైళ్లు, అనగా-కారాగృహములలో శిక్షింపబడువారికి గూడ వారివారి నేరముల ప్రాబల్యములను, స్థితి-అర్హతలనుబట్టి సాధారణ-కఠిన శిక్షలును, మఱియు ఏక్లాసు, బి క్లాసు, సి క్లాసులు ఎట్లు ఇవ్వబడుచు ననుభవింపబడుచుండునో, అట్లే యీ ప్రపంచమనుమహాకారాగారమందున జీవులు వారివారి ప్రారబ్ధ ఫలముననుసరించి, యీ జీవితశిక్షననుభవించునపుడు ఉత్తమ-మధ్యమ-అధమ-అధమాధమ స్థితులలో (అనగా క్లాసులలో) వారివారి జగదనుభవముల నొందుచుందురు. ఇట్లనుభవించునపుడు వారు ఇవియన్నియు సత్యములు నిత్యము

లని తలచి యీ అనుభవములయందు అతిసక్తతాభిమానములనొందుచు, పామరత్వముతోడ సంకల్పములజేయుచు, యీ వాంఛలతోడనే ఆ యా సారికి అనగా ఆయాజన్మమునుంచి మరణముఖమున విడుదల నొందుచుందురు. కానియేమిలాభము? ఇట్లు విడుదలగాంచిన జీవులందరును వారివారి కర్మఫలములను, వాంఛలను ననుభవించుటకుగాను అజ్ఞానముగలవారలగుచు, నీ ప్రపంచమహాకారాగారమునకు మరల మరల వచ్చుచు పోవుచు నుందురు. ఇదియే చర్విత చర్వణమగునట్టి సంసార చక్రము. ఇదియే జీవునకు సంసార బంధము, కారాగారసమానము. జీవుడు మహా కారాగారమువంటి యీ ప్రపంచమును, యీ ప్రపంచానుభవములను, యివి తనకు వాస్తవములు, నిత్యములు నని విశ్వసించి, వాటియందు వ్యామోహముతోడ రాగద్వేషాదుల నొందుట కంటే అవివేకము, మరి వేరజ్ఞానమనునది నేమియున్నది? వీటిని నమ్మకొని వీటియందు రాగద్వేషాది ఆస్థనొంది కోరికల జేయుచుండుట-స్వప్నకన్యను వివాహమాడుటకు యత్నించుట వంటిదియే కదా! జాగ్రత్ స్వప్నస్థితులకు ఈషద్భేదమున్నను శాస్త్రి దృష్ట్యా, అనగా-వివివేకుల దృష్టితో జూచిన అవివాస్తవములు కావుగదా! ఇట్టివాంఛలవల్ల గలుగు ఫలము దుఃఖమేగదాకావలయును.

నాకు అజ్ఞానముచే నిట్లుకలుగుచున్న దుఃఖముయొక్క ఆత్యంతిక నివృత్తికినీ, తిరిగి ప్రపంచ కారాగృహవాసికాకుండుటకును నేను సర్వస్వతంత్రుడనై నానిత్యనిరతిశయానందమనుభవించుటకును శాస్త్రయొక్కటియే యుపాయము జెప్పుచున్నది. అదియేదియనిన-ప్రారబ్ధము విధింపబడిన శిక్ష వంటిదిగావునను, విధించబడిన శిక్ష సాధారణముగా తప్పదు గావునను అనుభనించి ప్రారబ్ధమును నశింపజేసికొనవలయునేగాని వేరుదారిలేదనియు, కాని యిట్లనుభవించుటయందు నా ప్రారబ్ధానుసరణమున యీసుఖదుఃఖ భోగము లెంతటివియైనను వాటియొక్క అవాస్తవికతను గురుశాస్త్రబోధవలన బాగుగగ్రహించి, నిశ్చయమునొంది, వాటియందు పామరత్వమును సక్తతాభిమానములను వదలి, జ్ఞానపూర్వకమగు నిర్లిప్తతతోడ సమస్త జగదను

భవముల నొందవలయునుగాని వాటియందు వ్యామోహముతోడ రాగద్వేషాదులనొందగూడదు. ఇదియేవివేకము, అత్మసంయమనము. ఇట్లుజేయగలిగిన యడల యీసంయమాగ్నితోడ నా పుణ్యపాపకర్మలను నేరములయొక్క ఫలములన్నియు నశించును. అప్పుడు నాకు కర్మఫలము నశించి శిక్షాకారణములేకుండుటచే తిరిగి యీప్రపంచమను మహాకారాగారమున ప్రవేశించక స్వస్వరూపానందము నొందుదును నేనిప్పుడు ఆత్మతత్త్వమును యథార్థముగ గ్రహించినవాడను కావున—

"అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతిపూరుషః"
"జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా"

అను శ్రీకృష్ణపరమాత్మవచనముల ననుసరించి సర్వవ్యవహారమును నా ప్రారబ్ధక్షయమును గావించుటకు మాత్రమాచరించుచు, అనగా-సక్తతాభిమాన వర్జితుడనై నాప్రారబ్ధ సుఖదుఃఖభోగములననుభవించుచు నా స్వరూపానుసంధానాదులగావించుచుందునుగాక ! శాస్త్రప్రమాణమును బట్టియిట్లాచరించు సతతాభ్యాసములచే కాలక్రమమున, నా ప్రారబ్ధాంతమందు—

"అనందోబ్రహ్మేతివ్యజానాత్"
"జీవోబ్రహ్మైవ నాపరః"

అనువచనములననుసరించి నానిత్యనిరతిశయానంద స్వరూపము నొందుదునుగాక !

——0——

# గీతా పరమ తాత్పర్యము

భగవద్గీతయనునది సర్వోపనిషత్సారము. ఇది బ్రహ్మవిద్య. ఈ విద్య మానవునియొక్క పరమార్థ వాస్తవస్వరూపమును, దానిని పొందునట్టి సాధనములను తెలుపునట్టిది. ఇది ఆత్మజ్ఞానవిద్య. ఈ భగవద్గీతాబోధను ఒక్క భారతఖండమందేగాక, పాశ్చాత్య వివిధదేశములవారుగూడ సర్వమానవ జాతికిని, వారివారి యిహపర శాశ్వతసుఖప్రాప్తికి సాధనమగు నట్టిదని శ్లాఘించుచున్నారు. ఇది అనేక విదేశభాషలలోగూడ తర్జుమా చేయబడి ఖ్యాతిని గాంచిన గ్రంథరాజము.

ఇది ప్రస్థానత్రయములో నొకగ్రంథము. దీనికి శ్రీ శంకర భగవత్పాదులు భాష్యము గావించిరి. మనదేశమున గీతా ప్రామాణ్యమునంగీకరింపని వారరుదు. దీని ప్రామాణ్యమును పండిత పామరులుగూడ నంగీకరించుచు యనేకవిధముల వారివారి ప్రవృత్తుల ననుసరించి వ్యాఖ్యానములు వ్రాయుచున్నారు. ఇవి పలువిధములనున్నవి. దీనిని ప్రముఖులు పలువిధముల నుపన్యసించుచున్నారు. ఈ గ్రంధ పారాయణము చిత్తశుద్ధిసాధనముగను, దీని అర్థమును బాగుగ గ్రహించి మననాభ్యాసములు చేయుట మహత్తరమగు బ్రహ్మజ్ఞానసాధనముగను దెలియుచున్నది. దీని శాస్త్రీయాచరణాభ్యాసములు పరమశ్రేయోదాయకములు. కావున జిజ్ఞాసువులకు వారిమననాభ్యాసానుసంధానములకుగాను యీ గీతాబోధయొక్క పరమతాత్పర్యమును. సంగ్రహముగ విచారించుదము.

ఒకానొక నిమిత్తమునను సరించి భగవత్స్వరూపులగు నరనాయణులను వారే ఉపనిషత్సారమగు బ్రహ్మవిద్యనుపదేశించుటకుగాను శ్రీకృష్ణ పరమాత్మగను, స్థితప్రజ్ఞుడును, శిష్యుడునై, బ్రహ్మవిద్యను గ్రహించెడి అర్జునుడుగను, నవతరించి జీవతరణోపాయమగు శ్రీమద్భగ

వద్గీతయను బ్రహ్మవిద్యను, గురుశిష్య సంవాదరూపమున బోధించి యున్నారు. శ్రీకృష్ణావతారము పరమాత్మ స్వరూపము. అర్జునుడు స్థితప్రజ్ఞుడైన, సంపూర్ణ, బ్రహ్మవిద్యాధికారి. శ్రీకృష్ణపరమాత్మ యీ విద్యను, విద్యాసాధనములను అధికార తారతమ్యములనుబట్టి పరిపరివిధముల, కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గముల బోధించినను, యిందు భక్తి కర్మయోగములు మూడును చివరకు జ్ఞానమందే పర్యవసానమునొందుననియు, చెప్పి "నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే" అనగా యీజ్ఞానముతో సమానమగునది మరియొక పేదియుదునులేసుమా! యనితెలుపుచున్నారు. ఇచట జ్ఞానమనగా బ్రహ్మజ్ఞానమే. దీనిని ధ్రువపరచుచు,

శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి, యద్ జ్ఞాత్వాఽ మృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ, నసత్తన్నాసదుచ్యతే ॥

అని సారాంశమున జీవునకు యేది తెలియదగినదో, యేది తెలిసిన మోక్షము నొందునో అది, అదిలేనిది, నిరతిశయమైనదియునగు బ్రహ్మము. అదిసత్తుగాదు, అసత్తునుగాదని తెలుపుచున్నారు. ఇట్టి యీ అఖండాఽద్వితీయ పరమాత్మస్వరూపమే "అహమ్" నేను అను అధిష్ఠానముగను, "ఇదమ్" యీ ప్రపంచము అను అధ్యస్తముగను, వివర్తముగ భాసించుచున్నదని అచటచటయనేక శ్లోకములవలన తెలిపియున్నారు. కావున పరమార్ధవాస్తవమున యీ జీవప్రపంచములు ఒక్కటియేగాని భిన్నభిన్నములుగావు. పరమాత్మ స్వరూపము-అహమ్, నేను అను ప్రతీతితోడ సర్వాధిష్ఠానముగను, ఇదం-యీ ప్రపంచమను ప్రతీతితోడ యధ్యస్తముగను యున్నది. ఇందు అధిష్ఠానాంశము సత్యము. అధ్యస్తాంశము అవాస్తవము, కల్పితముగ నున్నది. కావున అవాస్తవమై, గల్పితమగు యీ ప్రపంచము, సత్యము వాస్తవమగునట్టి యధిష్ఠానరూపమగు పరమాత్మయందే భాసించుచున్నది. ఎల్లప్పుడును అధ్యస్తము అధిష్ఠానమును విడచి యుండుటకు వీలులేదు. కాని అధిష్ఠానము అధ్యస్తమందుయుండదు. ఇచట అధిష్ఠానము పరమాత్మస్వరూపము, జీవుడు. జీవత్వము అజ్ఞానకల్పితము, కాని వాస్తమున జీవుడు బ్రహ్మ

స్వరూపుడే. దీనినే శ్రుతి "జీవో బ్రహ్మైవనాపరః" యని తెలుపుచున్నది. పరమాత్మ యింద్రియగోచరుడుగాడు. ఈ స్థితిని బోధించుటకే,

శ్లో॥ మయాతతమిదంసర్వం, జగదవ్యక్త మూర్తినా ।
మత్ స్థానిసర్వభూతాని, నచాహంతేష్వవస్థితః ॥

అనగా ఇంద్రియములకు గోచరముగాని స్వరూపముగల నాచే జగత్తంతయూ నిండియున్నది. భూతములన్నియు నాయందున్నవి. నేనాభూతములనంటి యుండలేదు అని శ్రీకృష్ణపరమాత్మ తెలుపుచున్నాడు.

ఇచటనొక పరమరహస్యము గలదు. ఏదియన పరమార్థవాస్తవమున జీవుడు పరమాత్మ బ్రహ్మస్వరూపుడే గావున గీతాసారమును గ్రహించునపుడు శ్రీకృష్ణపరమాత్మ "అహమ్" "మాం," అని చెప్పినట్టి సందర్భములలో నెల్లచోట్లను ముముక్షువు తాను అనగా నేను, నన్ను యని గ్రహించి తద్విధముననే యనుసంధానము చేయుచుండవలయును. ఇది అద్వైతసిద్ధాంత రహస్యము.

ఇట్టి సర్వాధిష్ఠానమును బోధించుటకే,

శ్లో॥ అహంసర్వస్య ప్రభవో, మత్తస్సర్వం ప్రవర్తతే ।
ఇతిమత్వాభజన్తేమాం, బుధాభావసమన్వితాః ॥

అనగా నేనే అన్నిటికీ కారణము, నావలననే సర్వమును ప్రవర్తించుచున్నదని తెలిసికొని వివేకులు ప్రీతిభావములతోగూడిన వారై నన్ను సేవింపుచున్నారు. అనగా ముముక్షువు తన సర్వాధిష్ఠాన స్వరూపమును గ్రహించి ప్రీతి నిశ్చయములతో స్వస్వరూపమును అనుసంధించుచుండవలయును.

శ్లో॥ యోమామజమనాదించ, వేత్తిలోకమహేశ్వరమ్।
అసమ్మూఢస్స మర్త్యేషు, సర్వపాపైః ప్రముచ్యతే ॥

అనగా ఎవడు తనను పుట్టుకలేనివానిగను, ఆదిలేనివానిగను, సర్వలోకములను నియమించువానిగను (అనగా తానే కారణభూతుడుగను) తెలిసికొనునో యట్టివాడు మోహరహితుడగుచు పాపములన్నింటిచే విముక్తుడగుననియు,

శ్లో॥ భక్త్యామామభిజానాతి, యావాన్ యశ్చాస్మితత్త్వతః ।
తతోమాంతత్త్వతోజ్ఞాత్వా, విశతేతదనన్తరమ్ ॥

అనగా భక్తిచేతను అనగా స్వస్వరూపానుసంధానముచే తానెవడో, ఎట్టివాడో యథార్థముగ తెలిసికొనును. అట్లు నన్ను, అనగా తనను తాను వాస్తవముగ తెలిసికొనినయెడల నాయందు ప్రవేశించును. అనగా పరమానందస్వరూపుడేయగును అని తెలుపుచున్నారు.

ఇంకనూ ఆత్మానుసంధానమును గురించి,

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం, సర్వభూతాని చాత్మని ।
ఈక్షతేయోగ యుక్తాత్మా, సర్వత్రసమదర్శనః ॥

శ్లో॥ యోమాంపశ్యతిసర్వత్ర, సర్వంచమయిపశ్యతి ।
తస్యాహం నప్రణశ్యామి, సచమే నప్రణశ్యతి ॥

శ్లో॥ సర్వభూతస్థితం యోమాం, భజత్యేకత్వమాస్థితః ।
సర్వథావర్తమానోఽపి, సయోగీమయివర్తతే ॥

అనగా (అధ్యస్తస్వరూపములగునట్టి) భూతములన్నిటి యందును, సమత్వబుద్ధిగలవాడు, సమాహితాంతః కరణముగలవాడు, తన ఆత్మను సర్వభూతముల యందున్నదానిగను, సర్వభూతములును తనయందున్నట్లుగను (సమస్త భూతములను నాయందునను అనగా తన యందును, సర్వభూతముల యందును నన్నును, అనగా తనను) ఎవడు జూచునో అట్టి బ్రహ్మాత్మైక్యానుసంధానముగలవానికి, నేను (అనగా తన పరమార్థస్వరూపమగు పరమాత్మ

నై ననేను)పరోక్షముగా నుండను. అట్టివాడు నాకును(అనగా తనపరమార్థస్వరూపమునకు) పరోక్షముగా నుండడు. ఎవడు ద్వైతవర్జితుడై నన్ను(అనగా తనను) సర్వభూతములయందున్నవానినిగా జూచునో అట్టియోగి ఏప్రకారముగా నున్ననూ నాయందే యుండును. అనగా పరమాత్మనాసంస్థితుడుగానుండును.

అని శ్రీకృష్ణ పరమాత్మ ఆత్మానుసంధానలాభమును, స్వస్వరూపము, సర్వాధిష్ఠానముగను, జీవత్వప్రపంచములు అధ్యస్తములుగను, నున్న స్థితిని బోధించుచున్నారు. ఎట్లుచూచినను గీతాపరమతాత్పర్యము పరమార్థవాస్తవమున జీవాభిన్నమగు, సర్వాధిష్ఠాన, అఖండ, పరిపూర్ణ, చిద్ఘనానంద స్వరూపబోధయందే నిశ్చితమగుచున్నది. ఇదియే గీతాపరమతాత్పర్యము. తక్కినదంతయు సాధనోపాయములుగను, తద్విధానములుగను, మానవ శ్రేయస్సునకై బోధించుచున్నారు, శ్రీ కృష్ణపరమాత్మయే అర్జునునకు తన పరమార్థవాస్తవస్వరూపము అఖండ సచ్చిదానందస్వరూపమనియు, యీ జ్ఞానమే జీవునకు మోక్షదాయకమనియూ యోగవాశిష్ఠమందు తెలిపిన ఆఖ్యాయికను యిచట ముముక్షుజనోపయోగమునకుగాను విశదీకరించుచున్నాడను, కావున ముముక్షువులు సావధానచిత్తులై పరమతాత్పర్యమును గ్రహించుట యావశ్యకము. ఇట్లు గ్రహించి, చేయబడు సతతాభ్యాస పాటవమువలనగాని మానవునకు స్వస్వరూప జ్ఞానమును, జన్మకర్మములయొక్క రహస్యమును, బాగుగ తెలియదు. శ్రీకృష్ణభగవానులు ఇట్టి జ్ఞానమువలన జీవుడు, పరమాత్మయగు నాలోనేనైక్యమగునని—

శ్లో॥ జన్మకర్మచమేదివ్య, మేవంయోవేత్తి తత్త్వతః ।
త్యక్త్వాదేహంపునర్జన్మ, నైతిమామేతిసోఽర్జున ॥

అనగా ఎవడు దివ్యమైన యిట్టి తన జన్మమును, కర్మమును, నిజముగా తెలిసికొనునోవాడు యీదేహమును విడిచిన వెనుక మరల జన్మమును బొందడు. నాలోనైక్యమగును. అనగా అద్వితీయ, అఖండ, పరమాత్మస్వరూపుడేయగునని తెలుపుచు, మరియును—

శ్లో॥ భక్త్యామామభిజానాతి, యావాన్యశ్చాస్మి తత్త్వతః ।
తతోమాంతత్త్వతోజ్ఞాత్వా, విశతేతదనన్తరమ్ ॥

స్వస్వరూపధ్యానాను సంధాన శక్తిచేత, నేనుయెవరో, యెట్టివాడనో, అనగా తనను తానెవరో యథార్ధముగ తెలిసికొనును. తరువాత నాయందు ప్రవేశించును. అనగా పరమాత్మస్వరూపుడే యగునని గీతాచార్యుడైన శ్రీకృష్ణ పరమాత్మ తెలుపుచున్నారు.

భక్తియనగా, "స్వస్వరూపాను సంధానంభక్తిరిత్యభిధీయతే" యని శ్రీ శంకర భగవత్పాదులు నిర్వచించుచున్నారు.

—o—

# అర్జునునకు శ్రీకృష్ణ తత్త్వోపదేశము

శ్రీ యోగవాశిష్ఠమునందు అర్జునోపాఖ్యానములో సర్వము బ్రహ్మమే యను జ్ఞానము గలవానికి, సర్వ వ్యవహార కృత్యంబులును చిత్త విశ్రాంతికి బాధకంబులు కానేరవను బోధను, శ్రీకృష్ణ పరమాత్మ తన రూపద్వయమును జ్ఞాన యోగంబుల స్వరూపమును అర్జునున కుపదేశించిన సందర్భ శ్లోక, శ్లోక తాత్పర్యములను, ముముక్షు జనోపయోగకరముగ నుండునను, నుద్దేశ్యము తోడ నిచట సంగ్రహించుచున్నాడను:—

శ్లో॥ సర్వ సంకల్ప సంశాంతౌ, ప్రశాంత ఘనవాసనం,
నకించిద్భావనాకారం, తద్బ్రహ్మపరమం విదుః ॥

శ్లో॥ తదుద్యోగం విదుర్జ్ఞానం, యోగంచ కృతబుద్ధయః ।
బ్రహ్మ సర్వం జగదహం, చేతి బ్రహ్మార్పణం విదుః ॥

సమస్తమగు సంకల్పములును శాంతింపఁగానణఁగిపోయిన వాసనలు గలదియు, నేవిధమగు భావనయు లేనిదియునగు రూపమును పరబ్రహ్మ మునుగా నెరుంగుదురు. అట్టి బ్రహ్మము నెరుంగు నుద్యమము జ్ఞానమనియు, యోగమనియు చెప్పిరి. సమస్త జగంబును, నేనను బ్రహ్మమేయని యెంచుట బ్రహ్మార్పణమునుగా వచించిరి.

శ్లో॥ సామాన్యం పరమం చేతి, ద్వేరూపే విద్ధిమేనఘ ।
పాణ్యాదియుక్తం సామాన్యం, శంఖచక్ర గదాధరమ్ ॥
పరం రూపమనాద్యంతం, యన్మమైక మనామయం ।
బ్రహ్మాత్మ పరమాత్మాది, శబ్దైర్నైతదుదీర్యతే ॥

ఓపార్థా! నాకు సామాన్యమనియు, పరమమనియు రెండు రూపములు గలవు. అందు కరచరణాది యుక్తంబై శంఖచక్ర గదాదుల ధరించిన రూపము సామాన్యంబును, నాద్యంత రహితంబై యఖండంబగు రూపంబు పరమంబు నగుచున్నది. ఆ పరమ రూపమే బ్రహ్మము, ఆత్మ, పరమాత్మ మొదలగు శబ్దములచే చెప్పఁబడుచున్నది.

శ్లో॥ యావద ప్రతిబుద్ధ స్త్వ మనాత్మజ్ఞ తయాస్థితః।
తావచ్చతుర్భుజాకార, దేవపూజా పరోభవ॥

తత్రత్క-మాత్సంప్ర బుద్ధ స్త్వం, తతోజ్ఞాస్య సితత్పరం।
మమరూప మనాద్యంతం, యేనభూయో నజాయసే॥

నీవెంతవరకు నప్రబుద్ధుండవై యాత్మ స్వరూపము నెరుంగకుందువో అంతవరకునూ, నాలుగు చేతులుగల దేవతా స్వరూపమును పూజించుచుండుము. ఆ పూజా క్రమంబున ప్రబోధము నొంది యాద్యంత రహితమగు నాదు పరమ రూపమును నెరుంగఁగలవు. అందుచే మరల జననమొందవు.

శ్లో॥ నిర్మాన మోహాజిత సంగదోషా,
అధ్యాత్మ నిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వైర్వి ముక్తాస్సుఖదుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛంత్య మూఢాః పదమవ్యయంతత్॥

అహంకారము, తన్మూలమగు నజ్ఞానంబును లేని వారలును సంగ దోషమును జయించినవారలును, ఆత్మానుసంధానమందాసక్తి గలవారును, కామ రహితులును, సుఖదుఃఖాది ద్వంద్వ దోష విముక్తులు నగు విద్వాంసులు శాశ్వతంబగు నా బ్రహ్మ పదమును పొందుచున్నారు.

శ్లో॥ యస్యసర్వే సమారంభాః, కామ సంకల్ప వర్జితాః।
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం, తమాహుః పండితంబుధాః॥

ఎవ్వాని సమస్త కృత్యంబులును కామసంకల్ప రహితములో, ఎవ్వండు జ్ఞానాగ్నిచే సకల కర్మంబుల దహించినవాడో, వానిని పండితునిగా చెప్పిరి.

శ్లో॥ నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ।
యథా ప్రాప్తామ వర్తీచ భవ భూషిత భూతలః ॥

ఓ యర్జునా! నీవు ద్వంద్వ దోష రహితుండవును, ఎప్పుడును సత్త్వ గుణనిష్ఠుఁడవును, ఇష్టప్రాప్త్య నిష్ట నివృత్తులయందు తటస్థుండవును, ప్రమాద రహిత చిత్తుండవును నై ప్రాప్తించిన దాని ననుభవించుచు భూతలంబును ప్రకాశింపఁ జేయుచున్నవాఁడవగుము.

శ్లో॥ అజ్ఞానాదాత్మనస్స్వాధో సత్తామాయాతి వాసనా ।
ఆత్మజ్ఞానే మహా బోధాద్విలయం యాతివాసనా ॥

ఓ సాధువా! ఆత్మ నెరుంగనందువలన వాసన యుత్పత్తి నొందు చున్నది. ఆత్మజ్ఞానము కలుగఁగా పరిపూర్ణజ్ఞానము వలన నావాసన, నాశము నొందుచున్నది, అని తెలుపుచున్నారు.

ఇంకనూ గీతలలో "జ్ఞాన యజ్ఞః పరంతప, సర్వం కర్మాఖి లంపార్ధ జ్ఞానే పరి సమాప్యతే" జ్ఞాన యజ్ఞము సర్వోత్కృష్టమైనదనిన్నీ కర్మము లన్నియూ, మోక్ష సాధనమగు జ్ఞానమందే పరిసమాప్తి యగుననియూ, "నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" జ్ఞానముతో సమానముగా పవిత్రమగు వస్తువేదియునూ లేదనియూ శ్రీకృష్ణ పరమాత్మ తెలుపుచున్నారు. జ్ఞానమనగా ఆత్మజ్ఞానమనియే గ్రహించవలయును. ఆత్మజ్ఞానమనగా నేను ఆ పరమాత్మ ఒక్కటియే యని గురుశాస్త్ర ముఖమున తెలిసికొని, దాని మననాభ్యాసముల పాటవముచే స్వానుభవము నొందుటయే. ఇట్టి జ్ఞానికి "బ్రహ్మాండం గోష్పదాయతే" అనగా యీ బ్రహ్మాండ మంతయు గోపాదమని గ్రహించగలుగును. అనగా గోపదమును వలె తేలికగా సంసార మును దాటగలడని శ్రీ వశిష్ఠ భగవానులు తెలుపుచున్నారు.

మరియును, గీతా పరమ తాత్పర్యమును శ్రీకృష్ణ పరమాత్మ గీతలో పదమూడవ అధ్యాయమునందు చివర తెలుపుచున్న అయిదు శ్లోకములవలనను విస్పష్టపరచుచున్నారు. జిజ్ఞాసువుల, సులభగ్రహణమునకు గానువానిని సముదాయతాత్పర్యార్థము తోడ నిచట యుదాహరించుచున్నాడను—

శ్లో॥ యదాభూతపృథగ్భావ, మేకస్థమను పశ్యతి।
తత ఏవచవిస్తారం, బ్రహ్మ సమ్పద్యతే తదా॥

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వా, త్పరమాత్మాయమవ్యయః।
శరీరస్థోఽపికౌన్తేయ। నకరోతినలిప్యతే॥

శ్లో॥ యథాసర్వగతంసౌక్ష్మ్యా, దాకాశంనోపలిప్యతే।
సర్వత్రావస్థితోదేహే, తథాఽఽత్మానోపలిప్యతే॥

శ్లో॥ యథాప్రకాశయత్యేకః, కృత్స్నంలోకమిమంరవిః।
క్షేత్రంక్షేత్రీతథాకృత్స్నం, ప్రకాశయతిభారత॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ, మన్తరంజ్ఞానచక్షుషా।
భూతప్రకృతి మోక్షంచ, యేవిదుర్యాన్తితేపరమ్॥

అనగా యెప్పుడు భూతముల భేదమును అనగా యీ దృశ్యనానాత్వమును, వానియొక్క చిత్ర విచిత్ర నానా రూపములను ఒక్క యీశ్వరశక్తియగు ప్రకృతి యందున్న దానిగను, యీ భూతనానాత్వమంతయు మాయాకార్యమనియును నిశ్చయముతో యేజీవుడు చూడజాలునో అప్పుడు బ్రహ్మత్వమును బొందుచున్నాడు.

పరమాత్మ అనాది యగుటవలనను నిర్గుణమగుటవలనను, అవ్యయమైనది, అనగా నాశములేనిది కావున దేహమందున్నను కొంచమైనను దేనిని చేయుటలేదు. కర్మఫలములతో సంబంధమును బొందుటలేదు. అనగా పరమాత్మకర్తృత్వ భోక్తృత్వాదిరహితుడు అని అర్థము.

సర్వగతమగు నాకాశము సూక్ష్మభావముచే వస్తుసంబంధమువలన నెట్లులేపనము బొందుటలేదో యట్లే యొక్కటియగు ఆత్మ సర్వదేహముల యందున్నను ఆ యాయుపాధులయందలి గుణదోషముల సంబంధమును బొందునదికాదు. అనగా అసంగపదార్థము.

ఒక్క సూర్యుడు ప్రపంచమునంతయు నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో యట్లే క్షేత్రజ్ఞుడు అనగా పరమాత్మక్షేత్రములనన్నింటిని అనగా సర్వజీవరాశిని బాహ్యాంతరముల బ్రకాశింపఁ జేయుచున్నాడు. అనగా పరమాత్మ అఖండ స్వప్రకాశుడని అర్థము.

ఈ రీతిగా క్షేత్రక్షేత్రజ్ఞుల భేదమును అనగా జీవ, పరమాత్మల భేదమును జ్ఞానదృష్టిచే యెవరు తెలిసికొందురో, మరియు భూతములయొక్క ప్రకృతినుండి మోక్షమున కుపాయమగు పరమాత్మ ధ్యానాదికము లెవరు తెలిసికొందురో అట్టివారు మోక్షమునొందుదురు, అని యర్థము. ఇంకను పదునెనిమిదవ అధ్యాయమందు ఏబదియైదవ శ్లోకము వలన యిట్లు ధ్రువపరచుచున్నారు.

శ్లో॥ భక్త్యామామభిజానాతి, యావాన్యశ్చాస్మితత్త్వతః ।
తతోమాం తత్త్వతోజ్ఞాత్వా, విశతే తదనన్తరమ్ ॥

భక్తిచేత నేనెవరో అనగా తానెవరో యెట్టివాడో యథార్థముగ తెలిసికొనును. అట్లు నన్ను, అనగా తనను తాను తెలిసికొని తరువాత నా యందు ప్రవేశించును అనగా పరమానందస్వరూపుడేయగును. ఇచట భక్తియనగా శ్రీ శంకరులవారు "స్వస్వరూపానుసంధానం, భక్తిరిత్యభీయతే" యని నిర్వచించుచున్నారు.

గీతాచార్యులైన శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతయందెచటను నేను పీతాంబరధారుడననిగాని, శంఖచక్రగదాధరుడననిగాని, తన సగుణరూపమును నిర్దిష్టముగా తెలిపియుండలేదు. అయినను పరమాత్మ సగుణరూప ధ్యానాదులను మోక్షసాధనముగ అద్వైతసిద్ధాన్త మంగీకరించుచున్నది. కాని మోక్షప్రాప్తికి శ్రీ కృష్ణపరమాత్మ తన నిర్గుణస్వరూపమగు అద్వైతసిద్ధాన్తమునే పరమ తాత్పర్యముగ తెలుపుచున్నారు.

# బోధమాల

శ్లో॥ జ్ఞానమాత్ర స్వరూపోహం, జ్ఞాతృజ్ఞేయవివర్జితః ।
అఖండపరిపూర్ణోహం, సచ్చిదానందలక్షణః ॥

శ్లో॥ అహంసర్వ మిదంవిశ్వం, పరమాత్మాహమచ్యుతః ।
అఖండపరిపూర్ణోహం, నిర్మలాకాశవత్సదా ॥

శ్లో॥ నాహం దేహోనేన్ద్రియాణ్యంతరంగం,
నాహంకారః ప్రాణవర్గోన బుద్ధిః ।
దారాపత్యక్షేత్రవిత్తాదిదూర,
స్సాక్షీనిత్యః ప్రత్యగాత్మా శివోహమ్ ॥

శ్లో॥ నాహంజాతోనప్రవృద్ధోననష్టో,
దేహస్యోక్తాఃప్రాకృతాస్సర్వధర్మాః ।
కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తినాహం,
కారస్యైవహ్యాత్మనోమేశివోహమ్ ॥

శ్లో॥ మత్తోనాన్యత్కించిదత్రాస్తివిశ్వం,
సత్యం, బాహ్యం వస్తుమాయోపక్లృప్తమ్ ।
ఆదర్శాంతర్భాసమానస్యతుల్యం,
మయ్యద్వైతే భాతితస్మాచ్ఛివోహమ్ ॥

శ్లో॥ మనోహిజగతాంకర్తృ, మనోహిపురుషఃపరః ।
మనఃకృతం కృతంలోకే, నశరీరకృతంకృతమ్ ॥

శ్లో॥ సంసారోమనసాపుంసః, కల్పితోఽస్తినవస్తుతః,
మనశ్శూన్యేసుషుప్త్యాదౌ, సంసారోనైవదృశ్యతే ॥

శ్లో॥ మమపుత్రామమధన, మయంసోహమిదంమమ ।
ఇతీయమింద్రజాలేన, వాసనైవాభివల్గతే ॥

శ్లో॥ నిస్సంగవ్యవహారిత్వా ద్భవభావనవర్జనాత్
శరీరనాశదర్శిత్వా ద్వాసనా న ప్రవర్తతే ॥

శ్లో॥ మాయామాత్ర మిదంసర్వం, విశ్వంబ్రహ్మణికల్పితమ్ ।
జపా కుసుమసాన్నిధ్యా, ద్రక్తత్వం స్ఫటికేయథా ॥

శ్లో॥ భ్రాంతిమాత్రమిదంవిశ్వం, కల్పితం చిత్త విభ్రమాత్ ।
స్థాణౌపురుషవద్భ్రాంత్యా, విశ్వం బ్రహ్మణికల్పితమ్ ॥

శ్లో॥ భ్రాంతిమాత్రమిదం సర్వం, కల్పితం చిత్తవిభ్రమాత్ ।
స్వాత్మజ్ఞానంవినావిద్వాన్, జగద్భ్రాంతిర్నన శ్యతి ॥

శ్లో॥ దీర్ఘస్వప్నమిదంవిశ్వం, విశ్వం బ్రహ్మణికల్పితమ్ ।
నామరూపమిదం సర్వం, రజ్జౌసర్పఇవోదితమ్ ॥

శ్లో॥ కరోతుభువనేరాజ్యం, విశత్వాకాశమంబువా ।
స్వాత్మలాభాదృతేవిద్వాన్, విశ్రాంతింనాధిగచ్ఛతి ॥

శ్లో॥ నాహంజ్ఞేయమితిధ్యాయన్, తిష్ఠత్వమచలస్తథా ।
అనన్తాకాశసంకాశ, హృదయోహృదయేశ్వరే ॥

శ్లో॥ బ్రహ్మైవపంచభూతాని, బ్రహ్మైవ సకలం జగత్ ।
బ్రహ్మసత్యం జగన్మిథ్యా, బ్రహ్మభిన్నంనకించన ॥

శ్లో॥ అహంసర్వమిదం విశ్వం, పరమాత్మాహ మచ్యుతః ।
అహంకారాభిధాయాసా, కల్పితానతు వాస్తవీ ॥

శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే, సచ్చిదానందలక్షణే ।
అహంకర్తాహ్యహం భోక్తా, ఇతిభ్రాంతిర్వినశ్యతి ॥

శ్లో॥ మమపుత్రామమధన, మయంసోహమిదంమమ।
ఇతీయమింద్రజాలేన, వాసనై_వాభివల్గతే॥

శ్లో॥ నిస్సంగవ్యవహారిత్వా ద్భవభావనవర్జనాత్
శరీరనాశదర్శిత్వా ద్వాసనా న ప్రవర్తతే॥

శ్లో॥ మాయామాత్ర మిదంసర్వం, విశ్వంబ్రహ్మణికల్పితమ్।
జపా కుసుమసాన్నిధ్యా, ద్రక్తత్వం స్ఫటికేయథా॥

శ్లో॥ భ్రాంతిమాత్రమిదంవిశ్వం, కల్పితం చిత్త విభ్రమాత్।
స్థాణౌపురుషవద్భ్రాంత్యా, విశ్వం బ్రహ్మణికల్పితమ్॥

శ్లో॥ భ్రాంతిమాత్రమిదం సర్వం, కల్పితం చిత్తవిభ్రమాత్।
స్వాత్మజ్ఞానంవినావిద్వాన్, జగద్భ్రాంతిర్ననశ్యతి॥

శ్లో॥ దీర్ఘస్వప్నమిదంవిశ్వం, విశ్వం బ్రహ్మణికల్పితమ్।
నామరూపమిదం సర్వం, రజ్జౌసర్పఇవోదితమ్॥

శ్లో॥ కరోతుభువనేరాజ్యం, విశత్వాకాశమంబువా।
స్వాత్మలాభాదృతేవిద్వాన్, విశ్రాంతింనాధిగచ్ఛతి॥

శ్లో॥ నాహంజ్ఞేయమితిధ్యాయన్, తిష్ఠత్వమచలస్తథా।
అనన్తాకాశసంకాశ, హృదయోహృదయేశ్వరే॥

శ్లో॥ బ్రహ్మైవపంచభూతాని, బ్రహ్మైవ సకలం జగత్।
బ్రహ్మసత్యం జగన్మిథ్యా, బ్రహ్మభిన్నంనకించన॥

శ్లో॥ అహంసర్వమిదం విశ్వం, పరమాత్మాహ మచ్యుతః।
అహంకారాభిధాయాసా, కల్పితానతు వాస్తవీ॥

శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే, సచ్చిదానందలక్షణే।
అహంకర్తాహ్యహం భోక్తా, ఇతిభ్రాంతిర్వినశ్యతి॥

శ్లో॥ స్థాణౌపురుషవద్భ్రాంత్యా, కృతాబ్రహ్మణి జీవతా।
జీవస్యతాత్త్వికే రూపే, తస్మిన్దృష్టేనివర్తతే॥

శ్లో॥ చిన్మాత్రమమలంశాన్తం. నామరూపవివర్జితమ్ ।
అఖండం పరిపూర్ణంచ, చిదాకాశముపాస్మహే ॥

శ్లో॥ అఖండ పరమాకాశం, నామరూపవివర్జితమ్ ।
చిన్మాత్రమమలంనిత్యం, చిదాకాశముపాస్మహే ॥

శ్లో॥ జ్ఞానమాత్రస్వరూపోహం, పరావరవివర్జితః ।
అఖండపరిపూర్ణోహం, సర్వదాదహరేస్థితః ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోహం, మహాకాశఇవస్థితః ।
అఖండ పరిపూర్ణోహం, జ్ఞానమాత్రస్వరూపతః ॥

శ్లో॥ జ్ఞానమాత్ర స్వరూపోహం, జ్ఞాతృజ్ఞేయవివర్జితః ।
అఖండపరిపూర్ణోహం, సర్వదాదహరేస్థితః ॥

శ్లో॥ సర్వసాక్షీప్రత్యగాత్మా, సర్వతేజోవభాసకః ।
అఖండపరిపూర్ణోహం, పరమాత్మాహమచ్యుతః ॥

శ్లో॥ ప్రత్యగాత్మాపరంజ్యోతిః, పరమాత్మాహమచ్యుతః ।
నిత్యస్సర్వగతస్థాణు, రచలోహం సనాతనః ॥

శ్లో॥ ఆధ్యాత్మజ్ఞాననిత్యత్వం, తత్త్వజ్ఞానార్ధ దర్శనమ్ ।
ఏతత్జ్ఞానమితిప్రోక్త, మజ్ఞానంయదతోఽన్యథా॥

శ్లో॥ చిదాకాశమిదం సర్వం, సర్వం బ్రహ్మేతినిశ్చయాత్ ।
నిశ్చింతో విగతాభీష్టః, స్థితస్సన్నచలోభవ ॥

శ్లో॥ విచార్యార్యైస్సహాలోక్య, శాస్త్రాణ్యధ్యాత్మభావనాత్ ।
సత్తాసామాన్య నిష్ఠత్వం, యత్తద్ బ్రహ్మపరం విదుః ॥

శ్లో॥ సర్వసంకల్ప సంశాంతౌ, ప్రశాంతఘనవాసనమ్।
నకించిద్భావనాకారం, తద్బ్రహ్మపరమం విదుః॥

శ్లో॥ శుద్ధమాత్మాన మాలింగ్య, నిత్యమంతస్థయాధియా।
యఃస్థిత స్తంకమాత్మానం, భోగో బంధయితుంక్షమః॥

శ్లో॥ శుద్ధేన బోధ్య బోధేన, స్వాత్మజ్ఞానమయాత్మనా।
సుఖదుఃఖాదినా స్తీతి, జ్ఞాతే జ్ఞేయాతి సౌమ్యతామ్॥

శ్లో॥ సర్వమేవచిదాకాశం, బ్రహ్మేతిఘన నిశ్చయే।
స్థితిం యాతే శమంయాతి, జీవోనిస్స్నేహ దీపవత్॥

శ్లో॥ అనన్దం బ్రహ్మణోవిద్వాన్, నబిభేతికుతశ్చన।
విముక్తస్సర్వపాపేభ్యో, పరమాప్నోతిపూరుషః॥

శ్లో॥ ఆత్మానంచే ద్విజానీయా, దయమస్మీతి పూరుషః।
విముక్తస్సర్వపాపేభ్యో, బ్రహ్మాప్నోతి పరంసుఖమ్॥

శ్లో॥ పరంపురుషమాప్నోతి, పశ్యన్నాత్మానమాత్మని।
యతఃపరంనచైవా స్తి, తత్సుఖం ప్రాప్నుయాత్సదా॥

శ్లో॥ కిలతూష్ణింస్థితేనైవ, తత్పరం ప్రాప్యతే పరమ్।
పరమం యత్రసామ్రాజ్య, మపిరామతృణాయతే॥

శ్లో॥ సర్వంజగదిదంశాంత, మన న్తంధ్రువమవ్యయమ్।
పశ్యన్ భూతార్థచిద్రూపం, శాంత ఆస్వ యథాసుఖమ్॥

శ్లో॥ జ్ఞానసారమిదంపుణ్యం, మోహహ్రాసమసుధీకృతమ్।
యేపఠ న్తిసదాభక్త్యా, తత్సుఖంప్రాప్నువ న్తితే॥

ముముక్షువులకు యిందు ప్రతి ఒక్క శ్లోకమును తత్త్వవివేచనానుసంధానము లకు రత్నమువంటిది. కేవల శబ్దగ్రహణమువలన నివి యెంతసులభముగ

నగుపడినను, వీటిభావార్థము శాస్త్ర గంభీరమైయున్నది. కావున జిజ్ఞాసువులు వీటిభావార్థ ప్రయోజనమును సద్గురుముఖమున గ్రహించి వారివారి సతతాభ్యాసపాటవములచే తల్లాభమును బడయుదురుగాక.

ఎంతటిమేధావులకైనను, నీపరమార్థసిద్ధి నిరంతరసాధనాభ్యాసములు లేనిది గలుగదు. అభ్యాసమువలన సర్వసిద్ధులునూ చేకూరును. ఇదివేదశాసనము అను ఈ అర్థమునే—

శ్లో॥ అభ్యాసాత్సర్వ సిద్ధిః, స్యాదితి వేదాను శాసనమ్।
తస్మాత్త్వం సర్వముత్సృజ్య, కుర్వభ్యాసేస్థిరంమనః॥

అని వశిష్ఠభగవానులు శ్రీరామచంద్రమూర్తికి, నుపదేశించుచున్నారు. కావున జ్ఞానాభ్యాసకులగు జిజ్ఞాసువులిట్లు అభ్యాసలాభమును బాగుగ గ్రహించి వారి, వారి, సతతాభ్యాసాదుల నాచరించుచుందురుగాక.

———o———

# ఆత్మానుసంధాన రహస్యము

ఆత్మానుసంధాన మనగా మానవుడు తన నిత్యనిరతిశయ సుఖప్రాప్తికి గాను, ఆత్మస్వరూపమును గుర్వీశ్వరానుగ్రహములతోడ, శాస్త్రమువలన బాగుగగ్రహించి, స్వానుభవము నొందుటకుగాను, తల్లక్షణములను స్వాత్మాభిన్నముగ వృత్తిగోచరము గావించుకొని సర్వదా మరల మరల యనుకొనుచుండుట. "సోయందేవదత్తః" అనగా ప్రథమమున ఆ దేవదత్తుని స్వరూపలక్షణములను తెలిసికొనినగదా? ఆ దేవదత్తుడే యీ దేవదత్తుడని తెలిసికొనుటకు సాధ్యమగును? కానిచో వీలుగాదుగదా? అట్లే జ్ఞానాభ్యాసకుడు ఆత్మలక్షణములను బాగుగ తెలిసికొనవలసియున్నది. ఇట్లు తెలిసికొనుటకు శాస్త్రమే ఆధారముగాని మరియొకదారిలేదు. ఏలనన ఇది ప్రపంచ విషయముల లాగున యింద్రియగోచరముగాదు. కావున శాస్త్రమువలననే దీనిని గ్రహించవలసియున్నది. దీనిని అనగా యీ ఆత్మను సంస్కరింపబడిన మనసువలననే గ్రహించి స్వానుభవము నొందవలయునుగాని మరివేరుదారిలేదు. కావున ముముక్షువులగువారు సాధనచతుష్టయసంపత్తి కొరకు చిత్తశుద్ధిని సంపాదించి తత్స్వరూపమునందు ప్రీతినిశ్చయములనొంది యీ ఆత్మాను సంధానాభ్యాసము ప్రారంభించుటయందే శాస్త్రితాత్పర్యము.

ముముక్షువగునట్టి జిజ్ఞాసువునకు తన పరమార్ధ స్వరూపమును తెలిసికొనుటకు యెచటకునూ పోనవసరములేదు. సర్వదేశ సర్వకాలములయందు సాధ్యము. ఏలనన జీవునకు తన వాస్తవ స్వరూపము సర్వాధిష్ఠానమగునట్టి బ్రహ్మ స్వరూపము. ఇదినిర్వికార అఖండ పరిపూర్ణ శుద్ధచైతన్య మాత్రము. ఇందులకు ద్రవ్యమక్కరలేదు. కాయక్లేశములేదు. ఈ బ్రహ్మ స్వరూపము సర్వోపాధి వినిర్ముక్త, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, సజాతీయ విజాతీయ స్వగత బేధరహిత, అద్వితీయ, నిర్వికార, అసంగ, జగదుత్పత్తిస్థితిలయ

వివర్త, అభిన్న నిమిత్తోపాదానకారణ, అఖండ, పరిపూర్ణానంద, చైతన్య స్వరూపము. ఇదియేతాను, అనగా నేను అని ముముక్షువు గ్రహించవలెను. తనవెలుపల, లోపల, క్రింద, పైనయున్న కేవలచైతన్య స్వరూపమంతయు తనస్వరూపమే. తాను లేని, దేశ, కాల, వస్తువులుగాని, అవస్థలుగానిలేవు. కావుననే "అందుగలనిఁడు లేనని సందేహమువలదు, నేను సర్వోపగతిన్ । ఎందెందు వెదకిచూచిన నందందెగలను నాదు మోహము వీడన్" అని ముముక్షువు తన పరిపూర్ణత్వమును చైతన్యస్వరూపముగ సర్వదా అనుసంధించుచుండవలయును.

ముముక్షువు అనుసంధాన మెట్లుండవలెననిన - నాహంచిదాభాసః, అహంచిదేవ, అహంసాక్షీ, ప్రత్యగాత్మా, పరమాత్మైవ,

శ్లో॥ చిదేవ పంచభూతాని, చిదేవభువనత్రయం।
చిదేవాహం చిదేవాన్యత్, చిద్భిన్నం నచకించన॥

(చిత్ అనగా జ్ఞానము)

శ్లో॥ చిదాకాశ స్వరూపోహం, నామరూప వివర్జితః ।
అఖండపరిపూర్ణోహం, జ్ఞానమాత్రస్వరూపతః ॥

అని తన పరమార్థ వాస్తవస్వరూపమును సత్యజ్ఞానానంత లక్షణములచే సదా మననము చేయుచుండవలయును. ఇట్లు మననముగావించుచు యీ శరీర త్రయమునను, యీ సర్వదృశ్యమందునను తాను వాస్తవముగ నేదియునూ కానను నిశ్చయముతో తన పరమార్థస్వరూపమును అవస్థాత్రయాబాధితమై త్రైకాలికా పరిచ్ఛిన్నమగునట్టి, అఖండ, స్వప్రకాశ, పరిపూర్ణ, చిదానంద స్వరూపమను దృఢనిశ్చయముతో సర్వదా అనుసంధానము చేయుచుండవలయును. దీనికి నెచటకునూ పోనవసరములేదు. తానున్నచోటుననే చేయవచ్చును.

## —: నేను అను ప్రత్యయమునకు వాస్తవికార్థము :—

"అహం" నేను అను ప్రతీతియొక్క వాస్తవికార్థమేమనిన, నిట్లు గ్రహించవలయును. నేను మూర్తామూర్త స్వశరీర సర్వోపాధి వినిర్ముక్త, నిత్య, నిరతిశయ, అద్వితీయ, అసంగ, జగదుత్పత్తి స్థితిలయ వివర్త అభిన్న నిమిత్తోపాదానకారణ, స్వప్రకాశ, సర్వాధిష్ఠాన, అఖండపరిపూర్ణ, సచ్చిదానందస్వరూపుడను. ఇదియే నిర్వికార, అఖండపరిపూర్ణ చైతన్యము, ఇదియేనా పరమార్థ వాస్తవస్వరూపమని తెలిసికొని, ముముక్షువు, సర్వదా యీ స్వరూపమునే స్వాత్మాభిన్నముగ ప్రీతినిశ్చయములతోడ అనుసంధానము చేయుచుండవలయును. ఇంకనూ ఏ సత్పదార్థము జగత్కారణమో, ఏది జరామరణవర్జితమో, ఏది నిత్యనిరతిశయ పరిపూర్ణమో, ఏది స్వప్రకాశమో, ఏ ప్రకాశములేనిచో సూర్యచంద్రాదులు ప్రకాశింపజాలరో, ఏ ప్రకాశముచేత సూర్యచంద్రాదులునూ, యీ సర్వమును భాసించుచున్నదో, ఏది నిరవయవమో, ఏది నిశ్చలమో, ఏది అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమో, ఏది సత్యజ్ఞానానంతలక్షణమో, ఏది సచ్చిదానందలక్షణమో, అట్టి నిత్య నిర్వికార, పరిపూర్ణ జ్ఞానమాత్ర స్వరూపుడను నేను అని స్వాత్మాభిన్నానుసంధానము నాచరించుచుండవలయును. ఇదియే జీవునకు పరమ ముక్తిసాధనము.

ముముక్షు జనోపయోగమునకుగాను, యోగవాశిష్ఠమున వశిష్ఠభగవానులు శ్రీ రామచంద్రమూర్తికి నుపదేశించిన ఆత్మానుసంధానక్రమము నిచట యుదాహరించుచున్నాడను.

శ్లో॥ నిత్యానందం సమస్తజ్ఞం, పరం పరమ కారణమ్ ।
నిత్యం సర్వగతం శాంతం, నిరవద్యం నిరంజనమ్ ॥

శ్లో॥ నిష్కలం నిష్క్రియం శుద్ధం, తద్బ్రహ్మాస్మి పరంపదం ।
కేవలం సత్య సంకల్పం; శుద్ధం బ్రహ్మాస్మ్యహం పరమ్ ॥

శ్లో॥ పుణ్యపాప వినిర్ముక్తం, కారణం జగతః పరం ।
అద్వితీయం పరంజ్యోతి, ర్బ్రహ్మాస్మ్యానందమవ్యయమ్ ॥

శ్లో॥ ఏవమాదిగుణైర్యుక్తం, సత్త్వాదిగుణవర్జితం ।
అభీష్టం సకలంబ్రహ్మ, సదాధ్యాయేత్సు కర్మకృత్ ॥

నేను నిత్యంబును, సర్వగతంబును, శాంతంబును, అనింద్యంబును, నిష్కలంబును, నిష్క్రియంబును, శుద్ధంబునగు బ్రహ్మంబునగుదును. మరియు నేను పుణ్యపాపవినిర్ముక్తంబును, జగత్కారణంబును అద్వితీయం బునునగు బ్రహ్మంబునగుదును. అని యిట్లు ముముక్షువు గురుశుశ్రూషాది పరుండై సత్త్వాదిగుణరహితంబగు బ్రహ్మంబు నెపుడు (స్వాత్మాభిన్నముగ) ధ్యానించుచుండవలయునని వశిష్ఠభగవానులు యోగవాశిష్ఠమందు తెలుపు చున్నారు.

ఏ జీవునకును ఆత్మపదార్థము తనకంటె వేరుగాదు. కావున జిజ్ఞాసు వులు యీ రహస్యమును బాగుగ సద్గురువులవలన శాస్త్రీయముగ గ్రహించి ఆత్మానుసంధానమును సర్వదా స్వాత్మాభిన్నముగ చేయుటయే పరమశ్రేయో దాయకము, శీఘ్ర అపరోక్ష సిద్ధిదాయకమని శాస్త్రము తెలుపుచున్నది. ఈ ఆత్మానుసంధానాభ్యాసమును ముముక్షువులు అన్వయ వ్యతిరేకక్రమములను రెండువిధములుగను నభ్యసించవచ్చును. అన్వయక్రమమనగా సర్వము తానే నని తన సర్వాధిష్ఠానత్వము గుర్తించి తానే యీ జగదధిష్ఠానమనియు, యీ సర్వము కల్పితమాత్రముగ తనయందే యున్నదనియు, కాని వాస్తవమున నున్నది తన అఖండ పరిపూర్ణానందస్వరూపమేననియు బాగుగ తెలిసికొని ఆత్మాను సంధానాదుల గావించుచుండుట. వ్యతిరేకక్రమమనగా యీ స్వశరీర సర్వప్రపంచము అవాస్తవమై అధ్యస్తముగనున్నది గనుక యీ అధ్యస్త ప్రపంచరూపముననున్నదేదియు అనగా సర్వప్రపంచమును తాను కానను నిశ్చయముతో తన వాస్తవ స్వరూపము నిష్ప్రపంచ పదార్థమగు ఆ పర

మాత్మ స్వరూపమేనని స్వాత్మాభిన్నముగ అనుసంధానాదుల చేయుచుండుట. ఒకటి సర్వాత్మ భావనా రూపము. మరియొకటి సర్వ ప్రపంచ నిషేధరూపము. ఎట్లయినను తన నిర్విశేష సర్వాధిష్ఠాన రూపమును గ్రహించుట యావశ్యకము. ముముక్షువులకు పై రెండు విధానములును గ్రాహ్యములే. అభ్యాస గ్రహణ సౌకర్యమును బట్టి యెట్లభ్యసించినను ఒక్కటియే. శాస్త్రము రెండు విధములుగను బోధించుచున్నది. ఈ అభ్యాస పరిపాకముచే కలుగునదే తత్త్వ జ్ఞానము. తత్త్వజ్ఞానబలమే సమాధ్యభ్యాసమునకు సాధనమగును. ఈ సమాధి యనగా ప్రాణ నిరోధముచేసి, ఊరక పద్మాసన స్థితుడై కూర్చుండుట కాదనియూ,

శ్లో॥ సమాహితా నిత్యతృప్తా యథా భూతార్థ దర్శినీ ।
సాధో సమాధి శబ్దేన పరా ప్రజ్ఞోచ్యతే బుధైః ॥

శ్లో॥ అక్షుబ్ధా నిరహంకారా ద్వంద్వేష్వ ననుపాతినీ ।
ప్రోక్తా సమాధి శబ్దేన మేరోః స్థిరతరా స్థితిః ॥

శ్లో॥ నిశ్చింతా విగతాభీష్టా హేయోపాదేయ వర్జితా ।
ప్రోక్తా సమాధి శబ్దేన పరిపూర్ణా మనోగతిః ॥

శ్లో॥ తత్త్వావబోధో భగవన్ సర్వాశాతృణపావకః ।
ప్రోక్తస్సమాధి శబ్దేన నచతూష్ణీ మవస్థితిః ॥

అనగా సుస్థిరంబును యదార్థ దృష్టియుతంబునునగు పరమార్థజ్ఞానము సమాధి శబ్దముచే చెప్పబడును. సంక్షోభరహితంబును, అహంకార వినిర్ముక్తంబును ద్వంద్వదోషరహితంబును, మేరువుకంటె స్థిరంబునగు నిలకడ సమాధిశబ్దముచే చెప్పబడుచున్నది. చింతారహితంబును, వాంఛాముక్తంబును, హేయోపాదేయ వర్జితంబును, పరిపూర్ణంబును, నగు మనోగతి సమాధిశబ్దముచే చెప్పబడుచున్నది. కాని పద్మాసనస్థుండై కూర్చుండియున్నను, బ్రహ్మాంజలి చేయు

చున్నను, చిత్తము విశ్రాంతినొందని వానికి సమాధి యెట్లుకలుగును. సమస్త ఆశలను తృణములకు నగ్నియగు "తత్త్వజ్ఞానము" సమాధిశబ్దముచే చెప్ప బడునుగాని ఊరకయుండుట మాత్రము సమాధి శబ్దముచే చెప్పబడనేరదని శ్రీ వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు.

ఈ సమాధ్యభ్యాసము జీవునకు తన నిత్య నిర్వికార అఖండ పరిపూర్ణ స్వరూపగ్రహణము వలన గాని సాధ్యముకాదు. ఇట్లు గావించుటకు దృశ్య నానాత్వజ్ఞానము అడ్డు వచ్చుచుండును. కాని ఈ నానాగాగనుబడు దృశ్య మంతయు నామరూపమాత్రమేగాని వాస్తవ పదార్థముగాదు. వాస్తవమున నున్నది సద్రూపముననున్న ఒక్క ఆత్మపదార్థమేగాని తదితరమేదియును లేదు. అయినను మృత్తు ఒక్కటేయైనను, బాన, కుండ, చట్టి, మూకుడు, యను భేదములతో కేవల నామరూపమాత్రములవలన యెట్లు నానాగా తెలియబడు చున్నదో అట్లే యీ ప్రపంచమని తెలిసికొనుటకు "యథాసౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యం" అను శ్రుతివచనము ప్రమాణము. ఇదిగాకను ఒక్కటియగు మహాసముద్రజలమే అవస్థాభేద మాత్రమున కల్పితములగు నానాలవణఖండములుగ మారుచున్నదిగదా! కేవల జలమే దానిస్వభావ అవస్థాభేదములనుబట్టి మంచుగడ్డలుగను ఉప్పురాళ్ళుగను, మారుచు గురుత్వ, కాఠిన్య, రుచులతోగూడ వ్యవహారప్రయోజకమగుచున్నది గదా! జ్ఞానాభ్యాసకుడు తన యుపాధిగూడ నిట్టిదియేయని ఆత్మవిచారాదుల వలనగ్రహించి తన పరమార్థ వాస్తవ స్వరూపము అద్వితీయ అఖండ స్వరూప మని నిశ్చయము నొందవచ్చును. అట్టితరి తానుచేయు సతతానుసంధానాభ్యాస పాటవముచే తన పరిచ్ఛిన్నోపాధిని చిత్సాగరమందుంచగల సామర్థ్యముగలిగి, అనగా తాను చిదాకాశ స్వరూపుడనేనని భావించగలుగును. ఇట్టి నిరంతర భావనాపటిమయే సిద్ధికి సాధనము. ఈ విషయము "భావనాదార్ఢ్యాత్సిద్ధిః" అను పాతంజల సూత్రము తెలుపుచున్నది. ఇట్టి భావనకాలక్రమమున లవణఖండము

వంటి తన యుపాధిని చిన్మహాసముద్రమందు లయింపజేసి తాను చిత్సాగరమే యగును. తనగా తానప్పుడు అఖండ పరమానందస్వరూపుడే యగును. అట్టితరి సర్వము తానేగాని స్వాత్మభిన్నముగ నేదియు కనుబడదు. ఇట్టిస్థితినే "సర్వ మాత్మైవాభూత్." "కేనకంపశ్యేత్, కేనకంజిఘ్రేత్, ఏకత్వమను పశ్యతః," అని శ్రుతి అనువాదము చేయుచున్నది. కాన జ్ఞానాభ్యాసులగు జిజ్ఞాసువు లీరహస్యములను మెలకువతోడ గ్రహించి, వారి అభ్యాసాదుల నాచరించు చుండుట శీఘ్రఫలప్రదము, సాక్షాన్ముక్తి సాధనమని గ్రహింతురుగాక.

కాని ఈవిద్యాప్రాప్తి చిరకాల,సతతాభ్యాసమువలనగాని సాధ్యముగాదు. ఇచట జ్ఞానాభ్యాసకులు ముఖ్యముగ మరియొక రహస్యమును బాగుగ గుర్తించ వలసినదేమి యనిన, యీ విద్యా గ్రంథములను చదివిన మాత్రమునను, వినినమాత్రమునను, లేక శబ్దార్థములను బాగుగ గ్రహించగలిగిన మాత్ర మునను యీ విద్యాప్రాప్తి కలుగుట దుర్లభము. కాని మరియెట్లుప్రాప్తించు ననిన దీర్ఘకాల, సదాచార, సత్కర్మానుష్ఠానాదులచే గుర్వీశ్వరానుగ్రహమును, చిత్తశుద్ధిని సంపాదించి యీ విద్యాలాభమందు ప్రీతినిశ్చయములనొంది తాను చేయునట్టి చిరకాల సతతాత్మానుసంధానాభ్యాసాదుల పాటవముచే కాల పరిపాకమున ప్రారబ్ధాంతమందు తప్పక అఖండ చిత్స్వరూపానందప్రాప్తి కలుగునుగాని వేరుమార్గములేదు. కావుననే ముముక్షువులకు స్వాత్మ జ్ఞాన రూప స్వస్వరూపాను సంధానాదులావశ్యకమగుచున్నవి. ఈ జ్ఞానాభ్యాసము వలనగాని అజ్ఞానముచే కలిగిన సకల నామరూప ప్రపంచము వాస్తవము గాదను నిశ్చయము కలుగదు. స్వశరీరాది సర్వప్రపంచము సత్యమను భ్రాంతి స్వాత్మజ్ఞానమువలన నశించునని "అజ్ఞానప్రభవం సర్వం, జ్ఞానేన ప్రవి లీయతే'' అనిన్నీ, చిరకాల నిర్గుణాత్మానుసంధాన నిత్యాభ్యాసమువలనగాని సచ్చిదానందమైన ఆత్మను పొందవీలుగాదనియు, జిజ్ఞాసువులిట్లాచరించుటే, శ్రేయస్సాధనమనియు,

శ్లో॥ నిత్యాభ్యాసాదృతేప్రాప్తి, ర్నభవేత్సచ్చిదాత్మనః ।
తస్మాద్బ్రహ్మ నిదిధ్యాసో, జిజ్ఞాసు శ్రేయసే చిరమ్ ॥

అని శ్రీ శంకరభగవత్పాదులు స్పష్టముగ బోధించుచున్నారు. ఈ విషయమునే "సనిశ్చయేన యోక్తవ్యో, యోగోఽ నిర్విణ్ణచేతసా." అనగా జిజ్ఞాసువులు యోగసాధనములగు అనుసంధానాదులను విసుగు జెందని మనసుతోడ, పట్టుదలతో నభ్యసించవలయునని గీతలయందు శ్రీ కృష్ణపరమాత్మ తెలుపుచున్నారు.

కావున జిజ్ఞాసువులు ఈ విద్యాభ్యాసమును విసుగుజెందక చిరకాలము నాచరించుచుండుట యీ విద్యాప్రాప్తికావశ్యకమని గ్రహింతురుగాక. ఇచట నున్న రహస్యమేమియనిన, ఎంతటి ప్రయత్నముచేసియైనను అభ్యాసకుడు తన సర్వాధిష్ఠాన అఖండ, జ్ఞాన, పరిపూర్ణత్వమును గ్రహించి స్వానుభవము నొందవలసియున్నది. ఇట్టివారి స్వస్వరూపానుసంధానము సారాంశమున యెట్లుండవలెననిన—

ఈ శరీరోపాధి తన అజ్ఞానకాలములో నేర్పడియున్నట్టి తన ప్రారబ్ధ కర్మ ఫలానుభవక్షయము నొందుటకుగాను కల్పితమైన యొక ఉపకరణము అనగా సాధనమేగాని యీ యుపాధి తాను గాననియు, యీ కర్తృత్వ భోక్తృత్వానుభవములు కల్పితములగుచు తన ప్రారబ్ధాంతము వరకు నిమిత్త మాత్రముగ సుఖ, దుఃఖ, భోగానుభవముల నిచ్చుచుండునుగాని వీనితోడ తనకెట్టి వాస్తవ సంబంధము లేదనియు, జగన్మిధ్యాత్వ జ్ఞాననిశ్చయముతోడ తన పరమార్ధస్వరూపమును బాగుగ గ్రహించి తన పరమార్ధ వాస్తవ స్వరూపము నిట్లు, తానేపనిచేయుచున్నను సర్వదా అనుసంధానము చేయుచుండవలయును. "అహమ్," నేను స్వప్రకాశ, నిత్య, నిర్వికార, అఖండ పరిపూర్ణ, చిద్ఘనానంద స్వరూపుడనియు, యీ స్వరూపము నిర్మలమహాకాశము వంటి చిదాకాశ మనియు,తాను అచలుడై సంవిత్ మహాశిలవంటివాడనియు, నిర

వయవుడు, నిష్క్రియుడు గనుక తనకు వాస్తవమగునట్టి కర్తృత్వ, భోక్తృత్వ ములు లేవనియు నిశ్చయము నొందవలెను. తానే యీ స్వశరీర సర్వప్రపంచ సర్వాధిష్ఠానమగు అఖండానందస్వరూపము. ఇదియే ఆత్మ. ఇదియే కేవల ఆనందరూపమని "ఆత్మైవానందః" అను శ్రుతిబోధించుచున్నది. "ఆనన్దో బ్రహ్మేతివ్యజానాత్" అను శ్రుతి వాక్యము వరుణకుమారుడగు భృగువు విచారించి, విచారించి, కడకు యీ ఆనందమే బ్రహ్మయని తెలిసికొనినట్లు తెలుపు చున్నది. కావున జిజ్ఞాసువులు ఆత్మ, ఆనందము, బ్రహ్మ, ఒక్కటియేయని గ్రహించి వారి పరిపూర్ణాఖండానంద ప్రాప్తికి ఈ విధముగ నిరంతర స్వస్వరూపాను సంధానాభ్యాసాదుల చేయుచుండుట యావశ్యకము.

కాని యిచట కొందరు జిజ్ఞాసువులకు కూడ నొక సంశయము తోచ వచ్చును. ఏదియనిన — ఆ పరమాత్మస్వరూపము, నేనును ఒక్కటి యేయని గ్రహించి నిశ్చయమునొందినను, వ్యవహారులగువారికి అనగా దేహధర్మ ములతో నున్నవారికి యీ జీవబ్రహ్మైక్యానుసంధానమును నిరంతరముగ నభ్యసించుటయనునది సాధ్యమా? అని, ఇట్లాచరించుట సాధ్యము అనుమాట నిస్సందేహము. కాని ఏవిషయమునైనను నిరంతరముగ చింతింపగలుగుటకు, ఆవిషయమందు అత్యంత ప్రీతిని సంపాదించుటయావశ్యకము. ఈ అత్యంత ప్రీతి ప్రతివారికి అన్నిటికంటె యెక్కువగ తనయందే గలుగుచున్నది. ఇది సామాన్యానుభవమే. కాని మానవుడు "అహమ్", నేను అని తనను తాను గ్రహించునపుడు, సత్యమగునట్టి తన పరమార్థస్వరూపమగు అఖండానంద స్వరూపమును మరచి, అసత్యమగునట్టియు, తన వాస్తవ స్వరూపము కానట్టియు అస్థిరములగు దేహోపాధులే తానని అనగా నేను అని భ్రమించి వీటియందు అధికప్రీతిని పొందుచున్నాడు. అట్టి ప్రీతినే, గురు, శాస్త్ర, విచారానుభవముతోడ తన పరమార్థ వాస్తవస్వరూపమగు అఖండ పరిపూర్ణానంద స్వరూపమును గుర్తించి దాని యందు సంపాదించుటకేమి అసాధ్యము? అసాధ్యముగాదు. జీవునకు యిది తన ఆత్మస్వరూపమే గనుక దానిని బాగుగ గ్రహించి దానిలాభమందు ప్రీతిని సంపాదించినయడల, ప్రారబ్ధానుసరణమున

నెట్టి సుఖ దుఃఖ వ్యవహారభోగానుభవముల నొందుచున్నను, తనకు ప్రియ మగునట్టి తన పరమాత్మస్వరూపమే గోచరించుచుండును. అనగా స్మరణకు వచ్చుచుండును. స్వస్వరూపమిట్లు స్వాత్మాభిన్నముగ స్మరణకు వచ్చుచుండుటయే ఆత్మానుసంధానము. ఇది మానసిక క్రియారూపమున నుండును. ఎవరికైనను, వారికత్యంతప్రియమగు విషయము నందిట్టి యనుభవము సహజము. ఈ విషయమును ధ్రువపరచుటకే శ్రీ వశిష్ఠభగవానులు, శ్రీ విద్యారణ్యస్వామియునుగూడ ఈ క్రింది ప్రసిద్ధ దృష్టాంతమునుగైకొని, బోధించుచున్నారు.

శ్లో॥ పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి ।
తదేవాస్వాదయత్యంతః పరసంగ రసాయనమ్ ॥

అనగా పరపురుషానురక్తిగల యువతి గృహమందెన్ని పనులను జేయుచుండినను అవి చేయుచునే నిరంతరము తనకు ప్రియకరమగు పరపురుష సంగ సౌఖ్యమునే సదా భావించుచుండును. (అట్లే ఆత్మజ్ఞానాభ్యాసకుడు నిరంతరము స్వస్వరూపాను సంధానమును చేయగలుగుచుండుననిభావము.) ఈ అభ్యాసాదులు మానసికములు గనుక వ్యవహారాచరణమునకు లోపముండదు. కాని పామరత్వముతో వ్యవహరించడు. ఆత్మ-జ్ఞానస్వరూపము గనుక యెల్లప్పుడును ప్రకాశించును. స్వప్రకాశమైన ఆత్మ,ఘటాదులకంటె ప్రసిద్ధమైనదిగదా? ఒకసారి చూడబడిన ఘటమే తలచినపుడెల్ల జ్ఞప్తికి వచ్చుచుండునుగదా? దీనికేమి యధికప్రయత్నము కావలయును? ఆత్మజ్ఞానమనగా బ్రహ్మమును ప్రకాశింపజేసెడి చిత్తవృత్తియేగదా? కావున అభ్యాసకునకు స్వాత్మస్వరూపము తలచినపుడెల్ల గోచరించుచుండును. కాని యిట్లు నిరంతరము తలచుచుండుటకు, విషయమునందు అధిక ప్రీతి యావశ్యకము. జిజ్ఞాసువు యెట్టిప్రయత్నముతోడనైనను తన పరమార్ధ స్వరూపమందు పరమ ప్రీతిని సంపాదించుటయే ఆత్మానుసంధాన రహస్యము. ఈ రహస్యమును గుర్తెరిగి అట్టి పరమ ప్రీతిని సంపాదించిన మహనీయుడు యెంత వ్యవహారియైనను ఆత్మానుసంధానమును సతతము జేయగలుగును.

ఈ అనుసంధానాదుల నెంతవరకు జేయవలయుననిన, ఉపాసింప బడెడి పరాత్మ తానేయని గట్టి నిశ్చయము గలుగువరకు, అభ్యసించుచు అట్టి నిశ్చయమును జీవితకాలమంతయు నిలుపుకొనవలయును. దీనికి చిత్తఏకాగ్రత తోడ బనిలేదు. అనగా ఏపనిజేయుచున్నను, జేయకున్నను తన నిజ స్వరూపము గోచరించుచుండును. జిజ్ఞాసువు యిట్లు వాస్తవమును గ్రహించి ప్రీతినొందునట్టి స్వరూపము తనదేగాని అన్యముగాదు. పరమార్థవాస్తవమున తనకన్న అన్యమగు పదార్థమే లేదు. అవాస్తవముగ నున్నట్టి వ్యవహార పదార్థములు తనపరమార్థస్వరూపమును బాధింపజాలవు. వ్యవహారము అజ్ఞాన మున్నంతకాలమే తనను బాధించునుగాని అజ్ఞానము పోయినవెంటనే దీప ప్రకాశముచే చీకటి నశించునట్లు నశించును, తాను అజ్ఞానమను చీకటిలో సంచ రించునపుడే, అందుండు విషయములను వాని స్వభావ స్వరూపములను అజ్ఞాన మను చీకటిచే బాగుగ గుర్తింపజాలక తాను వాటివలన సుఖదుఃఖములతోడ క్రిందిమీదుగ తారుమారగుచుండును. కానితన ఆత్మప్రకాశముతోడనే వ్యవహార పదార్థ స్వరూప స్వభావములను బాగుగ తెలిసి కొనసమర్థుడగును. కావున అట్టివి జ్ఞానాభ్యాసకునకు బాధాకరములు కాజాలక సహకారములే యగుచు, 'ప్రారబ్ధాంతమందు స్వస్వరూపాఖండానంద ప్రాప్తి నొందింపజేయును.

ఇంకనూ యీ ఆత్మానుసంధాన రహస్యమేమియనిన పరమార్థవాస్త వమున బ్రహ్మ స్వరూపుడగు జిజ్ఞాసువు తానుచేయునట్టి మనన, విచారాదుల వలన తానే ఆనందస్వరూపుడననియు ఆనందమువలననే అన్నియు జీవించుచు, ఆనందమునందే తాదాత్మ్యము నొందుచున్నవనియు గ్రహించి అట్టి తన అఖండపరిపూర్ణానందలాభమందు ప్రీతినిశ్చయములతోడ తనహృదయాకాశము నందు అనుసంధానాదుల జేయుచు ఆత్మను తెలిసికొనుచున్నాడు. అట్టి మహనీయుడు బ్రహ్మానందమందు సుప్రతిష్ఠితుడగునని "యఏవంవేద ప్రతి తిష్ఠతి" అను భృగువల్లివాక్యము స్పష్టము జేయుచున్నది. అనగా అట్టి అభ్యాసకుడు కాలక్రమమున ఆనందస్వరూపుడేయగునని శ్రుతివాక్యము ధ్రువపరచుచున్నది. ఇట్టి ఆనందప్రాప్తికి అభ్యాసకుడు తనమననాదులచే,

తన వాస్తవస్వరూపమును మరుగుపరచుచున్నట్టి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములలో నేదియు తన వాస్తవ రూపముకాదని నిశ్చయమునొంది "అహమ్" నేను అను శబ్దముచే నుపలక్షిత మగు ఆత్మస్వరూపమునే తన పరమార్థస్వరూపముగ గ్రహించవలయును. ఇదియే బ్రహ్మ. ఈ బ్రహ్మోపలబ్ధి జిజ్ఞాసువులకు తపస్సుచేతనే సాధ్యము. తపస్సనగా అంతఃకరణ రూపముననున్న వృత్తిని బ్రహ్మాకారము జేయు చుండుటయే కాని, వేరుగాదు.

పర్యవసానమున ఆత్మజ్ఞానాభ్యాసకుడు ముఖ్యముగ గ్రహించవలసి నట్టి రహస్యమేమియనిన, తన ప్రారబ్ధానుసరణమున, నెంతటి సుఖదుఃఖాను భవముల ననుభవించుచున్ననూ, అట్టివి యన్నియూ, తన ప్రారబ్ధానుభవమున కుపకరణమగునట్టి కల్పితోపాధికి సంబంధించినవేగాని అట్టి భోగానుభవ ములతోడ తనకు వాస్తవసంబంధములేదని, నిశ్చయముగ తెలిసికొనవల యును. కాని యిట్లు తెలిసికొన్ననూ, జీవుని అనాది అజ్ఞానముచే కల్పితమైన యీ ఉపాధియందు అనగా దేహాదులయందు తనకు కలుగుచున్న తాదాత్మ్య ధ్యాసమువలన హర్ష శోక సుఖ దుఃఖాద్యనుభములు తనకు కలుగుచునే యుండును. కావున జ్ఞానాభ్యాసకుడు దీనిని బాగుగ గ్రహించి, యీ దేహ తాదాత్మ్యధ్యాస సంబంధమును, తన అభ్యాసస్థితి పాటవములను బట్టి శక్తి వంచనలేక ప్రయత్నముతోడ తగ్గించుకొనుట యావశ్యకము. ఇట్టి సమర్థత అభ్యాసకునకు, స్వశరీర జగన్మిథ్యాత్వ విచారమును నాత్మయందెల్లప్పుడునూ గావించుచుండుటవలననూ, సతత మననాద్యభ్యా సములవలననూ, అభివృద్ధి నొందుచుండును. ఇది మానసికక్రియ. అయినను అభ్యాసకులకు, బాహ్యావ్యవహార సంబంధ ఆందోళనములను కొంతవరకైనను స్వప్రయత్నపూర్వకముగ తగ్గించుకొనుటగూడ యావశ్యకము. ఆత్మ యందెల్లప్పుడునూ, స్వశరీర జగన్మిథ్యాత్వవిచారమును గావించుచుండ కాలక్రమమున దృశ్యమందు సక్తతాభిమానములు క్షీణించుచుండును.

తీవ్రాభ్యాసకులకిది ప్రత్యక్షము. జ్ఞానాభ్యాసకుడు తన ప్రారబ్ధమునుబట్టి యెట్టి వ్యవహారములాచరించుచున్ననూ అట్టివియన్నియూ తనయొక్క ప్రారబ్ధ క్షయమునకుగానే, నిర్వర్తింపబడుచున్నవను నిశ్చయజ్ఞానముతోడ. వ్యవహార లోపముచేయక నాచరించుచు, వాటి లాభనష్టములచే కలుగు సుఖదుఃఖాను భవములను తాను, నిమిత్తమాత్రముగ ననుభవించుచుండవలయునేగాని, వాటియందు వ్యామోహితుడు కాగూడదు. నిమిత్తమాత్రమనగా, తనకు తన శుభాశుభ కర్మఫలములతోడ వాస్తవ సంబంధములేదను నిశ్చయబుద్ధి. జ్ఞానాభ్యాసకుడు తన సమస్త సుఖదుఃఖ వ్యవహారానుభవములను, నిట్టి నిశ్చయజ్ఞానముతోడ, ననుభవించుచు, తానేపని జేయుచున్నను సర్వదా తన వాస్తవస్వరూపమును, నీ క్రిందివిధమున, మనన, నిదిధ్యసనముల నభ్య సించుచుండుట యావశ్యకము. తనహృత్కమలమునందు ప్రీతి నిశ్చ యములతోడ సర్వదా మానసికముగ తన స్వస్వరూపమును, నిట్లనుసం ధానము చేయుచుండుట, మరువగూడదు. "అహం" నేను వాస్తవమున యీ స్థూల సూక్ష్మదేహాది రూపుడనుగాను. నేను సాక్షి-ప్రత్యగాత్మ స్వరూపుడను. ఘటాకాశ మహాకాశములవలె ప్రత్యగాత్మ పరమాత్మలొక్కటియేకాని వేరు వేరు కావు. ప్రత్యగాత్మనగునేను ఆ పరమాత్మస్వరూపుడనే. నా పర మాత్మ స్వరూపమే సర్వాధిష్ఠానము. నాయందే, నిద్రచే స్వాప్నికునకు, గలుగు స్వప్నపదార్థములు, వాటియనుభవములలాగున యీ స్వశరీర సర్వ దశ్యములన్నియు, అజ్ఞానకల్పితములై నాకు వాస్తవమైన వానివలె ననుభవము నిచ్చుచున్నవిగాని, యివినాకు నిత్యములుకావు, అనిత్యములు. అవాస్తవములు. నాకు నిత్యమగునది ఆత్మస్వరూపముదప్ప వేరొండేమియులేదు. ఈ ఆత్మ చిదా కాశస్వరూపము. ఇదినిత్యము, నిర్వికారము, స్వప్రకాశము, స్వశరీర సర్వా ధిష్ఠానము, పరిపూర్ణము, సత్యజ్ఞానానందస్వరూపము. పరమార్థవాస్తవమున యిట్టివాడనగు నాకు, యీ జరామరణకర్తృత్వ భోక్తృత్వాది రూపముననున్న సంసారము కల్పితముగాక వాస్తవమెట్లగును ఈ సంసారము నాకు అజ్ఞాన కల్పితము. ప్రారబ్ధము నాకు అనాది భ్రాంతిచే సంప్రాప్తమగుచున్నది.

కావున దీనితోడ నాకు వాస్తవసంబంధములేదు. అయినను ప్రారబ్ధానుభవము సాధారణముగ తప్పదుగనుక, నా ప్రారబ్ధ క్షయమునకు మాత్రము, నీ యుపాధినియుపయోగించుకొను యావశ్యకతయున్నది. ఏలనన ప్రారబ్ధము నశించినగాని, నా స్వస్వరూపప్రాప్తి కాజాలదు. ప్రారబ్ధాంతమందు నా స్వస్వరూపమగునట్టి పరమాత్మస్వరూపుడనే కాగలను. సందేహములేదు. అను నిశ్చయముతోడ, జ్ఞానాభ్యాసకుడు తన హృత్కమలమందు సర్వదా "సోహం" అను మంత్రంబును, జ్ఞానపూర్వకముగను, ప్రణవరూపంబగు "ఓం"కార లక్ష్యార్థంబుగను, స్వాత్మాభిన్నముగ మననిదిధ్యాసనములాచరించుచుండవలయును. ఇది మానసికము. అవకాశమున్నప్పుడెల్ల, యేపనిచేయుచున్నను, నాచరింపదగినది. దీనికి కావలసిన ప్రయత్నము మనసును, స్వాధీనపరచుకొనుటయేగాని వేరేమియునూ లేదు.

"సోహం"అను మంత్రార్థంబును,"ఓం"కారలక్ష్యార్థంబును ఒక్కటియే. అదియేదియనిన- సర్వాధిష్ఠానపరబ్రహ్మ స్వరూపంబగు, మూర్తా మూర్త స్వశరీర సర్వోపాధి వినిర్ముక్త నిత్యనిర్వికార, సజాతీయ విజాతీయ స్వగత భేద రహిత, జగదుత్పత్తిస్థితిలయ వివర్తఅభిన్న నిమిత్తోపాదానకారణ, స్వప్రకాశ, అఖండ పరిపూర్ణ చిద్ఘనానందస్వరూపము. ఇదియే సత్యజ్ఞానానంత స్వరూపము. ఇట్టి నిర్గుణ పరబ్రహ్మంబు తానేయని స్వాత్మాభిన్నముగ, అద్వితీయ పరిపూర్ణ చైతన్యభావము నభ్యసించుచుండుటయే ముముక్షువులకు పరమ ప్రాప్తికరము, శీఘ్రఫలప్రదమని విద్వాంసులు గ్రహింతురుగాక.

ఆత్మజ్ఞానాభ్యాసకునకు, అభ్యాసపాటవముచే కాలక్రమమున తన కెంతెంత లాభముగలుగుచున్నదియును పరీక్షించుకొనుట యావశ్యకము. అభ్యాసకునకిట్టి లాభము ప్రత్యక్షము. ఈ లాభపరిశీలనవలన అభ్యాసకునకు యీ విద్యయందు ప్రీతి, నిశ్చయ, దార్ఢ్యములుగలుగుచు అభ్యాసపాటవమును వృద్ధిచేయుచుండును. లేనిచో అభ్యాసకునకు విసుగుజనించును. అభ్యాసకాలమందున నేనెంతకాల మభ్యసించుటయని, విసుగుకుగాని, స్వల్ప విశ్రాంతిలాభముతోడనే

కృతకృత్యులమైతిమని భ్రాంతికిగాని లోనగుదురు. దానివలన యోగభంగమగును. కావున అభ్యాసకుడు యిట్టి పొరపాటులనొందక తన ప్రారబ్ధాంతము వరకును స్వస్వరూపానుభవసిద్ధికి మనన, నిదిధ్యసనాది సాధనములను విడువగూడదు.

ఈ ఆత్మజ్ఞానాభ్యాస లాభము యెప్పుడు యెట్లు గుర్తించవలయు ననిన శ్రీకృష్ణపరమాత్మ గీతలలో—

శ్లో॥ యదా వినియతం చిత్త, మాత్మన్యేవావతిష్ఠతే ।
విస్పృహస్సర్వకామేభ్యో, యుక్తఇత్యుచ్యతేతదా ॥

శ్లో॥ యథాదీపోనివాతస్థో, నేఙ్గతేసోపమాస్మృతా ।
యోగినోయత చిత్తస్య, యుఞ్జతో యోగమాత్మనః ॥

అనగా, యెప్పుడు, ఏకాగ్రతను పొందింపబడిన చిత్తమాత్మయందుండునో, కోరికలన్నియు నెప్పుడు క్షీణించునో, అప్పుడు యోగము సిద్ధించుచున్నదని నెరుగవలయును. చిత్తనిరోధముచేసుకొని, అనగా విషయములనుండి మనసును మరలించుకొని ఆత్మానుసంధానము చేయు యోగికి, గాలిలేనిచోట దీపమెట్లు చలించకుండునో అట్లే చిత్తము చలించకుండ నుండుటనుబట్టి యోగము సిద్ధించుచున్నదని నెరుగవలయును.

ఇంకనూ,

శ్లో॥ యత్రోపరమతేచిత్తం, నిరుద్ధం యోగసేవయా ।
యత్రచైవాత్మనాఽఽత్మానం, పశ్యన్నాత్మనితుష్యతి ॥

శ్లో॥ సుఖమాత్యన్తికంయత్త, ద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।
వేత్తియత్ర నచైవాయం, స్థితశ్చలతి తత్త్వతః ॥

శ్లో॥ యంలబ్ధ్వా చాపరం లాభం, మన్యతే నాధికంతతః ।
యస్మిన్ స్థితోన దుఃఖేన, గురుణాఽపి విచాల్యతే ॥

శ్లో॥ తం విద్యాద్దుఃఖ సంయోగ, వియోగం యోగసంజ్ఞితమ్ ।
సనిశ్చయేన యోక్తవ్యో, యోగోఽనిర్విణ్ణచేతసా ॥

అనగా, ఎప్పుడు యోగానుష్ఠానముచే నిరుద్ధమగు చిత్తము యుపరతిని పొందునో, ఎప్పుడు సమాధి పరిశుద్ధమగునంతఃకరణముచేతను జ్యోతిస్స్వరూప మగు నాత్మను జూచుచు తనలో సంతోషింపగలుగుచుండునో, యెప్పుడు యింద్రియములకు గోచరముగాక బుద్ధిచేతనే దెలియదగునట్టి ఆనందము ననుభవించుచుండునో, యెప్పుడు తత్త్వరూపమగు బ్రహ్మానందములో యున్న వాడై చలనమును బొందదో, యే లాభమును పొందుచు యితర లాభముల నంతకన్న హెచ్చుగాదలంపడో, యే ఆత్మతత్త్వమునందున్నవాడై గొప్పది యగు దుఃఖమువచ్చినను చలింపకుండనుండునో, దానినే దుఃఖరహితమైన యోగమునుగా తెలిసికొనవలయును. ఇట్లు తెలిసికొని ఆ యోగమును పట్టు దలతో విసుగుజెందనిమనసుతోడ నభ్యసింపవలయునని తెలుపుచున్నారు. ఇట్లు తెలిసికొని, నాచరింపబడునట్టి సతతాభ్యాస, పాటవముచే కాలక్రమమున ఆత్మజ్ఞానము కలుగుచుండును. ఈ జ్ఞానమువలన కలుగు లాభమును "తద్వి జ్ఞానేన పరిపశ్యన్తిధీరా ఆనందరూప మమృతం యద్విభాతి" అనగా అట్టి విద్వాంసులు ఆత్మజ్ఞానముచే, సర్వకాలములయందమృతరూపమున, ఆనందమే స్వరూపముగాగలిగి ప్రకాశించుచుందురని ఆత్మతత్త్వమును జూచుచుందు రనియూ, ముండకోపనిషద్వచనము తెలుపుచున్నది. మానవునకిది మహత్తర లాభముగదా!

జీవునకిట్టి మహత్తరమగు లాభము, స్వాత్మాభిన్న బ్రహ్మజ్ఞానమేగాని మరి వేరేమియుగాదు. ఈ జ్ఞానప్రాశస్త్యమును శ్రుతి, స్మృతులు "జ్ఞానా దేవతుకైవల్యమితి వేదాంత డిండిమః" "నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే" అనినన్నీ ఘోషించుచున్నవి. ఇంకనూ యీ జ్ఞానాభ్యాస లాభమును ఉపనిషత్సమానమగునట్టి భగవద్గీతయందు శ్రీకృష్ణపరమాత్మ—

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన, స్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛ న్త్యపునరావృ త్తిం, జ్ఞాననిర్ధూత కల్మషాః ॥

అనగా యీ జ్ఞానమునొందిన మహనీయులు, జ్ఞానముచే పోగొట్టబడిన కల్మ షముగలవారై అనగా సర్వపాప విముక్తులై, పరమాత్మయందే నిశ్చయము గలవారై, బ్రహ్మాత్మనా సంస్థితులై, ఆ పరమాత్మయందే నిష్ఠులై, దాని యందే పర్యవసానముగలవారై, పునరావృ త్తిరహితమగు తత్స్వరూపులే యగుదురనియు, యింకనూ దాని తాత్పర్యమును, పర్యవసానముగ పదునెనిమి దవ అధ్యాయాంతమందు,

శ్లో॥ భక్త్యామామభిజానాతి, యావాన్ యశ్చాస్మిత త్త్వతః ।
తతోమాంత త్త్వతోజ్ఞాత్వా, విశతే తదన న్తరమ్ ॥

అనగా ఆత్మజ్ఞానమను భ క్తిచేతను, నేను అనగా తానెవరో యెట్టివాడో యధార్ధముగా తెలిసికొనును. అట్లు నన్ను అనగా తనను తాను యదార్ధముగా తెలిసికొనిన తర్వాత నాయందు ప్రవేశించును. అనగా అఖండానంత పరమాత్మ స్వరూపుడేయగునని, యిట్లు తిరిగి ధ్రువపరుచుచున్నారు.

ఈ మహ త్తర లాభము జీవునకు, ఒక్క ఉపనిషద్వాక్యబోధవలననే కలుగవలయునుగాని వేరు దారి లేదు. స్వాత్మరూపుడగు బ్రహ్మ ఉపనిషదేక గమ్యుడు. జీవబ్రహ్మైక్యబోధయే శ్రుతిపరమ తాత్పర్యము. అనగా జీవుడు బ్రహ్మకంటె వేరుగాదు. జీవ, బ్రహ్మస్వరూపమొక్కటియేకాని భిన్నములు కావు అని తెలుపుట. ఉపనిషద్బోధ పరమ ప్రమాణము. కావున జిజ్ఞాసువులివి యెట్లుయని సశాస్త్రీయముగ, విచారించి తెలిసికొనవలయునేగాని, శాస్త్ర ప్రామాణ్యమును సంశయింపదగదు. దీనియందు సంశయచిత్తులైనవారికి గొప్ప నష్టము. దీనినే "సంశయాత్మావినశ్యతి" యను వచనము స్పష్టముచేయు చున్నది. శ్రుతిపరమ ప్రామాణ్యమునుగురించి శ్రీ శంకరభగవత్పాదులు;

శ్లో॥ పాషాణ ప్లవనం చాపిసిద్ధ్యేత్కాల విపర్యయే।
నక్వచిచ్ఛ్రుతి వాక్యానాం అప్రామాణ్యంతు సిద్ధ్యతి॥

అనగా కాలవిపరీతమువలన, నౌకానౌకసమయమున రాళ్లు నీటియందు తేలిననూ తేలవచ్చునుగాని, శ్రుతివాక్యముమాత్రమెన్నటికినీ అప్రమాణమగుట తటస్థించదని చెప్పిరి. మరియు—

శ్లో॥ కారుణ్యం భవతామేత, దహం వచ్మినమాయయా।
శ్రుతివాక్యమను స్మృత్య నస్వతః ప్రకటీకృతమ్॥

అనగా శ్రీరామచంద్రా యీతత్త్వబోధరూపమున, నీకు నేను చెప్పుచున్న దంతయూ నామాటలుగావు. శ్రుతివాక్యము ననుసరించి, నీమీద కారుణ్యముతోడ దీనిని నీకు జెప్పుచున్నాడనేగాని, నిన్ను మోసముజేయుటకు నేను జెప్పునదిగాదు" అని అవతారమూర్తియగు శ్రీరామచంద్రమూర్తికి బ్రహ్మ మానసిక పుత్రుడగు వశిష్ఠభగవానులు తన బోధకన్నను శ్రుతివాక్యబోధకు ప్రాధాన్యమిచ్చుచున్నారు. కావున శ్రుతిప్రమాణము పరమోత్కృష్టమైనదని జిజ్ఞాసువులు నిశ్చయమొందుదురుగాక. ముముక్షువులిట్టి నిశ్చయముతోడ నభ్యసించునట్టి ఆత్మానుసంధానాదులకు కావలసిన సామర్థ్యమును వారికి నేనే యిచ్చుదునని, శ్రీకృష్ణపరమాత్మ,

శ్లో॥ తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామిబుద్ధి యోగంతం, యేనమాముపయాన్తితే॥

అనగా నాయందు అనగా స్వస్వరూపమందు, ఆసక్తి గలవారై ఆత్మానుసంధానాదులను ప్రీతిపూర్వకముగ నాచరించువారికి, ఏ ఉపాయముచేత నన్ను అనగా తన పరమార్థవాస్తవ స్వరూపమును బొందుదురో అట్టి బుద్ధిరూపమగు నుపాయమును, నేనే యిచ్చుచున్నానని, తెలుపుచున్నారు.

ఈ మొదలగు వచనములతోడ సాక్షాద్భగవత్స్వరూపుడగు శ్రీకృష్ణ పరమాత్మయే, సహాయ, సాధన, అభయ వచనములను యిచ్చుచున్నందున, అభ్యాసకులు సంశయచిత్తులుగాక, అభ్యాసమందు విసకట జెందక, సదా ఆత్మజ్ఞానాభ్యాసావలంబులగుచు, మహత్తరమగు పరమాత్మస్వరూపమును, జీవునకు స్వాత్మజ్ఞానరూపమగునట్టి, నిత్య నిరతిశయ సుఖ పరమలాభమును గుర్వీశ్వరారాధన, సతతమననానుసంధానాభ్యాసాదులతోడ, కాలక్రమమున నొందుదురుగాక.

ఈ విద్యకుగల ప్రధానరహస్యమేమనిన ఆత్మానుసంధానధ్యానాదులను గురించి యెంతవ్రాసి యెట్లు తెలిపినను అభ్యాసకులకు దీనియందు స్థైర్యము గలుగుట కష్టసాధ్యము. ఏలనన యీ అభ్యాసము, అద్వితీయము, స్వాత్మాభిన్నము, అఖండము. జగదనుభవమంతయు సద్వితీయము, నానాత్వముల తోడ చిత్రవిచిత్రముగ నుండును. ఆత్మజ్ఞానాభ్యాసము స్వాత్మాభిన్న, అద్వితీయ, అఖండ బ్రహ్మాకారవృత్తితోడ నభ్యసించవలసి యున్నది. అభ్యాస కాలమందు సద్వితీయమగు స్వశరీర దృశ్యనానాత్వములు, నానాత్వభేదములు, సంబంధములు, గోచరించుచు, స్వాత్మాభిన్న అఖండపరమాత్మానుసంధానాదులకు, విక్షేపము గలుగజేయుచుండును. సాధకులకు వారి అభ్యాస కాలమందు చిత్త స్థైర్యముండనీయక, యీ వివిధదృశ్యభేద నానాత్వ సంబంధములు, వాటివలన గలుగునట్టి రాగద్వేష అహంకార మమకారాదులు, అభ్యాసమునకు విఘ్నకరములగుచుండును. దీనిని నివారించుటకు జ్ఞానాభ్యాసకులు యీదృశ్యనానాత్వము, వాటి యనుభవములు, నిత్యము వాస్తవము గాదని శాస్త్రానుసరణమున బాగుగ గ్రహించి సంశయ విపర్యయరహితముగ నిశ్చయమునొందవలసిన యంశమును లోగడ ప్రకరణములలో సందర్భానుసారమున తెలిపియున్నను, పునరుక్తిని గమనించక నిది యెన్ని పర్యాయములు చెప్పినను చెప్పదగినదిగావున సాధకుల అభ్యాసపాటవముకు గాను తిరిగి విమర్శించుచున్నాడను.

శ్రుతిమాత మానవునకు "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" "నేహ నానాస్తి కించన" "జీవోబ్రహ్మైవనాపరః" "తత్త్వమసి" అను యనేక వచనముల తోడ కంఠోక్తిగా బోధించుచున్నది. (ఈ వచనముల యర్థము లోగడ వివిధ ప్రకరణములయందు తెలుపబడియున్నందున స్పష్టము.) సద్వితీయ నానాత్వ ములతోడ సుఖదుఃఖానుభవములనిచ్చుచున్న యీదృశ్యమునంతయు అద్వి తీయ అఖండమని తెలిసికొనుట యెట్లనిన, శ్రుతివాక్యపరమ తాత్పర్య ప్రమాణము వలనను, యుక్తివలనను, యనుభవమువలననుగూడ సద్గురు ముఖమున బాగుగ గ్రహించి యీసిద్ధాన్తదార్ఢ్యము నొందవలయునేగాని వేరుదారిలేదు. పరమార్థమున యీ స్వశరీర, ప్రపంచ అద్వితీయ అఖండత్వ మును శాస్త్రముగూడ లౌకికోదాహరణలతోడనే బోధించుచున్నది.

ఎట్లన, లోకమునంతకును సూర్యుడొక్కడే యయినను, ప్రతి జీవికి యనేక ప్రతిబింబములతోడ, ప్రతి ప్రదేశమునను తానొక్కొక్కడుగ యున్నట్లు గనుబడుచు దేనితోడను సంబంధపడక సర్వ ప్రపంచమును బ్రకాశింపజేయుచున్నను, ఆయా ప్రదేశముల వాతావరణ స్థితులనుబట్టి యల్ప, అధికప్రయాసలతోడ జూడబడుచున్నాడుగదా! ఇది సర్వానుభవము. మరియును సూర్యుడు రమ్యములగు గిరి, తటాక, వనములను, పవిత్ర మగు నదీప్రవాహ పుణ్యక్షేత్రాదులను అపవిత్రమగు మూత్రపురీషాది ప్రదేశ ములను యేకవిధమున యెట్లు బ్రకాశింపజేయుచు, వాటితోడ తానెట్టి సంబంధమును నొందక యెట్లుండుచున్నాడో యట్లే పరమాత్మ యెల్లప్పు డును తాను స్వప్రకాశ స్వభావుడు గనుక సమస్త జీవ దృశ్యమను వానితో నెట్టిసంబంధము నొందక బాహ్యాంతరముల సర్వదా నేకవిధమున బ్రకాశించు చుండును. ఇట్లు ప్రకాశించుచు సర్వదా నిర్వికారుడై యీయనయే అనంత ప్రతిబింబములతోడ జీవరూపమున భాసించుచుండును. కాని, ఆయా యుపాధివికారములతోడ నెంతమాత్రము సంబంధపడడు. సర్వదా యొకేవిధమున ప్రకాశించుచుండును. ఆ పరమాత్మ సర్వహృదయ పుండ రీకముల యందునను, భాసించుచుండునట్టి పరిపూర్ణ, నిత్య, నిర్వికార,

అఖండ ప్రకాశస్వరూపుడు. అట్లుండుచూ మనలందరకును యేల యొక్క రీతి గనే గనుబడుటలేదని శంకించవచ్చును. కారణమును నిర్మూలించినగాని కార్యము నశించదుగదా? ఈ స్వశరీరప్రపంచమంతయు అనాది అవిద్యా కార్యమని అనగా అజ్ఞానముచే భాసించుచున్నదని లోగడనే తెలుపబడెను. కావున ముముక్షువులగువారు ఈ విషయమును బాగుగ తెలిసికొని ఆదోషములను శాస్త్రీయ ప్రయత్నసాధనములచే నిర్మూలించినయెడల ఆ పరమాత్మ, స్వాత్మా భిన్న అఖండ చిద్ఘనానంద ప్రకాశము గోచరించును. అట్టి స్వరూపమే అభ్యాసకుడు తానని తెలిసికొని స్వానుభవమునొందిన, అట్టి మహనీయుడు పరమాత్మస్వరూపుడేయగును. ఈ విషయమును శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత పదమూడవ అధ్యాయమున చివరరెండు శ్లోకములవలన విశదపరచుచున్నారు.

అభ్యాసకులు నిస్సంశయముగ తెలిసికొనవలసిన మరియొక రహస్య మేమనినయడల యిప్పుడు వారి జగదనుభవములోనున్న దృశ్యభిన్న విభిన్న భేదములు, వీనివలన గలుగుచున్న సంబంధబాంధవ్యములు, వానిద్వారా గలుగు నట్టి యిష్టానిష్ట రాగద్వేషాదులు మొదలగునవి యన్నియు వారివారి ప్రార బ్ధానుభవములకుగాను యేర్పడిన కల్పితములవి నిశ్చయముగ గ్రహించ వలయును. ఇవియన్నియు వ్యవహారమందు భాసించుచు సుఖదుఃఖానుభవ ములు గలుగచేయుచున్నను యివియన్నియు వ్యవహారమునకు గల్పింపబడిన సంబంధములేసని అనగా అవాస్తవ సంబంధములని, నిస్సంశయముగ గ్రహించవలయును. జీవునకు యీ భేదము, సంబంధము, యనునవి కల్పితము లైనను అవి అనాదులని శాస్త్రము తెలుపుచున్నది. అనగా జీవుడు తన అనాది అజ్ఞానముచే వీనిని వాస్తవమని, తనకు నిత్యమని, నమ్ముచున్నాడుగాని పరమార్థమున యిందు ఏదియును వాస్తవముగాదు. కనుకనే శ్రుతిమాత యీ కనుబడుచున్న భేదములు, సంబంధములు భ్రాంతి మాత్రమనిన్ని, అనాదులనిన్ని, అయినను యీ స్వశరీర నానాత్వ దృశ్య మంతయు యొక్క ఆత్మజ్ఞానమువలన నశించునని మానవునకు బోధించు చున్నది. ఇది యెట్లని తెలిసికొనుటకు శ్రుతిప్రమాణము, యుక్తి, వ్యవహార

దృష్టాంతములుగూడ సాధనములు. వ్యవహారజ్ఞానమునకు ప్రత్యక్షము బలము కావున సర్వానుభవములో యున్న ప్రసిద్ధ ప్రత్యక్ష దృష్టాంతములను యుదాహరణముగ తీసికొని విచారించుట పరమార్థ సాధనము. లోగడ ప్రకరణములయందీవిషయమును సందర్భాను సారముగ తెలిపియున్నను, ముముక్షువుల స్వాత్మాభిన్న బ్రహ్మాభ్యాసాదులకిది ప్రధానముగ నుపకరించును గనుక నిచట విపులముగ విమర్శించుచున్నాడను. "పథ్యం శతవిధంకృత్వా" యను న్యాయము ననుసరించి పునరుక్తి ముముక్షుజనోపయోగమునకు యావశ్యకము.

సృష్టియందున పరమాత్మకు సన్నిహిత సాదృశ్యము కలిగినట్టిది మహాకాశము. ఈ మహాకాశమంతయు విభాగింపబడజాలని యొక్కటియగు అసంగ సర్వవ్యాపకభూతము. ఈ లక్షణములను బట్టియే "ఆకాశశరీరం బ్రహ్మ" యను శ్రుతివచనము బ్రహ్మకు ఆకాశసాదృశ్యమును తెలుపుచున్నది. ఈ సర్వ ప్రపంచము ఆకాశమునందే కల్పితముగ భాసించుచున్నది. అవకాశమిచ్చునది గనుక ఆకాశమని వ్యవహరింపబడుచున్నది. ఈ మహాకాశమనునది అమూర్తము. ప్రపంచవ్యవహారమున ఒక్కటియగు అఖండ మహాకాశమునే, అందు ఒక్కఘటమున్నను, లేక శతకోటిఘటములున్నను. వాటిస్థితి యున్నంతకాలము అనగా ఆ యుపాధులున్నంతకాలమే ప్రతి యొక్కఘటమునందుండు ఆకాశమును ఘటాకాశమనియు,ఇట్లే మఠాకాశము, జలాకాశము, మేఘాకాశము మొదలుగాగల ఆరోపణులతో ఆ యుపాధులనుబట్టి ఉపాధి యున్నంతకాలము వ్యవహారము జరుగుచుండును. ఇట్టి భేదమంతయు యుపాధి స్థితి, భేదములవలన గల్పింపబడినదేగాని వాస్తవమున యెట్టివిభాగమును, భేదమును, సంబంధమును, నొందక మహాకాశమెల్లప్పుడును యొక్కటిగనే యుండును. అయినను యీ భేదము ఉపాధులవలన వ్యవహరింపబడు భేదము దీనినే ఔపాధిక భేదమందురు. అసలు భేదమనునదే పరమార్థమున గల్పితము. పరమార్థమున భేదమనునది వాస్తవము గాదని జ్ఞానాభ్యాసకులు గ్రహించుట యావశ్యకము ఈ

ఘటాకాశాదులను వ్యవహారము ఆయా యుపాధులున్నంతకాలమే వ్యవస్థకు గాను గల్పితమై యుండును ఇది వ్యవహారమునకు వ్యవస్థాకల్పితము గనుక వ్యవహారకాలమందుండి ఆ యుపాధుల నాశమందు ఈ వ్యవహారవ్యవస్థ గూడ లేక అంతయు మహాకాశముగనే యుండును.

మహాకాశమందు ఉపాధుల స్థానీయములగు యొక్క ఘటముగాని, అన్ని ఘటములుగాని నశించినప్పుడు శేషించునది మహాకాశమొక్కటియే. ఇంకొక విశేషమును గుర్తించవలసియున్నది. అది ఏమనిన ఏ ఒక్క ఘటోపాధి నశించినను యొక్కటియగు మహాకాశమే శేషించును గాని నశించిన ఘటమునకు వ్యవహారమునకైనను ఘటాకాశమను వ్యవహారము వర్తించదు. సర్వవ్యవహారము ఆ యుపాధితోడ అంతము. అప్పుడు సంబంధమనునదిగాని భేదమనునదిగాని నేదియు నుండదు. జీవుని శరీరము ఘటోపాధి వంటిది. సర్వవ్యవహారము సుఖదుఃఖ అనుభూతియు ఈ అనిత్యమగు యుపాధి యుండునంతవరకే. మహాకాశము నిత్యమగు చిదాకాశము (బ్రహ్మ) వంటిది. కావున ఈ అనంతకోటి జీవరాశిలో యే జీవుడైనను స్వస్వరూప జ్ఞానముచే తన యుపాధిని విలయమునొందింపగలుగుచో అప్పుడు నిర్విశేషముగ శేషించునది నిత్య నిరతిశయ సుఖస్వరూపమగు చిదాకాశమొక్కటియే. ఇదియే బ్రహ్మ. జీవుని పరమాత్మ స్వరూపము, సర్వాధిష్ఠానము, అఖండము, స్వప్రకాశము, భేదరహితము. నిరవయవము, కావున నిష్క్రియము. జరా మరణవర్జితము. స్వప్రకాశచిద్ఘనానంద స్వరూపము. ఇది స్వాత్మాభిన్న అఖండ పరిపూర్ణ చిద్ఘనానంద స్వరూపమను నిశ్చయమునొంది స్వస్వరూప ప్రాప్తియందు ప్రీతితోడ ఆత్మానుసంధానాదులయందు సుస్థిరుడైన సాధకుడు సులభముగ అభ్యాసాదులనాచరింపగలుగును. ఇదియే పరమముక్తికి సాక్షాత్సాధనమని జిజ్ఞాసువులు గ్రహించి వారివారి అభ్యాస పాటవాదులచే కాలక్రమమున వారి నిత్యనిరతిశయ సుఖము నొందుదురుగాక ఇదియే ఆత్మానందప్రకాశము ఎంతటి ప్రజ్ఞావంతుడైనను పర్యవసానమున పరమాత్మ జ్ఞానము నొందనిది

అమృతత్త్వమును, అనగా పునర్జన్మరాహిత్యమగు పరమముక్తిని నొంద జాలడు ఈ విషయమునే శ్రీకృష్ణ పరమాత్మ గీతలయందు :

శ్లో॥ ఆబ్రహ్మ భువనాల్లోకాః, పునరావృత్తినోఽర్జున ।
మాముపేత్యతు కౌంతేయ, పునర్జన్మనవిద్యతే ॥

అను శ్లోకమువలన తెలుపుచున్నారు. ఇచట "మాం" నన్ను ఆత్మస్వరూపమగు పరమాత్మయనియే అర్థము. ఈ పరమాత్మయే స్వాత్మాభిన్న, అద్వితీయ, అఖండపరిపూర్ణ జ్ఞానస్వరూపుడు

పై విధమున యెంతగ ఆత్మజ్ఞానాభ్యాసమును గురించి, విశదపరచినను అభ్యాసకులకిచట నొక సంశయము కలుగవచ్చును. అది ఏదియనిన యీ ఆత్మజ్ఞానాభ్యాసాదులు వారివారి, స్థితి జీవనోపాయములకు నిరోధము గావించు ననియు, అందుచే ప్రాపంచిక భోగానుభవములు వారికి లోపించుననియు తోచవచ్చును. కాని యిట్లు సంశయించుట సరిగాదు. ఏలనన జీవునకు సుఖ దుఃఖభోగానుభవములు ప్రారబ్ధాధీనములు. అనగా వారివారి, ప్రారబ్ధఫలమును బట్టి సుఖదుఃఖానుభవములు జీవునకు కలుగుచుండును. ఈ ప్రారబ్ధమనునది జీవుడు తాను పూర్వముచేసిన పుణ్యాపాపముల కర్మఫలము. దీని సుఖ దుఃఖ భోగములు మానవునకు సాధారణముగ తప్పవుగాన జరుగుచునేయుండును. జీవునకీప్రారబ్ధమనునది విధించబడిన శిక్షవంటిదనియు, యిది జీవ ప్రారబ్ధాను భవమునకు కల్పితమాత్రమనియు లోగడనే వివరించియుంటిమి. జీవునకు ప్రారబ్ధభోగంబును జగన్మిథ్యాత్వజ్ఞానంబును, భిన్నవిషయములు. కావున ఒకదానికొకటి విరోధులుకావు. గాన జ్ఞానాభ్యాసకుడు జగన్మిథ్యాత్వజ్ఞానముతోడ ప్రారబ్ధముననుభవింపగలుగుచుండును. జ్ఞానాభ్యాసకునకు ప్రారబ్ధము నిశ్శేష ముగ క్షయింపనిది అనగా ప్రారబ్ధమున్నంతవరకు జగన్మిథ్యాత్వజ్ఞానము, స్వస్వరూపజ్ఞానము, రెండును అనుభవములో యుండుచు, జ్ఞానాభ్యాసపాట వమునుబట్టి ప్రారబ్ధసుఖదుఃఖానుభవముల తీవ్రత క్షీణించుచుండును. ఈ విషయమును శ్రీ విద్యారణ్యస్వామి పంచదశియందు సవిస్తరముగ నిరూపించిరి.

కావున జిజ్ఞాసువులు జూడదగును. గ్రంధవిస్తర భీతిచే నిచట వివరించుటలేదు. సాధకులకు ప్రారంభదశయందు ప్రారబ్ధానుభవములు క్లేశకరముగనున్నను జ్ఞానాభ్యాస పరిపాకమునుబట్టి కల్పితమగు యీ సుఖదుఃఖ భోగానుభవము క్షీణించి నిర్బాధకముగనే జరుగుచుండును. ఇది అభ్యాసఫలము. ఇట్టి అభ్యాసకుడు తన ప్రారబ్ధము నశించినతోడనే అజ్ఞానము పూర్తిగ నశించి సత్యజ్ఞానానంతరూపమగు బ్రహ్మ స్వరూపుడేయగును. ఇదియే మోక్షము. దీనినే శ్రుతిమాత "అవిద్యాస్తమయో మోక్షః" యని మానవునకు బోధించుచున్నది. ఈ మోక్షస్వరూపమే ఆత్మానందప్రకాశము - ఇదియే మానవుని (జీవుని) నిత్యనిరతిశయ సుఖము — మోక్షము — పరమముక్తి.

—O—

# "సంక్షిప్త ఆత్మబోధ"

మానవులకు యీ ఆత్మవిద్యాభ్యాసము రసాయనము సేవించుటవంటిది. జిజ్ఞాసువులు యీ బ్రహ్మజ్ఞానమును గురించి వ్రాసినదే వ్రాయుచున్నాడను సంశయమునొందగూడదు. ఏలనన, మానవులకు వారిదేహధారణ, వర్ధన, దార్ఢ్యములకు ప్రతిరోజునను ఆహారమెట్లావశ్యకమో అట్లే ముముక్షువునకు ఆత్మజ్ఞానాభ్యాసము ఆవశ్యకము. ఈ జ్ఞానమనునది సర్వదా ఏకరూపము. మానవుడు ప్రతిరోజు తినునట్టి ఆహారము ప్రధానముగ ఓదనమే (అన్నము) అయినను దానియందు విసుగుపుట్టకయుండుటకు వివిధ శాకవ్యంజనములతోడ నెట్లు భక్షించుచుండునో అట్లే యీ బ్రహ్మాభ్యాసమను ఏకతత్త్వమును వివిధానుసరణములతోడ నభ్యసించవలసియున్నది. కాని ప్రధానవిషయము "బ్రహ్మసత్యం జగన్మిథ్యా." "నేహనానాస్తికించన." "తత్త్వమసి", "అహంబ్రహ్మాస్మి" మొదలుగాగల వాక్యములు. ఇట్టి వాక్యములు అద్వైత సిద్ధాంతమునకు పల్లవివంటివి. పల్లవి అనగా భక్తుల భజనయందు, భజనకును,సంగీతవిద్యయందు కృతులు మొదలగువానికిని,యుండునట్టి ప్రధాన వచనములు. అనగా "ఓ రామ నీనామమెంతరుచిరా," "ఎందరో మహాను భావులు" అను మొదలుగాగలవానిని పల్లవియందురు. ఇట్టి పల్లవివాక్యములలో దేనినైనను నొక్కదానిని తీసుకొని భజనపరులు, గాయకులు, ఆ ఒక్క వాక్యమునే గంటలకొలదిగూడ వివిధస్వర, స్థాయిలతోడ, హృదయమునం దిట్టి భావోత్పత్తికిగాను భజన, సంగీత కాలక్షేపములు చేయుచుండుట అందరకును విశదమే ఇదంతయు నెందుకనిన తాత్కాలికముగనైనను భావరసోత్పత్తి గలుగుటకుగానే. ఇదే యిట్లుండ, జ్ఞానాభ్యాసకుడు ఇచ్ఛయించు తన నిత్య నిరతిశయ సుఖస్వరూపమగు బ్రహ్మభావమునొందుటకు యెంతటి అభ్యాస మావశ్యకమో పాఠకులే గ్రహింతురుగాక. నిరంతరాభ్యాస మావశ్యకము.

ఇట్టి అభ్యాసదార్ఢ్యమునకుగాను ఏకరూపమగు యీ బ్రహ్మజ్ఞానమును వివిధ ముగ పలుమారులు బోధించు యావశ్యకత గనబడుచున్నది. ఎంతకాలము భుజించినను ప్రధానమగునది అన్నము ఒక్కటిగానే యుండునట్లు, ఏవిషయ నామములతోడ బోధించినను ఆత్మజ్ఞానమనుపదార్ధమొక్కటియే. నదులన్నియు పర్యవసానమున సముద్రముజేరునట్లు యిందు అన్నివిషయములును ఆత్మజ్ఞాన సాధనములుగనే యుండును. ఏలనన మానవునకు ఆత్మజ్ఞానముకన్న శ్రేయో దాయకమైనది, పొందదగిన యధికలాభములేదు. కావున "ఆవృత్తిరసకృదుప దేశాత్" "పథ్యంశతవిధంకృత్వా" అను న్యాయముల ననుసరించి జీవునకు మోక్షస్వరూపమగు స్వాత్మాభిన్న, అఖండ, పరమాత్మస్వరూపమును వివిధముగ దెలిపినాడను. ఇట్లు చేయుటలో గ్రంధసమాప్తికివచ్చుచుంటిమి గనుక ఆత్మ బోధను తిరిగి సంక్షేపముగ వ్రాసితిని.

కావున పాఠకులు యీ ఏకతత్త్వమునందు విసుగుజెందక ప్రీతినిశ్చ యములతోడ బాగుగ పఠించి వారి వారి పరమలాభము నొందుదురుగాక. బ్రహ్మవిద్యయన్నను ఆత్మవిద్యయన్నను ఒక్కటియేనని లోగడ పలు మారులు తెలుపబడెను. అభ్యాసకులు యీ ఆత్మవిద్యావిషయ సిద్ధాంతములను విశదముగను, సంక్షేపముగను, నీ క్రింది సంగ్రహమునుబట్టి బాగుగ గ్రహించగలరు.

ఈ ప్రపంచమున సర్వజీవులకును యీ స్వశరీర సర్వదృశ్య దుఃఖ ములు తమతమ అనాది అజ్ఞానమువలననే గలుగుచున్నవిగాని మరి వేరు విధమునగాదు. జీవునకు అజ్ఞానము అనాదియైనను సాంతము. ఈ అజ్ఞాననివృత్తి వలననే జీవుడు తన నిత్య నిరతిశయ, పరిపూర్ణ సుఖస్వరూపమును పొంద గలుగును ఈ అజ్ఞాన నాశమునకు వృత్తి వ్యాప్తియే శరణ్యము. శాస్త్రము మానవుని అనాది అజ్ఞాన నాశనమునకు వివిధసాధనోపాయములను వారివారి యధికారమునుబట్టి తెలుపుచు, కర్మోపాసనలనన్నిటిని పరంపరా సాధనములుగ గ్రహించి పర్యవసానమున, సాక్షాన్మోక్షసాధనముగ జ్ఞానమునే తెలుపుచున్నది.

ఇచట జ్ఞానమనగా ఆత్మజ్ఞానమే. ఇదియే బ్రహ్మజ్ఞానము. సాక్షాద్భగవంతుడగు శ్రీకృష్ణమూర్తి గీతలలో జీవులు యీ అనాది సంసారబంధమునుండి విముక్తులగుటకు అనేక ఉపాయములను చెప్పి ద్రవ్యసాధ్యమగు యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞమే మక్కిలి శ్రేష్ఠమైనదనియు, తక్కినవన్నియు మోక్షస్వరూపమగు జ్ఞానముతో పరిసమాప్తినొందుననియు "జ్ఞానయజ్ఞః పరంతపః, సర్వం కర్మాఖిలంపార్థ, జ్ఞానేపరిసమాప్యతే" అని తెలుపుచున్నారు. ఇంకనూ "సర్వం జ్ఞానప్లవేనైవ, వృజినం సన్తరిష్యసి" సర్వసంసారదుఃఖమును, జ్ఞానమను తెప్పచే దాటుదువు అనియు, మరియును "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి, భస్మసాత్కురుతేర్జున" పుణ్యపాపముల నన్నిటిని జ్ఞానాగ్ని భస్మము చేయునని గూడ తెలుపుచున్నారు. ఈ బ్రహ్మజ్ఞానము జీవుని అనాది అజ్ఞానమును నశింపజేయును. మానవునకు సర్వదృశ్యసంసార దుఃఖమును తనకు యీ స్వశరీర సర్వదృశ్యము నిత్యము, వాస్తవము,ననుభ్రమజ్ఞానము వలన వారి వారి వాసనా సంస్కారములచే గలుగుచున్నది. ఈ వాసనలనగా— జీవుడు, తనకు యీ స్వశరీర సర్వజడజీవోపాధులను సత్యమనినమ్మి వ్యామోహితుడగుచున్నందున, స్వశరీర దృశ్యవిషయములందు అతిసక్తతాభిమానములతో రాగద్వేషాదులుగలుగుచు వాటివలన సంకల్పములు చేయుచు యీ సంకల్పములవలన కోరిక లేర్పడుచు వీనివలన జీవునకు ఇష్టానిష్టసంస్కారము లేర్పడుచున్నవి. ఇట్టి సంస్కారములే వాసనలనబడును. ఇవి జీవునకు అనాదిగా వచ్చుచూ జీవుని సంసారమున బంధించుచున్నవి. యీ అనాది వాసలలే జీవునకు దృశ్యసంసారమును కల్పించుచున్నవిగాని యిది వాస్తవముగాదని శ్రీ వశిష్ఠభగవానులు:—

శ్లో॥ మమపుత్రా మమధన, మయంసోఽహమిదంమమ ।
ఇతీయమింద్రజాలేన, వాసనైవాధివల్గతి ॥

అనగా వీరు నా పుత్రులు, ఇది నా ధనము, నేను ఇట్టివాడను. ఇది నా వస్తువు అనునట్టిదంతయును యింద్రజాలములాగున ప్రకాశించుచున్నది. అనగా

స్ఫురించుచున్నదిగాని వాస్తవముగాదని తెలుపుచున్నారు. ఈ వాసనాసంస్కార ములన్నియు జీవాజ్ఞానకల్పితములేగాని మరి వేరుగాదు. ఇట్టి కల్పిత సంసార దృశ్య దుఃఖము ఒక్క ఆత్మజ్ఞానమువలననే నశించును. శ్రీకృష్ణభగవానులు "నహిజ్ఞానేన సదృశం, పవిత్ర మిహవిద్యతే" అని గీతలో బ్రహ్మజ్ఞానముతో సాటియగునది, అంత పవిత్రమైనది మరి యొకటిలేదని తెలుపుచున్నారు. ఇచట జ్ఞానమనగా ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞాన మనగా బ్రహ్మజ్ఞానమే. బ్రహ్మజ్ఞానమనగా- జీవుడు, "అహం" నేనే, అనగా తానే బ్రహ్మయని తెలిసి కొని అనుభవమునొందుట.

ఇట్టి జ్ఞానము సంపాదించుటకు సత్కర్మానుష్ఠానముచే, సాధన చతుష్టయసంపత్త్యాత్మక చిత్తశుద్ధిని సంపాదించుట యావశ్యకము. ఈ జ్ఞానమునకు కావలసిన సాధనసంపత్తికి చిత్తశుద్ధి యావశ్యకము. ఈ చిత్తశుద్ధి దీర్ఘకాల సత్కర్మానుష్ఠానమువలనగాని గలుగదు. కావున ముముక్షువులగువారు ప్రథమమున నిత్య నైమిత్తిక సత్కర్మానుష్ఠానము, యీశ్వరారాధన, భక్తి, గురుపూజాదికములు మున్నగువానితో సాధన చతుష్టయసంపత్తిని కొంతవరకైనను సంపాదించి చిత్తమును సంస్కరించు కొనుట మిక్కిలి యావశ్యకమగుచున్నది. ఏలనన యిదిలేనిది యే జీవునికైనను తన పరమార్థ వాస్తవస్వరూపమగు బ్రహ్మజ్ఞానమును బాగుగ గ్రహిం చుటకు సాధ్యముగాదు. స్త్రీ పురుషులలో నెవ్వరైనను యిట్టి సామర్థ్యమును. అనగా సాధన చతుష్టయసంపత్తిని సంపాదించుకొనినవారే యీ విద్యాభ్యాస మునకు అధికారులు. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసమునకు ప్రథమమున సాధనచతు ష్టయసంపత్తి యావశ్యకము. ఈ విషయమును సూత్రభాష్యమందు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యనుసూత్రమున శ్రీ శంకరభగవత్పాదులు నిర్ణయించియు న్నారు. కావున విద్యాభ్యాసమునకు యిది ప్రథమసోపానమగుచున్నది. అనంత రము సద్గురువు నాశ్రయించి ఉపనిషచ్ఛాస్త్రశ్రవణముచేయుట యావశ్యకము. ఇట్లు శ్రవణముచేసిన విషయములను శ్రుతియుక్త్యను భవపూర్వకముగ విమ

ర్శించి సంశయ విపర్యయరహితముగ తెలిసికొనుట మననమనబడును. మననాభ్యాసాదులచే నిశ్చయమునొందినట్టి తన స్వస్వరూపధ్యానము, అనగా ఆత్మ ధ్యానముచేయుచుండుట నిదిధ్యసనమనబడును. ఇట్టి అభ్యాసకుడే బ్రహ్మ జ్ఞానాభ్యాసకుడు, ముముక్షువనబడును.

బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు శరీరధారణయే వ్యవహారము. ఈ వ్యవహార మంతయు అవిద్యాకల్పిత ఇంద్రజాలమువంటిదని జ్ఞానపూర్వక నిశ్చయము నొందవలయును. ప్రాతిభాసిక, వ్యవహారములకు స్వల్ప భేదమున్నను వివేకముతోడ విమర్శించినయడల వాస్తవభేదము గనబడదు. అయినను ముముక్షు ప్రారబ్ధ క్షయమునకు శరీరధారణ యావశ్యకమగుచున్నది. ఏలనన ప్రారబ్ధక్షయముగానిది పరముక్తియగు మోక్షము సంభవముగాదు. కావున జ్ఞానాభ్యాసకుడు యిట్టి తన శరీరమును కల్పితమాత్రము కేవల వ్యవహార సాధనముగ తెలిసికొని తన ప్రారబ్ధక్షయమునకు సాధనముగ యీ స్థూల సూక్ష్మోపాధులను వాడుకొనవలయునేగాని, సూక్ష్మోపాధినిగూడ "తాను" అనగా నేనే యని భ్రాంతిచెందగూడదు. ఈ రెండును ముముక్షువునకు తన తరణో పాయమునకు సాధనములుమాత్రమే. ఇట్లు శాస్త్రజ్ఞానపూర్వకముగ తెలిసికొని జ్ఞానాభ్యాసకుడు తన పరమార్ధ వాస్తవస్వరూపమును సర్వదా ఇట్లు గుర్తించుచు మననానుసంధానములచేయుట యావశ్యకము. ఎట్లనిన:— తాను వాస్తవమున అవస్థాత్రయకాలత్రయా బాధిత పరిపూర్ణ జ్ఞానస్వరూపుడననియు, యిదియే స్వప్రకాశ, అఖండ పరమాత్మస్వరూపమనియు, యిదియే తాను అనగా నేననియు, తనకు యీ పరిచ్ఛిన్న, జడ, దుఃఖిత్త్వములు వాస్తవమున సంబంధించినవిగావనియు, అట్టివి యన్నియు ప్రకృతి వికారమైన దేహధర్మ ములనియు, తనకు వీటితో నెట్టి వాస్తవసంబంధము లేదనియునిశ్చయముతోడ స్వస్వరూపానుసంధానాదుల నాచరించుట యావశ్యకము. ఇంకనూ తాను సాక్షీ మాత్రుడననియూ, యీ సుఖదుఃఖాదిభోగములు తనకు వాస్తవమున సంబం ధించినవిగావనియు నిశ్చయము నొందవలయును. ఏలనన తాను పరమార్ధ వాస్తవమున కర్తృత్వ భోక్తృత్త్వరహితుడు. నిరవయవుడు, నిష్క్రియుడు,

నిర్వికారుడు, అఖండపూర్ణుడు. జీవునకు పరమార్థవాస్తవమున ఇట్టి తనయందే అఖండ మహాసముద్రమునందు బాహ్యావాయుప్రసారము, మాలిన్యముల, సంపర్కము నొందుటచే పైభాగమునందుమాత్రము, అలలు, గుండములు, నురుగు, బుడగలు, గలుగుచు సముద్రములోపలి భాగమున జలమంతయు నిశ్చలమై, నిర్మలముగ, అఖండముగ, నెట్లుండునో, యట్లే తన అనాది, అవిద్యచే గలుచున్న వాసనాసంస్కారముల వలన తనయందే స్వాత్మా భిన్నముగ యీ దృశ్యనానాత్త్వ సంసారవికారములన్నియు గలుగుచున్నవి. కాని, జీవుడు శాస్త్రీయమగు స్వప్రయత్నముచే బాగుగ విచారించి తన అనాది అజ్ఞానమిట్టిది యని గుర్తించి దానిని, తన వివేకబలముచే జ్ఞానపూర్వకముగ వేరుపరచగలిగినయడల తన వాస్తవస్వరూపమునందు యీ దృశ్య భిన్నభిన్న నానాతత్త్వములు యెంతమాత్రమును వాస్తవముగనుండవు. అప్పుడు యీ దృశ్య సంసారదుఃఖము క్రమక్రముగ నివర్తించును,

కాని యీ దృష్టాంతము పరిణామములోనిది గనుకను, ఆత్మపరిణామ రహితముగనుకను, యిచట అభ్యాసకులు పొరబడక యీ యుపమాన ఉపమేయములకు ఏకదేశ సమాన సాదృశ్యమువరకే గ్రహించవలయును. ఈ స్వశరీర సర్వదృశ్యము అనగా ప్రపంచమంతయు ఆ అద్వతీయ, నిర్వికార, అఖండ, పరమాత్మయగు బ్రహ్మమునందె, మందాంధకారములో రజ్జువు యందు తోచునట్టి సర్పభ్రాంతిలాగున భాసించుచున్నదని నెరుగవలయును. ఇచట రజ్జువునకును, భ్రాంతిసర్పమునకును, యెట్టి వాస్తవసంబంధము లేకయే, సర్పాకార సర్పావయవ చలనాదులుగూడ రజ్జువుయందే గలుగు చున్నవిగాని రజ్జువును విడచి గలుగుటలేదు. అట్లుకలుగుట కవకాశములేదు. ఇచట రజ్జువు అధిష్ఠానము. సర్పము అధ్యస్తము. ఎల్లప్పుడును అధిష్ఠానము సత్యమైనదై అధ్యస్తము అధిష్ఠానమునందే అవాస్తవముగ, వాస్తవమైనదానివలె భాసించును. ఇట్టిదియే యీ ప్రపంచము. లోకభాస్కరునిలాగున యీ అఖండ పరమాత్మ ఒక్కదేఅయివున్నను లోకభాస్కరుడు ప్రతి జీవునిచేతను ఆయా ప్రదేశములయందు పరిచ్ఛిన్న భిన్నభిన్న ప్రతిబింబాకారముగ నెట్లు అగుపడు

చున్నాడో అట్లే ఈ అద్వితీయ, నిర్వికార, అఖండపరమాత్మగూడ ఒక్కడు గానే యుండి సర్వజీవులచేతను వారి వారి హృదయ పుండరీకములయందు ప్రత్యగాత్మస్వరూపమున తెలుసుకొనబడుచున్నాడేగాని, వాస్తవమున సూర్య ప్రతిబింబములన్నియు ఒక్కసూర్యుడే యగుచున్నట్లు, ఈ ప్రత్యగాత్మ పరమాత్మలు ఒక్కటియే యనియు ఇదియే తన స్వాత్మాభిన్న, పరిపూర్ణ, వాస్తవస్వరూపమనియు బ్రహ్మాభ్యాసకులు నిశ్చయము నొందవలయును. తన పరమార్ధ వాస్తవస్వరూపమును స్వానుభవపర్యంతము నిట్లు సర్వదా ధ్యానించుచుండవలయును. ఎట్లనిన "అహం" నేను సర్వోపాధివినిర్ముక్త, సజాతీయ, విజాతీయ, స్వగతభేదరహిత, స్వప్రకాశ, జగదుత్పత్తి స్థితి లయ వివర్తకారణ, నిత్య, నిరతిశయ, నిర్వికార, అసంగ, సర్వాధిష్ఠాన, అఖండ పరిపూర్ణచైతన్యస్వరూపుడను. ఇదియే నా పరిపూర్ణస్వరూపసుఖము. నాకు కర్తృత్వ, భోక్తృత్వములులేవని సర్వదా అనుసంధానము చేయు చుండవలయును.

ఆత్మజ్ఞానస్వరూపమగు బ్రహ్మస్వరూపమును గురించి వశిష్ఠభగవానులు శ్రీరామచంద్రమూర్తికిట్లు తెలుపుచున్నారు:—

శ్లో॥ సర్వసంకల్ప సంశాంతౌ, ప్రశాంత ఘనవాసనం ।
నకించిద్భావనాకారం, తద్బ్రహ్మ పరమం విదుః ॥

అనగా సర్వోపాధి వినిర్ముక్తమును, సర్వసంకల్పములును శాంతింపగ నణగిపోయిన వాసనలుగలదియు, సర్వభావనారహితమగునట్టి స్వాత్మాభిన్న, అఖండ పరిపూర్ణ చైతన్యమే బ్రహ్మగా నెరుగుమని, బ్రహ్మవిదులు తెలుపుచు న్నారని తాత్పర్యార్ధము. కావున అభ్యాసకులు సర్వదా—

శ్లో॥ అఖండపరిపూర్ణోహం, నిర్మలాకాశవత్సదా ।
జ్ఞానమాత్రస్వరూపోఽహం, నామరూపవివర్జితః ॥

శ్లో॥ అఖండపరిపూర్ణోహం, జ్ఞాతృజ్ఞేయవివర్జితః ।
జ్ఞానమాత్ర స్వరూపోహం, సర్వదాదహార్దేస్థితః ॥

అని తన పరిపూర్ణ జ్ఞానస్వరూపమును ధ్యానించుచుండుటయే సాక్షాన్మోక్ష మార్గము. శీఘ్ర ముక్తిఫలదాయకము. ఇట్టి తాత్పర్యమునే "సర్వోపప్లవ రహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి" అను, ముముక్షు అనుసంధాన ఆర్షవచనము స్పష్టపరచుచున్నది.

తీవ్రముముక్షువు శాస్త్రీయముగ నాచరించునట్టి తన సతత విచార మననాద్యభ్యాసమువలన గ్రహించవలసిన సారాంశమేమనిన: కనుచీకటి యందుయెంతమాత్రము కదలకపడియుండు త్రాడునందే భ్రాంతివలన సర్పము, సర్పవివిధావయవములు, సర్పచలనాదులుగూడ కనబడుచు భయకంపాది అనుభవములు గలుగుచున్నను, అసలు రజ్జువు నిర్వికారమై యుండును. మరియు ఒక్కటియగు అఖండ నిశ్చల మహాసముద్రమే బాహ్య వాయు మలినాదుల ప్రసారముచే పైభాగమందు అనగా బాహ్యమున మాత్రము పీచి కలు, అలలు, పెద్ద తరంగములు, చిన్నవి, నురుగు, బుడగలు, సుడిగుండ ములు, మొదలుగాగల సర్వ వికారముల నొందుచున్నను అంతరమున అనగా సముద్రపుటడుగున అనగా లోపల, నిస్తరంగమై శాంతముగ నుండును. అట్లే జీవునకు పరమార్థవాస్తవమున నిత్యనిర్వికార అఖండపరిపూర్ణ చైతన్య స్వరూపుడగు తనయందే చిత్ర విచిత్రముగ హెచ్చు తగ్గులతోడ సుఖ దుఃఖ రూపమున యీ సంసారానుభవములన్నియు తన అనాది అవిద్యా కామ కర్మఫలానుభవ నిమిత్తమై అహం నేనే యనుకొనుచున్నట్టి దేహేంద్రి యాదులయందు సుఖ దుఃఖ రూపభోగాది వికారానుభవములన్నియు సంభ వించుచున్నవిగాని తనకు వీటితో వాస్తవసంబంధములేదనియు, తానాత్మ స్వరూపుడనియు గ్రహించవలయును ఎట్లన, తన నిత్యానిత్య వివేకముచే వాస్తవ మాలోచించినయడల సర్వాంతరమందు యున్నట్టిదిన్నీ, తెలియబడు నట్టిదిన్నీ అగు తన స్వప్రకాశ పరిపూర్ణ చైతన్యాత్మకు యెట్టి మార్పును

గలుగుట లేదను జ్ఞాననిశ్చయముగలవాడగును. ఇంకను తనకు యీ జగదను భవములన్నియు తన ప్రారబ్ధానుభవ నిమిత్తముగ ఆత్మ బాహ్యములగు తన దేహాదులకు సంబంధించినవే గాని తనకు వీటితో వాస్తవసంబంధములేదను నిశ్చయమునుగూడ నొందవలయును. ఇంకను యిది నా దేహము. నా భార్య, వీడు నా పుత్రుడు, యివి నా గృహక్షేత్రాదులను జ్ఞానము తానేపని చేయు చున్నను నిదురయందుగూడ మరుపుకురాకుండ నెట్లుండునో, యట్లు తన స్వస్వరూపమగు పరమాత్మ తానేయని దృఢనిశ్చయమునొంది వ్యవహరించు చుండవలయును. ప్రారబ్ధక్షయమైనగాని తన అవిద్య అస్తమించదు. కావున యీ స్వశరీర జగదనుభవములను వాటి సంబంధములనన్నిటిని తన ప్రారబ్ధ క్షయమున కావశ్యకములను వివేకమునొంది,నిర్లిప్తతతోడతన వ్యవహారాదుల నాచరించుచు జ్ఞానాభ్యాసకుడు యిదియే తన పరమ ప్రయోజనమునకు సాక్షాత్సాధనము, విముక్తి మార్గమని తెలిసికొనవలయును. శ్రుతిమాతగూడ మానవునకిట్లే బోధించుచున్నది. విద్వాంసుల యనుభవముగూడ నిట్లే గనబడు చున్నది. కావున యీ విద్యయందు సంశయచిత్తులగుటకు యెంతమాత్ర మవకాశము గనబడదు.

ఇంతవరకు శ్రుతియుక్త్యనుభవపూర్వకముగ యీ గ్రంధమందు చేసిన బోధను సంగ్రహముగ జిజ్ఞాసువులీ క్రింది రెండుశ్లోకముల తాత్పర్య వివరణమువలన సులభముగ గ్రహించగలరు.

శ్లో॥ స్వాత్మన్యేవ జగచ్చిత్రం, మాయాకార్య మితీక్షితుః ।
ఉపేక్షితే జగత్సర్వం, స్వాత్మైవ పరిశిష్యతే ॥

శ్లో॥ సర్వసాక్షి ప్రత్యగాత్మా, కూటస్థమచలం ధ్రువమ్ ।
స్వప్రకాశః పరంజ్యోతిః, పరమాత్మాహమచ్యుతః ॥

మానవునకు తనయొక్క ఆత్మస్వరూపమునందే యీ చిత్ర విచిత్రమైన జగదనుభవమంతయు మాయావిరచితము, అనగా వ్యవహారమునకు కల్పిత

మాత్రము, పరమార్థ వాస్తవముగాదను నిశ్చయముతో యీ జగత్తును అనగా స్వశరీర జగదనుభవములను ఉపేక్షింపగా, అట్టి మహనీయునకు తనయొక్క కేవల ఆత్మస్వరూపమే నిర్విశేషముగ శేషించి స్ఫురించుచుండును. అహం అనుకొను ఆత్మ తానేగనుక యీ ఆత్మవాస్తవస్వరూప మెట్టిది యనిన ఈయనయే సర్వసాక్షి, అనగా సర్వజీవుల హృదయమునందున ప్రకాశించుచు సర్వమును ప్రకాశింపజేయువాడు. ఈయనయే ప్రత్యగాత్మ, అనగా తనలో సాక్షీరూపముననున్న జ్ఞానస్వరూపుడు. ఈయనయే అచలుడైన నిత్యనిర్వికార కూటస్థుడు, అనగా కూటస్థాత్మ. ఈయనయే స్వప్రకాశ పరప్రకాశుడు, అనగా బాహ్యాంతరముల ప్రకాశింపజేయువాడు. ఈయనయే అవినాశియగు అఖండపరిపూర్ణ పరమాత్ముడు. కేవల చైతన్యమాత్రుడు. ఈ పరమాత్మయే అహం నేను అనగా నాపరమార్థ వాస్తవస్వరూపమని ఈ శ్లోకముల తాత్పర్యార్థము.

ఇట్టి నిశ్చయమునొందిన జ్ఞానాభ్యాసకులు వారివారి అభ్యాసాదులను సులభముగను, ప్రీతితోడను నాచరించగలుగుచుందురు. ఏలనన ఈ అభ్యాసాదులు ఆత్మసుఖమును పెంపొందించుచుండును. తనకు సుఖమైనదానియందు ప్రీతి సహజమేగదా? ఇట్టి అభ్యాసమే శ్రద్ధాళువులగు జిజ్ఞాసువులను శ్రుతి పరమ తాత్పర్యమగు, జీవబ్రహ్మైక్యము నొందించునట్టి పరమసాధనమగుచు "అహంబ్రహ్మాస్మి" అను జ్ఞానమునొందింపజేయును. అభ్యాసపాటవమునుబట్టి ప్రారబ్ధాంతమున తత్స్వరూపుడగును. అటుపైన అహం అను జీవతత్త్వముండదు కేవల ఆత్మస్వరూపుడేయగును. కావున "ఆత్మైవానందః" అను వచనమునను సరించి తాను (ఆత్మ) పరిపూర్ణానందస్వరూపుడగును. ఆత్మానందమును ప్రకాశింపజేయునది ఈ విద్యయే జీవునకు పునర్జన్మరాహిత్యమగు మార్గమిదియే. ఈ విషయమునే శ్రీకృష్ణపరమాత్మ గీతలలో యిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ అశ్వత్థమేనం సువిరూఢమూల
మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ।

శ్లో॥ తతఃపదం తత్పరిమార్గితవ్యం,
యస్మిన్గతాననివర్తన్తి భూయః ।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే,
యతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ ॥

శ్లో॥ నిర్మానమోహాజితసఙ్గదోషా,
అధ్యాత్మనిత్యావినివృత్తకామాః ।
ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖ సంజ్ఞై,
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయంతత్ ॥

ఈ అహంకార మమకారములను, అసఙ్గమను దృఢమైన కత్తితో వేరుగా చేసి వదలి, పిమ్మట యెవనినుండి చిరంతనమగు సంసారప్రవృత్తి ప్రసరించినదో, అనగా ఈ సర్వదృశ్యమునకు సర్వాధిష్ఠానమేదియో, ఆద్యుడగునట్టి పురుషునేపొందెదను; అని నిశ్చయము నొంది, యేపదమును బొందినవారగుచు మరల తిరిగిరారో ఆ పదమును వెదకవలయును. అహంకారము, మోహము, విడచినవారు పుత్రాది సఙ్గదోషమును జయించినవారు, ఆత్మజ్ఞానమే నిత్యముగాగలవారు, కోరికలను బాగుగ విడచినవారు, సుఖము దుఃఖము మొదలగు ద్వంద్వములచే విడువబడినట్టి, అవిద్య తొలగిన పండితులు అట్టిపదమును గూర్చి పోవుదురు.

శ్లో॥ నతద్భాసయతేసూర్యో, నశశాఙ్కోనపావకః ।
యద్గత్వాననివర్తన్తే, తద్ధామపరమంమమ ॥

మరియును, ఏస్థానమును సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ప్రకాశింపచేయజాలరో, ఏపదమునుబొంది (జీవులు) మరల తిరిగిరారో అది నా ముఖ్యస్థానమని శ్రీకృష్ణపరమాత్మ స్పష్టపరచుచున్నారు.

అనగా పరమార్ధవా స్తవమున జీవుడు పరమాత్మస్వరూపుడే గనుక జిజ్ఞాసువుయొక్క ఆత్మస్వరూపమే బ్రహ్మస్వరూపమని సాధకుడు బాగుగ తెలిసికొని స్వాత్మజ్ఞానానుభవము నొందవలయును. ఇదియే అపరోక్షానుభూతి యగు ఆత్మజ్ఞానము. ఇదియే జీవునకు అపరోక్షానుభూతియగు నిత్యనిరతిశయ సుఖస్వరూపము. ఈ ఆత్మజ్ఞానలాభముకన్న జీవుడు పొందగల అధిక లాభములేదు. అపరోక్షానుభూతియనగా బ్రహ్మ (ఆత్మ) సాక్షాత్కారమనియే అర్థము. దీని పరమలాభమును గురించి—

శ్లో॥ ధాతుర్లోకస్సాధితోవాతతఃకిం,
విష్ణోర్లోకో వీక్షితో వాతతఃకిం।
శంభోర్లోకశ్శాసితో వాతతఃకిం,
యేనస్వాత్మానైవసాక్షిత్కృతోఽభూత్ ॥

అనగా బ్రహ్మలోకప్రాప్తినొందినను, వైకుంఠలోకమును పొందినను, కైలాసమును పొందినను, వాటి ఆధిపత్యముల సాధించినను దేవతాసాక్షాత్కారములచే సర్వసిద్ధులునొందినను, పదునాలుగులోకముల కాధిపత్యము సంపాదించినను, స్వాత్మాపరోక్షానుభూతిలేనిది యివియన్నియు నిష్ప్రయోజనములు. ఇవియన్నియు ఆరోపితములగు కల్పితములు, అనిత్యములుగావున, నిత్యము అనగా శాశ్వతము, సచ్చిదానందరూపమగు మోక్షమును లభింపజేయునట్టి స్వాత్మజ్ఞానము నిరతిశయ శాశ్వతసుఖమున కావశ్యమని శ్రీ శంకర భగవత్పాదులును,

శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః, పునరావృత్తినోఽర్జున ।
మాముపేత్యతు కౌన్తేయ, పునర్జన్మ నవిద్యతే ॥

అనగా అర్జునా బ్రహ్మలోకపర్యంతము, అన్నియు పునరావృత్తిగల లోకములే గాని, నన్ను పొందినవారు మాత్రము మరల జన్మమునొందరని స్పష్టముగా శ్రీకృష్ణ పరమాత్మ గీతలలో తెలుపుచున్నారు. ఇచట నన్ను అనగా పరమా

త్మను, యని అర్థము. పరమార్థవాస్తవమున జీవుని స్వరూపము పరమాత్మయే గనుక, ఈ పరమాత్మ సాక్షాత్కారము నిరన్తర స్వాత్మాభిన్న పరమాత్మానుసంధానాద్యభ్యాసమువలనగాని పొందబడదు. అనగా ఈ సాధనములచే మానవుడు తన వాస్తవస్వరూపమును తాను తెలిసికొనును. తన స్వరూపమే తనకు వాస్తవముగ తెలియనప్పుడు దేనిని తెలిసికొన్నను లాభములేదని తాత్పర్యార్థము. కావున జిజ్ఞాసువులు ఈ ఆత్మానుసంధానాద్యభ్యాసములు, పునర్జన్మ రహితమగు అమృతత్త్వమిచ్చునట్టి పరమసాధనములను నిశ్చయము నొందుదురుగాక.

—o—

# తత్త్వ మంజరి

## ప్రత్యగాత్మాను సంధానము

గీతావచనము:—

శ్లో॥ యోమాం పశ్యతిసర్వత్ర, సర్వంచమయిపశ్యతి।
తస్యాహం నప్రణశ్యామి, సచమేనప్రణశ్యతి॥

అనగా ఎవడు సమస్త భూతములను తనయందును, సర్వభూతముల యందును నన్నును, అనగా ఆత్మస్వరూపుడగుతనను జూచునో, అట్టి బ్రహ్మైత్మైక్యాను సంధానముగలవానికి నేను అనగా ఆత్మ పరోక్షముగానుండదు. అట్టివాడు నాకును, అనగా పరమాత్మ స్వరూపమునకును, పరోక్షముగానుండడు అని తెలుపుచున్నది. ఇట్లు స్వాత్మానుసంధానము జేయుటకు నీక్రింది శ్లోకసమన్వయము ఉపకరించునుగాన తెలుపుచున్నాడను.

శ్లో॥ అఖండ సంవిదాకారః, పరమాత్మాహమచ్యుతః।
బ్రహ్మసత్యం జగన్మిథ్యా, నేహనానాస్తికించన॥

శ్లో॥ అహమ్ సర్వమిదం విశ్వం, ప్రత్యగాత్మాహమచ్యుతః।
జ్ఞానమాత్రస్వరూపోహం, సర్వదాదహరేస్థితః॥

శ్లో॥ అఖండపరిపూర్ణోహం, జ్ఞానమాత్రస్వరూపతః।
మయిసర్వమిదం ప్రోతం, సూత్రేమణిగణా ఇవ॥

శ్లో॥ మయాతతమిదం సర్వం, జగదవ్యక్తమూర్తినా।
మత్స్థానిసర్వభూతాని, నచాహంతేష్వవస్థితః॥

శ్లో॥ అహంసర్వస్యప్రభవో, మత్తస్సర్వంప్రవర్తతే।
అఖండపరిపూర్ణోహం, నామరూపవివర్జితః॥

శ్లో॥ చిదాకాశస్వరూపోహం, పరమాత్మాహమచ్యుతః ।
మయిసర్వమిదంప్రోతం, సూత్రేమణిగణా ఇవ ॥

శ్లో॥ జ్యోతిషాంచ మహజ్జ్యోతిః, జ్ఞానమాత్రస్వరూపతః ।
అహం హి సర్వభూతానాం హృదయే సర్వదాస్థితః ॥

శ్లో॥ అఖండపరిపూర్ణోహం, జ్ఞానమాత్రస్వరూపతః ।
మత్తఃపరతరంనాన్యత్కించిదస్తి జగత్త్రయే ॥

శ్లో॥ జ్ఞానాష్టకమిదంపుణ్యం, మోహఘ్నామబుధోదితమ్।
అధ్యేయం సతతంభక్త్యా, పరమానందదాయకమ్ ॥

## బ్రహ్మస్వరూప వర్ణనమ్

శ్లో॥ స్వాత్మాభిన్నం పరంజ్యోతిః, సర్వతేజోఽవభాసకమ్ ।
సర్వహృత్కుహరాన్తస్స్న, మేతద్బ్రహ్మపరంవిదుః ॥

శ్లో॥ కేవలం సంవిదాకారం, నిర్గుణంనిష్క్రియంసదా ।
సర్వసాక్షిప్రత్యగాత్మా, ఏతద్బ్రహ్మపరంవిదుః ॥

శ్లో॥ అఖండ సంవిదాకారం, పుణ్యపాపవివర్జితమ్ ।
జగజ్జన్మాదిహేతుశ్చ, ఏతద్బ్రహ్మపరం విదుః ॥

శ్లో॥ నిష్ప్రపంచం పరం జ్ఞానం మహాకాశమివస్థితమ్ ।
అస్తిభాతిప్రియంచేతి, ఏతద్బ్రహ్మపరంవిదుః ॥

శ్లో॥ పరిపూర్ణ చిదాకార, మద్వితీయమఖండితమ్ ।
చిన్మాత్ర మమలం శాన్త, మేతద్బ్రహ్మపరం విదుః ॥

శ్లో॥ ఆనన్దం సత్యరూపంచ, పరిపూర్ణ మివాంబరమ్ ।
నకించిద్భావనాకార, మేతద్బ్రహ్మపరం విదుః ॥

శ్లో॥ నిష్క్రియం నిరహంకారం, సచ్చిదానన్దలక్షణమ్ ।
స్వాత్మాభిన్నం పరంజ్యోతి, రేతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ నిత్యస్సర్వగత స్థాణుః, సర్వాధారః పరశ్శివః ।
పరమాత్మా పరంజ్యోతి, రేతద్బ్రహ్మపరం విదుః ॥

శ్లో॥ అఖండ సంవిదాకారం, నిత్యం సర్వగతం శివమ్ ।
ఏకమేవాద్వితీయంచ, ఏతద్బ్రహ్మ పరంవిదుః ॥

శ్లో॥ స్వాత్మాభిన్నం సుఖం యత్ర, యత్రనాన్యచ్చపశ్యతి ।
నాన్యచ్ఛృణోతి జానాతి, ఏతద్బ్రహ్మపరం విదుః ॥

శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం, సర్వేన్ద్రియ వివర్జితమ్ ।
సర్వభూతా న్తరాత్మస్థం, ఏతద్బ్రహ్మపరంవిదుః ॥

శ్లో॥ అఖండసంవిదాకారం, నిర్మలాకాశవత్సదా ।
నకించిద్భావనాకార, మేతద్బ్రహ్మ పరంవిదుః ॥

శ్లో॥ చిన్మాత్రమమలంశా న్తం, జ్ఞానమాత్ర స్వరూపతః ।
అఖండ సంవిదాకారం, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ స్వప్రకాశం పరంజ్యోతిః, నిత్యం సర్వగతం ధ్రువమ్ ।
నిష్ప్రపంచం నిరాకారం, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ సర్వాధిష్ఠాన సద్రూపం, సర్వతేజోఽవభాసకమ్ ।
నిష్క్రియాసంగ చిద్రూపం, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ స్వాత్మాభిన్నం పరంజ్యోతిః, సత్యం జ్ఞానమన న్తకమ్ ।
ఇతి యద్వర్ణితం శ్రుత్యా, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ బహిర న్తశ్చ భూతానాం, అచరం చరమేవచ ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ అవిభక్తంచ భూతేషు, విభక్తమివచ స్థితమ్।
అఖండ సంవిదాకారం, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ అఖండ చిద్ఘనానన్దం, సర్వభూత హృదిస్థితమ్।
సర్వసాక్షీ పరంజ్యోతిః, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ సర్వాధిష్ఠాన మాత్రంతు, జగజ్జన్మాది కారణమ్।
అఖండ సంవిదాకారం, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ వృత్తి విస్మరణం సమ్యక్, బ్రహ్మాస్మీత్యేవ నిశ్చయాత్।
ఏతద్జ్ఞానంచ మోక్షశ్చ, ఏతద్బ్రహ్మ పరం విదుః ॥

శ్లో॥ బ్రహ్మరూప మిదం స్తోత్రం, మోహహ్రనామ బుధోదితమ్।
యేపఠన్తి, సదా భక్త్యా, తత్సుఖం ప్రాప్నువన్తితే ॥

ఈ శ్లోక నామమును బట్టి కొందరిట్లు సంశయించవచ్చును. ఏది యనిన— బ్రహ్మము గుణక్రియా రూప రహితముగదా! దానికి స్వరూపమును వివరించుటెట్లు? ఇది సిద్ధాన్త విరుద్ధము కాదా? యనునది. వాస్తవమున బ్రహ్మ పదార్థము దుర్భేద్యమగు నిత్య నిర్వికార పరిపూర్ణ అద్వితీయాఖండ నిర్గుణ నిరాకారమైనను, బోధకొఱకు శ్రుతిమాతయే అన్వయ వ్యతిరేక క్రమము ననుసరించి బ్రహ్మను స్వరూప తటస్థ లక్షణములతో బోధించుచున్నది. అద్వైత సిద్ధాన్తమున కల్పిత లక్షణము లెన్ని యున్నను యుండవచ్చును. సిద్ధాన్త విరుద్ధము కాదు. ఇట్లుండు స్వరూప లక్షణములన్నియు జిజ్ఞాసు బోధ కొఱకు సాధనములు మాత్రమే యగునుగాని, తదితరములు కాజాలవు. కావున జిజ్ఞాసువుల బోధాను సంధాన లాభ సౌలభ్యము నుద్దేశించి దైవ ప్రేరితుడనై వీనిని రచించినాడ.

ఈ శ్లోకముల కర్థమును వివరించుటలేదు. ఏలనన— ఇవి అద్వైత సిద్ధాన్త సార గంభీరమగు అతి రసవంతములు. వీనికి సరియగు వివరణము ఒక ప్రత్యేక గ్రంథము కాగలదు. గ్రంథ విస్తర భీతిచే వ్రాయుటలేదు.

కాని జిజ్ఞాసువులు సద్గురు ముఖమునగాని, సామర్థ్యమున్న స్వయముగగాని నీ శ్లోకముల యర్థమును హృద్గోచరము గావించుకొని, వారు ఆచరించు సతతాభ్యాస పాటవాదులను బట్టి కాలక్రమమున శ్రుతి పరమ తాత్పర్యమగునట్టి జీవబ్రహ్మైక్య బోధ నొందగలరు. ఇది పరమ సాక్షాత్కార సాధనము గనుక నిందు సందియములేదు.

## శ్రీకృష్ణ తత్త్వమ్

కృష్ణ పరమాత్మనేనమః

శ్లో॥ మూకం కరోతి వాచాలం, పంగుం లంఘయతే గిరిమ్।
యత్కృపాత మహంవందే, పరమానంద మాధవమ్॥

శ్లో॥ ఆధారం సర్వభూతానాం, జగదవ్యక్త రూపిణమ్।
శ్రీకృష్ణం పరమాత్మానం, ధ్యాయేఽహం జ్ఞానసిద్ధయే॥

శ్లో॥ కృష్ణమోంకార లక్ష్యార్థం, జగత్పరమ కారణమ్।
నిత్యం సర్వగతం శాంతం, ధ్యాయేఽహం జ్ఞానసిద్ధయే॥

శ్లో॥ అఖండ సచ్చిదాకారం, పరిపూర్ణ మివాంబరమ్।
శ్రీకృష్ణం పరమాత్మానం, ధ్యాయేఽహం జ్ఞానసిద్ధయే॥

శ్లో॥ స్వాత్మాభిన్నం పరంజ్యోతిః, ప్రజ్ఞానం సర్వ హృత్స్థితమ్।
శ్రీకృష్ణం పరమాత్మానం, ధ్యాయేఽహం జ్ఞానసిద్ధయే॥

శ్లో॥ సర్వస్య ప్రభవం కృష్ణం, జ్ఞానమాత్ర స్వరూపతః।
సాకారం భజతాం కృష్ణం, యావత్సత్వం ప్రసీదతి॥

శ్లో॥ పరంజ్యోతిః పరాత్మానం, స్వాత్మాభిన్నం పరాత్పరమ్।
కృష్ణం హృదిస్థితం ధ్యాయేత్, స్వాత్మలాభ పరాయణః॥

శ్లో॥ నిరాకారంచ సాకారం, కృష్ణం వందే జగద్గురుమ్।
తత్త్వజ్ఞానార్థ సిద్ధ్యర్థం, భక్త్యా నిత్యం హృదిస్థితమ్॥

శ్లో॥ నిరాకారాయ సాకార, రూపిణే పరమాత్మనే ।
శ్రీకృష్ణాయ నమో నిత్యం, తత్త్వజ్ఞానార్థ దాయినే ॥

శ్లో॥ కృష్ణం కమల పత్రాక్షం, శంకచక్ర గదాధరమ్ ।
పరాత్మానం సదా ధ్యాయేత్, పీతాంబర ధరం హరిమ్ ॥

శ్లో॥ శ్రీకృష్ణం పరమాత్మానం, కోటి సూర్య సమ ప్రభమ్ ।
నిత్యం సర్వ గతం శాంతం, వందేహం జ్ఞానసిద్ధయే ॥

శ్లో॥ శ్రీకృష్ణం పరమాత్మానం, గురువాయు పురస్థితమ్ ।
భక్తాభీష్ట ప్రదం వందే, ఆర్తత్రాణ పరాయణమ్ ॥

శ్లో॥ కృష్ణస్తోత్ర మిదం పుణ్యం, మోహన్నామ బుధోదితమ్ ।
యఃపఠేత్ సతతం భక్త్యా, సర్వాభీష్ట మవాప్నుయాత్ ॥

"ఉపాసకానాం సిద్ధ్యర్థం, బ్రహ్మణో రూపకల్పనా" అను వచనమును బట్టి శాస్త్రమే సగుణాకారములను కల్పించి, జీవోద్ధరణమునకుగాను అనేక అవతారములను తెలుపుచున్నది. అట్టివానిలో పరిపూర్ణమగునది శ్రీకృష్ణావతారము. శ్రీకృష్ణ భగవానులే నేను పరమాత్మను యని గీతలలో తెలుపుచున్నారు. ఈ పరమాత్మ స్వాత్మాభిన్న అద్వితీయ, నిత్య నిర్వికార, అఖండ చిద్ఘనానంద, పరిపూర్ణ స్వరూపము. ఇట్లు తెలుపుచు సగుణాకారముగల యిట్టి నన్ను కేవల శరీర ధారిగనే తలచక నా వాస్తవ స్వరూపమగు నిత్య నిర్వికార, అఖండ పరిపూర్ణ చిద్రూపము స్వాత్మాభిన్నముగ నెవరు తెలిసికొనుదురో అట్టివారు జన్మరాహిత్యమగు మోక్షము నొందుదురనియు, తదితరులు, అనగా సగుణోపాసకులు ఉత్తమ గతిని పొందుచుందురనియు, గీతలలో స్పష్టపరచుచున్నారు. కాని అవ్యక్తమగు నా నిర్గుణ పరమాత్మ స్వరూపమునందాసక్తిగల వారికి నెక్కువ కష్టమనియు, నిది దేహాభిమానులకు అతి కష్ట దుఃఖములతో గాని పొంద నలవిగాదనియు గూడ, శ్లో॥ క్లేశోఽధికతరస్తేషా, మవ్యక్తా సక్త చేతసామ్ । అవ్యక్తా హిగతిర్దుఃఖం,

దేహవద్భిరవాప్యతే ॥ అను శ్లోకము వలన తెలుపుచున్నారు. కావున సాధకులు ప్రథమమున ఆ పరమాత్మ సగుణ రూపమును ఆలంబనముగ తీసికొని అభ్యసించుచుండిన, కాల పరిపాక, అభ్యాస పాటవాదులను బట్టి నిర్గుణ పరమాత్మ గోచరించుచుండును. అభ్యాసకులకిది స్వానుభవైక వేద్యముగాని యొకరు చెప్పునదిగాదు. అపుడు స్వాత్మాభిన్న, నిర్గుణ, పరమాత్మాను సంధానాదుల నాచరించుట సులభమగును. ధ్యానించుటకు గూడ ఈ రామకృష్ణావతార రూపములు మనోహరములు అతి ఫలవంతములు. ఈ తాత్పర్యమునే "పుంసాంమోహనరూపాయ" అను ఆర్ష వచనము చాటుచున్నది. ఈ రూప మాధుర్యమును తెలుపుటకే రాగి గీతలలో గూడ యిట్లు స్మరించబడినది

శ్లో॥ అపి బృందావనే శూన్యే, సృగాలత్వం సఇచ్ఛతి ।
నతునిర్విషయం బ్రహ్మ, కదా చిదపిగౌతమ ॥

అనగా కృష్ణ చింతా పరాయణుడగు వాడు శూన్యమైన బృందావనములో నక్కగా నుండుటకైనను కోరుకొనును గాని ఆనిర్విషయ బ్రహ్మ పదార్థమును కోరడు. అనగా అభ్యసించుటకు సగుణ కృష్ణ పరమాత్మ రూపము అంత సులభ, మనోహర, మాధుర్యమైనదనియు, నిర్విషయ బ్రహ్మ పదార్థమంత కష్ట సాధ్యమైనదనియు తాత్పర్యము.

కావున జ్ఞానాభ్యాసకులు ఆత్మ విచారాదులు చేయుచు పై శ్లోకముల యందు తెలిపిన యట్లు, స్వాత్మాభిన్న, నిరాకార, పరమాత్మ స్ఫురించునంత వరకు, కృష్ణాది సగుణాకార ధ్యానాదు లభ్యసించుటయందు శాస్త్ర తాత్పర్యమని గ్రహింతురుగాక.

---

# ఆత్మదేవార్చన

ఈ ఆత్మదేవార్చనానిరంతరాభ్యాసమువలన జీవుడు కాలక్రమమున నిత్య నిరతిశయానందరూపుడగును. ఇదియే పరమముక్తి. పరమార్థవాస్తవమున ప్రతిజీవునియొక్క యథార్థస్వరూపమును, పరమాత్మయగు నిత్య నిరతిశయానన్ద స్వరూపమే. కాని జీవుడిప్పుడు దానిని మరచి తన అనాది అవిద్యచే తెలిసికొనజాలక యున్నాడు. అది తనయందే, కంఠమందుండియు మరువబడిన మణి హారమువలె పరమాత్మ స్వరూపముననున్నది. జీవునకు దీనిని తెలిసికొని స్వానుభవము నొందుటయే నిత్య నిరతిశయానన్దప్రాప్తి. ఇచట ప్రాప్తియనగా యున్నదానిని జ్ఞప్తికితెచ్చుకొని యనుభవించుటయే. కావుననే జీవునకు తన పరమార్థ స్వరూపప్రాపకమగునట్టి ఆత్మదేవార్చన మావశ్యకమగుచున్నది. ఈ ఆత్మదేవార్చనవలన జీవుడు మరచిన స్వస్వరూపము నొందును. కనుక యిది ముముక్షువులగు సాధకులకు పరమానన్దప్రాప్తి సాధనము. తక్కిన పూజా విధానములన్నియు యనిత్యమగు అల్పఫలదాయకములును, పరమ్పరాసాధనములును. ఈ ఆత్మదేవుని పూజాభ్యాసమే సాక్షాన్ముక్తి ప్రదమనియు, సర్వోత్కృష్టసాధనమనియు, పరమార్థమున దేవుండనగా పరిచ్ఛిన్నమగు దేహాది రూపాదులుగావనియు, దేవశబ్దమునకు వాస్తవార్థము అపరిచ్ఛిన్న పరిపూర్ణజ్ఞాన స్వరూపమేయనియు, యిదియే ఆత్మరూపమనియు, యీదేవుని పూజించుటయే వాస్తవపూజయనియు, యోగవాశిష్ఠమందు మహేశ్వరుండు వశిష్ఠమునీంద్రులకును, వారు శ్రీరామచంద్రమూర్తికిని యుపదేశించి యుండిరి. అద్దానిని స్వలాభమునకు గ్రహించినవాడనై, యీబోధవలన అధికారుల సాధనాభ్యాసాదుల ప్రయోజనమును గూడ నభిలషించుచు యందుగొన్ని వచనముల తాత్పర్యార్థముతోడ నిచటయుదహరించుచున్నాడను. దేవశబ్దమునకు ముఖ్యార్థమును యిట్లు నిర్వచించుచున్నారు.

శ్లో॥ శృణు బ్రహ్మవిదాంశ్రేష్ఠ, దేవార్చన మనుత్తమం ।
నదేవః పుణ్డరీకాక్షో, నచదేవస్త్రిలోచనః ॥

శ్లో॥ నదేవో దేహరూపోవా, నదేవశ్చిత్తరూపకః ।
అకృత్రిమమనాద్యంతం, దేవనం దేవ ఉచ్యతే ॥

శ్లో॥ ఆకారాది పరిచ్ఛిన్నే, మితేవస్తుని తత్కుతః ।
అకృత్రిమమనాద్యంతం, దేవనం చిచ్ఛివంవిదుః ॥

బ్రహ్మవిదులలోన శ్రేష్ఠుండవగు ఓమునీంద్రా! దేవార్చన విధిని చెప్పుచున్నాఁడవినుము. దేవుండనఁగా కమలపత్రాక్షుండుగాని, త్రినేత్రుండుగాని, దేహరూపుండుగాని, చిత్తరూపుండుగాని కానేరడు. ఇకనేమన, నుపాధి రహితంబును ఆదిమధ్యాంతవర్జితంబునునగు దేవనము (జ్ఞానము) దేవుఁడని చెప్పంబడును. ఆకారాదులచే పరిచ్ఛిన్నంబై పరిమితంబగు పస్తువునందు దేవత్వమెటులనుండును. కావుననే నిరుపాధికంబును, ఆద్యంతవర్జితంబునగు జ్ఞానమే శివుఁడని వచింతురు. అట్టిజ్ఞాన రూపుండగు దేవునినే పూజింపవలయును.

శ్లో॥ అజ్ఞాత శివతత్త్వానా మాకారాద్యర్చనంకృతం ।
యోజనాధ్వన్య శక్తస్య క్రోశాధ్వా పరికధ్యతే ॥

శ్లో॥ చిద్వ్యోమైవకిలా ఽ స్తీహ పారావారవివర్జితం ।
సర్వత్రా సంభవచ్చైత్యం, కల్పాంతేషుచ శిష్యతే ॥

శ్లో॥ బోధస్సామ్యం శమశ్చేతి పుష్పాణ్యగ్ర్యాణి తస్యతైః
శివంచిన్మాత్రమమలం పూజ్యం పూజావిదో విదుః ॥

శ్లో॥ శమబోధాదిభిః పుష్పైర్దేవ ఆత్మాయదర్చ్యతే ।
తత్తు దేవార్చనం విద్ధి నాకారార్చన మర్చనమ్ ॥

శ్లో॥ అకృత్రిమమనాద్యంతమద్వితీయ మఖండితం ।
అబహిస్సాధనాసాధ్యం సుఖంతస్మా దవాప్యతే ॥

యోజనము దూరమనిన భయపడువానికి క్రోశము దూరమని చెప్పఁబడునటుల నిట్టి నిరాకారంబగు శివతత్త్వము నెఱుంగని వారలకు సాకారము నందర్చనము విధింపఁబడియెను.

అద్యంతవర్జితంబును, ద్వశ్యసంస్పర్శరహితంబును, కల్పాంతములయందు శేషించునదియు నగు చిదాకాశంబేకలదు.

తత్వజ్ఞానము, సమభావము, నిర్వికారచిత్తత, అనునివి చిద్రూపుండగు నాశివునకు పూజార్హములగు పుష్పములగుచున్నవి. వీనిచే చిన్మాత్రుండగు నద్దేవుని పూజింపఁదగిన వానిగా వచింతురు.

నిర్వికారచిత్తత, తత్త్వజ్ఞానము మొదలగు పుష్పములచేత నాత్మ రూపుండగు దేవుని నర్చించుటయే దేవార్చనమగుఁగాని ఆకారార్చనము అర్చనము కానేరదు.

నిరుపాధికంబును, అద్యంతరహితంబును, బాహ్యసాధనములకసాధ్యంబునునగు కైవల్య సుఖమాదేవార్చనము వల్లనే లభించుచున్నది.

శ్లో॥ పూజాక్రమేషు సర్వేషు దేహగేహం పవిత్రకం ।
త్యాజ్యం దేహావబోధాత్మ, గ్రాహ్యం యత్నాత్పవిత్రకమ్ ॥

శ్లో॥ ఏషదేవస్సపరమః పూజ్యఏషసదాసతాం ।
పూజనం ధ్యానమేవాంతర్నాన్యదస్త్యస్య పూజనమ్ ॥

శాస్త్రోక్తసంస్కారములచేతను, స్నానాచమనాదులచేతను, గేహము వంటి యీదేహము పవిత్రము చేయబడునదైనను యీపూజావిధులయందు యత్నముచే దానిని విడువవలయును. దేహముయొక్క పవిత్రమగు సాక్షిచిత్ప్రకాశ రూపమును మాత్రమే ప్రయత్నపూర్వకముగ గ్రహింపవలయును. సర్వప్రపంచమునకును సాక్షిచ్చిన్మాత్రుండగు నితండే, యుత్కృష్టుండగు

దేవుండు. ఇతడే సత్పురుషులకెపుడును పూజ్యుండు. ఇద్దేవుని పూజయన లోన ధ్యానించుటయేగాని యింతకన్న వేరొండుపూజలేదు.

శ్లో॥ తస్మాత్త్రిభువనాధారం, నిత్యం ధ్యానేన పూజయేత్ ।
చిద్రూపం సూర్యలక్షాభం, సమస్తాభాసభాసకమ్ ॥

శ్లో॥ అంతస్థ చిత్ప్రకాశంస్వ, మహంతాసార మాశ్రయేత్ ।
అపారపరమాకాశ, విపులాభోగకంధరమ్ ॥

శ్లో॥ అనంతాధస్తనాకాశ, కోశపాద సరోరుహం ।
అనంత దిక్తటా భోగ, భుజమండల మండితమ్ ॥

కాపున ముల్లోకంబులకు నాధారభూతుండును, చిద్రూపుండును, లక్ష సంఖ్యగల సూర్యులతో సమానమగు కాంతిగలవాడును, సమస్తమగు సూర్య చంద్రాదులను ప్రకాశింపఁజేయువాడును, లోపల ప్రకాశించుచున్న జ్ఞానమే స్వరూపముగా గలవాడును, అహంకారమునకు సారభూతుండునునగు పరమాత్మను ధ్యానంబుచే పూజింపవలయును.

శ్లో॥ చిదాకాశమయం సర్వంజగదిత్యేవభావయన్ ।
యస్తిష్ఠత్యుపశాంతోఽన్తః సబ్రహ్మకవచస్స్మృతః ॥

శ్లో॥ అహమర్థ విముక్తేన భావేనా భావరూపిణా ।
సర్వంశూన్యం నిరాలంబం చిద్రూపమితి భావయేత్ ॥

ఎవడు సమస్తమగు జగంబును చిదాకాశ రూపంబేయని భావించుచు లోననుపశాంతి నొందినవాడును, పరిపూర్ణమగు బ్రహ్మమే రక్షకముగా గలవాడునునగునో అట్టివాడు జీవన్ముక్తుండగు చున్నాడు.

అహంకార రహితంబును, నిరుపాధికత్వవ్యపదేశంబునునగు భావంబుచే సమస్తమగు జగంబును నిరాశ్రయంబును, చిద్రూపంబును, చిదాకాశంబును నని భావింపవలయు.

శ్లో॥ స్వప్రకాశం స్వమాత్మాన, మవలంబ్యా విలంబితం ।
ఆస్వసంపూరితాకాశం, జగంతి నృపపశ్యహే ॥

శ్లో॥ యదైవైవంచితోరూపం తతంబుద్ధ మఖండితం ।
తదైవతీర్ణ సంసారః పరమేశ్వరతాం గతః ॥

స్వప్రకాశంబగు నాత్మను శీఘ్రంబుగనేనని నిశ్చయించి సుఖంబుగ నుండుము. మరియు సమస్తమగు జగమునను నాకాశమున నిండియున్న యాత్మను గాంచుము.

ఎపుడునీవు వ్యాప్తమగు చిత్తుయొక్క రూపము నఖండాకారమైన దానినిగా నెరుంగుదువో అపుడే నీవు సంసారమును దాటిన వాడవై పరమేశ్వరత్వము నొందుచున్నాడవు. అనగా పరమానన్ద స్వరూపుడవే యగుదువని తాత్పర్యము. దీనికి “బ్రహ్మవిదాప్నోతిపరం” అనుశ్రుతివచనమే పరమ ప్రమాణము

సారాంశమున ఈ అభ్యాసకుడు సర్వదా తనదేహాది పరిచ్ఛిన్న స్వరూపమును, దీనితోడి తాదాత్మ్యమును (సాధ్యమగు నంతవరకు) జ్ఞానపూర్వకముగ తిరస్కరించి త్యజించుచు, అఖండ పరిపూర్ణ చిద్ఘనానన్ద స్వరూపమును తానుగనే సాక్షిచిన్మాత్ర భావము తోడ చింతించుచు అఖండ నిర్వికార పరిపూర్ణ చైతన్యమును స్వాత్మాభిన్న అఖండాకార వృత్తితోడ ప్రారబ్ధాంతమువరకు మననధ్యానాదుల నాచరించుచుండుటయే పరమ పురుషార్థ ప్రదమగు ఆత్మదేవపూజనమని గ్రహించవలయును.

—o—

# చిదాకాశానుభూతి-అభ్యాస నిరూపణ

పరమాత్మయన్నను, చిదాకాశమన్నను, బ్రహ్మయన్నను నొక్కటియే. చిదాకాశానుభూతి – అభ్యాసము, ఆత్మాపరోక్షజ్ఞానమునకు పరమోత్కృష్ట సాక్షాత్సాధనము. లోగడ గ్రంథములో నచటచట వివిధముగ యీ విషయము తెలుపబడియేయున్నది. అయినను సాధకులగువారుగూడ నీయభ్యాసమందు సంశయరహితులగుట, స్థితిదార్ఢ్యముబు కలుగుట సామాన్యముగాదు. కావున నీ సాధకుల యభ్యాసపాటవమునకుగాను యీ విషయమును మరికొంత విచారించుదము. మనమింతవరకును వేదమాతయొక్క పరమ తాత్పర్య గమకమగు మహావాక్యబోధ ననుసరించి జీవబ్రహ్మైక్యమే నిరతిశయ శాశ్వత సుఖస్వరూపమగు పరముక్తి, మోక్షము, యని తెలిసి కొని యుంటిమి. జీవుడు ముక్తినిగాంచుటకు స్వశరీరముతోసహ యీ దృశ్యనానా జీవజడజగన్మిథ్యాత్వమును బాగుగ గ్రహించి పరమార్థ వాస్తవ మున నున్నది ఆత్మస్వరూపమొక్కటియేనను నిశ్చయము నొందవలయును. తదుపరి అద్వితీయ అఖండ పరిపూర్ణ చిద్ఘనానంద స్వరూపమగు ఆత్మను స్వాత్మాభిన్నముగ అపరోక్షానుభూతి నొందువరకు అనగా ఆత్మసాక్షాత్కార ప్రాప్తివరకును మనననిదిధ్యసనాద్యభ్యాసములు గావించుచుండుట యావశ్య కము. అప్పుడు కాలపరిపాకమున అపరోక్షానుభూతి కలుగును. ఇది చిరకాల సతతాభ్యాసమువలనగాని గలుగదు. ఇట్టి అభ్యాసములేనిది, శాస్త్రమును నెంతగా పఠించి కేవల శ్రవణము గావించినను ఆత్మాపరోక్షానుభూతి కలుగుట దుర్లభము. ఆత్మసాక్షాత్కారము కలుగనిదే జీవునకు తాను కోరునట్టి సుఖము శాశ్వతముకాజాలదు. మోక్షస్వరూపమగు నిత్యనిరతిశయ సుఖము స్వాత్మా భిన్న బ్రహ్మజ్ఞానమువలననే కలుగవలయును. కాని యితర జ్ఞానమువలన కలుగు సుఖములు శాశ్వతములు కాజాలక జీవునకు దుఃఖపర్యవసితములగు

చుండును. కావున మోక్షసిద్ధికి స్వాత్మాభిన్న అఖండ పరమాత్మానుభూతి యావశ్యకము. ఏ మహనీయుడు యీ పరమాత్మను స్వాత్మాభిన్నముగ తెలిసికొని స్వానుభవము నొందునో అట్టిమహనీయునకే శాశ్వతసుఖప్రాప్తి. తదితరులకు యిది కలుగదు, అను యీ విషయమును "ఏకోవశీ సర్వభూతాన్తరాత్మా, ఏకంరూపం బహుధాయః కరోతి। తమాత్మస్థంయేఽను పశ్యన్తిధీరాః, తేషాం సుఖం శాశ్వతంనేతరేషామ్ ॥" అను కఠోపనిషద్వచనము విశదపరచుచున్నది. కాన ముముక్షువులకీ అభ్యాసము అమృతతుల్యము. సాధకులు అభ్యాసాదుల నాచరించుటకుగాను లోగడ ప్రకరణములలో వివిధ యుదాహరణములతోడ కొన్ని నిరూపణలు సాధకోపాయములుగ తెలుపబడెను. కాని యెంత తెలిపినను యెట్లు బోధించినను అభ్యాసకులకీస్వాత్మాభిన్న అద్వితీయ అఖండ పరమాత్మధ్యానము సుసాధ్యముగ మనోగోచరముగాక, స్వశరీరానుభవ జగన్నానాత్వములయందు సత్యత్వబుద్ధివిడువక బాధించుచునే యుండును. కావున జిజ్ఞాసువులగు సాధకులకు జీవబ్రహ్మైక్యాను సంధానాభ్యాసమునకు సులభముగ యుండునటులను, మనోగోచరమగుటకును యీ విషయమును మరికొంత విపులముగ నిరూపించుచున్నాడను.

దృశ్యరహితమైన అఖండచిత్తే పరిపూర్ణాత్మయని సర్వవేదాన్తసిద్ధాన్తసారము. దీనినే "ప్రజ్ఞానంబ్రహ్మ" యను మహావాక్యము బోధించుచున్నది. అద్వితీయమై పరిపూర్ణమై యొక్కటియగు యీ చిత్తుదృశ్యాకారము నొందుటయే, అనగా యీ యొక్కటియగు చిత్పదార్థమును నానాగాజూచుచు వాస్తవమనిసమ్మి అనుభవించుచుండుటయే జీవునకు జీవత్వము, సంసార బంధము. ఈ దృశ్యసంబంధమైన స్వశరీరాది నానాత్వమంతయు అనాత్మ, అవాస్తవమని తెలిసికొని స్వాత్మాభిన్నముగ సత్యజ్ఞానానన్తస్వరూపమగు అఖండాత్మానుభవము నొందుటయే ముక్తి, పరమపదము. ఈ ముక్తిని కోరునట్టి సాధకుడు సర్వదృశ్యమును వదలి అనగా వాస్తవముగాదను వివేకపూర్వక దృఢనిశ్చయముతోడ, తననే అనగా తన ఆత్మను నిత్యపరిపూర్ణ అఖండాత్మగా ధ్యానాదుల నభ్యసించుచుండవలయును. ఈ విషయమునే

"దృశ్యంహ్యాదృశ్యతాంనీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్" అను శ్లోకమువలన అపరోక్షానుభూతిలో శ్రీ శంకరభగవత్పాదులు బోధించుచున్నారు. కాని కన బడుచు అనుభవింపబడుచున్న యీ దేహాదిప్రపంచమును వాస్తవము గాదను కొనుట యెట్లు? ఇప్పుడు కనబడక యున్న ఆత్మను వాస్తవమని తెలిసి కొనుటయెట్లు అనునది జిజ్ఞాసులగు సాధకులకు ప్రధానసమస్య—సంశయము. దీనినిట్లు పరిహరించుకొనవలయును. ముక్తిని పొందవలసిన ముముక్షుసాధ కులకు ప్రారంభమున గురుబోధ, శాస్త్రవచన ప్రమాణములకన్న మరియొక ఆధారములేదు. ఇట్టి ప్రమాణబుద్ధి చిరకాలసత్కర్మానుష్ఠానాదులవలన ప్రయత్న పూర్వకముగ సంపాదించుకొనిన చిత్తశుద్ధివలనగాని కలుగదు. దీనిని సంపా దించి ప్రథమమున గురుశాస్త్రబోధయందు ప్రమాణబుద్ధినొంది శాస్త్రశ్రవణము చేసి, దానిని సయుక్తికముగ మననముగావించి ఆత్మధ్యానాభ్యాసాదుల నాచరించు చుండిన కాలక్రమమున గురుశాస్త్రబోధ స్వానుభవమునకు వచ్చుచుండును. అప్పుడు శాస్త్రబోధయొక్క యాథార్థ్యము తెలిసి, అభ్యాసమునందు ఉత్సాహము కలుగుచు దీని పరిపాకమువలన క్రమముగ జీవన్ముక్తి విదేహముక్తుల నొందును. అభ్యాసకులగువారలకు పైన తెలుపబడిన సాధనక్రమ విధానములో శ్రవణముచేసిన దానిని సయుక్తికముగ మననముగావించి తెలిసికొనవలయునని చెప్పబడినది, తెలియుట యనగా విషయము వృత్తి గోచరమగుట. ఇట్లగుటకు నీక్రిందివిచారము ముముక్షువులకు మరికొంత సహకరించును.

జిజ్ఞాసువులకు శ్రుతిమాత, "ఏకమేవాద్వితీయం, నేహనానాస్తి కించన" "తద్బ్రహ్మ" "సఆత్మా" "అయమాత్మా బ్రహ్మ" "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" "జీవో బ్రహ్మైవనాపరః" అను మొదలగు వచనములతోడ, జీవునకు యీ స్వశరీర సర్వ దృశ్యము మిథ్యామాత్రమనియు, వాస్తవమున నున్నది యొక్క ఆత్మ పదార్థమేననియు, అదినిత్య నిరతిశయ సుఖ స్వరూపమనియు, అఖండానంద స్వరూపమనియు, అది నీ నిజ స్వరూపమే ననియు, వాస్తవమున జీవుడు బ్రహ్మకంటె వేరుగాదనియు బోధించుచున్నది. ఈ ఆత్మ స్వరూపానంద రూపమగునట్టి స్వాత్మాభిన్న అఖండ అద్వితీయ

పరబ్రహ్మమును బాగుగ తెలిసికొని స్వానుభవము నొందుటయే ముముక్షు ఆశయము. కాని యిది స్వప్రయత్న విచారానుభవముల వల్లగాని తెలిసికొను టకు సాధ్యముగాదు.

శాస్త్రము జీవునకు అనుభవము నిచ్చుచున్న యీ దేహాది యుపాధు లన్నియు అవాస్తవములు, ఘట సమానములు, అనిత్యములని బోధించు చున్నది. వివేకుల యనుభవము వలన గూడ నిట్లే తెలియుచున్నది. చిత్-జడ మిశ్రితమైన యీ దేహోపాధులే అవాస్తవమగునపుడు కేవల జడోపాధులు యెట్లు వాస్తవములగును? కావు. అయినను యీ ప్రపంచమంతయు జీవ ప్రారబ్ధానుభవ నిమిత్తము, జీవ తరణోపాయ సాధనముగ కల్పితమైన ట్టిది. అట్లగుచో సర్వమును శూన్యమేనాయనిన, అట్లుకాదు. కల్పిత పదార్థము లన్నిటికిని విధిగా వాస్తవ పదార్థమొకటి మూలమై యుండి తీరవలయును. ఈ స్వశరీర సర్వ దృశ్యము కల్పిత మాత్రమని శాస్త్రము తెలుపుచుండుటచే దీనికి మూలము అనగా అధిష్ఠానమగు వాస్తవ పదార్థమొకటి యుండి తీర వలయును. ఇట్లున్న సర్వాధిష్ఠాన మొక్కటియే సత్యము, నిత్యము, పరి పూర్ణము, స్వప్రకాశము. ఇదియే చిద్ఘనానంద స్వరూపము, అవినాశి, ఆత్మ. దీని ఆధారముచేతనే యీ సర్వము ప్రకాశించుచున్నది. పరమార్థమున అదియే నీవు, ఆత్మయని శాస్త్రము మానవునకు బోధించుచు సర్వదా సర్వ జీవులును కోరుచుండునట్టి శాశ్వత స్వరూప సుఖము యీ ఆత్మయే యని స్పష్టముగా బోధించుచున్నది. ఈ ఆత్మ స్వరూప వాస్తవమంతయు, లోగడనే శాస్త్రానుసారమున తెలుపుచు అందు యీ ఆత్మ నిర్మల మహాకాశము వంటి చిదాకాశమనియు, స్వప్రకాశమనియు, అద్వితీయ అఖండ పరిపూర్ణ పదార్థ మనియు, నిత్య నిర్వికారమైన సత్య జ్ఞానానన్త లక్షణమనియు వివరింపబడి యున్నది. బోధ కొరకు యిట్లెంతగ వర్ణించినను యిది యంతయు ద్వితీయ రహితమైన యొక్కటియగు స్వాత్మాభిన్న పరిపూర్ణ చిత్పదార్థము. ఇదియే ఆత్మ. దీనియందే జీవునకు తన అనాది భ్రాంతిచే సర్వ దృశ్యానుభవము రజ్జువు నందు సర్ప భ్రాంతి లాగునను, స్వాప్నికుని యందు స్వప్న పదార్థములవలెను

భాసించుచు అంతకన్న కొంత దీర్ఘ కాలము యనుభవ మిచ్చుచుండును. కాని పరమార్థ వాస్తవమున యున్నది- తన చిదాకాశ రూపము దప్ప వేరొండు లేదని స్వప్రమాణముగ నిశ్చయించి యున్నాము. కాని దీనిని యెట్లనుభూతి నొంద వలయుననిన– జ్ఞానాభ్యాసకుడు భాగత్యాగ లక్షణముచే తన వాస్తవ స్వరూపము నిర్మల మహాకాశమువంటి చిదాకాశ స్వరూపమనియు, యిదియే తన నిత్య నిర్వికార స్వప్రకాశ అఖండ పరిపూర్ణ స్వరూపమనియు, భేదమనునది తన యందించుకయైనను లేదనియు, యీ భేదములన్నియు ఆకసమునందు గనబడునట్టి వివిధ గంధర్వ నగరముల వంటివనియు, మరియును మహాకాశములో నుండు అనన్తకోటి ఘటాకాశముల వంటివి యనియు గ్రహించవలయును. అనగా యీ ఘటాకాశములన్నియు వ్యవహార మాత్ర మునకే కాని, వాస్తవమున నున్నట్టిది మహాకాశ మొక్కటియే యని గ్రహించవలయును. ఎట్లనన– యెన్ని ఘటాకాశములుగా నున్నను, అన్నియు యొక్క మహాకాశమేగదా? ఈ మహాకాశ మొక్కటియే ఘటములున్నంత కాలము ఘటాకాశములని వ్యవహరింపబడుచుండును. ఇది వ్యవహార మాత్రమేగాని పరమార్థ వాస్తవ మెట్లగును? మహాకాశమునకు వాస్తవ విభాగ మనునది గలుగుట యసంభవముగదా. సర్వదా యొక్కటి యగు మహాకాశము యీ అనన్తకోటి (అనగా అంతములేని) ఘటముల (ఉపాధుల) యుత్పత్తికి పూర్వము ఘటములున్నంత కాలము, ఘటముల నాశానన్తరము యేక విధముగ నుండుచు యుపాధుల యుత్పత్తి నాశములతో యించుక యైనను సంబంధించక యుండుచున్నను ఘటములున్నంత కాలము మాత్రమే ఘటాకాశములని మహాకాశమునకు వ్యవహార సంబంధమెట్లు గల్పింపబడు చున్నదో యట్లే తన అద్వితీయ అఖండ పరమాత్మయందే మాయా కార్య మగు యీ అనన్తకోటి నానాజీవ జడోపాధులు భాసించుచున్నంత కాలము మాత్రమే వ్యవహార ప్రయోజనముకుగాను యీ సంబంధములన్నియు గల్పింప బడినవి యనిన్నీ యీ సంబంధములను నవి వాస్తవములు, నిత్యములు గావనియు తెలిసికొనవలయును.

మరియును, అభ్యాసకుడు యీజగన్నానాత్వమందు అద్వితీయ ఏకత్వ మునుబాగుగ గ్రహించుటకు లోగడ గ్రంథములో విపులముగ తెలుపబడినట్టి శాస్త్రప్రసిద్ధమగు సూర్యదృష్టాంతమును, యీకాలమున అందరి యనుభవ ములోనున్నట్టి శబ్దచలనచిత్ర దృశ్యములయందు శ్వేతామ్బరపట (White Screen) యుదాహరణను, యీ సందర్భమున తెలిపిన తదితర దృష్టాంత ములను మరువగూడదు. ఇంకను యీదృశ్యనా నాత్వము యుపాధి సమూహ మంతయు యవిద్యాకల్పితమై జీవునకు ప్రారబ్ధాను భవమునిచ్చునిమిత్తము యీప్రపంచమున యుత్పత్తినాశములొందుచుండునేగాని సత్యమాలోచించిన యిట్టి కల్పితోపాధులతో తనకెంతమాత్రము వాస్తవమగు సంబంధ బాంధవ్య ములు లేవను నిశ్చయముతోడ తనస్వస్వరూపమును చిదాకాశరూపముగ తెలిసికొనవలయును. తాను పరిపూర్ణ చిదాకాశరూపుడననియు, యుత్పత్తి నాశరహితుడననియు, అపరిచ్ఛిన్నుడననియు, నిత్యనిరతిశయానన్ద రూపు డననియు తెలిసికొనవలయును.

ఇట్లెంతగ నెన్నివిధముల బోధించినను జ్ఞానాభ్యాసకులకు, వారి వారి అభ్యాసమునకు ప్రధానాటంకమని తలచునట్టి యొకపెద్ద సంశయమునకు సమాధానము చెప్పవలసియున్నది. అది ఏదియనిన, బాగుగనభ్యసించిన యెంతటి జ్ఞానబలముతోడనైనను, నేనీదేహాదులుగాను, నేను అద్వితీయ అఖండ పరమాత్మస్వరూపుడను, యనియెంతగ మననధ్యానాదులు చేయు చున్నను క్షుత్పిపాసాదులు, సుఖదుఃఖానుభవములు, విడచుటలేదే! వీనినెట్లు పరిహరించుకొనుట? ఇదిసాధ్యమగుటలేదే యనునట్టిది. ఇది కొంతవరకు యధార్థమేయైనను ముముక్షువు అభ్యాసము నందు నిరుత్సాహము జెందగూడదు. ఏలనన మానవునకు (జీవునకు) తన ప్రారబ్ధ సుఖదుఃఖ ఫలభోగమునకుగాను యీదేహము కల్పితమై అనగా నిమిత్తమగుచు యీ జన్మగలుగుననియు, యిది విధింపబడిన శిక్ష వంటిదనియు లోగడనే సవిస్తరముగ నిరూపింప బడినది. ఎవరికైనను శిక్షయనునది ఆగన్తుకముగాని సహజము గాదుగదా. కావున నిదితాత్కాలికమేగావలయును. అయినను శిక్షాకాలములో కారాగృహ

బాధలు విడువవుగదా. దాని నుల్లంఘించరాదు. ఏలనన, విధి నుల్లంఘించుట యను నేరమునకు యధికశిక్ష విధింపబడును. కావున దీనిని వివేకముతోడ యోర్చుకొని యనుభవించవలసినదేగాని వేరుమార్గములేదు. కాని జ్ఞానప్రబోధ తోడ నొందునట్టి సుఖదుఃఖ భోగములెంతటివైనను, యట్టి భోగములయందు తీక్ష్ణ, విజృంభణలు జ్ఞానబలమువలన తగ్గి అనగా క్షీణించి యనుభవముల నిచ్చుచుండును. అభ్యాసకులకు ఇట్టి భోగానుభవములు భావి ప్రతిబంధము గాజాలక అభ్యాసమునకు మాత్రము సహకరించుచుండును. ఇది గొప్ప లాభము. కావున పుత్రోత్పత్తి నపేక్షించు గర్భవతి నవమాసములలో గలుగు వికారములను, పిండభారమును, ప్రసవవేదనను, వీటినన్నిటిని యెట్లు సహించి యుత్సాహముగ యుండునో యట్లే ముముక్షువు ప్రారబ్ధమునుబట్టి తనకు గలుగు యెంతటి సుఖదుఃఖములనైనను వాటియందల్ప దృష్టితోడ యుత్సాహముగ యనుభవించుచు తన బ్రహ్మాభ్యాసమును విడువక నాచరించు చుండినయడల కాలపరిపాకమున తప్పక ఫలము గలిగితీరును.

ఇదిగాకను మానవులు వారి ఆరోగ్య సుఖముకొరకు శస్త్రబాధ, జ్వర బాధ, వ్రణ బాధలు మొదలగువానిని సహించి సుఖము నొందుచున్నారుగదా. అట్లే జ్ఞానాభ్యాసకుడు తన శాశ్వత సుఖమునకు ఈ దేహము నేనుగాను, నేను పరిపూర్ణ సుఖస్వరూపుడను, పరమాత్ముడను యని యనుకొనుట కేమి కష్టమున్నది. అనగా ఈ మాత్రమైన దీనిని గష్టముగా తలచక సహించవల యునని :—

శ్లో॥ శస్త్రాగ్నిఘాతాః ప్రసహ్యంతే, సహ్యంతే వ్యాధివేదనాః ।
నాహమిత్యేవమాత్రస్య, సహనేకాకదర్ధనా ॥

అని శ్రీ వశిష్ఠభగవానులు బోధించుచున్నారు. ఎంతటి చిన్నఫలమైనను కొంత త్యాగము, కష్టములేనిది గలుగదుగదా. అట్టియడ సాధకుడు కోరునట్టి మహత్తరమగు నిరతిశయ శాశ్వతసుఖము త్యాగము కష్టములేక యెట్లు

బడయసాధ్యము. కావున అభ్యాసకుడు వారి ఆశయమగు పరమాత్మ సాక్షాత్కారము నొందుటకుగాను తన ప్రారబ్ధ సుఖదుఃఖానుభవము లెట్టివియయినను యుత్సాహముతోడ ననుభవించుచు తన అభ్యాసాదులను నిరన్తర మాచరించుచుండుట యావశ్యకమని గ్రహించవలయును.

మరియును నానారంధ్రములుగల ఘటము నడుమ యొక దీపజ్యోతి నుంచినయడల, ఆ యొక్క దీపపుకాంతియే యన్ని ఘటరంధ్రములనుంచి యెట్లు ప్రకాశించుచుండునో యట్లే యీ యొక్కటియగు అద్వితీయ అఖండ పరమాత్మ ప్రకాశమే నానాజీవులయందు ప్రకాశించుచున్నదనియు ఆ ప్రకాశమే తెలివి, జ్ఞానముయనియు, అదియే తాననియుగూడ గ్రహించుట సులభమేగదా. సర్వ ఆత్మయొక్కటి, యుపాధు లనేకములనిన్నీ వాటికి గలుగుచున్న తెలివి యంతయు యీ ఆత్మప్రకాశమేయనిన్నీ, ఆత్మస్వరూపు డగు తనచేతనే స్వశరీరాది సర్వమును తెలిసికొనబడుచున్నదనిన్నీ అభ్యాసకులు తమ యనుభవమువలనగూడ తెలిసికొనవచ్చును. ప్రతి జీవియును యిది నాకు తెలిసినది, తెలియలేదుయని జ్ఞానాజ్ఞానములు రెంటికిని తాను సాక్షిగా యుండి గ్రహించుచున్నాడుగదా? ఇదియే తెలివి. ఈ తెలివి మాత్రమే తాను అనగా నేను యనుకొనబడుచున్నట్టి "అహం" ప్రతీతికి వాస్తవార్థము. జీవుని పరమార్థస్వరూపము. తానే సర్వమును చూచువాడు, తెలుసుకొనువాడు. ఈయనయే సాక్షి. తెలిసికొనువాడెప్పటికినీ తెనుసుకొనబడువాడు గాజాలడని సర్వానుభవములో నున్నదియే. ప్రతి మానవుడును నాదేహము, నాప్రాణము, నామనసు యని వీనివి తనవాటినిగా తలచుచు తాను వీటికి స్వామిగాయుండి, సర్వమును జూచుచున్నాడు. స్తంభకుడ్యాదులును చూచునట్టి నేత్రమును, జూడబడుచున్నట్టి స్తంభాదులును నొక్కటి గాజాలవుగదా? అయినను జీవుడు అనాదిభ్రాంతియుతుడై తనచే తెలుసుకొనబడుచున్నట్టి మనః ప్రాణాదులకు తాను స్వామిగాయున్నను తన స్వామిత్వమును మరచి యీ దేహ సమూహమునే తానని తన అనాది అజ్ఞానమువలన నమ్ముచున్నాడు. ఇది భ్రాంతిగాక సత్యమెట్లగును? కాదు. పరమార్థమున ఈ నేను, నేను యను తెలివియే తాను

గాని, అనాదిభ్రాంతియుతుడై నేను యని తలచుచున్న దేహాదులు తానుగాడు. సకలజీవరాశియందు యున్న ఈ తెలివియను పదార్థ మొక్కటియే. ఇదియే పరమాత్మ. ఇదియే తాను. ఈయనయే పరమార్థ జీవుడు, శుద్ధజీవుడు, బ్రహ్మ, ఆత్మ, జ్ఞానము, చిదాకాశము, యనుపర్యాయపదములతోడ తెలియబడువాడు. ఇట్టి పరిపూర్ణాత్మయైన తాను అనగా నేను పరిచ్ఛిన్న జీవుడనను కొనుట అభాస మాత్రమేగాని వాస్తవమెట్లగును? జీవభావమును జయించిన స్వాత్మయే బ్రహ్మ, చిదాకాశము. ఇది అఖండ పరిపూర్ణ జ్ఞానమాత్రము. ఈ ప్రపంచ మంతయు జ్ఞానమున కధీనమైయున్నది. ఎంత విచారించినను దీనిని విడచి లోపలగాని, బయటగాని యేదియును వాస్తవమనునది గనుబడదు. వాస్తవ మున బాహ్యాంతరముల బరిపూర్ణముగ నుండునట్టి ఈ అఖండజ్ఞానస్వరూపమే, ప్రజ్ఞానము, బ్రహ్మ, పరమాత్మ. ఇదియే స్వశరీర సర్వదృశ్యమునకు అధిష్ఠానము. అనగా సర్వాధిష్ఠానము. ఇట్టి అద్వితీయ అఖండ సర్వాధిష్ఠానమగు పరమాత్మయందే ప్రపంచము కల్పితమై భాసించుచున్నది. ఇది అజ్ఞాన కార్యము. కావున జ్ఞానాభ్యాసకులు కల్పితమగు నీ సర్వదృశ్యమును అవాస్తవ మను నిశ్చయమునొంది జ్ఞానపూర్వకముగ దృశ్యమును త్యజించినయడల అప్పుడు నిర్విశేషముగ శేషించునది తన ఆత్మయొక్కటియే. ఇదియే చిదాకాశము. ఇది సర్వజీవుల హృదయమందునను సర్వాంతరముగ అతి సూక్ష్మమై స్వచ్ఛముగ యుజ్జ్వల ప్రకాశముతోడ నుండును. ఈ ప్రకాశముతోడనే జీవుడు తననుతాను తెలిసికొనుట, తనకు బాహ్యమున యున్నదానిని గ్రహించుట గూడ జరుగుచున్నది. సూర్య చంద్రాదులును, తేజోరూపమగు నగ్నియు, అది యిది యననేల, సర్వమును ఈయన ప్రకాశమువలననే ప్రకాశించు చుండును. ఈ ఆత్మప్రకాశము లేనిచో నేమియును ప్రకాశింపదు, తెలియబడదు. ఇట్లున్న ఆత్మ మనలోపలనుండి యుండియు మనకేల యగుబడుట లేదు యను సంశయమునకు సమాధానము - జీవునికిగల తన అనాది అవిద్యయే, అనగా అజ్ఞానమే స్వాత్మయొక్క వాస్తవస్వరూపమును మరగు పరచుటకు కారణము. అజ్ఞానమను నీ యవిద్య అత్మ వాస్తవస్వరూపమును

మంచువలె గప్పియుంచును. ఇదియే ఆత్మను గప్పియుంచు ఆవరణము, ఇదియే ఆత్మ గనబడకుండుటకు కారణము. కారణమును తీసివేసినగాని కార్యము నివర్తింపదుగదా. కావున యేజీవుడు స్వప్రయత్నముతో తన యజ్ఞానమును, జ్ఞానాగ్నితోడ నిర్మూలించగలుగునో యట్టి మహనీయునకు ఈ పరమాత్మ స్వాత్మాభిన్నముగ సాక్షాత్కరించును. అనగా అజ్ఞానావరణ భంగమగును. అప్పుడు తానే పరమాత్మ స్వరూపుడనని తెలిసికొనును.

సారాంశముగ ఆత్మ జిజ్ఞాసువులగు సాధకులు శాస్త్ర విచారాదుల వలన ప్రథమమున జగన్మిథ్యాత్వ నిశ్చయము నొంది జ్ఞానపూర్వక దృశ్య త్యాగము తోడ భాగ త్యాగ లక్షణము వలన స్వాత్మ గ్రహణము చేయుట బాగుగ నభ్యసించుచుండవలయును. ఈ అభ్యాసకుడు సర్వదా అభ్యసించవలసినది దృశ్య త్యాగము, స్వస్వరూప గ్రహణము. ఇట్టి చిరాభ్యాసము వలన కాల పరిపాక అభ్యాస పాటవములను బట్టి చిదాకాశానుభూతి గలుగును. ఈ సాధన క్రమమునే శ్రీ శంకర భగవత్పాదులు "దృశ్యంహ్యా దృశ్యతాం నీత్వా, బ్రహ్మాకారేణ చింతయేత్" అను శ్లోకము తోడ అపరోక్షను భూతిలో యుపదేశించుచున్నారు.

గ్రంథ మెంతగా బోధించినను, గురువెంత యుపదేశించినను, జిజ్ఞాసువులకు సతతాభ్యాస పాటవముల వలనగాని ఈ యవిద్యా క్లేశము, సంశయములు యుపశమింపవు. ప్రారబ్ధాంతము వరకును నాచరించ బడునట్టి సతతాభ్యాస పాటవము వలనగాని ఆత్మాపరోక్షానుభూతి గలుగదు. ఈ యనుభూతి ఒక్కక్షణములో గలుగును. అటు పిమ్మట కర్తగాని కర్తవ్యములుగాని యుండవు. ఉన్నట్లుండినను వాస్తవము చేత యుండవు. కావున కర్తృత్వ భోక్తృత్వాదులు వాస్తవముగ లేనివాడే యగును. అట్టి మహనీయులకు పటములో జూచిన దేశముకన్న స్వయముగా జూచిన దేశము యెట్లు విస్పష్టమగునో, యట్లే ఆత్మ ప్రకటితమగును. అనగా అజ్ఞానావరణము తగ్గునని యర్థము. అజ్ఞానము తగ్గుట వలన ఆత్మ ప్రకాశము యధికముగా గోచరిం

చును. ఆత్మ సుఖ స్వరూపము గమక క్లేశము స్ఫురింపదు. సర్వ సంశయములు విడును. ఆత్మానందము ప్రకాశించును. సాధకులకు ఆత్మా పరోక్షానుభూతికి నిరన్తరాభ్యాసమే శరణ్యము. ఈ సతత జ్ఞానాభ్యాసము వలననే చిదాకాశానుభూతి కలుగును. ఎట్లనిన :

శ్లో॥ ఏకతత్త్వ ఘనాభ్యాసా, దహం బ్రహ్మేతి నిశ్చయాత్ ।
చిత్తంహ్యా చిత్తతాం గత్వా, చిదాకాశం విశిష్యతే ॥

ఈ సాధనాభ్యాసమును గురించి శంకించుటగాని, విసుగుజెందుటగాని వివేకముగాదు. అభ్యాసము వలన పొందబడని సిద్ధి యుండదు. ఈ విషయమును "అభ్యాసాత్సర్వ సిద్ధిః స్యాదితి వేదాను శాసనమ్" అను శ్రీ వశిష్ఠ వచనము విశదము జేయుచున్నది. జ్ఞానాభ్యాసకుడిచట యొక విషయమును మరువగూడదు. ఏది యనిన - యీ అభ్యాసకుడెంతటి మహనీయుడైనను ప్రారబ్ధ శేషమున్నంతవరకు దేహము విడువదు. దేహమున్నంతవరకు దేహ ధర్మములు విడువవు. ప్రారబ్ధము పూర్తిగ నశించిన తోడనే దేహమనునదియే యుండదు. సాధకుడప్పుడు అపరిచ్ఛిన్న, అఖండ, సంవిదాకార స్వరూపుడే యగును. పరమానంద స్వరూపుడగును. ఏతత్పర్యంతము పరిచ్ఛిన్నమగు యుపాధి ధర్మములతోడనే చిదాకాశ రూపమగు బ్రహ్మానంద సుఖమును స్వాత్మాభిన్న జ్ఞానముతోడ ధ్యాన సమాధులందనుభవించుచు, వ్యవహార కాలమందు గూడ యట్టి జ్ఞానముతోడనే సమస్త కర్మల నాచరించుచు యుపాధి విలయానన్తరము తత్స్వరూపుడగును. అది సిద్ధ స్వరూపస్థితి. బ్రహ్మవిద్యా సంప్రదాయ ఋషి పుంగవులును, మహనీయులైన జ్ఞానులును గూడ వారి వారి దేహ ధర్మముల ననువర్తించుచునే యిట్టి స్థితిని పొందినటుల పురాణేతిహాసముల వలన స్పష్టమగుచున్నది. ఎవరైతే దేహ ధర్మములను విడచి పరమాత్మ స్వరూపమగు అఖండ పరిపూర్ణ సంవిదాకారము, అపరిచ్ఛిన్నముగ నొంద ప్రయత్నించుదురో యట్టివారి ప్రయత్నము ఆకసమును కత్తిపెట్టి పొడుచుటకు ప్రయత్నించుట వంటిదని శ్రీ వశిష్ఠ భగవానులు తెలుపుచున్నారు.

కావున అభ్యాసకులు వారి దేహ ధర్మములతోడ ప్రారబ్ధానుభవ వ్యవహారముల గావించుచునే యీ విద్యను పొందవలసియున్నది. ఇట్లు చేయుట సాధ్యమా యని సంశయము నొందగూడదు. ఏలనన మానవుడెన్ని వ్యవహారముల నాచరించుచున్నను తాను గట్టిగ మనసార ప్రేమించు వస్తువును మరువడు. అది మనసున యుంచుకొనియే తన సమస్త వ్యవహారముల జేయుచు దాని సాధన కొరకు యత్నించుచుండునుగదా? ఇది సామాన్యానుభవములో నున్నదే. ఈ విషయమునే శ్రీ విద్యారణ్యస్వామి "పరవ్యసనినీనారీ వ్యగ్రాపి గృహ కర్మణి" అను శ్లోకోదాహరణతో పంచదశియందు బోధించు చున్నారు. మానవునకు ప్రారబ్ధమును బట్టి వ్యవహారాచరణ తప్పదు. ఇట్టి యనుభవముతోడనే సాధకుడు తన లక్ష్యమగు స్వస్వరూప ప్రాప్తి నొంద వలయును. దీనికి కావలసినది, యీ ఆత్మ విద్యయందు పరమ ప్రీతిని సంపా దించుకొనుటయే. తదుపరి సాధకుడు తన వ్యవహారానుభవముల నెట్లొందు చున్నను యీ విద్యాభ్యాసమును మరువక నాచరింపగలుగును. అభ్యాసపాట వమును బట్టి కొంత కాలమునకు దీనిని విడచుట కూడ క్లేశకరముగ నుండును. అనగా యిచ్ఛయింపడు. అన్న పానాదులవలె, నీ యభ్యాసము గూడ జరుగుచుండును. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకులు యీ విద్యయందు ప్రీతి నిశ్చయముల సంపాదించి వారి వారి ప్రారబ్ధ సుఖ దుఃఖ భోగాను భవము లెట్టివైన, యెంతటివైనను వానిని దేహ ధర్మములని యెంచి యీ విద్యను సాధించవలయునేగాని వేరు మార్గములేదు.

కాన సాధకులు గురు శాస్త్రబోధ ననుసరించి బాగుగ నభ్యసించి స్వాత్మజ్ఞానమునొంది, అసజ్ఞ వ్యవహారముతోడ వారి ప్రారబ్ధ క్షయమును గావించుకొని ముక్తిని బడయవలయునేగాని వేరు మార్గములేదు. ఇంచుక ప్రారబ్ధశేషముండి బ్రహ్మపరోక్షానుభూతి పొందినవారే జీవన్ముక్తులు. వీరుగూడ ముక్తులే, సందియములేదు. కాని కొంత కాలము అసజ్ఞ వ్యవహారముండును. ఇది మానసికము. ప్రారబ్ధ నిశ్శేషమైన జ్ఞానులు యుపాధి విలయమై అఖం డాత్మానంద స్వరూపులగుదురు. వీరిరువురకును వ్యవహార భేదమేగాని స్థితి

భేదమేమియు నుండదు. వీరు సంసారమును దాటిన మహనీయులు. కృత కృత్యులు.

సాధకులగు వారికి గూడ ఈ బ్రహ్మవిద్యా విచారాభ్యాస ఫలమును గురించి :

శ్లో॥ స్నాతంతేన సమస్త తీర్థసలిలై, స్సర్వాపిదత్తాఽవని।
ర్యజ్ఞానాంచ కృతం సహస్రమఖిలా దేవాశ్చ సంపూజితాః॥

సంసారాచ్చ సముద్ధృతాః స్వపితర, స్త్రైలోక్యపూజ్యోఽప్యసౌ।
యస్య బ్రహ్మ విచారణేక్షణమపి, స్థైర్యం మనః ప్రాప్నుయాత్॥

ఎవ్వని చిత్తము బ్రహ్మ విచారమునందు క్షణము సేపైనను స్థైర్యమునొందునో, వాడు సమస్త తీర్థములందు స్నానము చేసినవాడును, సమస్త భూమిని దానము చేసినవాడును సహస్ర యజ్ఞములు చేసినవాడును, సమస్త దేవతలం బూజించిన వాడునగును. వాని పితరులు సంసారమునుండి యుద్ధరింపఁబడుదురు. వాఁడు ముల్లోకములయందును పూజ్యుఁడగుచున్నాడు, అని వాశిష్ఠ వచనము తెలుపుచున్నది.

సారాంశమేమనిన - సర్వోపనిషత్పరమ తాత్పర్యమగు అద్వైత సిద్ధాన్తము మోక్షమానన్దరూపమని, ఆత్మరూపమని, శరీరముండగనే అది లభించునని, శాశ్వతమని, అందుచేతనే ధర్మ, అర్థ, కామములను మూడు పురుషార్థములకంటె మోక్షమే పరమపురుషార్థమని తెలుపుచున్నది. ఈ విషయము శాస్త్రము చెప్పుటయేగాక విద్వదనుభవము వలనగూడ నిశ్లే తెలియుచున్నది. ఇట్టి మోక్షము నొందుటకు జ్ఞానమే సాధనముగాని వేరు సాధనములేదనిగూడ శాస్త్రిమే తెలుపుచున్నది. ఈ విషయమును "జ్ఞానాదేవతుకైవల్యమితి వేదాన్త డిండిమః" అను వచనము స్పష్టముజేయుచున్నది. ఇచట జ్ఞానమనగా సదాత్మజ్ఞానమనియేగాని వేరుగాదని జిజ్ఞాసువులు గ్రహించవలయును. జీవుడు శాశ్వత సుఖము బడయుటకు ఆత్మజ్ఞానమే సాధనము

గాని, మరి వేరొండుగాదు. ఈ జ్ఞానము వలన గలుగునదియే ఆత్మానన్దము. ఇది నిత్యము, అనగా యెన్నటికి, నశించనట్టిది. పురుషునకు ప్రాపంచిక విషయముల వలన గలుగునట్టి, యెట్టి, యెంతటి ఆనన్దమైనను తాత్కాలికమై నశించునదే. పురుషునకు యీ ఆత్మానన్దముతప్ప ఇతరానన్దము లన్నియు కాలాన్తరమున నశించి పర్యవసానమున దుఃఖము నొందిజేయు నవియే. ఆత్మానన్దము నిత్యనిరతిశయమైన సుఖస్వరూపము. ఇది అద్వితీయ అఖండ పరిపూర్ణ చిద్ఘనానందరూపము, నిత్యము. ఇట్టి శాశ్వతసుఖము నభ్య సించువాడే బ్రహ్మాభ్యాసకుడు. ఈ అభ్యాసకుడు తన ప్రారబ్ధానుసరణమున యెంతటి సుఖదుఃఖభోగముల ననుభవించుచున్నను తన పరమార్థ స్వరూప మును తెలుపునట్టి "సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవా ద్వితీయం," "విజ్ఞానమానన్దంబ్రహ్మ, తత్త్వమసి" అను వాక్యబోధను మరువక శ్రీ శంకర భగవత్పాదుల బోధసారమగునట్టి "విశ్వం దర్పణ దృశ్యమాననగరీతుల్యం, నిజాన్తర్గతం పశ్యన్నాత్మనిమాయయా, బహిరివోద్భూతం యథానిద్రయా। యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయం" అను శ్లోకార్థ మును బాగుగ మనసున నుంచుకొని తన సర్వ వ్యవహారముల నాచరించు చుండవలయును. ఇది అభ్యాసము.

బ్రహ్మప్రాప్తికిట్లు తానభ్యసించునట్టి స్వస్వరూపాను సంధానము చిదాకాశ స్వరూపము. చిదాకాశమన్నను బ్రహ్మయన్నను పర్యాయపదములే గాని వేరుగావు. ఈ బ్రహ్మ చిదాకాశస్వరూపుడు. ఈ స్వరూపము జీవునకు తన హృదయపుణ్డరీకమునందే తెలియబడునుగాని, అన్యత్ర తెలిసికొనుటకు సాధ్యముగాదు. సాధకుడిట్లు తెలిసికొని చిదాకాశానుభూతి నొందుట కుపాయ మగు సాధనాభ్యాసములు లోగడ నిరూపింపబడినవి. అయినను ముముక్షుసాధ కుల జ్ఞానదార్ఢ్య ప్రయోజనములనుద్దేశించి ఛాన్దోగ్యోపనిషత్తునందలి ఒకటి రెండు వాక్యముల సంగ్రహించి, ప్రకృత తాత్పర్యార్థముతోడ నిచట నుదాహ రించుచున్నాడను.

"అథయదిదమస్మిన్ బ్రహ్మపురేదహరం పుణ్డరీకం వేశ్మదహరోఽస్మి
న్నన్తరాకాశ స్తస్మిన్ యదన్త స్తదన్వేష్టవ్యం తదుపాసితవ్యం, తద్వావ విజి
జ్ఞాసితవ్యమితి"

రాజునకు పట్టణమువలె బ్రహ్మమునకు యీ శరీరము నగరముగా
నున్నది. దానియందు స్వల్పమై పుణ్డరీకమునుబోలు హృదయమను గృహా
మందు అతిసూక్ష్మమగు నాకాశమున్నది, అందున్న ఆకాశమను బ్రహ్మ
యన్వేషింపదగినది. అనగా సాక్షాత్కారము చేసికొనతగినది యగుచున్నది.
ఇదియే చిదాకాశము.

శరీరము బ్రహ్మమునకు, రాజునకు నగరమువలె నున్నది. హృదయ
గుహ బ్రహ్మోపలబ్ధిస్థానమగుటచే నది బ్రహ్మకు గృహమని వర్ణింపబడినది.
అనగా బ్రహ్మస్వరూపము, అచట ఉపలబ్ధియగునని తాత్పర్యము.

మరియును "యావాన్వాఅయ మాకాశస్తావానేషోఽ న్తర్హృదయే
ఆకాశః" అనగా భౌతికమగు ప్రసిద్ధమైన మహాకాశమెంత పరిమాణము
గలదో యంతపరిమాణము హృదయాకాశమునకు గూడ గలదని వాక్యము
తెలుపుచున్నది. ఇచట విశేషముగ గ్రహింపవలసినదేమనిన హృదయా
కాశము పరిచ్ఛిన్నమగుటచే దానియందున్న చిదాకాశరూపమగు బ్రహ్మము
గూడ పరిమితమని భ్రాంతి నొందగూడదు. ఏలనన హృదయపుణ్డరీకమందున్న
అంతఃకరణము విశుద్ధమైనపుడు జ్ఞానజ్యోతి స్వరూపమగు బ్రహ్మము అచట
తెలిసికొనబడును. బ్రహ్మము నిరుపమానము గనుక, దృష్టాంతము లేమింజేసి
యాకాశముతో తుల్యమని బోధించుటకిచట ఆకాశ శబ్దము వాడబడినదేగాని
వేరుగాదు. పరిచ్ఛిన్నమగు నిర్మలమైన విశుద్ధదర్పణమందు మహాకాశము
ప్రతిబింబించులాగున చిదాకాశరూపము, నపరిచ్ఛిన్నమగు పరబ్రహ్మము,
హృదయకుహరాన్తమందుండు విశుద్ధాన్తఃకరణము నిర్మలమైననట్టి దర్పణము
వంటిదిగాన, అందు స్వచ్ఛముగా ప్రతిబింబించును. వాస్తవమున ప్రతిబింబము
స్వయముగా అనృతమైనను దానిచే బింబము తెలియబడునుగదా! ఇట్లు తెలియ

బడునట్టి పరమాత్మ బింబమే జీవునియొక్క స్వాత్మాభిన్నమగు పరమార్థ వాస్తవస్వరూపము. ఇట్టి స్వస్వరూప విజ్ఞాన ప్రాప్తి, పురుషుడెపుడు తన పరమార్థ స్వరూపమును మననముజేయునో యపుడు సిద్ధించునని "యదావై మనుతేఽథవిజానాతి" అనిగూఢ వచనము తెలుపుచున్నది. పురుషుడిట్టి మననాభ్యాసాదులచే చిదాకాశరూపమగు బ్రహ్మను స్వాత్మాభిన్నముగ తెలిసికొని కాలక్రమమున అభ్యాసపాటవమునుబట్టి స్వానుభవము నొందగలుగును. అపుడు యీ అభ్యాసకుడు ఆప్తకాముడగును. అనగా సర్వాభీష్టప్రదమగు మోక్షమునొందును. తదుపరి తాను కోరవలసిన దేమియులేక స్వరూప సుఖము ననుభవించుచుండును. ఈ అర్థమునే "ఆత్మానంచే ద్విజానీయాదయమస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్యకామాయ శరీరమను సంజ్వరేత్" "యోవేదనిహితం గుహాయాం పరమే వ్యోమన్। సోఽశ్నుతే సర్వాన్కామాన్థ్సహ।" యను శ్రుతి వచనములు విస్పష్టము చేయుచున్నవి.

జిజ్ఞాసువు లెవరయినను ప్రస్థానత్రయ భాష్య శ్రవణమును గౌణముగ, గావించియున్నను ఆత్మ తత్త్వమనన విచారములను మానగూడదు. ఏలనన దీర్ఘకాల సతత మనన నిదిధ్యసనాది అభ్యాసము వలనగాని స్వాత్మాభిన్న పరమాత్మ జ్ఞానము నిస్సంశయముగ స్ఫురింపదు. ఇట్టి సంశయ విపర్యయ రహిత జ్ఞానాభ్యాసము వలనగాని ఆత్మ సాక్షాత్కారము గలుగదు.

ముముక్షువులకు సర్వ శాస్త్ర సారమును శ్రీ శంకర భగవత్పాదులు సంగ్రహముగ శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమను శ్లోక రత్నములతోడ బోధించు చున్నారు. శ్రీ సురేశ్వర స్వామివారు, దీనికి మానసోల్లాసమను వార్తికమును గావించియుండిరి. ఇదిసిద్ధాన్త గంభీరమగు స్తోత్ర రత్నము, ముముక్షువులకు మననామృతము. సాధకులకు యీ స్తోత్రము యొక్కయు, వివేకచూడామణి, అపరోక్షానుభూతి, ఉపదేశసాహస్రి, మహావాక్య దర్పణము మొదలగువాని యొక్కయు అర్థమును సద్గురు ముఖమున గ్రహించుట చాల ఉపయుక్తము. వీనితోడ భగవద్గీత, యోగవాశిష్ఠము, పంచదశి, నైష్కర్మ్య సిద్ధి, మొదలగు

ప్రకరణ గ్రన్థరాజములను సద్గురు ముఖమున పఠించి, మననాదుల నభ్యసించు చుండుట బ్రహ్మవిద్యా లాభమున కత్యుత్తమముగ సహకరించుననని వేరుగ జెప్పబనిలేదు. జ్ఞానాభ్యాసకుడు తన యీస్థూల సూక్ష్మోపాధులను, జ్ఞానసిద్ధికి సాధనోపాయములుగ గ్రహించుచు స్వప్నమందుగూడ తన పరమార్థ స్వరూప మును మరువక నిరన్తరాభ్యాసము గావించుచుండుట సాక్షాన్ముక్తి మార్గము.

ముముక్షువిచట ప్రధానముగ గ్రహించవలసినదేమియనిన – తన అభీష్ట మగునట్టి చరమ వృత్తి సాక్షాత్కారము గలుగునంతవరకును బ్రహ్మజ్ఞానా భ్యాసకునకు వృత్తియే శరణ్యము. అనగా దీనికి వృత్తి వ్యాప్తి యావశ్య కము. సర్వదా వృత్తిని స్వాత్మాభిన్నము, సత్యజ్ఞానానన్త రూపమగు బ్రహ్మా కారముగ అనగా తదాకారా కారితముగ నుంచునట్టి దీర్ఘకాలాభ్యాసము వలన గాని బ్రహ్మాత్మజ్ఞానము నశించదు. ఈ యజ్ఞానము నశించినగాని బ్రహ్మా త్మైక్య బోధ గలుగదు. స్వాత్మాభిన్న బ్రహ్మాత్మైక్య జ్ఞానము గలుగుటయే మోక్షమని శాస్త్ర వచనములు ఘోషించుచున్నవి. ఈ విషయమునే ఈ క్రింది వచనము విశదము జేయుచున్నది.

శ్లో॥ బ్రహ్మాత్మాజ్ఞాననాశాయ,
వృత్తివ్యాప్తి రపేక్ష్యతే।
బ్రహ్మాత్మైకత్వ బోధేన,
మోక్షః సిధ్యతి, నాన్యథా ॥

మరియును జీవునకు అవిద్యాస్తమయమే మోక్షమని "అవిద్యాస్తమయో మోక్షః" అను శ్రుతి వచనము స్పష్టపరచుచున్నది. అవిద్యయన్నను, బ్రహ్మా జ్ఞానమన్నను పర్యాయ పదములు, అనగా నొక్కటియే. కనుక ఈ అభ్యాస కుడు తన ప్రజ్ఞా వివేకముచే స్థూల సూక్ష్మోపాధులను జ్ఞాన పూర్వకముగ విడబరచి అనగా వేరుచేసి దేహాదులతోడ తన ప్రారబ్ధముననుభవించుచు సూక్ష్మోపాధియగు అంతఃకరణ వృత్తితోడ సర్వదా "నాహం చిదాభాసః అహం చిదేవ" అను జ్ఞానముతో స్వాత్మాభిన్నా పరిచ్ఛిన్న చిదాకాశాను సంధానమును యభ్యసించుచుండుటయే ముక్తికి సాక్షాత్సాధనము. శీఘ్ర మోక్షప్రదము.

ఈ అభ్యాసకుడు ప్రారబ్ధాను సరణమున యెంతటి, యెట్టి సుఖదుఃఖాను భవముల నొందుచున్నను, తానాచరించునట్టి సమస్త వ్యవహారములకు తన పరమార్థ స్వరూపము సాక్షీ మాత్రమనియు, వాస్తవమున తానఖండ పరిపూర్ణ జ్ఞాన స్వరూపుడననియు, అయినను దేహ ధర్మాధ్యాసము వలన యిప్పుడను భూతమగుచున్న సుఖ దుఃఖాది ధర్మములన్నియు నిమిత్త మాత్రముగ తన ప్రారబ్ధానుభవమునకు గల్పితములనియు, తాను సర్వదా ఈ స్వశరీర దృశ్యాను భవ సంఘాతమంతకును సాక్షీ మాత్రుడనను నిశ్చయమును సర్వదా అభ్య సించుచుండవలయును. ఇట్టి చిరకాలాభ్యాస పాటవము వలనగాని స్వస్వరూప నిశ్చయానుభూతి గలుగదు. కనుక అభ్యాసకులకు చిరకాల నిత్యాభ్యాసము యావశ్యకమని వేరుగ జెప్ప బనిలేదు. ప్రారబ్ధాంతము వరకును యిట్టి నిత్యాభ్యాస మావశ్యకము.

ఇచట సాధకులకు ఈ అభ్యాస ప్రమాణ, ప్రయోజనముల నుద్దేశించి గీతాచార్యులగు శ్రీకృష్ణ పరమాత్మ తెలిపినట్టి బ్రహ్మ స్వరూప, సాధన ప్రయోజన బోధకములగు కొన్ని శ్లోకముల. గీతా 13, 18 అధ్యాయముల నుంచి సంక్షేప సమష్టి తాత్పర్యముతోడ నుదాహరించుచున్నాడను.

శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం, తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
ఏతత్ జ్ఞాన మితిప్రోక్త, మజ్ఞానం యదతోఽన్యథా ॥

శ్లో॥ సర్వతః పాణిపాదంత, త్సర్వతోఽక్షిశిరో ముఖమ్ ।
సర్వతశ్శ్రుతిమల్లోకే, సర్వమావృత్య తిష్ఠతి ॥

శ్లో॥ సర్వేన్ద్రియ గుణాభాసం, సర్వేన్ద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వ భృచ్చైవ, నిర్గుణం గుణభోక్తృచ ॥

శ్లో॥ బహిరన్తశ్చ భూతానా, మచరం చరమేవచ ।
సూక్ష్మత్వాత్తద విజ్ఞేయం, దూరస్థం చాంతికేచతత్ ॥

శ్లో॥ అవిభక్తంచ భూతేషు, విభక్తమివచ స్థితమ్ ।
భూత భర్తృచ తద్జ్ఞేయం, గ్రసిష్ణు ప్రభవిష్ణుచ ॥

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి, స్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞాన గమ్యం, హృదిసర్వస్య ధిష్ఠితమ్ ॥

అనగా తత్త్వజ్ఞానార్థ దర్శనము ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వము, మోక్షమే సర్వోత్కృష్టమని సర్వదా చింతించుచుండుట యిది యంతయు జ్ఞానమనియును దీనికన్న వేరైనదంతయు అజ్ఞానమని చెప్పబడుచున్నది.

ఏది తెలియదగినదో, ఏది తెలిసిన మోక్షము నొందునో అది చెప్పెదను. ఎట్టిదనఁగా, అది ఆదిలేనిది నిరతిశయమైనదియు నగు బ్రహ్మము. అది సత్తుగాదు, అసత్తును గాదని చెప్పుదురు.

అది యింద్రియ గుణములగు రూపాదుల నన్నింటిని బ్రకాశింపజేయునది. ఇంద్రియములతో సఙ్గములేనిది, అనగా నెట్టి సంబంధములేనిది. అయినను సర్వమును భరించునది. సత్త్వ రజస్తమో గుణరహితము. అయినను సత్త్వాది గుణములను పాలించునది.

అది భూతములకు లోపలను పయిని నిండియున్నది. స్థావరములు, జంగమములును అదియే. అయినను సూక్ష్మమగుటచే నదియే యిదియని తెలిసికో నలవిగానిది. మూఢులకు దూరముగా నుండును. పండితులకుఁ జేరువగా నుండును

భూతములయందు అభేదముగనున్నను భేదముగల దానివలె నుండును. భూతములను బోషించునది, ప్రళయమందు మ్రింగునది, సృష్టి కాలమందు నానా రూపములుగాఁ బుట్టునది అదియే. అదియే జ్ఞేయపదార్థము.

అది చంద్ర సూర్యాదులను గూడఁ బ్రకాశింపఁజేయునది. తమస్సు కంటె బయిగా నుండునది యని చెప్పఁబడును. అదియే జ్ఞానమనునది.

అదియే జ్ఞేయ పదార్థము. దానిని జ్ఞానముచేతనే తెలిసికోవలయును. అది అందరి హృదయముల యందును ఉన్నది.

శ్లో॥ సిద్ధింప్రాప్తో యధా బ్రహ్మ, తదాఽఽప్నోతి నిబోధమే ।
సమాసేనైవ కౌన్తేయ, నిష్ఠా జ్ఞానస్య యాపరా ॥

శ్లో॥ బుధ్యావిశుద్ధయా యుక్తో, ధృత్యాత్మానం నియమ్యచ ।
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా, రాగద్వేషౌవ్యుదస్యచ ॥

శ్లో॥ వివిక్తసేవీలఘ్వాశీ, యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరోనిత్యం, వైరాగ్యం సముపాశ్రితః ॥

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం, కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్యనిర్మమశ్శాన్తో, బ్రహ్మభూయాయ కల్పతే ॥

శ్లో॥ భక్త్యామామభిజానాతి, యావాన్ యశ్చాస్మి తత్త్వతః ।
తతోమాం తత్త్వతోజ్ఞాత్వా, విశతే తదనన్తరమ్ ॥

అర్జునా! నైష్కర్మ్యసిద్ధిని బొందినవాఁడగుచు నెట్లు బ్రహ్మను పొందునో సంక్షేపముగఁ జెప్పెదను వినుము. అదియే జ్ఞానమునకు బరమావధి.

సాత్త్వికబుద్ధితోడఁగూడిన వాఁడై సాత్త్విక ధృతిచేతఁ గార్య కారణ సమూహ రూపమగు బుద్ధిని నియమించి శబ్దాది విషయములను విడిచి రాగద్వేషములు వదలి, శుద్ధమగు ప్రదేశమందుండువాఁడై, మితాహారుఁడై వాక్కును, శరీరమును, మనస్సును నియమించుకొని నిత్యమును ధ్యానయోగమునందాసక్తుఁడై వైరాగ్యము నవలంబించి, అహంకారమును, బలమును, దర్పమును, కోపమును, పరిగ్రహము (భార్యాదికము)ను విడిచి మమత్వము లేకుండ శాంతముగనుండు వాఁడు నేనే బ్రహ్మమును అనినిశ్చల ముగానుండుటకుఁదగినవాడు.

అట్లు బ్రహ్మమునందున్నవాడు ప్రసన్నచిత్తుఁడై శోకింపఁడు. కోరడు. సర్వభూతములయందును సముఁడై గొప్పదియగు నాభక్తిని బొందును.

భక్తిచేతను, నేను అనగా జీవుడు ఎవరో తన వాస్తవస్వరూప మెట్టిదియో, యెట్టివాడో, అనగా తానెట్టివాడో, తెలిసికొనును. అట్లునన్ను అనగా తననుతాను యధార్థముగా తెలిసికొనితరువాత నాయందు అనగా పరమాత్మ యందు ప్రవేశించును. అనగా పరమానన్దస్వరూపుడే యగునని తాత్పర్యము.

ఇచట భక్తియనగా "స్వస్వరూపాను సంధానం, భక్తిరిత్యభిధీయతే" అను శ్రీ శంకరభగవత్పాదుల భక్తి నిర్వచనమే గ్రాహ్యము.

కావున సాధకులు దీనినంతయు బాగుగ గ్రహించి యీ విద్యా ప్రాప్తికి యావశ్యకమగు చిరకాలాభ్యాసాదులయందు విసుగుజెందక ప్రీతి నిశ్చయములతోడ,

శ్లో॥ దద్యాన్నావసరంకించి, త్కామాదీనాం మనాగపి ।
ఆసుప్తేరామృతేఃకాలం, నయేద్వేదాన్త చిన్తయా ॥

అను శ్రీ విద్యారణ్యవచనానుసారమున సదా బ్రహ్మాభ్యాస మాచరించుచు కాలక్రమమున నిత్యనిరతిశయానన్దము నొందుదురుగాక.

సాధకులిచట నొక రహస్యమును జ్ఞప్తి యందుంచుకొనవలయును. ఏదియన - ఎంతటి సాధకుడైనను, జీవుడు ఉపాధితో యున్నంతకాలము, ఆలంబన లేనిది తన వాస్తవస్వరూపమగు నిర్వికార అఖండ పరిపూర్ణాత్మ స్వరూపమును స్వాత్మాభిన్నముగ జూడలేడు. కావున ఓంకార ప్రణవ శబ్ద లక్ష్యార్థమగునట్టియు, "సోహం" అను మంత్రార్థమగునట్టియు, "అహం బ్రహ్మాస్మి" యను మహా వాక్యబోధయగునట్టియు, స్వాత్మాభిన్న బ్రహ్మ స్వరూపమును, పై వానిలో దేనినైనను ఆలంబనగా సద్గురుముఖమున గ్రహించి, వృత్తివ్యాప్తితోడ అర్థమును అనగా స్వాత్మాభిన్న అద్వితీయ

బ్రహ్మస్వరూపమును బాగుగ మనోగోచరము గావించుకొని, నద్దానిని స్వాత్మాభిన్నముగ (నిర్గుణప్రతీక సహాయమున) మనన ధ్యానాదుల ప్రారబ్ధాంతము వరకును నాచరించుచుండుట, యొక శాస్త్రీయోపాయము, ఈ అభ్యాసము కాలక్రమమున స్వస్వరూపసిద్ధి నొందింపజేయును. ఇదియే జీవునికి పరమావధి, ముక్తి, నిత్యనిరతిశయానందప్రాప్తి. ఇదియే మోక్షము.

బ్రహ్మాభ్యాసకుల నుద్దేశించి శ్రీ శంకర భగవత్పాదులు కరతలామలకముగ బోధించుచున్నట్టి కొన్ని శ్లోకరత్నముల నిచట తెలుపుచున్నాడను. అభ్యాసకులకు వీని యర్థము సుగోచరము గనుక వేరుగ వ్రాయుటలేదు.

శ్లో॥ సంసారోమనసాపుంసః, కల్పితోస్తి నవస్తుతః ।
మనః శూన్యే సుషుప్త్యాదౌ, సంసారో నైవదృశ్యతే ॥

శ్లో॥ అజ్ఞాన దోషేణతు యత్ర యత్ర
ప్రకల్పితం తత్తుమృషైవదృష్టం ।
రజ్వాదికేవస్తుని సర్పతాది
యథాతథైవాత్మని జీవతామృషా ॥

శ్లో॥ దీర్ఘస్వప్న మిదం విశ్వం, విశ్వంబ్రహ్మణి కల్పితం ।
దీర్ఘసంసారరోగస్య, విచారోహిమహౌషధమ్ ॥

శ్లో॥ అద్యాష్టమీతి నవమీతి చతుర్దశీతి
జ్యోతిష్కవాచోప వసంతి భక్త్యా ।
శ్రుతేస్త్వహో తత్వమసీతి వాక్యం ।
నవిశ్వసంత్యద్భుతమేతదేవ ॥

శ్లో॥ సూతకాది నిరాకారం సాకార మివపశ్యతి ।
స్వస్మిన్ దృఢప్రత్యయేన సూతక్యహమితి స్ఫుటమ్ ॥

శ్లో॥ నతథాబోధితః శ్రుత్యా ముహుస్తత్వ మసీత్యలం ।
విద్వానపి విజానాతి స్వతత్వం మహదద్భుతమ్ ॥

శ్లో॥ యత్ర యత్ర మనస్యాప్తి స్తత్రతత్ర జగత్త్రియం ।
యత్రయత్ర మనోనాస్తి తత్ర తత్ర నకించన ।

శ్లో॥ మూర్తామూర్త వికారజాతముదితం సత్యాదికం సర్వత,
స్తచ్చేత్యాగమబోధితం బహువిధం యన్నామరూపాత్మకం ।
తత్సర్వం స్వయమేకమేవ సదభూత్తస్మాత్పరం బ్రహ్మణః ।
కించిన్నాస్తి విచారితం సదఖిలం బ్రహ్మైవ సద్వస్తుతః ॥

శ్లో॥ యద్వత్స్వప్న శరీరకేఽహమితి ధీస్సంభావితా నిద్రయా
తద్వజ్జాగ్రతి మాయయాత్ర వపుషిస్వాత్మత్వధీః కల్పితా,
సత్యంనైతదసిత్వమాత్మనిధియా పశ్యస్వమేకాగ్రయా,
నిత్యం శుద్ధమనంత మవ్యయ సుఖం బ్రహ్మాసి సాక్షాత్పరమ్ ॥

శ్లో॥ త్యక్త్వా బాహ్యమిదం మనోనిలయనం తుచ్ఛం మృషేతిస్వయం,
బుద్ధ్యానిశ్చల యాగురూక్తిపరయా విజ్ఞాయ తత్త్వంమునే ।
బ్రహ్మణ్యస్తభిదే చిదాత్మని సదానందేఽద్వయే నిర్గుణే,
లీనస్యాస్తగతేః సుఖేన వసతస్తూష్ణీం కిమన్యైర్భ్రమైః ॥

శ్లో॥ అనాత్మచిన్తనం త్యక్త్వా కశ్మలం దుఃఖ కారణమ్ ।
చిన్తయాత్మాన మానన్దరూపం యన్ముక్తి కారణమ్ ॥

శ్లో॥ బ్రహ్మాది స్తంబపర్యన్తా మృషామాత్రా ఉపాధయః ।
తతఃపూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనాస్థితమ్ ॥

శ్లో॥ లక్ష్యేబ్రహ్మణి మానసం దృఢతరం సంస్థాప్య బాహ్యేన్ద్రియం,
స్వస్థానేవినివేశ్య నిశ్చలతనుశ్చోపేక్ష్య దేహస్థితమ్ ।
బ్రహ్మాత్మైక్య ముపేత్య తన్మయతయా చాఖణ్డ వృత్త్యానిశం,
బ్రహ్మానన్ద రసం పిబాత్మనిముదా శూన్యైః కిమన్యైర్భ్రమైః॥

శ్లో॥ సాక్షిణ్యశేషం ప్రవిలాప్య దృశ్యం, తమద్వయే బ్రహ్మణి
నిష్ప్రపంచే ।
తతః స్వయం వ్యోమవదేవ పూర్ణాత్మనాత్మనాతిష్ఠతియః
సముక్తః ॥

# బ్రహ్మవిద్యాసారము

బ్రహ్మవిద్యా సారాంశమేమనిన, మానవుడు తన పరమార్థ స్వరూపమును వాస్తవముగ తెలిసికొని, స్వానుభవము నొందుట. ఈ బ్రహ్మవిద్య యెందుల కావశ్యకమనిన మానవునకు ఆత్యంతిక దుఃఖ నివృత్తియై, తన శాశ్వత సుఖమును నొందుటకుగాను ఆవశ్యకము. మానవుడు తన శాశ్వత సుఖ రూపమగు అమృతత్త్వమును బ్రహ్మ విద్యయగు సదాత్మజ్ఞానము వలననే పొందవలయును. వేరు మార్గములేదు. కావుననే పరమాత్మయగు శ్రీకృష్ణ భగవానులు, అర్జునునకు, పదునెనిమిది అధ్యాయములతో భగవద్గీత యందు ప్రధానముగ నీ బ్రహ్మవిద్యనే బోధించినాడు. ప్రధానముగ నీ విద్యా రహస్యమేమియనిన, ప్రతి జీవుడునూ సర్వకాల సర్వావస్థల యందునను, అనుభవించుచున్నట్టి యీ "అహం" నేను, అనుప్రతీతికి వాస్తవమున నేమి యర్థమని తెలసికొనవలసియున్నది.

ఏ జీవుడికైనను యీ ప్రపంచానుభవమంతయు ఒక్క "అహం" నేను అను ప్రతీతితోడనే జరుగుచున్నదిగాని యీ నేను, అను ప్రతీతి లేని యడల, ప్రపంచానుభవమే యుండదు. ఈ అనుభవము వాస్తవముగ లేని యడల జీవునకు సంసారమే యుండదు. సంసారము నశించిన, మానవునకు దుఃఖమనునదియే వాస్తవమున యుండదు. అట్లైనచో యీ నేను అను ప్రతీతి సర్వ జీవులకునూ, యెందులకు కలుగుచున్నది? దీని వాస్తవ స్వరూపమెట్టిది? ఈ యథార్థమును తెలిసికొనిన యడల మనకేమి లాభము? అనునట్టి విచారము జిజ్ఞాసువుల కావశ్యకము గావున, దీని, సంక్షేపముగ మరియొక మారు విచారించుదము.

మానవునకు తనకిప్పుడు తన సుఖదుఃఖానుభవ సర్వ వ్యవహారములకు నుపయోగించుచు, తాను నేను అనుకొనుచున్నట్టి, యీ మనో దేహేంద్రియ

ప్రాణాదులలో నేదియును తాను అనగా నేను అనుకొనుచున్న అనుభవములో వాస్తవమున అహం స్వరూపమగు ఆత్మ పదార్థముగాదు. ఈ సంఘాత మంతయు తన ప్రారబ్ధ ఫలము ననుభవించుటకుగాను కల్పితముగ నేర్పడిన యొక సంపుటి. నిత్యా నిత్య వివేకముతోడ తన యనుభవమును, ప్రపంచాను భవమును గూడ సూక్ష్మ బుద్ధితోడ బాగుగ విచారించి తెలిసికొనునట్టి వివేక వంతునకు యిందు యిప్పుడు నేను నాదియని తాననుభవించుచున్న దానిలో నేదియును తనకు నిత్యముగాక అంతయు తాత్కాలికమే యగుచు అశాశ్వతమగుచున్నది. కాని నేదియును శాశ్వతమగుటలేదు. ఇట్ల శాశ్వత మగునట్టి వాని వలన అనగా యిట్టి అనుభవముల వలన తనకు సుఖము శాశ్వతముగ నుండునని తలచుటయు, నమ్మటయు వివేకము కాదు గదా! అయినను యీ లోకవాసనానుభవములన్నియు జన్మ పరంపరతోడ అనాదిగా వచ్చుచుండుటచే, తాత్కాలిక సుఖదుఃఖ రూపముననున్న యీ అనిత్యమగు దేహాది లోకానుభవమే తనకు నిత్యమను భ్రాంతితోడ, జీవునకు తన సమస్త లోక వ్యవహారానుభవములు జరుగుచుండును. మానవు లకు నీ ప్రపంచమున తమ, తమ సుఖదుఃఖ భోగానుభవము లెట్టివియై యెంతటి వియైనను యీ ప్రారబ్ధ సుఖదుఃఖ ఫలానుభవముల ననుభవింప వలయునేగాని సాధారణముగ తప్పవు. ఏలనన జీవునకు ఈ ప్రారబ్ధమనునది, తన అజ్ఞానముచే నాచరించిన కామకర్మల యొక్క ఫలము. అజ్ఞానముచే నాచరించిన నేకార్యమైనను నేరమేగదా! నేరమునకు శిక్ష తప్పదు గదా! జీవు నకు, యిట్టి పుణ్యపాపాచరణమునకు, విధింపబడిన శిక్షయే, మానవుడిప్పుడు తాననుభవించుచు యీజీవితములో కలుగుచున్నట్టి సుఖదుఃఖలోకానుభవములు. ఇదియేప్రారబ్ధ ఫలము. దీనిని భోగసాధనము లేనిది, యను భవించుటకు వీలులేదు గావున అట్టి భోగ సాధనముగ తాత్కాలికముగ నేర్పడినదే యీ దేహ సంఘాతము. ఇది మానవునకు (జీవునకు) అనాదిగా అనగా యెప్పుడు వచ్చినదో చెప్పలేనంతటి, అతి దీర్ఘ కాలానుభవముగ నుండుటచే, మాన వుడు యిదియే సత్యము తనకు నిత్యమునని తలచి, ఈ దేహాది సంఘాతమునే

తాను అనగా నేను అని భ్రమించుచున్నాడు. అయినను యిదియంతయు తనకు సత్యము, నిత్యముగాక తాను నేను అని తలచుచున్న తన ఈ దేహాదులు నశించుచున్నవి. కాని తాను, నేను అనుకొనుచున్నట్టి ప్రతీతియగు తాను మాత్రము నశించుటలేదు. ఈ నేను అహం ప్రతీతి మాత్రము తనకు, అవస్థాత్రయత్రికాలా బాధితముగ మిగులుచున్నది. ఇది యెట్లనిన దీనిని గురించి లోగడ ప్రకరణములలో అతి విపులముగ తెలుపబడియున్నది గావున తిరిగి విపులముగా వ్రాయుటలేదు. ఐనను అభ్యాసకులకీ విషయము ప్రధానమైనదగుటచే, మనన దార్ఢ్యమునకుగాను నిచట తిరిగి సంక్షేపముగ నుదాహరించుచున్నాడను, పైన తెలిపిన యట్లు, యెల్లప్పుడును నిర్విశేషముగ శేషించుచున్న ఈ నేను అను "అహం" ప్రతీతియె, తన పరమార్థ వాస్తవ స్వరూపమనియు, యిది అఖండ పరిపూర్ణ జ్ఞానానంద స్వరూపమనియు, నిత్య నిరతిశయ సుఖ స్వరూపమనియు, మానవునకు శాస్త్రము వేయినోళ్ళ పరిపరి విధములుగ బోధించుచున్నది. శాస్త్రమనగా ముఖ్యార్థము వేదము. లోగడ తెలిపినటుల శాస్త్రమెల్లప్పుడును మానవునకు, అనధిగత అబాధిత శ్రేయస్సాధనమునే బోధించునుగాని మరియొకటి బోధించదు. కావున శాస్త్ర బోధనుపేక్షించుటగాని, యుల్లంఘించుటగాని మానవునకు శ్రేయోదాయకముగాదు.

కావున వివేకవంతుడగు మానవుడు తన అనుభవములో అవస్థాత్రయ త్రికాలాబాధితముగనున్న నేను "అహం" పదార్థమెట్టిదియని, శాస్త్రీయమైన సూక్ష్మబుద్ధితోడ బాగుగ విచారించి తెలిసికొనుట తన శాశ్వత సుఖమునకావశ్యకము. ఇప్పుడు మానవుడు తాను వాస్తవముగగానట్టి, అనిత్యము, కల్పితము, అవాస్తవము, అగునట్టి యీ దేహేంద్రియాది సంఘాతమునే "అహం" నేను అని నమ్మి తన సమస్త లోకానుభవములనుజేయుచు, యివి తనకు నిత్యము సుఖసాధనములని, వ్యామోహితుడగుచు, విషయ భోగలాలసతోడ దుఃఖితుడగుచు, సంసారసాగరమున చర్వితచర్వణముగ భ్రమణము జేయుచుండును. మానవునకిప్పుడు తన సదాత్మస్వరూపము తెలియుటలేదు.

కావుననే "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యబోధతోడ, యీ "అహం" పదార్థము నిత్యనిరతిశయస్వరూపమగు బ్రహ్మ పదార్థమే. ఇదియే "అహం" నేను. ఈ నాయొక్క అహం ప్రతీతియే బ్రహ్మ. ఇదియే నా ఆత్మస్వరూపము. ఈ రెండునూ ఒక్కటియేగాని వేరువేరు కాదు. అను రహస్యమును శ్రుతిమాత మానవునకు స్పష్టముగా బోధించుచున్నది. మరియును, యిట్టి స్వాత్మాభిన్నమగు బ్రహ్మస్వరూపము, నిత్యనిర్వికార, అద్వితీయ, అసంగ, స్వప్రకాశ సర్వాధిష్ఠాన, అఖండపరిపూర్ణ చిద్ఘనానంద స్వరూపమనియు, సత్యజ్ఞానానంతమనియు, సచ్చిదానందలక్షణమనియు, యిదియే నీ పరమార్థస్వరూపమనియు "తత్త్వమసి"యను మహావాక్యముతోడ బోధించుచున్నది. ఇంకనూ పరమాత్మస్వరూపమగు, యిట్టి నీయందే, అనాది అవిద్యాప్రభావమువలన కనుచీకటిలో త్రాటియందు భ్రాంతిచేతోచెడి సర్ప, సర్పావయవ, చలనాదులలాగున జగత్తు భాసించుచు భయాది అనుభవముల నిచ్చుచున్నది. మరియు ఒక్కడేయగునట్టి స్వాప్నికునియందు, నానా విధములుగ గనబడుచు వివిధానుభవముల నిచ్చునట్టి స్వప్నదృశ్యములాగున, ఈ స్వశరీర ప్రపంచములు భాసించుచున్నవేగాని వాస్తవము కాదు. ఇందు ఎట్లు రజ్జువు, స్వాప్నికుడుమాత్రము వ్యవహారమున సత్యములగుచు, ప్రాతిభాసికములగునట్టి భ్రాంతిసర్ప, సర్పచలనాదికములు, స్వప్నమునందు నగుపడు దృశ్య, దృశ్యానుభవములు అన్నియు అసత్యములేయగుచున్నవో అట్లే పరమార్థమున "అహం" స్వరూపుడగు శుద్ధజీవుడు మాత్రము సత్యముగ నుండుచు వ్యావహారికములగు ఈ శరీర సంఘాత, దృశ్యనానాత్వములు, వాటి యనుభవములు మిథ్యామాత్రము లేననియు, కావుననే ఈ మిథ్యా ప్రపంచ, శరీరములనుగురించి వ్యామోహపడవలదని శ్రుతిమాత మనలకు తెలుపుచున్నది. ఇంకను జీవునకు అనిత్య, అవాస్తవ, మిథ్యామాత్రమగు ఈ దేహాది సంఘాత ప్రపంచములను జ్ఞానపూర్వకముగ త్యజించి, అహం మమతలను వదలి, నీ పరమార్థస్వరూపమగు, అద్వితీయ అఖండ చిద్ఘనానంద రూపమును బాగుగ తెలిసికొని, స్వానుభవమునొందమని, వేదమాత పరమ

కారుణ్యముతోడ మానవునకు బోధించుచున్నది. పరమార్థ వాస్తవమున ప్రతి జీవుడునూ, నిత్యనిరతిశయానందస్వరూపమగు పరమాత్మస్వరూపుడే. ఈయన నిత్యనిర్వికార, అద్వితీయ అసంగ స్వప్రకాశ పరిపూర్ణుడు. అయినను అసంఖ్యాకములగు, ఈ నానాఉపాధులచే ననుభవింపబడుచు, వాటిని ప్రకాశింపజేయుచున్నవాడు ఈ పరమాత్మ ఒక్కడే. ఈ నానాత్వము వాస్తవముకాదని స్పష్టపరచుటకే శ్రుతిమాత "మాయామాత్రమిదంద్వైతం అద్వైతం పరమార్థతః" "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ""నేహనానాస్తికించన""జీవోబ్రహ్మైవనాపరః" "తత్సత్యం అతోన్యదార్తం" అని తెలుపుచున్నది. ఈ విషయమునే శ్రీకృష్ణపరమాత్మ త్రయోదశాధ్యాయమందు విశదముజేయుచు, గ్రహించవలసిన పరమాత్మ స్వరూపమునుగూడ స్పష్టముగా తెలుపుచున్నారు. ఎట్లు ఒక్కడేయైన సూర్యుడు ఈ సర్వ ప్రపంచ నానాజీవజడోపాధుల నన్నిటిని ప్రకాశింపజేయుచు వాటితో నెట్టి సంబంధము నొందక తాను సర్వదా ఏకవిధమున ప్రకాశించుచుండునో అట్టిదియేనా స్వరూపము, అనగా ఆత్మ స్వరూపము. దీనిని బాగుగ తెలిసికొని యెవరు స్వానుభవము నొందుదురో వారు పరమాత్మ స్వరూపుడనగు నన్ను అనగా పరమార్థ స్వరూపమును పొంది, తిరిగి మృత్యువునొందరు. అని విశదీకరించి తెలుపుచున్నారు. ఇట్టి స్థితిని జిజ్ఞాసువులు వారి, వారి, నిరంతర స్వస్వరూపాను సంధానాది అభ్యాసము వలన పొందవలయునేగాని వేరు దారిలేదు. ఇట్టి అభ్యాసస్థితియే కాలక్రమమున ఆత్మానంద ప్రాప్తి నొందజేసి, ప్రారబ్ధాంతమందు తత్స్వరూపుడను గావించును. అనగా తన అవిద్య నశించును. ఇదియే మోక్షము. ఈ విషయమునే శ్రుతి "అవిద్యాస్తమయోమోక్షః" అని తెలుపుచున్నది. ఈ స్వస్వరూపానుసంధానమే సాక్షాన్మోక్ష సాధనమగు భక్తి. ఈ భక్తియే మోక్షసాధనమునకు సర్వోత్కృష్టమైనదని శ్రీ శంకర భగవత్పాదులు; "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ, స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" యని తెలుపుచున్నారు.

శ్రీ భగవద్గీత పదునెనిమిది ఆధ్యాయములును బ్రహ్మవిద్యయే. అయినను యిందు విశేషముగ శ్రీకృష్ణపరమాత్మ 2, 4, 6, 8,9, 12, 13, 15,18,

అధ్యాయములలో సందర్భానుసారమున, పరమాత్మయగు బ్రహ్మస్వరూప మును, అధికారుల నుద్దేశించి బ్రహ్మవిద్యా సాధనములను, వాటి అభ్యాస సక్రమమును తెలుపుచున్నారు. కరుణామూర్తులగుచు, శ్రీ శంకర భగవత్పా దులు వివేకచూడామణి మొదలగు ప్రకరణ గ్రంధములవలనను, శ్రీ విద్యా రణ్యస్వామి పంచదశి మొదలగు గ్రంధములవలనను, శ్రీ వశిష్ఠభగవానులు వాసిష్ఠబోధవలనను ఈ బ్రహ్మవిద్యను కరతలామలకములాగున జిజ్ఞాసువులకు బోధించుచున్నారు. ఇవి ప్రధానములు. ఇంకను యిట్టి గ్రంధరాజము లనేకములు విరాజిల్లుచున్నవి.

జిజ్ఞాసతో శ్రద్ధాళువులై, వీనిని సద్గురు ముఖమున పఠించి మననా దులు గావించి స్వస్వరూప అనుసంధానాది అభ్యాసములను ప్రారబ్ధాంతము వరకును, విసువుజెందక నాచరించునట్టి మహనీయులగు సాధనాభ్యాసకులు, కాలక్రమమున వారి స్వస్వరూప సాక్షాత్కారమునొంది, నిత్య నిరతిశయ స్వరూపులగుదురనుటకు సందియములేదు.

జిజ్ఞాసువులు యిది మనలకిప్పుడు సాధ్యమాయని సంశయింపపనిలేదు. వారు చేయవలసినదంతయు సదాచార సత్కార్మానుష్ఠానముల నాచరించుచు, సాధుసంగమ సచ్ఛాస్త్ర శ్రవణాదులచే ఈ విద్యను సాధించుటయందు ప్రీతి నిశ్చయములను సంపాదించిన చాలును. ఇట్టివారికి :—

శ్లో॥ తేషాం సతతయుక్తానాం, భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగంతం, యేనమాముపయాన్తితే ॥

యని శ్రీకృష్ణపరమాత్మ తెలుపుచున్నారు. కావున అట్టి వారికి ఈ అభ్యాస సౌలభ్యమును భగవంతుడే యనుగ్రహించును. దీనివలన సాధకుడు జీవునకు సాధారణముగ తప్పనియట్టి తన ప్రారబ్ధానుసరణమున యెట్టి సుఖదుఃఖ భోగానుభవముల నొందుచున్నను ఈ విద్యాభ్యాసము జేయుచుండవచ్చును. ఆరంభమున కొంత ప్రయత్న మావశ్యకము. ఇది క్లేశముగనుండునుగాని

కాలక్రమమున అభ్యాసపాటవమునుబట్టి సాధకునకు ఈ అభ్యాసము ఏదో యొకవిధమున సహజముగనే జరుగుచుండును. ఎట్లన మానవుడు తానేపని జేయుచున్నను తన నామరూపములను మరువనియటులను, యేదేశములలో యెట్టి ధర్మశాలలు, వసతిగృహములలో నివసించుచున్నను తన గృహక్షేత్రాదు లను మరువనియటులను, బ్రహ్మాభ్యాసికి అభ్యాసపాటవమునుబట్టి కాల పరి పాకమున తన స్వరూపమగునట్టి పరమాత్మస్వరూపము మరపుకురాక శాస్త్రీయను సారమున యేదోయొకవిధమున సదాత్మాను సంధానవృత్తి కలుగుచునే యుండును. అప్పుడభ్యాసము సహజముగ జరుగుచుండును. ఇట్టి నిరంతరాభ్యా సముచే ప్రారబ్ధాంతమున చరమవృత్తి సాక్షాత్కారము కలుగును. తదుపరి ఆ క్షణముననే తత్స్వరూపుడగునని శాస్త్రము బోధించుచున్నదిగావున శాస్త్ర ప్రమాణమునుబట్టి అట్లే యగుననుట సత్యము. కాని సాధకుడు ఈ అభ్యాస మందు విసువుజెందక ప్రారబ్ధాంతమువరకును అప్రమత్తుడై ఆత్మజ్ఞాన సాధనాభ్యాసములను విడువగూడదు. ఈ విషయమునే శ్రీకృష్ణపరమాత్మ గీత ఆరవ అధ్యాయములో "సనిశ్చయేన యోక్తవ్యో, యోగోఽనిర్విణ్ణచేతసా" అని తెలుపుచున్నారు.

——o——

# తత్త్వసారము, ఉపసంహారము

ఈ విద్యా పర్యవసాన సారాంశమేమనిన, ముముక్షువునకు ఆత్మ, అనగా బ్రహ్మజ్ఞానమువలనగాని ఆత్మప్రకాశానందముగలుగదు. బ్రహ్మజ్ఞాన మనగా జీవబ్రహ్మైక్య జ్ఞానము. అనగా నేనును, బ్రహ్మయు నొక్కటియే, నేనే బ్రహ్మను, "అహంబ్రహ్మాస్మి," అను నిశ్చయముతో, ముముక్షువు తాను పరోక్షముగా గ్రహించిన జ్ఞానము నపరోక్షముగావించుకొనుట. ఇట్టి అపరోక్ష జ్ఞానమే ఆత్మానందదాయకము. అనగా యిదియే స్వస్వరూపానందము. దీని నొందుటకు ప్రారబ్ధాంతమువరకు నిర్గుణబ్రహ్మను సంధానాదులావశ్యకమని శాస్త్రమువలనను, శ్రీశంకరభగవత్పాదాది పూర్వాచార్యులవలనను ఉద్ఘోషించి బోధింపబడుచున్నది. కావున ఈ జ్ఞానాభ్యాసకులు ఆత్మవిచారాద్యను సంధానాదులనిట్లు నాచరించుచుండవలయును.

అనుసంధానము: నేను "అహం", మూర్తామూర్త స్వశరీర సర్వోపాధి వినిర్ముక్త, సజాతీయ విజాతీయ స్వగత భేదరహిత, జగదుత్పత్తి స్థితిలయ వివర్తకారణ, అద్వితీయ, నిత్యనిర్వికార, స్వప్రకాశ సర్వాధిష్ఠాన అఖండ చిద్ఘనానందరూపుడను. నేను, సర్వబాహ్యాంతర అఖండపరిపూర్ణ చైతన్య స్వరూపుడను. నేనే ప్రత్యగాత్ముడనై దేహళీదీప న్యాయమున, అనగా గడప మీదనున్న దీపములాగున లోపలను వెలుపలనుగూడ అనగా సమస్తమును, బాహ్యాంతరముల బ్రకాశింపజేయువాడను. నేను నిరవయవుడనగుటవలన నిష్క్రియుడను, సాక్షిమాత్రుడను. కావున నాకు వాస్తవమగు కర్తృత్వ భోక్తృత్వములులేవు. ఈ అనుభవింపబడుచున్న సుఖదుఃఖరూపకర్తృత్వ భోక్తృత్వములు నాప్రారబ్ధకల్పితములు. ప్రారబ్ధము నా అనాది అవిద్యాకామ కర్మఫలము. ఇదికల్పిత మాత్రము. నాస్వశరీర సర్వదృశ్యమును యిట్టిదే. ఇదియంతయు నాకర్మఫలానుభవమునకుగాను కల్పితమైనది. నేనిప్పుడీరహస్య

మును బాగుగ తెలిసికొనినవాడను. కావున నాప్రారబ్ధక్షయముతోడ, ఈ నా కర్తృత్వ భోక్తృత్వా ద్యధ్యాసనివర్తించును. కావుననాకు ఈ ప్రపంచముతోడ వాస్తవమగుపని, అనగా ప్రయోజనము నాప్రారబ్ధక్షయముతప్ప మరేమియునులేదు. కనుక నాకు నాప్రారబ్ధక్షయానుకూల వ్యాపారముమాత్ర మావశ్యకము. ఇట్లు వ్యవహరించుటకు సుఖదుఃఖానుభవముల యందు సక్తతాభిమానములు క్షీణించవలయును, దీనికి శాస్త్రచోదితమగు స్వశరీర జగన్మిథ్యాత్వజ్ఞానదార్ఢ్య మావశ్యకము. ఈ దృశ్యమిథ్యాత్వజ్ఞానము సత్కర్మానుష్ఠాన, శాస్త్రశ్రవణ, మననాదులచేగాని గలుగదు. మననమనగా వస్తుసిద్ధికి తిరిగి తిరిగి ఆత్మవిచారము చేయుచుండుట. కావుననే శాస్త్రము "విచారాజ్జాయతేబోధః" అనిస్పష్టముచేయుచున్నది. అట్టివిచారమును మరల సింహావలోకనముగ నీయుపసంహార ప్రకరణమునందు గావించుదము.

ప్రతిదినమునను సర్వదా, సర్వజీవులును నిద్రలేచునది మొదలు పరుండు నంతవరకును వారివారి సుఖమునకుగానే బాహ్యప్రయత్నములను చేయుచుందురు. ఇదిలోకానుభవము, సర్వవిదితము. కాని ప్రతిజీవుడునూ కోరునట్టి తనసుఖము వాస్తవమున ఆత్మస్వరూపుడగు తనలోననే సర్వాంతరముగనున్నదిగాని, తనను విడచిగాని, తనకుబైటగాని వాస్తవముగలేదు. దీనిని తెలుపుటకే శ్రుతిమాత "ఆత్మైవానందః" ఆత్మయే ఆనందస్వరూపమని తదితరములుగావనియుగూడ "ఏవ" కారమువలన స్పష్టముచేయుచున్నది. ఆత్మగాని జీవుడులేడు. ప్రతిజీవుడునూ "నేను" అనగాతను ఆత్మయనే తలచుచున్నాడు. నేను ఆత్మగాదని జెప్పువివేకులెవరునూ యుండరు. అయినను యీ ఆత్మస్వరూపమును యథార్థముగ తెలిసికొనజాలక, ఆత్మకాని దానిని ఆత్మయని భ్రాంతుడగుచుండుటచే ఆత్మానందమగు వాస్తవస్వరూప సుఖమును పొందజాలక, నశ్వరములు, తాత్కాలికములగునట్టి అనాత్మానందములతోడ, అనగా, ఆభాసములు, క్షణికములగు విషయసుఖములతోడ వ్యామోహితుడగుచు పర్యవసానమున, జనన, మరణ ప్రవాహరూపమగు సంసారదుఃఖము నొందుచున్నాడు. సదాత్మజ్ఞానమే మానవకళ్యాణమునకు పరమావధి. కాన

మానవునకు తన నిత్యనిరతిశయ ఆత్మానంద స్వరూపమును, దానినొందునట్టి సాధనములను, సశాస్త్రీయముగను, సప్రమాణముగను, అనుభవనిరూపణలతోడ తేటతెలుగున బోధించుటయే ఈగ్రంథముయొక్క ముఖ్యోద్దేశ్యము.

లోగడ ప్రకరణములలో ఆత్మస్వరూపము, అనుసంధానక్రమముల గురించి వివిధముగ తెలుపబడినది. ఇప్పుడు ఆత్మానుసంధాన సాధనములను గూడ కొంతవరకు విచారించుదము. ఈ విచారణ ఎందులకనిన- ఈవిమర్శ అభ్యాసాదుల వలనగాని ఆత్మానుసంధాన గ్రహణ సౌలభ్యముగలుగదు. ఈ అభ్యాసాదుల పటిమనుబట్టి ఆత్మానంద మంతంత గోచరించుచుండును. అనగా అనుభూతియగుచుండును, కావున ఈవిచారమావశ్యకము.

ఇంతవరకు నిరూపణలనుబట్టి, వాస్తవమున జీవుడు ఆత్మస్వరూపుడేనని "జీవోబ్రహ్మైవనాపరః" "అయమాత్మాబ్రహ్మ" అను మొదలగు శ్రుతివచనములవలనను, వివేకిమాన వానుభవమును బట్టియుగూడ నిశ్చయమగుచున్నది. సదాత్మ - నిత్య, నిర్వికార, స్వప్రకాశ, అద్వితీయ, అఖండ జ్ఞానస్వరూపుడు అయినను, మాయాకార్యమగు సృష్టివైచిత్ర్యమువలన జీవజడ నానాత్వము ఇంద్రియ గోచరానుభవములలో యున్నందునశ్రుతి "ఏకోవశీసర్వ భూతాంతరాత్మా, ఏకంసత్ విప్రాబహుధావదన్తి" సర్వభూతముల యందుండు ఆత్మ ఒక్కటి యైనప్పటికినీ దీనినే నానాగాజెప్పుచున్నారు అని ఆత్మస్వరూపమును పై వచనము స్పష్టముజేయుచున్నను, మానవులు దీనిని సులభముగ గ్రహింపజాలకయున్నారు. దీనికికారణము అనాది అజ్ఞానమేగాని మరివేరేమియునుగాదు. ఇందుకుగాను శాస్త్రము సదాత్మను బాగుగగ్రహించుటకు, వివిధమార్గములను, ఉదాహరణములతోడ తెలుపుచు అట్టివానిలో సృష్టియందు మహాకాశమును, బ్రహ్మకతిసమీప సాదృశ్యముగ తెలుపుచున్నది. కాని ఆకాశముగూడ జన్యముగావున కల్పాంతమున నశించునది. అవకాశమిచ్చునదిగావున వికారి. కావున మహాకాశమునకుగల ఈ మొదలగు లక్షణములను త్యజించి, అసంగ, పరిపూర్ణవ్యాపక లక్షణములను మాత్రము బ్రహ్మపదార్ధమునకు

సమాన లక్షణములుగ అభ్యాసకులు గ్రహించవలయును, ఈ బోధనుగురించి యోగవాశిష్ఠమునందు సరస్వతీదేవి, లీలికిట్లు బోధించుచున్నది-

శ్లో॥ చిత్తాకాశం చిదాకాశం, ఆకాశంచతృతీయకమ్ ।
ద్వాభ్యాంశూన్యతరంవిద్ధి, చిదాకాశం వరాననే ॥

ఓసుందరీ, మహాకాశము, చిత్తాకాశము, చిదాకాశములు మూడుగలవు. ఇందు పంచభూతాత్మకమైన మనస్సంకల్ప రూపమగు చిత్తాకాశమును, భూతాకాశమగు మహాకాశమును, యీరెండును జన్యములు, కల్పనామాత్రములు నశించునవి గావున యీరెండును శూన్యమాత్రములు, అనగా వాస్తవములు గావని తెలిసికొని, నిశ్చయము నొందునెడల, అప్పుడు వీనికి అధిష్ఠానమగునట్టి అద్వితీయ, నిత్య, నిర్వికార, అఖండపరిపూర్ణమగు చిదాకాశమే నిర్విశేషముగ శేషించునని తెలిసికొనుము. ఇదియే నీవాస్తవ స్వరూపము. సర్వమునకు చిదాకాశము అధిష్ఠానము. మహాకాశ, చిత్తాకాశములు అధ్యస్తములుగాన వాస్తవములుగావు అనుతాత్పర్యార్థమును బోధించెను. ఆత్మయన్నను, చిదాకాశమన్నను, బ్రహ్మయన్నను నొక్కటియేనని లోగడనే పలుమారులు స్పష్టపరచియుంటిమి. మనసుతోడ వివిధముగ జేయుసంకల్పజాలమే సంసారకారణము. మనసు స్వస్థతగ స్వస్వరూపము నందుండునపుడు, అది మనసుగాదు, బ్రహ్మయే. ఈ విషయమునే శ్రీరామచంద్రమూర్తికి వశిష్ఠభగవానులు, "సంకల్ప మన ఏవసంసారః, నిస్సంకల్పమన ఏవబ్రహ్మ" యని సూత్రప్రాయముగ బోధించియున్నారు. కావున సర్వప్రయత్నములవలనను, మనస్సంకల్పజాల రూపమగు చిత్తాకాశమును, ప్రళయాంతమందు నశించునట్టి మహాకాశమును వాస్తవములుగావని తెలిసికొని, వీటి కధిష్ఠానమగు బ్రహ్మపదార్థము నిర్మలమహాకాశమువంటి, నిత్య, నిర్వికార, అఖండపరిపూర్ణ జ్ఞానస్వరూపమని "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" అనువచనానుసరణమున, స్వాత్మాభిన్నముగ గ్రహించి స్వానుభవము నొంది జీవుడు తత్స్వరూపుడగుటయే శాస్త్రపరమ తాత్పర్యము. ఈ విషయమును జీవునకు స్పష్టముగా తెలియబరచుటకే

శాస్త్రము- లోకప్రసిద్ధమగునట్టి, రజ్జు సర్పభ్రాంతిలో, గనుచీకటియందు గలుగుచున్న సర్పాకారచలనాదులన్నియునూ, స్తబ్ధముగా నుండునట్టి, అనగా యెట్టి మార్పును, చలనాదులను పొందనట్టి త్రాడుయందే గలుగుచున్నవి గాని, త్రాడునువిడచి యెచటనూ గలుగుటలేదుగదా! అట్లే యీ సర్వప్రపంచ, జీవ, జడ, జాలమంతయు, జీవఅనాదిభ్రాంతివలన, పరమార్థ వాస్తవమున బ్రహ్మ స్వరూపుడగునట్టియు, నిత్యనిర్వికార అఖండజ్ఞాన స్వరూపుడగునట్టియు తన యందే అనాదిగానున్నట్టి అజ్ఞానమను మందాంధకారములవలన, తోచుచున్న దని తెలుపుచున్నది. ఇట్లే యీ దృశ్యనానాత్వ మంతయు ప్రాదేశపరిమితి గల స్వాప్నికునియందు, బ్రహ్మాండ భూమండలాదులు, వాని దీర్ఘానుభవములు గూడ కొద్ది క్షణముల కాలములో నెట్లుగలుగుచున్నవో, అట్లు పరమార్థ వాస్తవమున చిదాకాశము లేక బ్రహ్మ స్వరూపుడగు తన యందే ఆభాసముగ గనబడుచున్నది గాని, యీ జగన్నానాత్వము, పరమార్థ వాస్త వముగాదని ముముక్షువులగు వారు బాగుగ తెలిసికొని నిశ్చయమునొంది, వారి మననాద్యభ్యాసముల నాచరించుటయే సాక్షాన్ముక్తి మార్గమని శాస్త్రము తెలుపుచున్నది. పైననిరూపించిన యట్లు యీ స్వశరీర సర్వదృశ్యమంతయు బ్రహ్మ యందే గలుగుచున్నది గాని, బ్రహ్మ భిన్నముగనేదియును యీ దృశ్యమందు లేదు. జీవుడు దృశ్య కోటిలోని వాడే నని భ్రాంతి నొందు చుండుటచే "జీవో బ్రహ్మైవనాపరః" "అయమాత్మాబ్రహ్మ" అనిన్నీ, మూర్తా మూర్త దృశ్యమంతయు బ్రహ్మయందే వివర్తముగ గలుగుచున్నందున "సర్వంఖల్విదంబ్రహ్మ" "బ్రహ్మసత్యంజగన్మిథ్యా" "నేహనానాస్తికించన" యనిన్ని మానవునకు శ్రుతి మాత ఘోషించి. బోధించుచున్నది.

"అహం" నేను అను ప్రతీతి ఎల్లప్పుడునూ మోక్షపర్యంతమునుండి మోక్షకాలమునందు స్వస్వరూపమున లయమగుచున్నది. లయమనగా యీ నేను యను ప్రతీతి వాస్తవముగాదని తెలిసికొని స్వానుభవము నొందుటయే. ఈ శరీరాదులు నశించునవిగాని నేను అను తాను నశించక, అవస్థాత్రయ, త్రికాలాబాధితముగ నుండును. ఇది వివేచనపరులగు వివేకులందరి యనుభవ

ములలోనున్నదియే గావున వివేకియగువాడు, నశించునట్టి, మూర్తామూర్త స్వశరీర, సర్వ దృశ్యమును వదలి (అనగా వాస్తవముగాదని బాగుగ్రహించి) తన పరమార్థ వాస్తవ స్వరూపము జగదధిష్ఠానమగు అద్వితీయ, నిత్య, నిర్వికార, అఖండ, చిద్ఘనానంద స్వరూపమగు బ్రహ్మయని తెలిసికొని స్వాత్మాభిన్నముగ, స్వానుభవము నొందుటకు ప్రారబ్ధాంతమువరకు "అహం బ్రహ్మాస్మి" అను నిశ్చయముతో, సతతానుసంధానాదుల నభ్యసించుచుండిన ప్రారబ్ధాంతమున స్వస్వరూపమగు పరమాత్మ స్వరూపుడే యగునని శాస్త్రము విశదపరచి బోధించుచున్నది. పరమాత్మ లక్షణములను, దానినొందు విధానమును శ్రీ కృష్ణపరమాత్మ గీతలలో నిట్లు స్పష్టపరచుచున్నారు-

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వా, త్పరమాత్మాయమవ్యయః।
శరీరస్థోఽపికౌన్తేయ, నకరోతినలిప్యతే॥

శ్లో॥ యథాసర్వగతం సౌక్ష్మ్య, దాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే, తథాఽఽత్మానోపలిప్యతే॥

శ్లో॥ యథాప్రకాశయత్యేకః, కృత్స్నంలోకమిమంరవిః।
క్షేత్రం క్షేత్రీతథాకృత్స్నం, ప్రకాశయతిభారత॥

శ్లో॥ క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవ, మన్తరం జ్ఞానచక్షుషా।
భూత ప్రకృతి మోక్షంచ, యేవిదుర్యాన్తితేపరమ్॥

శ్లో॥ అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం, తత్త్వ జ్ఞానార్థ దర్శనమ్।
ఏతత్ జ్ఞానమితిప్రోక్త, మజ్ఞానం యదతోఽన్యథా॥

శ్లో॥ అహఙ్కారం బలందర్పం, కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమశ్శాన్తో, బ్రహ్మ భూయాయ కల్పతే॥

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా, నశోచతినకాఙ్క్షతి।
సమస్సర్వేషు భూతేషు, మద్భక్తిం లభతేపరామ్॥

శ్లో॥ భక్త్యా మామభిజానాతి, యావాన్ యశ్చాస్మితత్త్వతః ।
తతోమాంతత్త్వతోజ్ఞాత్వా, విశతే తదనన్తరమ్ ॥

ఈ శ్లోకముల తాత్పర్యార్థమేమనిన—పరమాత్మ నిర్గుణమగుటవలనను, అనాదియగుటవలనను, అవ్యయమైనది. అనగా నాశము లేనిది. కావున దేహమందున్నను, యెట్టిక్రియలతోడగాని, కర్మఫలములతోగాని, సంబంధమును పొందుటలేదు.

సర్వగతమగు ఆకాశము సూక్ష్మ భావమువలన నెట్లు దేనితోడను సంబంధము నొందుటలేదో, అట్లే ఆత్మ సర్వదేహముల యందున్నను, ఆదేహములయందలి గుణదోషముల సంబంధము నొందునదిగాదు.

ఒక సూర్యుడు ప్రపంచమునంతయు నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో, యట్లే క్షేత్రజ్ఞుడగు పరమాత్మక్షేత్రములనన్నింటిని ప్రకాశింపజేయుచున్నాడు.

ఈ రీతిగ క్షేత్ర క్షేత్రజ్ఞుల, అనగా జీవపరమాత్మల అభేధమును జ్ఞాన దృష్టిచే నెవరు తెలిసికొందురో, మరియు భూతముల యొక్క ప్రకృతినుండి మోక్షమునకుపాయమగు ఆత్మజ్ఞానమును నెవరు జ్ఞానదృష్టిచే తెలిసికొందురో, అనగా స్వానుభవము నొందుదురో, వారు మోక్షమును బొందుదురు.

జ్ఞానమనగా ఆధ్యాత్మజ్ఞానము. తద్విషయమైన నిత్యత్వము మోక్షమే సర్వోత్కృష్టమని నిశ్చయించి ప్రయత్నించుచుండుట, ఇది యంతయు జ్ఞానమని చెప్పబడినది. దీనికన్న వేరైనదంతయును అజ్ఞానమని చెప్పబడినది.

అహఙ్కారమును, బలమును, దర్పమును, కోపమును, పరిగ్రహమును అనగా, భార్యాపుత్ర విత్తక్షేత్రాదులయందు మమత్త్వమును త్యజించి శాంతముగనుండువాడు నేనే బ్రహ్మమును అని నిశ్చలముగా నుండుటకు తగినవాడు.

అట్లు బ్రహ్మాత్మనా సంస్థితుడగువాడు ప్రసన్న చిత్తుడై దుఃఖరహితుడగుచు నిస్సంకల్పుడగును, అనగా దేనిని కోరడు. సర్వభూతములయందును సముడై గొప్పదియగు నాభక్తిని పొందును.

శ్లో॥ క్షేత్ర జ్ఞంచాపి మాంవిద్ధి, సర్వక్షేత్రేషు భారత।
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం, యత్తత్ జ్ఞానం మతంమమ॥

ఇంకనూ దేహములన్నిటియందును ఉన్నటువంటినన్నే (అనగా తననే) క్షేత్రజ్ఞునిగా తెలిసికొనుము. క్షేత్ర క్షేత్రజ్ఞులను తెలిసికొనుటయే అనగా జీవుడు తనను తాను వాస్తవముగా తెలిసికొనుటయే ఆత్మజ్ఞానము. ఇదియే నామతము అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు బోధించుచున్నారు.

ఇట్టి భక్తివలన నేనెవరో, అనగా తన ఆత్మస్వరూపమెట్టిదో, యెట్టివాడనో, అనగా, తానెట్టివాడో యథార్థముగ తెలుసుకొనును. అట్లు నన్ను యథార్థముగ అనగా తనయొక్క పరమార్థ స్వరూపమును వాస్తవమున తెలిసికొని, తరువాత నా యందు ప్రవేశించును. అనగా పరమానంద స్వరూపుడే యగును, అని శ్రీకృష్ణపరమాత్మ తెలుపుచున్నారు. ఇదియే ఆత్మజ్ఞానము.

ఈ ఆత్మజ్ఞానలాభము మానవులయొక్క లోకవ్యవహారానుభవ భోగైశ్వర్యములను లోపింపజేయునను సాధారణాభిప్రాయముగలదు. ఇది భ్రాంతిమాత్రము, అవాస్తవము. మానవులకు యీ సదాత్మ జ్ఞానలాభము వారివారి ప్రపంచ భోగానుభవములకు సహకరించుచు విశ్రాంతి సాధనమగును గాని లోకానుభవములకు బాధకరముగాదని విద్వాంసులు గ్రహింతురుగాక.

మరియును వ్యవహారమందు సాధారణముగ నన్ని మతములవారునూ, జీవుడు, ప్రపంచము, దేవుడు యను మూడు అంశములను విధిగా నొప్పుకొనుచున్నారు. కాని యివి వివేకులకు మూడునూ భిన్న భిన్నములా, ఒక్కటియాయను సంశయమునకు శ్రుతిమాతయే "సదేవ సౌమ్యే దమగ్ర ఆసీత్"

యీ సృష్టికి పూర్వము సత్పదార్థమొక్కటియే యున్నదనిన్ని సర్వదాయున్నది "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ, నేహానా నాస్తి కించన" అనగా వాస్తవమున నున్నది ఏమనిన- రెండవ వస్తువు లేనట్టి యొక్కటియే యగు బ్రహ్మ మాత్రమే. నానాగా కనుబడు వస్తువులన్నియు అవాస్తవములు అనగా వాస్తవముగ లేవు అనిన్ని యింకనూ "జీవో బ్రహ్మైవనా పరః" జీవుడు బ్రహ్మకంటె వేరుగాదనియు స్పష్టము చేయుచూ "తత్త్వమసి" ఆ బ్రహ్మవు నీవేయని గూడ మహా వాక్యము వలన జీవునకు తన పరమార్థ వాస్తవ స్వరూపమును తెలుపుచున్నది. కాని మానవులందరకునూ యిపుడు వారి వారి ఆత్మ తెలియుట లేదాయను సంశయము గలుగవచ్చును. ఇట్లు గలుగుటకు గూడ నవకాశమున్నది. ఏలనన యే మానవుడునూ తానాత్మస్వరూపుడను గాననుటలేదు. తనను తాను తెలిసికొనకుండనూ యుండుటలేదు. కాని మానవుడు తన అనాది జీవాజ్ఞానముతోడ తాను వాస్తవమునగాని యట్టి శరీరో పాధినే తాను అనగా నేను అనిన్ని, యీ నానాగా గనబడు ప్రపంచమును కల్పిత సంబంధములతోడ, నాదియనిన్ని యధ్యాసము నొందుచు వీటియందు సత్యత్వ బుద్ధితోడ సంసారమునందు భ్రమణము చేయుచున్నాడు. అధ్యాస మన "అతస్మిన్ తత్ బుద్ధిః" ఆ వస్తువుగాని దానిని ఆ వస్తువు యని తలంచుట. అనగా అవాస్తవ పదార్థమందు వాస్తవ బుద్ధిని చేయుట. జీవునకు యీ తన శరీర ప్రపంచములు రెండునూ అవాస్తవములు. కాని వీటియందు సత్యత్వ బుద్ధి నొందుచు యివి తనకు సత్యమను భ్రాంతి నొందు చున్నాడు. ఈ భ్రాంతి జీవున కనాదిగ వచ్చుచున్నది. ఈ అనాది భ్రాంతినుండి జీవుని నుద్ధరించుటకే శ్రుతిమాత, జీవునకు తాను మరచిన తన పరమార్థ వాస్తవ స్వరూపమును బోధించుచున్నది. ఏ జీవునకైనను పరిపూర్ణ స్వాత్మజ్ఞానము గలుగనిదే నిత్య నిరతిశయ సుఖ స్వరూపమగు ముక్తియను మాటగూడ కలలో వార్త. అనగా లభింపదు. వాస్తవమున జీవుడు తానే అద్వితీయ, అఖండజ్ఞాన స్వరూపుడు. కాని జీవునకిట్టి తన పరమార్థ స్వరూపమును గుర్తించుటకు అధ్యాస అడ్డువచ్చుచున్నది. ముముక్షువునకు యీ అధ్యాసను తెగించుకొనుటయే ప్రథమ

కర్తవ్యము. ఈ ఆవశ్యకతను బట్టియే సూత్ర భాష్యములో మొట్టమొదట "భార్యాపుత్రాదిషు సకలేషు వికలేషువా, అహమేవ, వికలస్సకలోవేతి మన్యతే, సత్యానృతే మిథునీకృత్య అహమిదం మమేద. మితినైసర్గికోయం లోకవ్యవహారః, తస్య ప్రహాణాయ ఇయం శారీరక మీమాంసా ఆరభ్యతే." అనగా భార్యా పుత్రాదులకు ఏర్పడు సుఖ దుఃఖాదులు, జీవుడుతనకే కలుగుచున్నట్లు అనుభవము నొందుచున్నాడు. సత్యానృతములను కలిపి నేను, నాది, యను వ్యవహారము చేయుట లోకానికి స్వాభావికము ఈ అధ్యాసమును తొలగించుటకుగాను యీ శారీరక మీమాంస అనగా జీవ స్వరూపవిచారము ఆరంభింపబడును అని శ్రీ శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు.

ఏలనన ఆత్మజ్ఞానము లేనిది యీ అధ్యాసము నివర్తింపదు. కావున మానవునకు తన ఆత్యంతిక దుఃఖ నివృత్తికి తన పరమార్థ స్వరూపాత్మజ్ఞానమావశ్యకము. ప్రతి జీవునకునూ, యీ ఆత్మ పరిపూర్ణము, అద్వితీయము, అఖండము, సర్వాధిష్ఠాన మగునది యిది యొక్కటియే. దీనిని గురించి కఠోపనిషత్తు "ఏకోవశీ సర్వభూతాన్తరాత్మా, ఏకం రూపం బహుధాయః కరోతి। తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్" అనగా ఆత్మ అద్వితీయము, సమస్త జగత్తును తన వశమునందుంచుకొన్నది. సర్వ భూతముల కంతరాత్మయు నగుచున్నది ఆత్మశుద్ధ విజ్ఞానరూపమే యైనను, ఉపాధి వశమున, ననేక ప్రకారముల నానాగాయున్నటుల గన్పట్టుచున్నది. ఎవరు తన హృదయాకాశాంతర్గతమగు బుద్ధి గుహయందిట్టి యాత్మను, దర్శించుదురో అట్టి వారికి శాశ్వత సుఖము గలుగును. తదితరులకు గలుగదు. అని స్పష్టముగా తెలుపుచున్నది. ఈ అర్థమునే సంగ్రహముగ తైత్తిరీయోపనిషత్తు "యో వేద నిహితంగుహాయాం పరమేవ్యోమన్। సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ" అనగా ఎవడు శ్రేష్ఠమగు హార్దాకాశమందలి. (అనగా తన హృదయ పుండరీకమందున్న.) బుద్ధి గుహాయందు నిగూఢముగ నున్నట్టి పరమాత్మను తెలిసికొనుచున్నాడో, యతనికి నొక్కమారుగ సమస్తములగు కోర్కెలు తీరును. అనగా అకాము

డగును అని తెలుపుచున్నది. కాని యెవడైనను యొకడు యీ ఆత్మ స్వరూపుడగు బ్రహ్మ, మాకు యిపుడు గనుబడుటలేదు. అట్టివాడున్నాడో లేడో యని సందేహించినను, లేడని తలచినను, అది ప్రమాద హేతువని శ్రుతియే "అసన్నేవస భవతి। అసద్బ్రహ్మేతి వేదచేత్" అనగా ఎవడైనను బ్రహ్మము లేదని తలంచువాడు, వాడు స్వయముగ సత్పురుషుడై యుండియు, పురుషార్థమును గోల్పోవుచున్నాడు. అనగా స్వయముగా తానే లేనివాడగుచు న్నాడు, అని తెలుపుచున్నది. కావున సర్వ విధముల చేతను మానవునకు తన మోక్ష ప్రాప్తికి ఆత్మజ్ఞానము ఆవశ్యకము.

కావున మానవుని మోక్షస్వరూపమగునట్టి నిత్య, నిరతిశయ, సుఖ ప్రాప్తికొరకే శ్రుతిమాత "బ్రహ్మవిదాప్నోతిపరం" అని తెలుపుచున్నది. అనగా బ్రహ్మను తెలిసికొనిన విద్వాంసుడు సర్వోత్కృష్టపదమగు నిత్య నిరతిశయ సుఖస్వరూపము నొందునని అర్థము. ఇట్లు తెలుపుచు "నాన్యః పంథావిద్యతేయనాయ" మోక్షమునకు వేరుదారిలేదు అని గూడ చెప్పి "జీవో బ్రహ్మైవనాపరః" జీవుడు బ్రహ్మకంటె వేరుకాదని స్పష్టముచేయుచున్నది.

కాని యీ బ్రహ్మ - ఆత్మపదార్థము చూడబడునదిగాని తెలిసికొనబడు నదిగాని గాదు. ఏలనన శ్రుతి "విజ్ఞాతారమరేకేన విజానీయాత్" అనగా తానే జ్ఞానస్వరూపుడై యున్నప్పుడు, తననుతానెట్లు చూడగలడు ? ఎల్లప్పుడునూ చూడబడువస్తువు తానుగాదు. కావున ఇది ఎట్లని మానవునకు బోధించునట్టి స్వానుభవమే తత్త్వజ్ఞానము.

తత్వజ్ఞానమనగా — జీవుడు తన పరమార్థస్వరూపమును గ్రహించి, స్వానుభవమునొందుట. ఇదియే జీవునకు పరమపురుషార్థము, మోక్షప్రాప్తి. ఈ పురుషార్థము మానవునకు ఒక్క తత్వజ్ఞానము అనగా బ్రహ్మజ్ఞానము వల్లగాని కలుగదు. జీవునకు మానవజన్మ కలిగినప్పుడే ఆత్మజ్ఞానమును సంపాదించవలయునని- "నచేదిహావేదీన్మహతీవినష్టిః" ఈ జన్మయందే సదాత్మ జ్ఞానమును సంపాదింపకయుండు జీవునకు ఘోరమగు నష్టము సంభవించునని

శ్రుతిమాత తెలుపుచున్నది. కావున ఈ జన్మమునందే సదాత్మజ్ఞానమును సంపాదించుట యావశ్యకమని శాస్త్రము తెలుపుచున్నది. కాని ఆత్మ, ప్రయత్నముచేగాని లభ్యముగాదని—

"నాఽయమాత్మా ప్రవచనేన లభ్యోనమేధయా న బహునాశ్రుతేన।
యమేవైషవృణుతేతే నలభ్య స్తస్యైష ఆత్మావివృణుతేతనూంస్వామ్"

ఈ యాత్మ వేదాధ్యయనము, బుద్ధిచాతుర్యము, వేదార్థశ్రవణము, అను మొదలగువానిచే తెలియబడదు. కాని ఏసాధకుడు ప్రయత్నము చేయుచున్నాడో వానికి ఈ ఆత్మ తనకుతానే ప్రకటితమగును. అనగా—ఎరుంగబడును. ఇట్టి శ్రద్ధగల సాధకునకు ఆయాత్మ స్వయముగనే స్వస్వరూపమును ప్రకటించును. (ఇదియే గుర్వీశ్వర ప్రసాదమని సాధకుడు ఎరుంగవలయును.)

ఈ సాధన ప్రయత్న నిరూపణములనుగురించి గ్రంథములో విపులముగ బహువిధముల తెలుపబడెను అయినను ముముక్షువులగు జిజ్ఞాసువులకు ఈ పరమోత్కృష్ట విద్యాలాభమునుద్దేశించి నా చిరకాల సతత ప్రయత్న సాధనాభ్యాసానుభవమును నిచట సంగ్రహించుచున్నాడను.

శ్రుతి పరమతాత్పర్యము, జీవబ్రహ్మైక్యబోధయే. జీవునకిట్టి అద్వితీయ అఖండజ్ఞానము మహావాక్యమువలననే కలుగవలయును. కాని ఈ జ్ఞానమాత్ర స్వరూపుడగు ప్రత్యగాత్మ, ప్రమాణములు అనగా ఇంద్రియములచే జూచి తెలుసుకొనబడెడువాడుగాడు. ఏలనన ఆయన స్వయంప్రకాశమానుడై గడప యందున్న దీపములోపలను బయటను ప్రకాశించునట్లు ఆంతర బాహ్యేంద్రియాది విషయములను ప్రకాశింపజేయుచుండును. ఈ ప్రకాశమునకు ఆయన కర్తకాడు ఆయన స్వరూపప్రకాశముచేతనే సర్వము ప్రకాశింపజేయబడుచున్నదని—"తస్యభాసా సర్వమిదం విభాతి" అని శ్రుతి తెలుపుచున్నది. జీవునకిట్టి పరమాత్మైక్యమును "తత్త్వమసి" "అయమాత్మాబ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" "ప్రజ్ఞానంబ్రహ్మ" అను మహావాక్యములు బోధించుచున్నవి.

ప్రజ్ఞానఘనుడు ఎట్టివాడనగా—

"అపూర్వమనపరమనన్తర మబాహ్యం ప్రజ్ఞాన ఘనఏవ" ఈ ప్రజ్ఞాన ఘనుడు కారణము కార్యములేనివాడు, అనగా సర్వత్ర నిండియుండు నిత్యపరిపూర్ణ జ్ఞానస్వరూపుడు అని శ్రుతి తెలుపుచున్నది. నిత్య పరిపూర్ణ జ్ఞాన స్వరూపుడే తానని ఆత్మాభిన్న అఖండాకారముగ "అహంబ్రహ్మాస్మి" అని ముముక్షువులనుసంధానము చేయుచుండవలయును.

ఇట్టి అభ్యాసకునకు సాక్షాత్సాధన క్రమమునుగూడ శ్రుతియే "ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే" అని తెలుపుచున్నది. కాని— శ్రుతియే— "పరాంచిఖాని వ్యతృణత్ స్వయం భూస్తస్మాత్పరాజ్ పశ్యతినాన్త రాత్మన్" అని తెలుపుచున్నది. ఇంద్రియములు బాహ్య విషయముల జ్ఞానమునే కలుగజేయునుగాని, ఆత్మజ్ఞానమును సాక్షాత్తుగా నివ్వజాలవు. కావున బాహ్యప్రవృత్తి త్యజించినయడల ఆత్మజ్ఞానమునకు సాధనములుకాగలవు. తత్త్వమస్యాది మహావాక్యము దీనినే బోధించుచున్నది. ప్రత్యగాత్మయందు దుఃఖిత్వాది సంసారమును బోధించెడి "అహందుఃఖీ"త్యాది ప్రత్యక్ష ప్రమాణమునకు విరుద్ధముగా, అద్వితీయ కూటస్థ పరమానంద చైతన్య జ్ఞానమును పుట్టించుచున్నది.

అందుచే విద్వాంసులైనవారు ప్రత్యక్షమైన "అహందుఃఖీ" త్యాది ప్రమాణములను గౌణమనియు, కూటస్థాత్మ-నిర్వికారుడు అసంగుడు గనుక ఈ జ్ఞానము అముఖ్యమనియు తెలుపుదురు. ఏలనన, దుఃఖిత్వాదులు ముఖ్యముగా అంతఃకరణధర్మములై యున్నను, గౌణవృత్తిచే ఆత్మధర్మములుగ వ్యవహరింపబడుచున్నవి. ఆత్మ స్వరూపమును బోధించుటకు 'త్వం-అహం' (నీవు—నేను) అనుపదములుతప్ప వేరుపదములులేవు ఈ రెండును వాచ్యార్థముతో అంతఃకరణమునకు సంబంధించినవి యగుచు, లక్షణా వృత్తిచే ప్రత్యగాత్మను బోధించును. ఈ ఒక్క 'అహం' వృత్తిచేతనే ప్రత్యగాత్మ లక్షింపబడుచున్నదిగాని, వేరుదారిలేదు. ప్రత్యగాత్మ ప్రత్యక్షముగ తెలియబడు

వస్తువుగాదు. "గంగాయాంఘోషః" అనునప్పుడు ప్రవాహ వాచకమైన గంగా శబ్దము తీరవాచకము కాకపోయినను లక్షణా వృత్తిచే తీరమును బోధించుచున్నదిగదా; అట్లే "తత్త్వమసి" వాక్యము, "అహంబ్రహ్మాస్మి" అను వాక్యము, అంతఃకరణాద్య వచ్ఛిన్న చైతన్య వాచకమగుచు, లక్షణా వృత్తిచే అఖండైకరస స్వప్రకాశ పరమాత్మ బోధను కలుగజేయును. ఇందుకు సందియములేదు.

కాని యిచట నొకశంక కలుగవచ్చును. ఏదియనిన- నివర్తింప జేయబడవలసినట్టి అజ్ఞానమునకును, ప్రవర్తింపజేయునట్టి జ్ఞానమునకును ఒక్క- ఆత్మయే ఆశ్రయమైయున్నందున ఆత్మకు సవికారత్వము సంభవించును గదా యనునది. ఈ శంకకు అవకాశములేదు. ఏలనన - వివర్తకారణవాద సిద్ధాంతమందు ఎచటనూ వాస్తవికమైన సద్వితీయత్వము సంభవింపదు. ఎల్లప్పుడునూ సత్యమగు అధిష్ఠానమును, కల్పితమగు అధ్యస్తమును పరమార్థ వాస్తవమున ఒక్క-టిగనేయుండును. ఇదిగాక, ఆకసము — అమూర్తము, రూపహీనము సనునది జ్ఞానము. ఆకసము-నీలముగనున్నది. బోర్లించినట్లు అర్ధగోళాకారముగనున్నది యనునది అజ్ఞానము. ఇది సర్వానుభవము. ఈ జ్ఞానా జ్ఞానములు రెండును ఒక్క-వస్తువునందే యున్నను అట్టి ఆకసమునకు ఎట్టివికారమును కలిగింపకయే వాస్తవజ్ఞానము అజ్ఞానమును నివర్తింపజేయుచున్నది. అనగా — ఆకాశము వాస్తవమున రూపహీనమనుజ్ఞానమే, ఆకసమునందెట్టి మార్పును కలిగించకయే, ఆకసము నీలము — అర్ధగోళాకారము — అనుజ్ఞానమును నివర్తింపజేయుచున్నది. కాని ఆకాశయథార్థ జ్ఞానము లేనివారందరికిని ఆకాశనీలత్వాదులు వాస్తవముగనున్నట్లే కనబడుచుండునుగదా! ఇటులనే ఆత్మ-దుఃఖిత్వాది సంసారము కలవాడనునది అజ్ఞానము. ఆత్మ- అసంగ, నిత్య, నిర్వికార, అఖండ, చిన్మాత్ర స్వరూపుడనునది జ్ఞానము. ఈ రెండును ఆత్మనే ఆశ్రయించియున్నను, ఆయాత్మయందెట్టి వికారములను సంపాదించ నేరవు. అనగా — ఆత్మకు కలుగజేయలేవు. కావున జ్ఞానము — అజ్ఞానమును

నివర్తింపజేయును. అప్పుడు నిత్య నిర్వికార అఖండ చిద్రూపము నిర్విశేషముగ శేషించును. ఇదియే మోక్షము.

ముముక్షువునకు అన్వయవ్యతిరేక విచార సహితమహావాక్య శ్రవణము వలన అవిద్యా నివృత్తిగలుగును. ప్రత్యగాత్మ అవిద్యా నిద్రచే నాక్రమింప బడి, గాఢసుషుప్తిగలవానివలె స్వస్వరూపజ్ఞానము మరచినవాడై యున్నట్లు లోకానుభవమును బట్టి తెలియుచున్నది. కావున తత్త్వమస్యాది మహావాక్య బోధ — అంతఃకరణదేహేంద్రియాది తాదాత్మ్యమును, ఆభాసరూపత్వమును రెంటిని నిరసించుచు, అవిద్యా నిద్రను నిరాకరించి, అద్వితీయ అఖండ స్వస్వరూప జ్ఞానమును కలుగజేయును. ఇదినిత్యము. లేనికాలమెప్పుడునులేదు. దీనినే — "నహిద్రష్టుఃదృష్టేర్వి పరిలోపో విద్యతే." సాక్షియొక్క స్వరూప భూతమైన జ్ఞానమునకు లోపములేదు, అని శ్రుతి తెలుపుచున్నది. జీవునకిట్టి తన నిత్య అఖండ పరిపూర్ణ సత్యస్వరూపమును తనమెడలోని మరచిన హారమును వలె జ్ఞప్తికి తెచ్చుకొనుటయే కర్తవ్యము. జ్ఞప్తికి వచ్చిన వెంటనే తానే పరిపూర్ణ స్వరూపుడగును ఈ అర్థమునే "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అనుశ్రుతి తెలుపు చున్నది.

సదాత్మతత్త్వ జ్ఞానముకలవానికి శ్రుతి —

"తస్యతావదేవచిరం, యావన్న విమోక్ష్యే, అథసంపత్స్యే ॥

మోక్ష ప్రాప్తికి ప్రారబ్ధాంతము వరకే విలంబముగాని, తదుపరి ఆలస్య ముండదని తెలుపుచున్నది. సదాత్మ యనగా—స్వాత్మాభిన్న అద్వితీయ అఖండాత్మ కాని, స్వభిన్నాత్మ కాదు. భిన్నాత్మజ్ఞానము స్వస్వరూపానుభవ బోధ నివ్వజాలదని ముముక్షువులు గ్రహించవలయును.

జిజ్ఞాసువు బాగుగ గ్రహించవలసిన రహస్యమొకటి కలదు. ఏది యనిన- సర్వకాలముల యందును తనకు "అహం" నేను అని కలుగు ప్రతీ

తికి తన పరమార్థ వాస్తవ స్వరూపము నిత్య నిరతిశయ అఖండ పరిపూర్ణ జ్ఞానానంద స్వరూపమేననియు, కాని తాను యిప్పుడు తన అజ్ఞాన కృత ప్రారబ్ధ ఫలముచే యీ ఉపాధి బద్ధుడనై యున్నాననియు, తనకీ యుపాధి తన ప్రారబ్ధక్షయము వరకే యుండుననియు, ప్రారబ్ధాంతమందు తాను తన పరిపూర్ణ బ్రహ్మానంద స్వరూపము నొందగలననియు నిశ్చయముతో నుండి తన వ్యవహార పరమార్థ సాధన కర్మలను నిర్లిప్తతతో నాచరించుచుండ వలయును. కాని- ఎట్టి పరిస్థితులయందైనను తాను- 'నేను' అను "అహం" ప్రతీతి విషయము తన శరీరాదులని మాత్రమని స్వప్నములో గూడ తలచ గూడదు. సర్వ కర్మలను శాస్త్ర చోదితముగ నిర్వర్తించుచు, అవియన్నియు తన ఉపాధి ధర్మములను నిశ్చయముతో నుండవలయును. స్వశరీర సర్వ దృశ్యోపాధులన్నియు తన ప్రారబ్ధ ఫల భోగమునకుగాను కల్పితములైనవే గాని, తనకెందు నిత్య సత్యమగు పదార్థమేదియు లేదను నిశ్చయముతోడ సర్వదా సర్వాధిష్ఠాన అఖండాకారమగు నిర్మలాకాశమువంటి తన పరి పూర్ణజ్ఞానస్వరూపమును అనుసంధించుచుండవలయును. ఇట్టి వృత్తితోడనే తన సర్వ కర్మలను నిర్వర్తించవచ్చును ఇదియే మోక్షసాధనము.

ముముక్షువునకు తన పరమార్థ స్వరూపమగు బ్రహ్మను తెలిసికొనుటకు గాను ఎచటికి పోనవసరములేదు. ఏలన-తన పరమార్థ వాస్తవస్వరూపము, స్వశరీర సర్వాధిష్ఠానమగు పరమాత్మయే. కాని అనాది అవిద్యాకల్పితమైన, దీనియందే "అహం" "ఇదం" అను రెండు ప్రతీతులును, స్వాప్నికునియందు స్వాప్న ప్రపంచము ధ్వస్తమగుచున్న విధముగ నున్నవిగాని వాస్తవముగలేవు. కావున సర్వము తనయందే అవాస్తవముగనున్నదనియు తాను వాస్తవమున పరమాత్మస్వరూపుడేననియు గ్రహించవలయును.

శ్రుతి, "జీవోబ్రహ్మైవనాపరః" జీవుడు బ్రహ్మకంటె వేరుగాదు, అని స్పష్టముచేయుచు, ఈ విషయమునే సదృష్టాంతముగ విపులముగ బోధించు చున్నవి. ఎల్లప్పుడును ఒక్కటియగు పరమాత్మయే సంసారమను వృక్షముపైన

వాస్తవముగ చిద్రూపమునను, భ్రాంతితోడ ప్రతిబింబరూపమగు జీవునిగను, అనగా పరమాత్మ—జీవాత్మరూపముల అజ్ఞానకాలమందు భాసించుచుండును. జీవుడు భ్రాంతుడై సంసార సుఖదుఃఖానుభవముల నొందుచున్నను, పరమాత్మ సాక్షిరూపమున నిత్యనిరతిశయ సుఖస్వరూపముతో భాసించుచుండుననియు, ఆలంకారికముగ నీ రెండు పక్షులను ఒక్కచెట్టుమీదనే యున్నట్లు శ్రుతి తెలుపుచున్నది. ఎప్పుడు ఈ జీవాత్మయను పక్షి, తన సుఖదుఃఖానుభవములతో విసకటజెంది, వైరాగ్యముకలదై, పైనున్న వాస్తవస్వరూపమగు పరమాత్మ పక్షిని జూచునో, అప్పుడీజీవుడు తాను భ్రాంతుడే గనుక, తన భ్రాంతిజ్ఞానము నశించి నేను వాస్తవమున ఆ నిత్యనిరతిశయ సుఖమగు పరమాత్మస్వరూపుడనేగాని, వేరుగాదని గ్రహించును. కనుక భ్రాంతిచే సద్వితీయముగ ప్రతీతుడగు జీవుడు, తాను అద్వితీయ బ్రహ్మస్వరూపుడగును. ఈ తాత్పర్యార్థమునే క్రింది శ్రుతివచనములు రూపకముగ జీవునకు బోధించుచున్నవి-

"ద్వాసుపర్ణాసయుజా సఖాయాసమానం వృక్షం పరిషస్వజాతే। తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి॥" "సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః। జుష్టం యదాపశ్యత్యన్యమీశ మస్యమహిమానమితివీతశోకః॥

కావున ముముక్షువు పై వచనార్థములను బాగుగ సద్గురుముఖమున తెలిసికొని "అహం" నేను అను తాను చిత్ప్రతిబింబరూపమగునట్టి రెండవ పక్షివంటివాడను గాననియు, తను అనగా నేను పరమార్థవాస్తవమున పైనున్న మొదటిపక్షివంటి సాక్షిరూపుడననియు, తనకీసంసార సుఖదుఃఖానుభవములతో వాస్తవసంబంధము లేదనియు, శాస్త్రీయముగ ప్రతీతి నిశ్చయములతోడ గ్రహించి, తన ప్రారబ్ధానుసరణమున నెట్టి సుఖదుఃఖానుభవములు పొందుచున్నను అవియన్నియు శరీరాభిమానియగు చిత్ప్రతిబింబుడు, అనగా చిదాభాసునివేగాని వీనితో వాస్తవసంబంధము నాకులేదు. ఇవి అజ్ఞాన కల్పితమాత్రముగ ప్రారబ్ధానుసరణమున జరుగుచు, నన్ను అధ్యాసముతో బంధించుచున్నవి.

"అహం" నేను కేవల చిద్రూపుడను. సాక్షి, ప్రత్యగాత్మ, పరమాత్మైవ, నేను స్వప్రకాశ, అఖండ, సచ్చిదానందస్వరూపుడను, అని తన స్వస్వరూపాను సంధానమును విసుగుచెందక నభ్యసించుచుండినయడల, కాలపరిపాక ప్రారబ్ధాంతమున తన స్వస్వరూపమగునట్టి, నిత్య, నిర్వికార, అఖండపరిపూర్ణానంద స్వరూపుడే యగును. సంశియములేదు. ఐతే యిట్లు గావించుటకు మనసును నిలుపుట సాధ్యమాయని, అర్జునునకు కలిగిన సంశయమునకు, గీతలలో 'అభ్యాసేనతు కౌన్తేయ, వైరాగ్యేణచ గృహ్యతే" అనగా అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను, మనసును నిరోధించి యీ ఆత్మవిద్యను సాధింపవచ్చునని శ్రీకృష్ణపరమాత్మయును,

శ్లో॥ పరామర్శేన శాస్త్రస్య గురువాక్యార్థబోధనాత్।
అభ్యాసాత్సర్వసిద్ధిఃస్యాదితి వేదానుశాసనం॥

అనగా శాస్త్రవిచారంబువలనను, గురూపదేశంబువలనను, ఆత్మానుసంధానాభ్యాసంబువలనను, సర్వంబు సిద్ధించునని వేదములు చెప్పుచున్నవి, అని శ్రీ వశిష్ఠభగవానులును తెలుపుచున్నారు. కావున స్వస్వరూపమగు అఖండ జ్ఞాన స్వరూపమును భావనాభ్యాసదార్ఢ్యముచే సాధించవచ్చును. ఇదియే జీవుని అఖండ పరిపూర్ణానందస్వరూపము. ఇదియే పరమాత్మస్వరూపము. ఇట్టి జ్ఞానమునొందిన మహనీయుడు సమస్తమును జ్ఞానరూపముగనే జూచుచుండునని—"తద్విజ్ఞానేన పరిపశ్యన్తిధీరా ఆనందరూపమమృతం యద్విభాతి" అట్టి విద్వాంసులు ఆత్మజ్ఞానముచే, ఆనందమే రూపముగాగలిగి సర్వకాలములయందమృతస్వరూపమున ప్రకాశించుచున్న ఆత్మతత్త్వమును అంతటను చూచుచున్నారు, అని ముండకోపనిషద్వచనము తెలుపుచున్నది. ఇంకను పరమాత్మ జ్ఞానఫలమును యిట్లు తెలుపుచున్నది.

1. "భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టేపరావరే॥"

2. "యథానద్యః స్యందమానాః సముద్రేఽస్తంగచ్ఛన్తి నామరూపే విహాయ। తథావిద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్॥"

3. నాస్యాబ్రహ్మవిత్కులేభవతి। తరతి శోకం తరతి పాప్మానం గుహాగ్రన్థిభ్యోవిముక్తోఽమృతోభవతి॥"

1. అనగా పరావరుడగు నా పరమాత్మ దర్శనమగుచుండగా బుద్ధి నాశ్రయించి పీటముడివలె గట్టిపడిన యవిద్యావాసనాజాలము వీడిపోవును. నదీ ప్రవాహమువలె నవిచ్ఛిన్నముగ బ్రవహించుచున్న సర్వసంశయ సంతానము విచ్ఛిన్నమగును. సంశయములు పోయినవెంటనే యవిద్య నశించును. ప్రాక్తన జన్మసంబంధమగు సంచితకర్మమంతయు నశింప పునర్జన్మము లేకుండును. సంసారకారణము లేకుండుటచే ముక్తుడగు ననియు,

2. నదులు ప్రత్యేక, ప్రత్యేక వ్యక్తిత్వములతో వాని, వాని, జలముతో బ్రవహించి తుదకు సముద్రమున బ్రవేశించి తమ తమ ప్రత్యేక నామరూపములను గోల్పోయి సముద్రమున నైక్యమందునట్లు విద్వాంసుడు తన నామరూపములనుంచి విముక్తుడై, ప్రకాశాత్మకుడగు పరాత్పరుని యందనన్యత్వము నొందుచున్నాడు, అనిన్ని

3. బ్రహ్మవిదుని వంశము నందబ్రహ్మవిదుడు బుట్టడు. అతడు ధర్మాధర్మాత్మకమగు పాపమును దాటును. హృదయగ్రంథిరూపమునగున్న అధ్యాసము నివర్తించును, అని పైవాక్యములు యీ బ్రహ్మవిద్యాఫలమును విశదీకరించుచున్నవి.

శాస్త్రము బోధించుచున్నట్టి సర్వమోక్షసాధనములును వ్యవహారము లోనివేగాని పరమార్థమున, నివియేవియును లేవని— "ననిరోధోనచోత్పత్తిర్న బద్ధోనచసాధకః। నముముక్షుర్నవై ముక్త ఇత్యేషాపరమార్థతా॥" అనగా— పరమార్థమున ప్రళయముగాని, పుట్టుకగాని, బద్ధుడైన జీవుడుగాని, సాధకుడు

గాని, ముముక్షువుగాని, ముక్తుడుగాని లేడు ఇదియే పరమార్థము అని మాండూక్యోపనిషత్తు తెలుపుచున్నది. ఈ సర్వమును మనోవ్యాపారముండు నపుడు మాత్రమే కల్పనామాత్రముగ సంభవించుచున్నది. సుషుప్తి, సమాధులయందుగాని చిత్తనిరోధసమయమందుగాని యిట్టి కల్పనలు తటస్థించుట లేదు. కనుక నిరోధము, ఉత్పత్తి, బంధము, సాధకుడు, ముముక్షువు, మొదలగునవి యన్నియు వ్యవహారస్థితియందున, ఆత్మబోధకొరకు మనఃకల్పనా మాత్రములగుచున్నవిగాని పరమార్థవాస్తవమున నివియేవియును లేవు. సర్వవిశేషశూన్యమగు వస్తువే పరమార్థము. ఇది అద్వితీయ అఖండపరిపూర్ణ చిద్ఘనానందస్వరూపము. ఇదియే పరమాత్మస్వరూపము, జీవాభిన్నము.



ఆత్మజ్ఞానము నొందిన మహనీయునకు;



శ్లో॥ బ్రహ్మైవపంచభూతాని, బ్రహ్మైవభువనత్రయం ।
బ్రహ్మైవాహం బ్రహ్మైవాన్యత్ బ్రహ్మభిన్నం నవిద్యతే ॥

అనగా సర్వము అఖండ పరిపూర్ణ జ్ఞానరూపమగు బ్రహ్మముగనే భాసించునని శ్రీ వశిష్ఠవచనము తెలుపుచున్నది. 

అట్టితరి యీ విద్వాంసుడు తానే బ్రహ్మస్వరూపమగు, అఖండ పరమానందస్వరూపుడనని తెలిసికొని, సర్వభయవిముక్తుడగుచు, దేనివలనను భయమునొందడనియు, తదుపరి అభయప్రాప్తుడగుచు, స్వస్వరూపమునందు ప్రతిష్ఠితుడగుననియు, భూమపదార్థమును జూచువాడు అనగా పొందినవాడగుననియు, యింకను యిదియే పరమ సుఖప్రాప్తియనియు, యిదియే అమృతత్త్వమనియు, తానమృతుడేయగుననియు, యిచటనే బ్రహ్మస్వరూపుడగుననియు "ఆత్మైవానందః" "ఆనందం బ్రహ్మణోవిద్వాన్. నబిభేతి కుతశ్చన" "అథసోఽభయంగతోభవతి" "అభయం ప్రతిష్ఠాంవిందతే" "యత్రనాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి సభూమా" "ఏతద్వై సుఖమ్" "ఏకత్వమనుపశ్యతి" "అమృతత్వమేతి" "అమృతోభవతి" "అత్రబ్రహ్మసమశ్నుతే" అను పరమ తాత్పర్యమును శ్రుతిమాత వచనములు

స్పష్టముగా తెలుపుచున్నవి. ఇట్టి విద్యయే యీ గ్రంథసారాంశము. ఇదియే ఆత్మానంద ప్రాప్తిస్వరూపము. సైవముక్తిః, మోక్షః.

ఈ పదునాలుగు భువనములందునను, మరెచటనుగాని మానవుడు ( జీవుడు ) యీ విద్యకన్న పొందగల్గిన అధికలాభముగాని, పొందదగిన అధికలాభముకాని లేదు. ఇదియే పరమ లాభము. ఇదియే జీవునకు పరమావధి యగు నిత్యనిరతిశయ సుఖప్రాప్తి. ఇదియే ఆత్మానందస్వరూపము.

శ్లో॥ జ్ఞానశాస్త్ర మిదంపుణ్య,
మాత్మానంద ప్రకాశకమ్ ।
అధ్యేయం వేదవత్సర్వం,
మోహన్రామ బుధోదితమ్ ॥

శ్లో॥ ఇదం యశస్యమాయుష్యం,
మోక్షప్రాప్తి సుసాధనమ్ ।
యేపఠన్తి సదాభక్త్యా,
తత్పదం యాన్తి తేపరమ్ ॥

శ్రీ గుర్వీశ్వరానుగ్రహప్రసాదముచే, ముముక్షు కాశ్యపసగోత్ర
కౌతా వంశోద్భవ, మోహనరామశాస్త్రి విరచితంబగు,
ఆత్మానంద ప్రకాశిక,

సమాప్తము.

ఓం తత్సత్